RAH – e – AMAL
With Arabic Text
(Telugu)

# హదీసు వెలుగు

## (అరబీ మూలంతో)

మూలం :
మౌలానా జలీల్ అహ్‌సన్ నద్వీ

అనువాదం :
ఎస్.ఎమ్. మలిక్

اَلْحَمْدُ لِلّٰهِ الَّذِیْ ھَدٰنَا لِھٰذَا
وَمَا كُنَّا لِنَھْتَدِیَ لَوْلَا اَنْ ھَدٰنَا اللّٰهُ
وَالصَّلٰوةُ وَالسَّلَامُ عَلٰی
سَیِّدِنَا مُحَمَّدٍ رَّسُوْلُ اللّٰهِ
وَعَلٰی اٰلِهٖ وَاَصْحٰبِهٖ اَجْمَعِیْنَ۔

ఈ సత్కార్యాన్ని చేసే సద్బుద్ధిని ప్రసాదించిన
అల్లాహ్‌కే సకల స్తోత్రాలు చెల్లు.
అల్లాహ్ రుజుమార్గం చూపకపోతే
మేము సన్మార్గాన్ని పొంది ఉండేవారము కాము.
నాయకమన్యులు, దైవసందేశహరులు, మహనీయ ముహమ్మద్‌కు,
ఆయన ఆత్మీయులకు, సన్నిహిత సహచరులకు, అందరికీ
సకల శుభాలూ, శాంతి ప్రాప్తించుగాక!

జీవితం అవిభాజ్యమయిన ఏకాంకమని నమ్మి,
అందులోని సకల రంగాలు దైవదత్తమయిన
మార్గదర్శకత్వంలో తీర్చి దిద్దుకోవాలని
ఉవ్విళ్ళూరే సాత్విక మనస్కులకు,
కారుణ్యమూర్తి మహనీయ ముహమ్మద్
(సల్లల్లాహు అలైహి వ సల్లం) పవిత్ర జీవితాన్నే
తమ ఆదర్శంగా భావించి,
ఆయన కాంతిమంతమయిన అడుగుజాడల్లోనే
పయనించదలచిన
సత్యపథగాములకు ఈ కృషి అంకితం

—మలిక్

# విషయ సూచిక

# మనవి

ఇస్లామ్ అవగాహనకు, అనుసరణకు దివ్య ఖుర్ఆన్ ఎంత ప్రముఖ మయిందో దాన్ని అందజేసి తదనుగుణంగా ఆచరించి చూపిన దైవ ప్రవక్త మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆదర్శ జీవితంకూడా అంతే ముఖ్యమయింది. ఎందువల్లనంటే ఆయన జీవితం ఖుర్ఆన్ వ్యాఖ్యానం తప్ప మరొకటి కాదు. ఆయన దివ్యఖుర్ఆన్లోని ఆదేశాలను క్రియాత్మకంగా ఆచరించి చూపారు. దివ్య ఖుర్ఆన్లోని ప్రతి ఆయత్ను ఆచరణ రూపేణ, వాక్కు రూపేణ విశదీకరించారాయన. ఆయన ప్రవచనాలను, ఆచరణలను హదీసులని అంటారు. సహస్రాది హదీసులున్న అనేక సంకలన గ్రంథాల్లో నుండి కొన్ని హదీసుల్ని మటుకే ఎన్నుకుని ప్రముఖ ఇస్లామీయ పండితులు మౌలానా జలీల్ అహ్సన్ నద్వీ ఉర్దూలో 'రాహె అమల్' (ఆచరణాపథం) అన్న శీర్షికతో అనువదించారు.

హదీసు గ్రంథాలన్నింటినీ కాకపోయినా ప్రారంభంగా ఈ కూర్పునయినా తెలుగు ప్రజలకు అందజెయ్యాలన్న సంకల్పంతో 'రాహె అమల్'ని తెలుగులోకి అనువదించాలని భావించి తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్వారు ఆ పనిని, సర్వ విధాలా బలహీనుణ్ణయిన నాకు అప్పగించారు. హదీసు విద్యలోను, అరబీ సాహిత్యంలోను ఆరితేరిన వారు చెయ్యవలసిన కార్యమది. అరబీ భాషలో ఏదో లేశమయిన ప్రవేశమున్న నేను ఆ మహత్కార్యాన్ని చేపట్టడం మితిమీరిన సాహసమేనేమో! కాని గత్యంతరం లేక, మౌలానా జలీల్ అహ్సన్ నద్వీ చేసిన ఉర్దూ అనువాదం సహాయంతో ఈ మహత్తర బాధ్యతను నెరవేర్చగలిగానని నమ్ముతున్నాను.

తొలుత ఈ హదీసుల్ని గీటురాయి వారపత్రికలో 'హదీసు వెలుగు' శీర్షికన వరుసగా ప్రచురిస్తూ వచ్చాము. వాటినే మరోసారి పరిష్కరించి నేడు పుస్తక రూపంలో **"తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్"** వారు వెలువరిస్తున్నారు.

అనువాదం సులభగ్రాహ్యంగా, తెలుగు నానుడికి సన్నిహితంగా ఉండాలని ప్రయత్నించాను. కొన్ని కొత్త ప్రయోగాలు, కొత్త పదబంధాలు అక్కడక్కడ కానరావచ్చు. అవి తెలుగుతనం సంతరించుకుని భాషలో ఇమిడిపొయ్యాయో లేదో పండితులే నిర్ణయించాలి.

కొన్ని హదీసులకు మౌలానా నద్వి వివరణలు వ్రాయలేదు. అలాంటి వాటికి అవసరమనుకున్న చోటల్లా నేను స్వయంగా వివరణలు ఇవ్వడానికి కృషి చేశాను. ఆ వివరణల్లోను, అనువాదంలోనూ ఏవయినా తప్పులు దొర్లినట్లయితే వాటికి నేనే బాధ్యుణ్ణి. అలాంటి దోషాలు, ఇంకా ఇతర భాషాదోషాలు ఎత్తి చూపాలని పాఠకులనందరినీ అభ్యర్థిస్తున్నాను. అలాంటి దోషాలు ఏవైనా ఉంటే వాటిని వచ్చే ప్రచురణలో సంస్కరించడానికి కృషి చేస్తాము.

ఈ కృషిని దయతో ఆమోదించాలని, దీని ప్రచురణకు వివిధ రూపాల్లో చేయూతనిచ్చిన వారందరికీ పుణ్యఫలాన్ని ప్రసాదించాలని దైవాన్ని వేడుకుంటూ —

హైదరాబాద్
1-1-1989

మలిక్

★ ★ ★ ★ ★

# అరబీ మూలం

1989లో 'హదీసు వెలుగు' సంకలనం తొలిసారిగా ప్రచురించినప్పుడే హదీసుల అరబీ మూలం కూడా ఉన్నట్లయితే ఎంతో బావుండేదని అనేక మంది పండితులు, జిజ్ఞాసువులూ సూచించారు. ఆ తరువాత డిసెంబరు 1996 వరకు ఇంకా రెండు ముద్రణలు వెలువడినా అనేక సాంకేతిక కారణాలవల్ల అరబీ మూలాన్ని చేర్చటానికి వీలుకాలేదు. మనిషి ఎన్ని చెయ్యదలచినా దైవ సహాయం, ఆయన అభీష్టంతోడుగా లేనిదే ఏదీ నెరవేరదు. ఇప్పటికయినా ఆ అవసరాన్ని తీర్చగలుగుతున్నందుకు సంతోషంగా ఉంది. దైవం ఆ అవకాశం ఇచ్చినందుకు ఆయనకు ఎనలేని కృతజ్ఞతాభివందనాలు. అల్లాహ్ సద్బుద్ధిని ప్రసాదిస్తేనే తప్ప మనిషివల్ల ఏదీ సాధ్యం కాదు.

తేది: 29-3-1997

ప్రకాశకులు

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# భూమిక

దేవుని మార్గదర్శకత్వమే లేకపోతే లోకంలో మనిషి మనుగడ సన్మార్గాన సవ్యంగా సాగడం సాధ్యపడదు. మనిషికి సన్మార్గం చూపడానికి అల్లాహ్ తన గ్రంథాలు అవతరింపజేశాడు. తన ప్రవక్తల్ని ప్రభవింపచేశాడు. ప్రవక్తలు అల్లాహ్ ఉద్గ్రంథంలోని ఆదేశాల్నీ, నిర్దేశాల్నీ విపులీకరించారు. వాటికనుగుణంగా తమ వ్యక్తిగత జీవితాన్ని గడిపి, తాము స్థాపించిన సత్సమాజాన్ని నడిపి, దైవేచ్ఛ ప్రకారం సాగే జీవితం అంటే ఏమిటో చూపారు. కేవలం దేవుని మార్గదర్శక గ్రంథాలే అవతరించి ఉంటే జీవితంలో నిత్యం ఎదురయ్యే అవసరాలకు వాటి అన్వయంలో అతి తీవ్రమయిన భేదాభిప్రాయాలు పొడసూపేవి. అందుకే దైవాదేశాలను దైవేచ్ఛ ప్రకారం ఆచరించి చూపగల, ఆచరింపజేయగలవారు ఒకరు ఎంతయినా అవసరం, వారు ఆ గ్రంథాలను అందజేసిన దైవ సందేశహరులే కాగలరు.

దైవాదేశాలను, క్రియారూపంలో ఆచరించి చూపే అవసరాన్ని తీర్చడానికి సృష్టిరాశిలోని మానవాతీతులయిన వారెవరూ తగినవారు కారు. ఉదాహరణకు, దైవదూతలకు ఈ కార్యం అప్పగించాలంటే, వారు సహజంగా మానవ అవసరాలకు అతీతులు కావడంచేత వారి నైజం, ప్రవృత్తి, ఉద్రేకాలు, ఉద్వేగాలు సర్వం మనిషికి పూర్తిగా భిన్నమయినవి. అందుచేత వారు మానవజీవితానికి ఆదర్శప్రాయులు కాలేరు. మానవులకు ఆదర్శప్రాయం కాగలిగేది మానవ జీవితం ఒక్కటే. ఈ కారణంగానే అల్లాహ్ మానవులనే తన ప్రవక్తలుగా పంపాడు.

మానవ చరిత్ర ఎంత పురాతనమయినదో ప్రవక్తల ఉనికి కూడా అంతే ప్రాచీనమయినది. మనిషి ధరణిపై కాలుపెట్టగానే ప్రవక్తల పరంపర ప్రారంభమయింది. ప్రతి జాతిలోనూ, మనుషులు నివసించిన ప్రతిదేశంలోనూ వారు ఆవిర్భవించారు. తమ జాతిని వారు తమ తమ భాషల్లో సంబోధించారు. దైవవాణిని అందజేయడమేకాక దాని ఆధారంగా ఒక సత్సమాజాన్ని నిర్మించి చూపారు.

అట్టివారిలో అంతిమ ప్రవక్త, చివరి దైవసందేశహరుడు హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం. ప్రపంచ మానవులంతా నాగరికత రీత్యా ఒకే సమాజంగా

ప్రవక్తకు అసాధారణ శక్తిసామర్థ్యాలు, విజ్ఞాన వివేకాలు, దివ్య కాంతి మార్గదర్శకాలు ప్రసాదించటంతోపాటు దైవం ప్రవక్తను అనుక్షణం పరిరక్షిస్తూనే ఉంటాడు. ప్రవక్త మానవుడే అవడంచేత ఆయనవల్ల ఏదేనిపొరపాటు లేక మరపు సంభవిస్తే ఆ క్షణమే అల్లాహ్ దాన్ని సవరించి సరిదిద్దుతాడు. దీన్ని బట్టి ప్రవక్త చేసిన ప్రతిపనీ, పలికిన ప్రతిమాటా దైవామోదం పొందివుందని చెప్పవచ్చు. తన ఆమోదమే లేకపోతే దాన్ని అప్పటికప్పుడే మాన్పించి సరిదిద్ది ఉండేవాడుఅల్లాహ్!

దివ్య ఖుర్ఆన్‌లోని ప్రచార ప్రతిభ అంతా విశ్వాసాలు, ధర్మసూత్రాల వివరణలోనే కేంద్రీకృతమయి వుంది. ఆరాధన, నైతికత, సామాజిక వ్యవహారాలు ఇత్యాది విషయాలకు సంబంధించిన ఆదేశాలు, ఆనతులు, పరిమితులు ఖుర్ఆన్‌లో ఇతోధికంగా సూత్రప్రాయంగానే సూచించబడ్డాయి. వీటి మౌలిక సమస్యల్ని మాత్రమే దివ్య ఖుర్ఆన్‌లో చర్చించడం జరిగింది. ఈ ఆదేశాలు అనుజ్ఞల వివరణలు, అనుబంధ శాసనాలు అన్నీ మహాప్రవక్త బోధనలద్వారా ఆయన ఆచరణ ద్వారానే ద్యోతకమవుతాయి. ఆయన దైవ దౌత్య బాధ్యతల్లో దివ్య ఖుర్ఆన్‌ని అందజేయడంతోపాటు దాన్ని విశదీకరించడం, వ్యాఖ్యానించడం దాని ఆజ్ఞల్ని శాసనాలుగా జారీచెయ్యడం, వాటిని వివిధ సమస్యలకు అన్వయింపచెయ్యటం కూడా చేరి ఉన్నాయని ఇంతకుముందే మనం తెలుసుకొన్నాము. ఇప్పుడు మహా ప్రవక్త ముహమ్మద్(సఅసం) తన మాటల ద్వారా చేతల ద్వారా దివ్య ఖుర్ఆన్‌ని దాని ఆచరణాత్మక రూపాన్ని ఎలా బోధించారో, మనకు ఎలా అందజేశారో కొన్ని ఉదాహరణల ద్వారా తెలుసుకుందాము.

దివ్య ఖుర్ఆన్‌లో నమాజ్‌కోసం నిలుచునేముందు కాళ్ళు చేతులు ముఖం కడుక్కోవాలనీ, తలపై తడిచేతితో "మసహ్" చేసుకోవాలనీ ఉంది. (అల్ మాయిదా-6). అయితే దాని క్రమపద్ధతిని, కడగటమంటే నోటితో పుక్కిలించడం, ముక్కును పరిశుభ్రపరచడం అని, తలతోపాటు చెవుల మసహ్ చేయడం కూడా అవసరమే అని మహాప్రవక్త ఆచరణ (సున్నత్) ద్వారానే మనకు తెలిసింది. ఈ "వుజూ"ఏ విధంగా భంగమవుతుందో, ఏ రూపంలో భంగపడదో ఆయన తెలుపడం వల్లనే మనకు తెలుసు. ఈ వివరమంతా దివ్య ఖుర్ఆన్‌లో మనకు కానరాదు.

దివ్య ఖుర్ఆన్‌లో, "అకీముస్సలాత్" (నమాజ్‌ను నెలకొల్పండి) అని ఆదేశింపబడింది. కాని సలాత్ అంటే ఏమిటో, దాని సంస్థాపన ఎలా జరుగుతుందో, దాన్ని ఎలా చెయ్యాలో, ఏఏ వేళల్లో చెయ్యాలో, మరే వేళల్లో చెయ్యకూడదో,

ఎన్నెన్ని రకాతులు చెయ్యాలో, ఎవరెవరు చెయ్యాలో, సామూహికంగా జరిపే నమాజ్‌లో పాటించవలసిన విధులేవో- ఈ విషయాలన్నీ మహాప్రవక్త (సఅసం) ఆచరణ (సున్నత్) ద్వారానే మనకు బోధపడతాయి. రోజా ( ఉపవాస వ్రతం) గురించి ఆదేశింపబడిన చోట (బఖర 185-187) దివ్య ఖుర్‌ఆన్‌లో రోజా ఎప్పటి నుంచి ఎప్పటి వరకు పాటించాలి? రోజా సమయంలో నిషిద్ధమయిన కార్యాలేమిటి? వ్రతభంగం ఎలా జరుగుతుంది? రోజా ఎవరెవరికి విధిగా నిర్ణయించబడింది? దీనికి వినాయింపు ఎవరు? ఇత్యాది ఎన్నో ప్రశ్నలకు సమాధానం మనకు లభించదు. ఇది మహాప్రవక్త (సఅసం) బోధనల ద్వారా, ఆయన ఆచరణ ద్వారానే తెలిసివచ్చింది.

అలాగే "హజ్" చేయడం విధిగా నిర్ణయించినప్పటికీ (ఆలి ఇమ్రాన్-79) దివ్య ఖుర్‌ఆన్‌లో ప్రతి ముస్లిమ్ జీవితంలో ఒక్కసారి చెయ్యాలో లేక ప్రతి సంవత్సరమూ చేస్తూ ఉండాలో విశదపరచలేదు. మహాప్రవక్త (సఅసం) ఆదేశాల ద్వారా, జీవితంలో ఒక్కసారి హజ్ చేసినా ఈ విధి నెరవేరుతుందని తెలుస్తోంది.

దివ్య ఖుర్‌ఆన్‌లో "జకాత్" గురించి అనేక చోట్ల ప్రస్తావించడం జరిగింది, అయితే అది ఎంత ధనమున్నవారు చెల్లించాలి. వెండి, బంగారాలు ఎంతెంత ఉన్నవారు దానికి బాధ్యులవుతారు అనే విషయాలు మహాప్రవక్త (సఅసం) వివరణలవల్లనే మనకు బోధపడతాయి.

అలాగే తినే, త్రాగే పదార్థాల్లో ధర్మసమ్మతమైనవాటి జాబితా, నిషిద్ధమయిన వాటి జాబితా (అల్ మాఇదా-4); వారసత్వం పంపకపు వివరాలు (అన్ నిసా:11); పెళ్ళిళ్ళకు సంబంధించిన ఆజ్ఞల విశదీకరణ (అన్ నిసా: 23); మద్యపాన నిషేధం గురించిన వివరాలు, దొంగతనానికి శిక్షను గురించిన ఆదేశాలు అన్నీ దివ్య ఖుర్‌ఆన్‌లో కేవలం సూత్రప్రాయంగా పేర్కొనబడ్డాయి. వివరాలన్నీ మనకు మహాప్రవక్త (సఅసం) సున్నత్ (సంప్రదాయం)లోనే లభిస్తాయి.

ఈ వివరణనుబట్టి మహాప్రవక్త(సఅసం) సంప్రదాయాలు లేక హదీసులకు, ఖుర్‌ఆన్ అవగాహన, అనుసరణలకు అవినాభావ సంబంధముందని తెలుస్తోంది. మహాప్రవక్త(సఅసం) సంప్రదాయాలను కాదనికూడా ఇస్లామ్‌ను ఆచరించగలమని తలపోయడం కేవలం భ్రమ, అపోహ, అహేతుకం, అసాధ్యం!

మహనీయ ముహమ్మద్ (సఅసం) దైవ సందేశహరుల పరంపరలో చిట్టచివరివారు. ఆయన తరువాత ఇక దైవప్రవక్తలు ప్రభవించరు. అలాగే దేవుని

దివ్యగ్రంథం ఖుర్‌ఆన్, అంతిమ దైవవాణి, ఇకపైన మరో ప్రవక్త రాకపోవడంచేత మరో గ్రంథం కూడా అవతరించదు. దైవాదేశాలు తమ తుదిరూపంలో దివ్య ఖుర్‌ఆన్‌లో పొందుపరచబడ్డాయి. దివ్య ఖుర్‌ఆన్ యావత్ మానవాళికై ప్రళయదినం వరకు అనుసరణయోగ్యమయిన ఉద్గ్రంథం, దాన్ని భద్రపరచడం తన బాధ్యతగా తీసుకుని అల్లాహ్ దాన్ని భద్రపరిచాడు. అలాంటప్పుడు మహాప్రవక్త (సఅసం) సున్నత్ (ప్రవచనాలు, సంప్రదాయాలు) కూడా చిరకాలానికిగాను భద్రపరచడం అనివార్యం, దైవికంగా ఈ మహత్కార్యం కూడా నిర్విఘ్నంగా జరిగిందని చెప్పవచ్చు.

మహాప్రవక్త (సఅసం) తన మాటల ద్వారా చేతల ద్వారా దైవాదేశాల (కుర్‌ఆన్ ఆయత్‌ల) విశదీకరణ చేయడంతోపాటు ఇస్లామీయ సిద్ధాంతాల కనుగుణంగా వ్యక్తుల సంస్కరణ, సముద్ధరణ చేశారు. వారిని ఒక సంఘటిత సమాజంగా, క్రమబద్ధమయిన, శక్తిమంతమయిన ప్రజగా తీర్చిదిద్దారు. ఆ సమాజంలో ఇస్లామీయ విశ్వాసాలు మొదలుకుని ఆచరణాత్మక జీవితపు రంగాలన్నింటిలో ఆయన తీసుకున్న నిర్ణయాలు, రూపొందించిన సిద్ధాంతాలు, శాసనాలు, నియమాలు క్రియారూపం దాల్చాయి. ఆయన బోధించిన రీతిలో నమాజ్, జకాత్, రోజా, హజ్ ఇత్యాది ఆరాధనల విధులు, విధానాలు ప్రజల్లో సర్వసామాన్యమయ్యాయి. పెళ్ళిపేరంటాలు, విడాకులు, వారసత్వపు చట్టాల నియమ నిబంధనలు ఆయన ఏర్పరచినట్లే ఇస్లామీయ సమాజంలో ఆచరణలోకి వచ్చాయి. క్లుప్తంగా చెప్పాలంటే, కుటుంబ కార్యకలాపాల నుంచి బజారు వ్యవహారాల వరకు, న్యాయస్థానాల తీర్పులు మొదలు పరిపాలన విషయాలు, చివరకు జాతీయ అంతర్జాతీయ రాజకీయ వ్యవహారాల వరకు అన్నిటా ప్రవక్త మహనీయులు (సఅసం) ఏర్పరచిన సంప్రదాయమే ఇస్లామీయ సమాజ సంప్రదాయంగా రూపొందింది.

దైవ ప్రవక్త (సఅసం) నిష్క్రమణానంతరం కూడా ఈ సమాజం అలాగే ఆయన స్థాపించిన సంప్రదాయాలపై క్రియారూపంలో సుస్థిరంగా శతాబ్దాల తరబడి సాగింది. ఈ నిరంతర 'సున్నత్' ఆచరణ వల్ల 'సున్నత్' ముస్లిమ్ సమాజంలో సురక్షితమయి పోయింది. ఈ 'సున్నత్' కు సంబంధించిన జ్ఞానం వివిధ వ్యక్తుల్లోనూ సజీవరూపం దాల్చింది. ప్రవక్త మహనీయులు (సఅసం) ప్రజల మధ్య ఉన్నంత కాలం దాన్ని గ్రంథస్థం చేసి ఇతరులకు అందజేసేందుకు శ్రద్ధ తీసుకునే అవసరం ఏర్పడలేదు. ఆయన నిర్యాణం తరువాత ఇటు సామాన్య ప్రజలకు అటు పాలకులకు, న్యాయాధికారులకు అందరికీ దాని ఆవశ్యకత ఏర్పడింది. అప్పుడే దాన్ని సేకరించి సంకలనం చేసే కార్యక్రమం ప్రారంభించారు.

ఈ 'సున్నత్ జ్ఞానం' కలిగివున్న వారు దాన్ని ఇతరులకు అందజేయడం తమ విధిగా భావించేవారు. ఈ విధంగా హదీసుల ఉల్లేఖనం ప్రారంభమైంది. ఈ సంకలనక్రియ హి|జీ శకం 11వ ఏట (మహాప్రవక్త(సఅసం) పరమపదించిన మర్నుసటి సంవత్సరం) ప్రారంభమై 3, 4 శతాబ్దాల వరకు సాగింది.

పురాతన కాలంలో సంఘటనల్నీ, సంభాషణల్నీ యధాతథంగా పరిరక్షిం చేందుకు, ఇతరులకు, భావి సంతతి వారికి అందజేసేందుకు అనుసరించిన పద్ధతి- సంఘటనను లేక సంభాషణను పొల్లుపోకుండా జ్ఞాపకముంచుకుని ఇతరులకు వినిపించడం, అరబ్బులు వేల సంవత్సరాల తరబడి అక్షరాభ్యాసం లేక అలా జ్ఞాపకశక్తి ద్వారానే తమ పని గడుపుకుంటూ వచ్చారు. వారి స్మరణశక్తికి ప్రపంచంలో విశేషస్థానం లభించింది. వారు కవితలనే కాక తెగల వంశ వృక్షాలను చివరికి గుర్రాల జాతి పరంపరను సయితం యిలా జ్ఞాపకం పెట్టుకునేవారు.

మహనీయ ముహమ్మద్ (సఅసం)తో ఆయన సహచరులకు ఉన్న ప్రేమానుబంధం మానవచరిత్రలో నిరుపమానమయినది, అద్వితీయమయినది. సహచరుల మనోఫలకంపై ఆయన వేసిన ముద్రను మనం కనీసం ఊహించనయినా లేము. ఆయనతో గడిపిన ఘడియలే తమ జీవితాలు గడించిన అమూల్యనిధిగా వారు భావించేవారు, ఆయన పలికే ప్రతి మాటను శ్రద్ధగా వినేవారు, ప్రతి కదలికను అత్యంత జాగ్రత్తగా పరిశీలించేవారు. జీవితంలో తమ నడవడికి ఆదర్శం ఆయన అవలంబించే రీతులే, విధానాలే అన్న దృష్టితో వారు ఆయన్ని పరికించేవారు. సహాబా (సహచరులు)లో ఎవరయినా మహాప్రవక్త (సఅసం) దివ్య సన్నిధిలో లేనప్పుడు జరిగిన విశేషాలు, ఆయన సెలవిచ్చిన సూక్తులు అన్నీ ఆ సహాబీకు తరువాత వినిపించాలని హాజరయిన వారు తమలో తాము నిర్ణయించుకున్న ఉదాహరణలు కూడా మనకు లభిస్తాయి. అలాంటిది, జ్ఞాపకశక్తిలో తమకు తామే సాటి అయిన అరబ్బులు ప్రవక్త జీవిత విశేషాల్ని, సంఘటనల్నీ ఆయన పలికిన మాటల్ని యధాతథంగా జ్ఞాపకం ఉంచుకోవడం పట్ల ఉపేక్షకనబరుస్తారా?

ప్రవక్త మహనీయుని సహచర్యం లభించనివారు ఆయన జీవన వివరాలు, ఆయన బోధనలు, శిక్షణలు తెలుసుకోవాలని తహతహలాడేవారు. కాగా ఎవరయినా ఒక సహాబి (సహచరుడు) జీవించి ఉన్నట్లు వారికి తెలియగానే వారు వందల మైళ్ళు ప్రయాణం చేసి ఆ సహాబిని కలుసుకునేవారని మనకు చరిత్రలో ఎన్నో నిదర్శనాలు లభిస్తాయి.

2)

దైవ ప్రవక్త జీవనకాలంలోనే సహాబావారు ఆయన ప్రబోధనల్ని, ప్రవచనాల్ని వ్రాసుకునేవారు. అంతేకాదు ఆయన కూడా తన ఆదేశాలను బోధనల్ని జ్ఞాపకముంచుకోవాలనీ, ఇతరులకు అందచేయాలనీ తాకీదు చేసేవారు. వ్రాసుకునే అనుమతి కూడా ఇచ్చారు. హదీసు పుస్తకాల్లో ధార్మిక బోధనల్ని ఆదేశాల్ని ప్రవక్త మహనీయులు వ్రాయించి దూరప్రదేశాల్లో ఉండే ముస్లిమ్‌లకు పంపిన సందర్భాలెన్నో ప్రస్తావించడం జరిగింది.

అరబ్బులు తమ జ్ఞాపకశక్తి, వాక్పటిమల ఆధారంగానే స్వయంగా తమ కార్యకలాపాలన్నీ సాగిస్తూ వచ్చిన కారణంగా ఇస్లామ్ ఆవిర్భవించిన తొలి రోజుల్లో ఈ విశేష లక్షణాన్నే వినియోగించుకునేవారు. చదువుకున్న వారు చాలా తక్కువ. అప్పుడు వ్రాతమూలకంగా భద్రపరచవలసిన అత్యంత ముఖ్యవస్తువు దైవవాణి లేక కుర్‌ఆన్ ఒక్కటే.

దివ్య కుర్‌ఆన్, దాని పదజాలం రీత్యా, క్రమం దృష్ట్యా, భావానుగుణంగా, సంపూర్ణంగా దైవవాణియే. దాని ప్రతి పదాన్ని దైవం నిర్దేశించిన క్రమంలో పొల్లుపోకుండా పరిరక్షించడం అత్యావశ్యకం. అందువల్ల ప్రప్రథమంగా దివ్య కుర్‌ఆన్‌ని గ్రంథస్థం చేసి భద్రపరిచే అగత్యం ఏర్పడింది. సున్నత్‌లో మహాప్రవక్త పలికిన మాటలూ, ఆచరణా రెండూ చేరి ఉన్నాయి. ఆచరణాత్మకమైన సున్నత్‌ను సహాబావారు ఉల్లేఖించేటప్పుడు తమ మాటల్లో, "మహాప్రవక్త ఇలా చేసేవారు, ఆయన స్వభావం ఇలాంటిది" అని చెప్పేవారు. ఆయన సూక్తుల్ని బోధనల్ని ఉల్లేఖించేటప్పుడు కూడా మహాప్రవక్త పలికిన మాటలే అప్పజెప్పాలన్న నిర్బంధం ఉండేది కాదు. ఆయన మాటల భావం మారకుండా తమ మాటల్లో చెప్పేందుకు మహాప్రవక్త సహాబాను అనుమతించారు. అయితే సహాబా వారికి పదునైన జ్ఞాపక శక్తి సహజంగానే వుండటంచేత వారు హదీస్ ఉల్లేఖనంలో వీలైనంత వరకు ప్రవక్త మహనీయులు ప్రయోగించిన పదాలనే ప్రయోగించేవారు, అందువల్ల హదీసులను గ్రంథస్థం చేసే పని కుర్‌ఆన్‌ని గ్రంథస్థం చేయడంకంటే ముఖ్యమైనది కాదు.

ప్రవక్త సహచరుల్లో అక్షరాస్యులు చాలా తక్కువ. కాగితం ఇంకా సర్వసామాన్యమవలేదు. వ్రాయడానికి ఖర్జూరపు ఆకులు, వెడల్పాటి ఎముకలు, చర్మపు పల్చని పొరలు వినియోగించేవారు. దివ్య కుర్‌ఆన్‌ను గ్రంథస్థం చేసేవారు కొద్ది మంది సహచరులే. ఇలాంటి పరిస్థితిలో కుర్‌ఆన్‌ను ఇతర వ్రాతలతో సమ్మిళితం కాకుండా కాపాడడానికి జాగ్రత్త చర్యగా ప్రారంభంలో హదీసులు ప్రవక్త

బోధనలూ ఆదేశాలు వ్రాయడాన్ని నిషేధించారు మహాప్రవక్త (సఅసం). అయితే హిజ్రత్ అనంతరం మదీనా పాలనా వ్యవహారాలు ఇస్లామీయ వ్యవస్థ క్రిందికి రాగానే దైవ ప్రవక్త (సఅసం) తీసుకున్న మొదటి చర్య నిరక్షరాస్యతను రూపుమాపేందుకు వయోజనులకు, బాలబాలికలకు విద్య గరపడమే. అనతికాలంలోనే చదవడం వ్రాయడం నేర్చుకున్నవారు చాలామందే తయారయ్యారు. ఆ సందర్భంలో హదీసులు వ్రాసుకునే అనుమతి నివ్వడమేగాక తాను స్వయంగా హదీసులు వ్రాయించి ఇతర ప్రదేశాలకు పంపే ఏర్పాటు కూడా చేశారు ప్రవక్త మహనీయులు.

హదీసు గ్రంథాల్లోనే ఈ అనుమతికి సంబంధించిన అనేక వివరాలు మనకు లభిస్తాయి. ప్రవక్త బోధనలే కాక ఆయన వివిధ ప్రదేశాలకు వ్రాయించి పంపిన ఆదేశాల వివరాలు కూడా హదీసు పుస్తకాల్లో లభిస్తాయి. ఇంకా, ఆ కాలంలోని మహారాజులకు చక్రవర్తులకు ఇస్లామ్ సందేశం అందజేస్తూ మహాప్రవక్త వ్రాయించిన లేఖలు అనేకం, వాటిలో ప్రస్తావించిన మాటల వివరాలతో సహా హదీసు గ్రంథాల్లో ఉదాహరించబడ్డాయి. అలాంటిదే ఒక ఉత్తరం మహాప్రవక్త ఆనాటి ఈజిప్టు చక్రవర్తి మకౌకిస్‌కి వ్రాయించారు. అది హదీసు గ్రంథాల్లో సవివరంగా ఉల్లేఖించబడింది. ఈజిప్టు పురావస్తుశాఖవారు నిర్వహించిన త్రవ్వకాలలో అసలు లేఖ బయలుపడింది. అసలు లేఖ ఈజిప్టు మ్యూజియమ్‌లో నేటికీ భద్రంగా వుంది. దాని ఛాయాచిత్రం కూడా ప్రకటించడం జరిగింది. దానిని హదీసుల్లో ఉల్లేఖించిన ఉత్తరంతో పోల్చిచూస్తే రెంటిలో ఏమాత్రం తేడా కానరాదు. దీన్నిబట్టి సహాబావారు మహాప్రవక్త పలికిన మాటల్నీ, వ్రాయించిన పదాల్ని మరువకుండా తిరిగి అప్పజెప్పాలని ఎంత జాగ్రత్త వహించారో ద్యోతకమవుతోంది.

హదీసును పరిరక్షించే కార్యం మొదటినుంచే నిర్వహించబడింది. నోటిద్వారా, గ్రంథస్థం చేయటం ద్వారా మహాప్రవక్త సంప్రదాయాన్ని (సున్నత్‌ను) సురక్షితంగా ఎలాంటి మార్పులు చేర్పులు లేకుండా ఇతరులకు, తమ తరువాతి తరాలవారికి అందజేయడానికి తగు జాగ్రత్తలు తీసుకున్నారు ఆయన (సఅసం) సహచరులు, వారి తరువాత వారి అనుచరులు. దైవం వారందరిపట్ల ప్రసన్నుడవుగాక!

– ఎస్.ఎమ్. మలిక్

అపార కృపాశీలుడు అనంత కరుణామయుడయిన అల్లాహ్ పేరుతో

# సంకల్పశుద్ధి

١ـــــعَنْ عُمَرَ بْنِ الْخَطَّابِ رَضِيَ اللّٰهُ عَنْهُ قَالَ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّمَا الْأَعْمَالُ بِالنِّيَّاتِ وَإِنَّمَا لِامْرِئٍ مَّا نَوٰى، فَمَنْ كَانَتْ هِجْرَتُهٗ إِلَى اللّٰهِ وَرَسُوْلِهٖ فَهِجْرَتُهٗ إِلَى اللّٰهِ وَرَسُوْلِهٖ۔ وَمَنْ كَانَتْ هِجْرَتُهٗ إِلٰى دُنْيَا يُصِيْبُهَا أَوِ امْرَأَةٍ يَتَزَوَّجُهَا فَهِجْرَتُهٗ إِلٰى مَا هَاجَرَ إِلَيْهِ۔ (متفق عليه)

1. మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఈ విధంగా సెలవిచ్చారని హజ్రత్ ఉమర్ (రజి అల్లాహు అన్హు) ఉల్లేఖించారు: "కర్మలు కేవలం మనోసంకల్పంపై ఆధారపడి ఉంటాయి. మనిషి దేని సంకల్పమయితే చేసుకుంటాడో, అతనికి అదే ప్రాప్తమవుతుంది. (ఉదాహరణకు) ఎవరైతే అల్లాహ్, ఆయన ప్రవక్త కొరకు హిజ్రత్ చేస్తారో, వారి హిజ్రత్ మాత్రమే నిజమయిన హిజ్రత్. ఎవరయితే ప్రపంచం కొరకు లేదా స్త్రీని వివాహమాడటానికి హిజ్రత్ చేస్తారో వారి హిజ్రత్ ప్రపంచం కొరకో లేక స్త్రీ కొరకో చేసిన హిజ్రత్ గా పరిగణించబడుతుంది." (ముత్తఫకున్ అలైహ్)

---

1. ఇది మానసిక సంస్కరణ, ఆధ్యాత్మిక శిక్షణలకు సంబంధించిన ముఖ్యమయిన హదీసు. మహాప్రవక్త(సఅసం) ఉపదేశానికి భావమేమంటే, సత్కార్యాలు సఫలీకృతమవడం మనిషి చిత్త వైఖరిపై ఆధారపడి ఉంటుంది. సంకల్పం సవ్యంగా ఉంటే పుణ్యఫలం లభిస్తుంది. లేకపోతేలేదు. ఒక కార్యం, పైకి ఎంత గొప్ప సత్కార్యంగా కనిపించినా, పరలోకంలో దాని ప్రతిఫలం లభించాలంటే, దాన్ని దైవ ప్రసన్నత పొందటానికి మాత్రమే చెయ్యాలి. ఒకవేళ దాన్ని ప్రాపంచిక లాభం పొంద టానికి మాత్రమే చేస్తే పరలోక వాణిజ్య మండలిలో దానికి ఎలాంటి విలువ లభ్యం కాదు. ఈ సత్కార్యం

٢ـــــ عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللّٰهُ عَنْهُ قَالَ: قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِنَّ اللّٰهَ لَا يَنْظُرُ إِلٰى صُوَرِكُمْ وَأَمْوَالِكُمْ وَلٰكِنْ يَّنْظُرُ إِلٰى قُلُوْبِكُمْ وَأَعْمَالِكُمْ - (مسلم)

2. "అల్లాహ్ మీ రూపురేఖల్ని, మీ సిరి సంపదల్ని చూడడు; మీ అంతర్యాలను, మీ ఆచరణలను చూస్తాడు" అని మహాప్రవక్త (సఅసం) ప్రవచించినట్లు హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖించారు. (ముస్లిమ్)

٣ـــــ عَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللّٰهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ: إِنَّ أَوَّلَ النَّاسِ يُقْضٰى يَوْمَ الْقِيٰمَةِ عَلَيْهِ رَجُلٌ اِسْتُشْهِدَ فَأُتِيَ بِهٖ فَعَرَّفَهٗ نِعَمَهٗ فَعَرَفَهَا، قَالَ: فَمَا عَمِلْتَ فِيْهَا؟ قَالَ: قَاتَلْتُ فِيْكَ حَتّٰى اسْتُشْهِدْتُ، قَالَ: كَذَبْتَ وَلٰكِنَّكَ قَاتَلْتَ لِأَنْ يُّقَالَ جَرِيْءٌ فَقَدْ قِيْلَ - ثُمَّ أُمِرَ بِهٖ فَسُحِبَ عَلٰى وَجْهِهٖ حَتّٰى أُلْقِيَ فِي النَّارِ - وَرَجُلٌ تَعَلَّمَ الْعِلْمَ وَعَلَّمَهٗ وَقَرَأَ الْقُرْاٰنَ فَأُتِيَ بِهٖ فَعَرَّفَهٗ نِعَمَهٗ فَعَرَفَهَا، قَالَ: فَمَا عَمِلْتَ فِيْهَا؟ قَالَ: تَعَلَّمْتُ الْعِلْمَ وَعَلَّمْتُهٗ وَقَرَأْتُ فِيْكَ الْقُرْاٰنَ - قَالَ: كَذَبْتَ وَلٰكِنَّكَ تَعَلَّمْتَ لِيُقَالَ هُوَ عَالِمٌ وَقَرَأْتَ الْقُرْاٰنَ لِيُقَالَ هُوَ قَارِئٌ فَقَدْ قِيْلَ - ثُمَّ أُمِرَ بِهٖ فَسُحِبَ عَلٰى وَجْهِهٖ حَتّٰى أُلْقِيَ فِي النَّارِ - وَرَجُلٌ وَسَّعَ اللّٰهُ عَلَيْهِ وَأَعْطَاهُ مِنْ أَصْنَافِ الْمَالِ فَأُتِيَ بِهٖ فَعَرَّفَهٗ نِعَمَهٗ فَعَرَفَهَا، قَالَ: فَمَا عَمِلْتَ فِيْهَا؟ قَالَ: مَا تَرَكْتُ مِنْ سَبِيْلٍ تُحِبُّ أَنْ يُّنْفَقَ فِيْهَا إِلَّا أَنْفَقْتُ فِيْهَا لَكَ، قَالَ كَذَبْتَ وَلٰكِنَّكَ فَعَلْتَ لِيُقَالَ هُوَ جَوَادٌ فَقَدْ قِيْلَ ثُمَّ أُمِرَ بِهٖ فَسُحِبَ عَلٰى وَجْهِهٖ ثُمَّ أُلْقِيَ فِي النَّارِ - (صحيح مسلم)

3. హజ్రత్ అబూ హురైరా (రజిఅన్), 'దైవ సందేశహరుడు (సఅసం) ఇలా బోధిస్తూ ఉండగా విన్నాను' అని అన్నారు :

"ప్రళయదినం నాడు అందరికంటే ముందు షహాదత్ (దైవ మార్గాన ప్రాణత్యాగం చేసి అమరగతి) పొందిన వ్యక్తికి ప్రతికూలంగా తీర్పు చెప్పటం జరుగుతుంది. అతన్ని దైవ న్యాయస్థానంలో హాజరుపరచిన తరువాత, అల్లాహ్ అతనికి తాను ప్రదానం చేసిన అనుగ్రహాలన్నింటినీ గుర్తుచేస్తాడు. అవన్నీ అతనికి జ్ఞాపకం వస్తాయి. అప్పుడు, 'నా అనుగ్రహాలను పొంది నీవు సాధించిందేమిటి?' అని అల్లాహ్ ప్రశ్నిస్తాడు. అతను, 'నేను నీ ప్రసన్నతను పొందడానికి (నీ ధర్మానికి విరోధులయిన వారితో) యుద్ధం చేశాను. చివరికి ప్రాణాన్ని సయితం త్యాగం చేశాను' అని విన్నవించుకుంటాడు. దానికి దేవుడు అతనితో, 'నా కోసమే నీవు పోరాడావనటం శుద్ధ అబద్ధం. నీవు పోరాడింది (ప్రాణత్యాగం చేసింది) జనులు నిన్ను ధీరుడు, శూరుడు అనాలనే. తదనుగుణంగా ఆ ప్రతి ఫలం నీకు ప్రపంచంలోనే లభించింది' అని అంటాడు. ఆ తరువాత ఆ అమరగతుడ్ని బోర్లా పడవేసి, ఈడ్చుకొనిపోయి నరకంలో పడవెయ్యవలసిందని ఆదేశించటం జరుగుతుంది. అలాగే అతన్ని నరకంలో పడవేస్తారు.

"తరువాత మరో వ్యక్తిని దైవ న్యాయస్థానంలో హాజరుపరుస్తారు. అతను ధర్మజ్ఞాని, ధర్మబోధకుడు, కుర్ఆన్ పాఠకుడూను. అల్లాహ్ తన వరప్రసాదాలను అతనికి జ్ఞాపకం చేస్తాడు. అవన్నీ అతనికి జ్ఞాపకం వస్తాయి. అతన్ని 'వీటిని పొంది నీవు సాధించిందేమిటీ?' అని అడుగుతాడు అల్లాహ్. అతడు సవినయంగా చెప్పుకుంటాడుః 'ప్రభూ! నేను నీ కొరకు నీ ధర్మజ్ఞానాన్ని అభ్యసించాను; నీ కోసమే దాన్ని ఇతరులకు బోధించాను;

---

అక్కడ చెల్లని నాణెం అవుతుంది. ఈ యదార్థాన్ని విశదపరచ టానికి మహాప్రవక్త (సఅసం) హిజ్రత్(వలసపోవటం) ను ఉదాహరించారు. చూడండి, హిజ్రత్ నిజంగానే ఎంతో గొప్ప త్యాగం, గొప్ప సత్కార్యం. కాని అల్లాహ్, ఆయన ప్రవక్త ఆజ్ఞ మేరకు హిజ్రత్ చేయక కేవలం తన ఐహిక వాంఛల పరిపూర్తికి మాత్రమే చేస్తే ఇంత గొప్ప సత్కార్యంగా కనిపించే ఈ పని ద్వారానూ పరలోకంలో ఎలాంటి పుణ్యఫలం ప్రాప్తం కాదు. అంతేకాక ప్రజల్ని మోసపుచ్చినట్లు కూడా అభియోగం మోపబడుతుంది.

నీ కొరకే కుర్ఆన్ పఠించాను.' దానికి సర్వేశ్వరుడు - 'నువ్వు అబద్ధం చెప్పావు. జనులు నిన్ను పండితుడు అనాలనే ఉద్దేశ్యంతో నీవు ధార్మిక విద్యను అభ్యసించావు. ప్రజలు నిన్ను కుర్ఆన్ జ్ఞాని అనాలనే ధ్యేయంతో నీవు కుర్ఆన్ పఠించావు. దానికి ప్రతిఫలం నీకు లోకంలోనే లభించింది' అని పలికి, 'ఇతన్ని బోర్లాపడవేసి ఈడ్చుకు పోండి, నరకంలో పడవేయండి' అని ఆదేశిస్తాడు. అతన్ని ఈడ్చుకుని పోయి నరకంలో పడవేస్తారు.

"మూడవ వ్యక్తి హాజరవుతాడు. అల్లాహ్ అతనికి ప్రపంచంలో సకల సంపదలను పుష్కలంగా ప్రసాదించి ఉంటాడు. అతనికి తన అన్ని అనుగ్రహాలను గుర్తుచేస్తాడు అల్లాహ్. అతను వాటినన్నింటిని గుర్తు చేసుకుని 'అవును, నేను ఈ అనుగ్రహాలన్నింటినీ పొందాను' అని ఒప్పుకుంటాడు. అపుడు అతనితో అతని ప్రభువు, 'నా అనుగ్రహాలు పొంది నీవు ఏ కార్యాలు చేశావు?' అని ప్రశ్నిస్తాడు. సమాధానంగా అతడు నివేదించుకుంటాడుః 'ఏ యే మార్గాల్లో ధనం ఖర్చుపెట్టడం నీకు ప్రీతికరమో, ఆ మార్గాలన్నింటిలో నీ ప్రసన్నత కొరకు నేను ధనం ఖర్చు చేశాను' అని. అప్పుడు అల్లాహ్ అంటాడు, 'అబద్ధం చెప్పావు. ప్రజలు నిన్ను దాత అనాలని నీవు ధనాన్ని క్రుమ్మరించావు. ఆ బిరుదు నీకు ప్రపంచంలో ఎలాగూ లభించింది' అని చెప్పి, - 'ఇతన్ని బోర్లాపడవేసి, ఈడ్చుకుని వెళ్ళి అగ్నిలో పడవేయండి' అని ఆజ్ఞాపిస్తాడు. అతన్ని అలాగే తీసుకువెళ్ళి అగ్నిలో పడవేస్తారు."

(సహీహ్ ముస్లిమ్)

---

3. పై మూడు హదీసులు ఒక మహత్తర సత్యాన్ని వెల్లడి చేస్తున్నాయి. ఏ కార్యానికయినా దాని బాహ్యరూపాన్ని బట్టి పరలోకంలో ప్రతిఫలం లభ్యం కాదు. దైవ ప్రసన్నత పొందటానికి చేసిన కార్యమే అక్కడ పుణ్యఫలానికి అర్హత పొందుతుంది. ఎంత గొప్ప సత్కార్యాన్నయినా, ఇతరులు దాన్ని చూచి మెచ్చుకోవాలనీ లేదా ప్రజల దృష్టిలో తన గౌరవ ప్రతిపత్తులు పెరగాలనీ ఎవరయినా చేస్తే దైవ దృష్టిలో దానికి ఏ విధమయిన ఆదరణా లభించదు; పరలోకంలో దానికి ఎలాంటి విలువా

# విశ్వాసాలు

٤ــــعَنْ عُمَرَ بْنِ الْخَطَّابِ رَضِيَ اللّٰهُ عَنْهُ ...... قَالَ فَأَخْبِرْنِيْ عَنِ الْإِيْمَانِ - قَالَ : أَنْ تُؤْمِنَ بِاللّٰهِ وَمَلٰٓئِكَتِهٖ وَكُتُبِهٖ وَرُسُلِهٖ وَالْيَوْمِ الْاٰخِرِ وَتُؤْمِنَ بِالْقَدْرِ خَيْرِهٖ وَشَرِّهٖ - (صحيح مسلم)

4. హజ్రత్ ఉమర్ (రజిఅన్) ఉల్లేఖించారు. "..... ఆ వచ్చిన వ్యక్తి (వాస్తవంగా ఆయన జిబ్రీల్ (అలైహిస్సలాం), మహాప్రవక్త (సఅసం) వద్దకు మానవాకారంలో వచ్చారు) దైవ ప్రవక్తను అడిగారు, ' ఈమాన్ (విశ్వాసం) అంటే 'ఏమిటీ?' అని, దానికి దైవసందేశహరులు (సఅసం) సమాధానమిచ్చారు :

'ఈమాన్ (విశ్వాసం) అంటే, నీవు అల్లాహ్‌ను, ఆయన దూతల్ని, ఆయన పంపిన గ్రంథాలను, ఆయన ప్రవక్తల్ని, పరలోకాన్ని సత్యమయి నవిగా విశ్వసించాలి. ఇంకా, అదృష్టాన్ని అంటే ఏది జరిగినా- మేలయినా కీడైనా - అది దైవం తరఫున జరుగుతుందని నమ్మాలి."

(సహీహ్ ముస్లిమ్)

---

ప్రాప్తం కాదు. అది అల్లాహ్ తులమానంలో చెల్లని తూనిక అవుతుంది. ఇలాంటి విశ్వాసమూ ఉపకరించదు, ఇలాంటి ఆరాధనా చెల్లదు.

4. ఇది సుదీర్ఘమయిన హదీసులోని ఒక భాగం. ఇది జిబ్రీల్ హదీస్ అని ప్రతీతి. సంగ్రహంగా అందులోని విషయం ఏమంటే, ఒక రోజున హజ్రత్ జిబ్రీల్ మానవాకారంలో మహాప్రవక్త వద్దకు వచ్చారు. ఇస్లాం, ఈమాన్ (విశ్వాసం), ఇహ్సాన్ (అత్యంత శ్రేష్ఠమయిన సత్కార్యం) ఖియామత్ (ప్రళయం)లను గురించి ప్రశ్నించారు. ఆయన (సఅసం) అన్నింటికీ సమాధానమిచ్చారు.

ఈమాన్‌కు సంబంధించిన ప్రశ్నోత్తరాలు ఇక్కడ ఉల్లేఖించబడ్డాయి. ఈమాన్ అన్న పదానికి అర్థం ఒకరిని విశ్వసించడం అనీ, అందుచేత అతని మాటను సత్యమైనదని స్వీకరించడం అనీ వస్తుంది. ఒక వ్యక్తి సత్యవ్రతుడని నమ్మినప్పుడే అతని మాటను ఎవరయినా అంగీకరిస్తారు. ఈమాన్‌కు ఊపిరి ఈ నమ్మకమే. మనిషి మోమిన్ (విశ్వాసి) కాగలగాలంటే అల్లాహ్ తరఫు నుండి ఆయన సందేశహరుల ద్వారా వచ్చిన విషయాలన్నీ

సత్యమైనవని విశ్వసించడం అత్యవసరం. వాటిలోని మౌలిక విశ్వాసాలు ఈ హదీసులో ప్రస్తావించబడ్డాయి. కుర్‌ఆన్ మరియు హదీసుల్ని దృష్టిలో పెట్టుకుని వాటిని వేర్వేరుగా పరిశీలిద్దాము.

(అ) అల్లాహ్‌ను విశ్వసించడమంటే : ఆయన నిత్యుడని, ఆయన విశ్వకర్త అని, నిఖిల జగత్తు నిర్వహణను నిర్విరామంగా కొనసాగించే ప్రభువని; ఈ సృష్టిక్రియలోనూ, ఈ నిర్వహణలోనూ ఆయనకు ఎవ్వరూ తోడులేరని, ఆయనకు ఎవ్వరూ సాటి కారని అంగీకరించడం. ఆయన ఉనికి అన్ని లోపాలకు, దోషాలకు అతీతమయినదని, ఆయన సకల సద్గుణ సంపన్నుడయిన స్వామి అని సకల శుభాలకు సరోవరమని ఒప్పుకోవడం.

(ఆ) దైవ దూతలను విశ్వసించడమంటే : వారి ఉనికిని గుర్తించడం; వారు పరిశుద్ధులని నమ్మడం; వారు దైవాజ్ఞల్ని ఉల్లంఘించలేరని, సదా దైవ దాస్యంలో నిమగ్నులయి ఉంటారని, విశ్వాసపాత్రులయిన దాసులుగా అనునిత్యం స్వామి ఆజ్ఞల్ని పాలించడానికి సంసిద్ధులయి ఉంటారని, ప్రపంచంలో సత్కార్య పరాయణులయిన మనుషుల కొరకు ప్రార్థిస్తూ ఉంటారని విశ్వసించడం.

(ఇ) దైవ గ్రంథాలను విశ్వసించడం అంటే : అల్లాహ్ తన సందేశహరుల ద్వారా అప్పుడప్పుడు పంపిన మార్గదర్శక గ్రంథాలనన్నింటినీ సత్యమైనవిగా గుర్తించడం. వాటిలో చివరి ఉద్గ్రంథం దివ్య ఖుర్‌ఆన్ అని నమ్మడం. గత ప్రవక్తల అనుచర సమాజాలు తమకు లభించిన దైవ గ్రంథాలను ప్రక్షిప్తపరచి వాటి స్వరూపాన్ని చెరిపివేసాయి. చివరన మహనీయ ముహమ్మద్ (సఅసం) ద్వారా తన అంతిమ గ్రంథం పంపాడు అల్లాహ్. ఇందులో స్పష్టమయిన సంపూర్ణమయిన మార్గదర్శక సూత్రాలున్నాయి. ఇందులో ఎలాంటి దోషం లేదు. ఎలాంటి లోపమూ లేదు. ఇప్పుడు దైవాన్ని చేరడానికి, ఆయన ప్రసన్నుడయ్యే మార్గం పొందడానికి ప్రపంచంలో ఈ గ్రంథం తప్ప మరో పరిపూర్ణదైన గ్రంథం ఏదీ లేదు అని విశ్వసించడం.

(ఈ) దైవప్రవక్తల్ని విశ్వసించడం అంటేః అల్లాహ్ చేత ప్రభవింపజెయ్యబడిన ప్రవక్తలందరూ నిజమయినవారని, సత్యస్వరూపులని, ఈ ప్రవక్తలందరూ దైవ సందేశాన్ని హెచ్చు తగ్గుల్లేకుండా ప్రజలకు అందజేశారని నమ్మడం. ఈ ప్రవక్తల పరంపరకు చివరివారు మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) అని, ఇప్పుడు మానవులకు ఆదర్శమూర్తి ఆయనే అని, మోక్షం కేవలం ఆయన్ని అనుసరించడం వల్లనే లభిస్తుందనీ మనసారా అంగీకరించడం.

(ఉ) పరలోకాన్ని విశ్వసించడం అంటే : తీర్పు జరిగే ఒక రోజు రానున్నదని, ఆ రోజున మానవుల జీవితపు భోగట్టా మొత్తం పరిశీలించబడుతుందనీ అప్పుడు ఎవరి

# అల్లాహ్ పట్ల విశ్వాసం

٥ــــ عَنْ مُعَاذِ بْنِ جَبَلٍ رَضِىَ اللّٰهُ عَنْهُ قَالَ: كُنْتُ رِدْفَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، لَيْسَ بَيْنِي وَبَيْنَهُ إِلَّا مُؤْخِرَةُ الرَّحْلِ. فَقَالَ: يَا مُعَاذَ بْنَ جَبَلٍ! فَقُلْتُ: لَبَّيْكَ يَا رَسُوْلَ وَسَعْدَيْكَ - ثُمَّ سَارَ سَاعَةً، ثُمَّ قَالَ: يَا مُعَاذَ بْنَ جَبَلٍ! قُلْتُ: لَبَّيْكَ يَا رَسُوْلَ اللّٰهِ وَسَعْدَيْكَ - ثُمَّ سَارَ سَاعَةً، ثُمَّ قَالَ: يَا مُعَاذَ بْنَ جَبَلٍ! قُلْتُ: لَبَّيْكَ يَا رَسُوْلَ اللّٰهِ وَ سَعْدَيْكَ - قَالَ: هَلْ تَدْرِي مَا حَقُّ اللّٰهِ عَزَّ وَجَلَّ عَلَى الْعِبَادِ؟ قَالَ: قُلْتُ: اَللّٰهُ وَرَسُوْلُهُ أَعْلَمُ - قَالَ: فَإِنَّ حَقَّ اللّٰهِ عَلَى الْعِبَادِ أَنْ يَعْبُدُوْهُ وَلَا يُشْرِكُوْا بِهِ شَيْئًا، ثُمَّ سَارَ سَاعَةً، ثُمَّ قَالَ: يَا مُعَاذَ بْنَ جَبَلٍ! قُلْتُ: لَبَّيْكَ يَا رَسُوْلَ اللّٰهِ وَسَعْدَيْكَ - قَالَ: هَلْ تَدْرِي مَا حَقُّ الْعِبَادِ عَلَى اللّٰهِ إِذَا فَعَلُوْا ذَالِكَ؟ قُلْتُ اَللّٰهُ وَرَسُوْلُهُ أَعْلَمُ - قَالَ: أَنْ لَا يُعَذِّبَهُمْ

(بخاری ومسلم)

5. హ్రజత్ ముఆజ్ బిన్ జబల్ (రజిఅన్) ఉల్లేఖించారు: "(ఒకసారి ప్రయాణంలో) నేను వాహనంపై దైవప్రవక్త (సఅసం) వెనక కూర్చుని ఉన్నాను. నాకూ ఆయనకీ మధ్య జీను వెనుక భాగం తప్ప మరేమీ లేదు. ఆయన 'ముఆజ్ బిన్ జబల్' అని పిలిచారు.

---

కర్మలు సవ్యంగా ఉంటాయో వారు బహుమానం పొందుతారనీ, ఎవరి కర్మలు అపసవ్యంగా ఉంటాయో వారు శిక్షార్హులు అవుతారనీ, అక్కడ లభించే శిక్ష కూడా అపరిమితమయినదనీ, బహుమానం కూడా అనంతమయినదేననీ నమ్మడం.

(ఉ) అదృష్టాన్ని విశ్వసించడం అంటే : ప్రపంచంలో జరిగేదంతా దైవాజ్ఞానుసారం జరుగుతోంది. ఇక్కడ ఆయన అధికారాలే చెలామణి అవుతాయి, ఆయన కోరిక ప్రకారం కాకుండా మరోవిధంగా ఈ విశ్వంలో జరగటం అసంభవం, మంచీ

'అయ్యా, సెలవియ్యండి. నేనిక్కడే ఉన్నాను' అన్నాను నేను. (ఆయన మౌనం వహించారు) కొంత దూరం వెళ్ళాక తిరిగి పిలిచారు, 'ఓ ముఆజ్ బిన్ జబల్!'

"దానికి నేను 'అయ్యా, సెలవియ్యండి, బానిసను ఇక్కడే ఉన్నాను' అని సమాధానమిచ్చాను. (కాని ఆయన ఏమీ పలుకలేదు) మళ్ళీ కొంతదూరం పోయాక 'ఓ ముఆజ్ బిన్ జబల్!' అని పిలిచారు ఆయన. మూడవసారి కూడా నేను అలాగే సమాధానమిచ్చాను. అప్పుడాయన, 'అల్లాహ్‌కు దాసులపై వున్న హక్కు ఏమిటో నీకుతెలుసా' అని అడిగారు. 'అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకే బాగా తెలుసు' అని నేను బదులిచ్చాను. దానికి ప్రవక్త మహనీయులు (సఅసం) 'అల్లాహ్‌కు దాసులపై ఉన్న హక్కు ఏమిటంటే, వారు ఆయన్నే ఆరాధించాలి; ఈ ఆరాధనలో మరెవ్వరినీ భాగ స్వాములుగా చెయ్యకూడదు' అని సెలవిచ్చారు.

"ఇంకా కాస్త దూరం వెళ్ళి 'ముఆజ్!' అని పిలిచారు 'సెల వియ్యండి. మీ మాటను సావధానంగా విని పాటిస్తాను' అని జవాబు పలికాను.

"అల్లాహ్‌ను ఆరాధించే దాసులకు అల్లాహ్‌పై ఉన్న హక్కు ఏమిటో నీకు తెలుసా?' అని అడిగారు. 'అల్లాహ్‌కు, ఆయన సందేశహరునికే బాగా తెలుసు' అని నేను బదులు పలికాను. 'దాసులకు అల్లాహ్‌పై ఉన్న హక్కు ఏమిటంటే ఆయన వారిని శిక్షించకుండా వుండాలి' అని సెలవిచ్చారు." (బుఖారి, ముస్లిమ్)

---

చెడులకు, సన్మార్గ దుర్మార్గాలకు సంబంధించిన ఒక నియమం ఉంది, దాన్ని ఆయన ముందే నిర్దిష్ట పరిచాడు. కృతజ్ఞులయిన దేవుని దాసులపై వాటిల్లే ఉపద్రవాలు, వారు ఎదుర్కొనే కష్టాలు వారికి ఆసన్నమయ్యే పరీక్షా సమయాలు అన్నీ వారి ప్రభు ఆజ్ఞ ప్రకారం ముందే నిర్ణయించబడిన నియమానుసారం జరుగుతాయని విశ్వసించడం.

5. హజ్రత్ ముఆజ్ (ర.అ) వివరించినదానికి భావమేమంటే, నేను ఆయనకు అతి సమీపంలోనే ఉన్నాను. చెప్పడానికి, వినడానికి ఎలాంటి అవరోధమూ లేదు. ఆయన

٦ـــ قَالَ: أَتَدْرُوْنَ مَا الْإِيْمَانُ بِاللّٰهِ وَحْدَهٗ؟ قَالُوْا: اَللّٰهُ وَرَسُوْلُهٗ اَعْلَمُ، قَالَ: شَهَادَةُ أَنْ لَّآ إِلٰهَ إِلَّا اللّٰهُ وَأَنَّ مُحَمَّدًا رَّسُوْلُ اللّٰهِ وَإِقَامُ الصَّلٰوةِ وَإِيْتَاءُ الزَّكٰوةِ وَصِيَامُ رَمَضَانَ۔ (مشکوٰۃ)

6. "ప్రవక్త శ్రేష్ఠులు (అబ్దుల్ కైస్ తెగవారి ప్రతినిధి వర్గాన్ని ఉద్దేశించి) అడిగారు, 'దైవం ఒక్కడే అని విశ్వసించడమంటే ఏమిటో మీకు తెలుసా?' అని. దానికి వారు, 'అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకే తెలుసు' అని పలికారు. అప్పుడు ఆయన 'విశ్వాసమంటే, మనిషి అల్లాహ్ తప్ప మరే ఇతర ఆరాధ్య శక్తిలేదనే సత్యానికి, ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ సందేశహరుడనే వాస్తవానికి సాక్ష్యమివ్వాలి; నమాజ్‌ను సవ్యంగా చెయ్యాలి; జకాత్ ఇవ్వాలి; రమజాన్ నెలలో రోజా వ్రతాన్ని పాటించాలి' అని బోధించారు."

(మిష్కాత్)

٧ـــ عَنْ أَنَسٍ رَضِیَ اللّٰهُ عَنْهُ قَالَ: قَلَّمَا خَطَبَنَا رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِلَّا قَالَ: لَا إِيْمَانَ لِمَنْ لَّا أَمَانَةَ لَهٗ وَلَا دِيْنَ لِمَنْ لَّا عَهْدَ لَهٗ۔ (مشکوٰۃ)

7. హజ్రత్ అనస్ (రజిఅన్) ఇలా అన్నారు : మహాప్రవక్త (సఅసం) ప్రసంగించినప్పుడల్లా ఈ విషయాలను తప్పనిసరిగా ప్రస్తావించేవారు : "ఎవరిలోనయితే అమానతు లేదో వారిలో ఈమాన్ (విశ్వాసం) లేదు, ఎవరికయితే వాగ్దానంపట్ల గౌరవం లేదో వారిలో దీన్ (ధర్మం) లేదు."

(మిష్కాత్)

---

చెప్పినదాన్ని సునాయాసంగా వినగలను. కాని చెప్పబోయే విషయం చాలా ముఖ్యమయింది గనుక, దాని ప్రాముఖ్యత నాకు విశదమవ్వాలనీ నేను శ్రద్ధగా వినాలనీ ఆయన మూడు సార్లు పిలిచి మౌనంగా ఉండిపోయారు అన్నది.

మహాప్రవక్త (సఅసం) సూక్తిని గమనిస్తే తౌహీద్ (ఏకేశ్వరోపాసన)కు ఎంత ప్రాముఖ్యం ఉందో మనకు తెలుస్తుంది. ఇదే మానవుణ్ణి నరకయాతన నుండి రక్షిస్తుంది. దైవాగ్రహం నుండి కాపాడి స్వర్గప్రవేశానికి అర్హత చేకూర్చే విషయంకన్నా విలువయినది మరొకటి కాగలదా?

٨ ـــ عَنْ عَمْرِو بْنِ عَبَسَةَ رَضِيَ اللّٰهُ عَنْهُ قَالَ : قُلْتُ يَا رَسُوْلَ اللّٰهِ، مَا الْإِيْمَانُ ؟ قَالَ : الصَّبْرُ وَالسَّمَاحَةُ ۔ (مُسلم ــــ عمرو بن عبسه)

8. హజ్రత్ అమ్ర్ బిన్ అబస (రజిఅన్) ఇలా అన్నారు: "నేను దైవ ప్రవక్త (సఅసం)ను '[ఈమాన్] విశ్వాసమంటే ఏమిటీ?' అని అడిగాను. ఆయన 'విశ్వాసమంటే సహనం; దాతృత్వం' అని సమాధానమిచ్చారు." (ముస్లిం)

٩ ـــ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : مَنْ أَحَبَّ لِلّٰهِ وَأَبْغَضَ لِلّٰهِ وَأَعْطٰى لِلّٰهِ وَمَنَعَ لِلّٰهِ فَقَدِ اسْتَكْمَلَ الْإِيْمَانَ ۔ (بخاری ــــ ابوامامه)

9. మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు : "ఎవరయితే అల్లాహ్ కొరకు స్నేహం చేస్తారో, అల్లాహ్ కొరకు శత్రుత్వం వహిస్తారో ఇంకా అల్లాహ్ కొరకే దానం చేస్తారో, అల్లాహ్ కొరకే నిరాకరిస్తారో వారు తమ విశ్వాసాన్ని పరిపూర్ణం చేసుకున్నారు." (బుఖారి - అబూ ఉమామ)

١٠ ـــ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : ذَاقَ طَعْمَ الْإِيْمَانِ مَنْ رَضِيَ بِاللّٰهِ رَبًّا وَبِالْإِسْلَامِ دِيْنًا وَبِمُحَمَّدٍ رَسُوْلًا ۔ (بخاری ومسلم ــــ عباسؓ)

10. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు. "ఎవడయితే అల్లాహ్‌ను తన ప్రభువుగా, ఇస్లామ్‌ను తన ధర్మంగా, ముహమ్మద్ (సఅసం)ను దైవ ప్రవక్తగా స్వీకరించి ఆనందానుభవం పొందాడో ఆ వ్యక్తి విశ్వాసంలోని రుచిని ఆస్వాదించాడు." (బుఖారి, ముస్లిమ్ - అబ్బాస్)

---

7. దైవాన్ని విశ్వసించడంవల్ల మానవులపై వాటిల్లే దైవానికి సంబంధించిన బాధ్యతలేమిటో, తోటి మానవులకు సంబంధించిన బాధ్యతలేమిటో అన్నీ దివ్య ఖుర్ఆన్‌లో పొందుపరచబడి ఉన్నాయి. వాటిని సరిగ్గా నిర్వహించని వ్యక్తి ఈమాన్(విశ్వాసం)లో పరిపూర్ణతను సాధించలేదని భావం. అలాగే ఒక వ్యక్తి, ఇచ్చిన మాటను నిలబెట్టుకోలేక పోతే అతనిలో ధర్మపరాయణతలేదని అర్థం. ఎవరి హృదయాల్లో విశ్వాస బీజాలు నాటుకుపోతాయో వారు బాధ్యతల నిర్వహణలో ఎలాంటి లోపమూ రానివ్వరు. తెలిసీ దాటవేసే ప్రయత్నమూ చెయ్యరు. ఇలాగే ఏ వ్యక్తిలో ధర్మనిష్ఠ ఉంటుందో అతను చివరి ఘడియ వరకు చేసిన బాసను నిలబెట్టుకుంటాడు. అల్లాహ్, ఆయన

# ప్రవక్త పట్ల విశ్వాసం

١١ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : إِنَّ خَيْرَ الْحَدِيْثِ كِتٰبُ اللهِ وَخَيْرَ الْهَدْيِ هَدْيُ مُحَمَّدٍ - (مُسلم ـــ جابرؓ)

11. "ఉత్తమ వచనం అల్లాహ్ గ్రంథం, ఉత్తమ చరితం ముహమ్మద్ (సఅసం) చరితం" అని మహాప్రవక్త (సఅసం) పలికారు.

(ముస్లిమ్-జాబిర్)

١٢ـــ عَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ : قَالَ لِيْ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : يَا بُنَيَّ ، إِنْ قَدَرْتَ أَنْ تُصْبِحَ وَتُمْسِيَ وَلَيْسَ فِيْ قَلْبِكَ غِشٌّ لِأَحَدٍ فَافْعَلْ ثُمَّ قَالَ : يَا بُنَيَّ وَذَالِكَ مِنْ سُنَّتِيْ ، وَمَنْ أَحَبَّ سُنَّتِيْ فَقَدْ أَحَبَّنِيْ كَانَ مَعِيَ فِي الْجَنَّةِ - (مُسلم)

12. హజ్రత్ అనస్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం మహాప్రవక్త (సఅసం) తనకు ఇలా ఉపదేశించారు:

"అబ్బాయి! నీవు నీ మనస్సులో ఎవరిపట్లా కల్మషపు ఆలో చనల్లేకుండా రేయింపగళ్ళను గడపగలిగితే అలాంటి జీవితాన్నే గడుపు." ఆయన, "నా విధానం (సున్నత్ = సంప్రదాయం) కూడా ఇదే. నా విధానాన్ని ప్రేమించే వ్యక్తి నిస్సందేహంగా నన్ను ప్రేమించినట్లే. నన్ను ప్రేమించిన వ్యక్తి స్వర్గంలో నాతో వుంటాడు." అని అన్నారు. (ముస్లిమ్)

---

ప్రవక్త, ఆయన గ్రంథం పట్ల మనిషికి ఉన్న బాధ్యత, బాధ్యతల్లోకెల్లా గురుతరమయినది, ప్రమాణాల్లోకెల్లా గొప్పది, మనిషి తన దైవంతో ఆయన ప్రవక్తతో, ప్రవక్త అందజేసిన "ధర్మం"తో చేసిన ప్రమాణం. వీటిని నిర్వర్తించడం అన్నింటికంటే ముఖ్యమయింది.

8. విశ్వాసమంటే, మనిషి అనుసరించడానికి దైవ మార్గాన్ని ఎన్నుకోవాలి; ఆ మార్గంలో ఎదురయ్యే ఆపదల్ని భరించాలి; దైవంపై భారం మోపి ముందుకు పురోగమించాలి – ఈ వైఖరినే సహనం అనంటారు. మనిషి తన సంపదను నిరుపేదల కొరకు, అనాథలైన దేవుని దాసుల కొరకు దైవ ప్రసన్నత పొందటానికి వ్యయపరచాలి.

١٣ـــ جَاءَ ثَلٰثَةُ رَهْطٍ إِلٰى أَزْوَاجِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَسْأَلُوْنَ
عَنْ عِبَادَةِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ۔ فَلَمَّا أُخْبِرُوْا بِهَا كَأَنَّهُمْ تَقَالُّوْهَا
فَقَالُوْا: أَيْنَ نَحْنُ مِنَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ؟ وَقَدْ غَفَرَ اللّٰهُ مَا تَقَدَّمَ
مِنْ ذَنْبِهٖ وَمَا تَأَخَّرَ، فَقَالَ أَحَدُهُمْ: أَمَّا أَنَا فَأُصَلِّي اللَّيْلَ أَبَدًا، وَقَالَ
الْاٰخَرُ: أَنَا أَصُوْمُ النَّهَارَ أَبَدًا وَلَا أُفْطِرُ۔ وَقَالَ الْاٰخَرُ: أَنَا أَعْتَزِلُ النِّسَاءَ فَلَا
أَتَزَوَّجُ أَبَدًا۔ فَجَاءَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِلَيْهِمْ فَقَالَ: أَنْتُمُ
الَّذِيْنَ قُلْتُمْ كَذَا وَكَذَا؟ أَمَا وَاللّٰهِ، إِنِّي لَأَخْشَاكُمْ لِلّٰهِ وَأَتْقَاكُمْ لَهٗ
لٰكِنِّي أَصُوْمُ وَأُفْطِرُ وَأُصَلِّي وَأَرْقُدُ وَأَتَزَوَّجُ النِّسَاءَ فَمَنْ رَغِبَ عَنْ سُنَّتِي
فَلَيْسَ مِنِّي۔ (مسلم — انس رضؓ)

13. ముగ్గురు వ్యక్తులు మహాప్రవక్త (సఅసం) ఆరాధనలను గురించి తెలుసుకోటానికి ఆయన సతీమణుల వద్దకు వచ్చారు. వారు దాన్ని గురించి తెలుసుకున్నప్పుడు అది చాలా స్వల్పం అని భావించారు. వారు ఇలా ఊహించుకున్నారు : "ప్రవక్త (సఅసం) కూ మనకూ పోలిక ఏమిటీ? ఆయన పూర్వంకూడా ఎలాంటిపాపం ఎరుగరు, ఇకపై కూడా ఆయన ఎలాంటి పాపమూ చెయ్యరు. (మనమయితే పాప రహితులం కాము. కనుక మనం ఇతోధికంగా ఆరాధన చెయ్యాలి)." తదనుగుణంగా వారిలో ఒకడు "ఎల్లప్పుడూ నేను రాత్రిఅంతా నఫిల్ నమాజులు చేస్తూ

---

మూలంలో ఉన్న "సమాహాత్" అన్న పదానికి ఇదే అర్థం. ఈ పదానికి వినమ్రత, ఉదారత, విశాల హృదయత అన్న అర్థాలు కూడా వస్తాయి.

9. అంటే మనిషి శిక్షణ పొందుతూ క్రమేణ ఈ ఉన్నత స్థానాన్ని పొందగలుగుతాడు: అతను ఎవరితో సన్నిహితుడయినా, మరెవరికి దూరమయినా, కేవలం దైవప్రసన్నత బడయటానికే అలా చేస్తాడు. ధర్మం కొరకే ఒకరిని ప్రేమిస్తాడు, ధర్మం కొరకే మరొకరిని ద్వేషిస్తాడు. అతని రాగ ద్వేషాలు స్వార్థంతో, ప్రాపంచిక ప్రయోజనాలతో ముడిపడి ఉండవు. కేవలం దైవం కొరకే, ఆయనకు సమ్మతమైన ధర్మం కొరకే అంకితమయి ఉంటాయి. మనిషి ఈ స్థితికి చేరినప్పుడే అతని విశ్వాసం పరిపూర్ణమవుతుందని తెలుసుకోవాలి.

గడుపుతాను" అని నిర్ణయించుకున్నాడు. రెండో వ్యక్తి "నేను ఎల్లప్పుడూ నఫిల్ రోజాప్రతాన్ని పాటిస్తాను. పగటిపూట ఎన్నడూ భోజనం చెయ్యను" అని నిశ్చయించుకున్నాడు. మూడో వ్యక్తి "నేను స్త్రీలకు దూరంగా ఉంటాను. ఎన్నటికీ వివాహంచేసుకోను" అని తీర్మానించు కున్నాడు.

మహాప్రవక్త (సఅసం) [కు ఈ సమాచారం అందినపుడు ఆయన] వారివద్దకు పోయి "మీరేనా ఈ నిర్ణయాలు తీసుకున్నది?" అని అడిగారు. తరువాత ఆయన ఇలా హితబోధ చేశారు. "నిస్సందేహంగా నేను మీ కంటే అధికంగా దైవానికి భయపడేవాణ్ణి. ఆయన అవిధేయతకు దూరంగా ఉండేవాణ్ణి. కాని నేను ఒకప్పుడు (నఫిల్) రోజాలుపాటిస్తాను, మరొకప్పుడు పాటించను. ఇలాగే (రాత్రిళ్ళలో) నఫిల్ నమాజులు కూడా చేస్తాను, నిద్ర కూడా పోతాను. నేను పెళ్ళి కూడా చేసుకున్నాను. (కనుక నా పద్ధతిని అనుసరించటమే మీకు శ్రేయస్కరం). ఎవరి దృష్టిలోనయితే నా సంప్రదాయానికి విలువ లేదో, ఎవరైతే నా సంప్రదాయానికి విముఖులవుతారో అట్టి వారితో నాకు ఎలాంటి సంబంధమూ లేదు."

(ముస్లిమ్-అనస్)

---

10. అంటే అల్లాహ్ దాస్యానికి తనను తాను అంకితం చేసుకుని దైవ గ్రంథం అందజేసిన ఇస్లామీయ షరీఅత్ ప్రకారం జీవితం గడుపుతూ, ప్రవక్త మార్గదర్శకత్వానికి కట్టుబడి ఉంటూ పూర్తిగా తృప్తి చెందిన వ్యక్తి అని భావం. నేను అల్లాహ్ దాస్యం తప్ప మరెవరి దాస్యాన్ని చెయ్యనని సర్వకాల సర్వావస్థల్లో ఇస్లామ్ ఆదేశాల ప్రకారమే నడుచుకుంటాననీ, ప్రవక్త (సఅసం) ను తప్ప మరే ఇతర మానవుణ్ణి అనుసరించనని నిర్ణయించుకున్న వ్యక్తి అని భావం. ఏ వ్యక్తి ఈ విధంగా పరిణతి చెందుతాడో అతను ఈమాన్ మాధుర్యాన్ని ఆస్వాదించాడని తెలుసుకోవాలి.

11. దైవ వచనం లేక దైవ గ్రంథమే ఉత్తమ వచనం అంటే అది ఉత్తమ మార్గదర్శ కత్వం అని భావం. అలాగే ప్రవక్త శ్రేష్ఠుల జీవిత చరిత్ర ఉత్తమమయిందంటే, అనుసరించేందుకు ఉత్కృష్టమయిన ఆదర్శం అదొక్కటే అని అర్థం.

12. ఒకరిపట్ల కల్మషపు భావాలు, చెడు ఆలోచనలు కలిగి ఉండటమన్నది నైతిక రుగ్మతగా, ఆధ్యాత్మిక దోషంగా చెప్పవచ్చు. దాన్ని గురించి బోధక శ్రేష్ఠులు

3)

١٤ـــــ مَنَعَ رَسُوْلُ اللّٰہِ صَلَّى اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ شَیْئًا، فَرَخَّصَ فِیْہِ فَتَنَزَّہَ عَنْہُ قَوْمٌ فَبَلَغَ ذٰلِكَ رَسُوْلَ اللّٰہِ صَلَّى اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ فَخَطَبَ : فَحَمِدَ اللّٰہَ ثُمَّ قَالَ : مَا بَالُ أَقْوَامٍ یَتَنَزَّھُوْنَ عَنِ الشَّیْءِ أَصْنَعُہٗ ؟ فَوَاللّٰہِ إِنِّیْ لَأَعْلَمُھُمْ بِاللّٰہِ وَأَشَدُّھُمْ لَہٗ خَشْیَۃً ۔ (بخاری ومسلم ـــــ عائشہؓ)

14. మొదట మహాప్రవక్త (సఅసం) ఒక పని చెయ్యకూడదని ప్రజలను వారించారు. కాని తరువాత ఆయన ఆ పనిని చేశారు - తద్వారా ఇక తాను అందరికీ ఆ పనినిచేసే అనుజ్ఞ ఇస్తున్నట్లు తెలియాలని. అప్పటికీ కొందరు ఆ పనిని చేసేందుకు సిద్ధపడలేదు. అప్పుడు ఆయన ఇలాంటి మనస్తత్వం గలవారిని గురించి ఒక ప్రసంగం చేశారు. అందులో దైవ స్తోత్రం పిదప, "నేను ఏ కార్యాన్నయితే చేస్తున్నానో, దాన్ని చెయ్యటానికి కొందరు ఎందుకు వెనుకాడుతున్నారు? దైవం సాక్షి, నేను వారందరికంటే అధిక దైవ జ్ఞానం కలవాణ్ణి; వారందరికంటే అధిక దైవభీతిగలవాణ్ణి" అని ఉద్బోధించారు. *(బుఖారి - ముస్లిమ్, ఆయిషా [రజిఅన్])*

---

ముహమ్మద్(సఅసం) ఈ హదీసులో ఎంతో వివేచనతో తన సహచరులకు తెలిపారు. ఒకరు మనకు కీడు తలపెట్టినప్పుడు మనలో వారి పట్ల దురభిప్రాయం జనించడం సహజం. కాని దైవ సందేశహరుని ఈ బోధనను పాటించినప్పుడు మనసులోని భారమంతా తొలగిపోయి నిష్కల్మషమయిన, తేలికయిన హృదయం ఎంత హాయి నిస్తుంది!

14. కొందరు వ్యక్తులు స్వయం కల్పిత "ధర్మనిష్ఠ" భావనకు గురయి ధర్మంలో అనుమతించబడిన కార్యాన్ని కూడా చెయ్యడానికి తప్పుగా పరిగణిస్తారు. అలాంటి మనస్తత్వంగలవారు కొందరికి ఒకప్పుడు మహాప్రవక్త వారించిన కార్యాన్ని, స్వయంగా ఆయన చేసిన తరువాత కూడా చెయ్యడానికి మనస్కరించలేదు. కారణం వారి 'విపరీత భయభక్తుల' భావనే. అలాంటివారిని దృష్టిలో ఉంచుకునే ప్రవక్త మహనీయులు పై ప్రసంగం చేశారు. భయభక్తులకు, ధర్మ పరాయణతకు దైవ ప్రవక్తను మించిన గీటురాయి ఏది కాగలదు ?

١٥ـــــ عَنْ جَابِرٍ رَضِيَ اللّٰهُ عَنْهُ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ حِيْنَ أَتَاهُ عُمَرُ فَقَالَ : إِنَّا نَسْمَعُ أَحَادِيْثَ مِنْ يَهُوْدَ تُعْجِبُنَا أَفَتَرٰى أَنْ نَكْتُبَ بَعْضَهَا؟ فَقَالَ : أَمُتَهَوِّكُوْنَ أَنْتُمْ كَمَا تَهَوَّكَتِ الْيَهُوْدُ وَالنَّصَارٰى ؟ لَقَدْ جِئْتُكُمْ بِهَا بَيْضَاءَ نَقِيَّةً ، وَلَوْ كَانَ مُوْسٰى حَيًّا مَا وَسِعَهُ إِلَّا إِتِّبَاعِيْ۔

(مسلم ـــ جابرؓ)

15. హజ్రత్ జాబిర్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారుః మహాప్రవక్త (సఅసం) వద్దకు హజ్రత్ ఉమర్ (రజిఅన్) వచ్చి, "యూదుల మాటలు కొన్ని మాకు మంచివిగా తోస్తున్నాయి. వాటిలో కొన్నింటిని వ్రాసుకోవడానికి మమ్మల్ని అనుమతిస్తారా?" అని అడిగారు. దానికి ఆయన "మీరూ అపమార్గపు గోతిలో పడాలని అభిలషిస్తున్నారా- యూదులూ క్రైస్తవులూ తమ తమ గ్రంథాలను వదలి అపమార్గంలో పడినట్లు ? నేను మీకు అందజేసిన షరీఅత్ (శాసనాంగం) సూర్యునిలా తేజోవంతమయినది, అద్దంలా స్వచ్ఛమయినది. ఒకవేళ నేడు మూసా (అస్సలాం) సజీవులయి ఉంటే, నన్ను అనుసరించటం తప్ప ఆయనకూ్కడా మార్గాంతరం లేకపోయేది" అని బోధించారు. *(ముస్లిమ్-జాబిర్ [రజిఅన్])*

١٦ـــــ عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرٍو قَالَ : قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : لَا يُؤْمِنُ أَحَدُكُمْ حَتّٰى يَكُوْنَ هَوَاهُ تَبَعًا لِمَا جِئْتُ بِهٖ۔ (مشكوٰة)

16. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారంః "ఒక వ్యక్తి చేసే సంకల్పం, మనో ప్రవృత్తులు నేను తెచ్చినదానికి (దివ్య ఖుర్ఆన్‌కు) లోబడి రూపొందనంతవరకు మీలో ఏ ఒక్కడూ నిజమయిన మోమిన్ (విశ్వాసి) కాజాలడు" అని మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. (మిష్కాత్)

---

15. యూదులు తమ ధార్మిక గ్రంథమయిన తౌరాహ్ (Torah) ను ప్రక్షిప్తాలతో

١٧۔ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ : لَایُؤْمِنُ أَحَدُکُمْ حَتّٰی أَکُوْنَ أَحَبَّ إِلَیْہِ مِنْ وَّالِدِہٖ وَوَلَدِہٖ وَالنَّاسِ أَجْمَعِیْنَ ۔

(بخاری ومسلم — انسؓ)

17. మహాప్రవక్త (సఅసం) ఒకసారి ఇలా వివరించారు. "మీలో ఒక వ్యక్తి దృష్టిలో నేను అతని తండ్రికన్నా అతని కొడుకుకన్నా ఇంకా ప్రజలందరికన్నా అధికంగా ప్రేమపాత్రుణ్ణి కానంతవరకు మీలో ఎవడూ నిజమయిన మోమిన్ (విశ్వాసి) కాలేడు." (బుఖారి, ముస్లిమ్-అనస్)

١٨۔ إِنَّ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ تَوَضَّأَ یَوْمًا ، فَجَعَلَ أَصْحَابُہٗ یَتَمَسَّحُوْنَ بِوَضُوْءِہٖ ، فَقَالَ لَھُمُ النَّبِیُّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ : مَا یَحْمِلُکُمْ عَلٰی ھٰذَا ؟ قَالُوْا : حُبُّ اللّٰہِ وَرَسُوْلِہٖ ، فَقَالَ النَّبِیُّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ : مَنْ سَرَّہٗ أَنْ یُّحِبَّ اللّٰہَ وَرَسُوْلَہٗ أَوْ یُحِبَّہُ اللّٰہُ وَرَسُوْلُہٗ فَلْیَصْدُقْ حَدِیْثَہٗ إِذَا حَدَّثَ ، وَلْیُؤَدِّ أَمَانَتَہٗ إِذَا أُتُمِنَ ، وَلْیُحْسِنْ جِوَارَ مَنْ جَاوَرَہٗ ۔ (مشکوٰۃ — عبد الرحمٰن بن ابی قرادؓ)

18. అబ్దుర్రహ్మాన్ బిన్ అబీ కిరాద్ ఇలా ఉల్లేఖించారు: 'ఒక రోజు మహాప్రవక్త (సఅసం) వుజూ చేశారు. ఆయన సహచరులు కొందరు ఆయన వుజూ చేసిన నీరు తీసుకుని తమ ముఖాలకు పులుముకోసాగారు. అప్పుడాయన వారిని, "మిమ్మల్ని ఇలా చేయమని పురికొలిపిందేమిటీ?" అని ప్రశ్నించారు. దానికి వారు, "అల్లాహ్‌పైన ఆయన ప్రవక్తపైన గల ప్రేమే" అని సమాధానం ఇచ్చారు. అప్పుడు ఆయన వారికి ఇలా బోధించారు:

"ఎవరు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తనూ ప్రేమించి సంతోషిస్తారో వారు మాట్లాడితే సత్యమే పలకాలి; అతనివద్ద అమానతు (అప్పగింత)గా ఏమైనా పెట్టినప్పుడు దాన్ని (సురక్షితంగా) దాని యజమానికి అప్పగించాలి. పొరుగువారితో మంచిగా మెలగాలి." (మిష్కాత్)

١٩ــــ جَاءَ رَجُلٌ إِلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ: إِنِّي أُحِبُّكَ قَالَ: اُنْظُرْ مَا تَقُوْلُ! فَقَالَ: وَاللّٰهِ، إِنِّي لَأُحِبُّكَ ثَلٰثَ مَرَّاتٍ، قَالَ: اِنْ كُنْتَ صَادِقًا فَاَعِدَّ لِلْفَقْرِ تِجْفَافًا- لَلْفَقْرُ اَسْرَعُ إِلَى مَنْ يُّحِبُّنِيْ مِنَ السَّيْلِ إِلَى مُنْتَهَاهُ- (ترمذی)

19. హజ్రత్ అబ్దుల్లాహ్ ఇలా ఉల్లేఖించారు: ఒక వ్యక్తి ప్రవక్త మహనీయుని (సఅసం) సన్నిధిలో హాజరయ్యాడు. 'నేను మిమ్మల్ని ఎంతో ప్రేమిస్తున్నాను' అని అన్నాడు. 'నీవు ఏమంటున్నావో బాగా ఆలోచించుకో' హెచ్చరించారు మహాప్రవక్త (సఅసం). అతడు మూడు సార్లు 'దైవం సాక్షి, నేను మిమ్మల్ని అమితంగా ప్రేమిస్తున్నాను' అని పలికాడు.

"నీవు చెప్పేదే నిజమయితే, బీదరికాన్ని ఎదుర్కొనడానికి సిద్ధపడాలి. నన్ను ప్రేమించే వారి వైపునకు బీదరికం వెల్లువకంటే వేగంగా వేంచేస్తుంది" అని ప్రకటించారు మహాప్రవక్త శ్రేష్ఠులు (సఅసం). (తిర్మిజి)

---

చెరిపారు. అయితే అందులో అంతా చెడు మాత్రమే ఉందని అర్థం కాదు. కొన్ని నిజమైన విషయాలు కూడా అందులో ఉన్నాయి. వాటిని ముస్లిములు విని మెచ్చుకునేవారు. ఒకవేళ అప్పుడు మహాప్రవక్త అలా వారించకుండా ఆ మంచి విషయాలను భద్రపరచుకునేందుకు అనుమతించి ఉంటే నిజమయిన ఇస్లామ్ బోధనలు గుర్తుపట్టడం కష్టతరమయిపొయ్యేది. ఇస్లామ్ ధర్మంలో ఎన్నో తప్పుడు భావాలు చోటు చేసుకుని ఉండేవి. మంచి విషయాలు ఏ మతంలో ఉండవనీ? మహాప్రవక్త (సఅసం) హజ్రత్ ఉమర్ (రజిఅన్)కు ఇచ్చిన సమాధానం దృష్ట్యా స్వచ్ఛమైన సెలయేరు అందుబాటులో ఉండగా కలుషితమైన కుంటలవైపు చూడటం అవివేకం కాదా?

16. ప్రవక్తను విశ్వసించడమంటే ఇంకా వేరే భావమేముంది ? తన మనోవాంఛల్ని, తన సంకల్పాలను, తన ప్రవృత్తుల్ని ప్రవక్త అందజేసిన మార్గదర్శకత్వం ప్రకారం మలచుకోవడం, తన అంతర్యానికి కళ్ళెం వేసి దాన్ని దివ్య ఖుర్ఆన్ హస్తగతం చెయ్యడం - ఇంతేగా? ఇలా జరక్కపోతే ఇంకా ప్రవక్తను విశ్వసించడంలో అర్థమే లేదు.

17. మహాప్రవక్త (సఅసం) సూక్తికి అర్థం ఏమిటంటే, మనిషికి దైవ సందేశహరునిపై, ఆయన బోధించిన ధర్మంపై గల ప్రేమ కడమ ప్రేమలన్నింటినీ జయించినప్పుడే

# దివ్య ఖుర్‌ఆన్‌ని విశ్వసించడం

٢٠۔ قَالَ ابْنُ عَبَّاسٍ رضی : مَنِ اقْتَدٰی بِکِتٰبِ اللّٰهِ لَایَضِلُّ فِی الدُّنْیَا وَلَایَشْقٰی فِی الْاٰخِرَةِ ۔ ، ثُمَّ تَلَا هٰذِهِ الْاٰیَةَ : "فَمَنِ اتَّبَعَ هُدَایَ فَلَایَضِلُّ وَلَایَشْقٰی ۔" (مشکوٰۃ)

20. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ సెలవిచ్చారు : "ఎవరు అల్లాహ్ గ్రంథాన్ని అనుసరిస్తారో వారు ప్రపంచంలోనూ సన్మార్గానికి దూరం కారు, పరలోకంలోనూ సఫలతను కోల్పోరు." తరువాత ఆయన ఒక ఆయత్‌ను పఠించారు.
"నేను పంపిన మార్గదర్శకత్వాన్ని ఏ వ్యక్తి అయితే అనుసరిస్తాడో అతడు (ప్రపంచంలో) సన్మార్గాన్ని తప్పడు, (పరలోకంలో) నిష్ఫలతకు గురికాడు." (20 : 123) (మిష్కాత్)

٢١۔ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّی اللّٰهُ عَلَیْهِ وَسَلَّمَ : نَزَلَ الْقُرْاٰنُ عَلٰی خَمْسَةِ أَوْجُهٍ : حَلَالٍ وَّحَرَامٍ وَّمُحْکَمٍ وَّمُتَشَابِهٍ وَّأَمْثَالٍ فَأَحِلُّوا الْحَلَالَ وَحَرِّمُوا الْحَرَامَ وَاعْمَلُوْا بِالْمُحْکَمِ وَاٰمِنُوْا بِالْمُتَشَابِهِ وَاعْتَبِرُوْا بِالْأَمْثَالِ ۔ (مشکوٰۃ — ابوھریرۃ رضی)

21. దైవప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "దివ్య ఖుర్‌ఆన్‌లో అయిదు అంశాలున్నాయి. అవి: హలాల్, హరామ్, ముహ్కమ్, ముతషాబిహ్, అమ్సాల్. హలాల్‌ను హలాల్‌గానే భావించండి, హరామ్‌ను హరామ్‌గానే పరిగణించండి, ముహ్కమ్‌ను అమలుపరచండి, ముతషాబిహ్‌ను విశ్వసించండి. అమ్సాల్ ద్వారా గుణపాఠం పొందండి."
(మిష్కాత్ - అబూహురైరా [రజిఅన్])

---

అతడు విశ్వాసి కాగలుగుతాడు. పుత్ర ప్రేమ ఒక దారిపై నడపమంటుంది; పితృ ప్రేమ మరో మార్గాన్ని అనుసరించమంటుంది; ప్రవక్త (సఅసం) వేరొక బాటను నడవమంటారు. అయితే దైవ ప్రవక్త(సఅసం) చూపిన బాటనే పాటించాలి. అప్పుడే అతడు నిజమయిన విశ్వాసి అని, ప్రవక్త ప్రేమికుడని రూఢీ అవుతుంది. ఇలాంటి

۲۲ــــقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ اللّٰهَ فَرَضَ فَرَائِضَ فَلَا تُضَيِّعُوْهَا، وَحَرَّمَ حُرُمٰتٍ فَلَا تَنْتَهِكُوْهَا، وَحَدَّ حُدُوْدًا فَلَا تَعْتَدُوْهَا وَسَكَتَ عَنْ أَشْيَاءَ مِنْ غَيْرِ نِسْيَانٍ فَلَا تَبْحَثُوْا عَنْهَا- (مشكوٰة ــ جابرؓ)

22. "అల్లాహ్ కొన్ని విధుల్ని నిర్ణయించాడు, వాటిని అలక్ష్యం వల్ల కోల్పోకండి, కొన్ని పనుల్ని నిషేధించాడు, వాటిని చెయ్యకండి, కొన్ని హద్దుల్ని ఏర్పరిచాడు, వాటిని మీరకండి, కొన్ని విషయాలపట్ల మౌనం వహించాడు–ఇది విస్మరణ వల్ల మటుకు కాదు – మీరు వాటిని గురించి తెలుసుకోవాలని అనవసరంగా ఆరాటపడకండి." అని బోధించారు దైవ ప్రవక్త (సఅసం). *(మిష్కాత్ - జాబిర్ [రజిఅన్])*

---

వ్యక్తులే ఇస్లామ్‌కు అవసరం. వారే ప్రపంచ చరిత్రను సృష్టిస్తారు. పరిపక్వం చెందని విశ్వాసం భార్యాపిల్లల పట్లగల అనురాగాన్ని, తల్లిదండ్రులపట్ల గల ప్రేమాభిమానాలను త్యాగం చెయ్యనిస్తుందా?

18. ప్రవక్త సహచరులు ప్రవక్త వుజూ చేస్తుండగా రాలే నీటిని తీసుకుని తమ ముఖాలకు పులుముకున్నారంటే అది కేవలం ఆయన పట్ల ప్రేమ కారణంగానే చేశారు. అలా చెయ్యడంలో విపరీతమేమీ లేదు, తప్పూ లేదు – దైవప్రవక్త వారిని మందలించడానికి. అయితే ఆ సందర్భాన్ని పురస్కరించుకుని నిజమయిన ప్రవక్త ప్రేమ అంటే ఏమిటో ఆయన(సఅసం) ఎంతో హృద్యంగా వివరించారు. ప్రవక్త ప్రేమకు నిజమయిన అర్థం ఆయన అందజేసిన ఆదేశాలను, ఉపదేశాలను అమలు పరచడం, ఆచరించడం. ఆయన తీసుకువచ్చిన ధర్మాన్ని తమ జీవన మార్గంగా చేసుకోవడం, ఇదే దైవ ప్రవక్త పట్ల ప్రేమకు, ఆయన పట్ల విధేయతకు ఉన్నత స్థానం. అయితే ఇదంతా చిత్తశుద్ధితో జరగాలి – ప్రదర్శనా బుద్ధితో కాదు.

19. ఒకరిని ప్రేమించడమంటే వారి ఇష్టాన్ని తమ ఇష్టంగా మార్చుకోవాలి; వారు అవలంబించేమార్గాన్ని తమ మార్గంగా ఎన్నుకోవాలి; వారి సహచర్యం, వారి సాన్నిధ్యం, వారి ప్రసన్నతలకొరకు పరితపిస్తూ సర్వస్వాన్ని త్యాగం చెయ్యడానికి సిద్ధపడాలి. మహాప్రవక్తను ప్రేమించడమంటే ఆయన ఒక్కో అడుగుజాడను వెదకి దాన్ని అనుసరించాలి ; ఏ మార్గంలో ఆయన గాయపడ్డారో ఆ మార్గంలో నడిచే ధైర్యం, ఆకాంక్ష మనలో జనించాలి. ఆ మార్గంలో సౌర్‌గుహ కూడా వస్తుంది. బద్ర్ మైదానం,

٢٣ــــعَنْ زِيَادِ بْنِ لَبِيْدٍ قَالَ: ذَكَرَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ شَيْئًا، فَقَالَ: ذٰلِكَ عِنْدَ أَوَانِ ذَهَابِ الْعِلْمِ. قُلْتُ: يَا رَسُوْلَ اللّٰهِ! وَكَيْفَ يَذْهَبُ الْعِلْمُ وَنَحْنُ نَقْرَءُ الْقُرْاٰنَ وَنُقْرِئُهُ أَبْنَاءَنَا وَيُقْرِئُهُ أَبْنَاءُنَا أَبْنَاءَهُمْ؟ فَقَالَ: ثَكِلَتْكَ أُمُّكَ زِيَادُ! كُنْتُ لَأَرَاكَ مِنْ أَفْقَهِ رَجُلٍ بِالْمَدِيْنَةِ، أَوَلَيْسَ هٰذِهِ الْيَهُوْدُ وَالنَّصٰرٰى يَقْرَءُوْنَ التَّوْرٰىةَ وَالْاِنْجِيْلَ؟ لَا يَعْمَلُوْنَ بِشَيْءٍ مِّمَّا فِيْهِمَا۔ (ابن ماجه)

23. జియాద్ బిన్ లబీద్ ఇలా అన్నారు : మహాప్రవక్త ఒక భయంకర విషయాన్ని ప్రస్తావించి "ధర్మజ్ఞానం నశించినపుడు ఇది సంభవిస్తుంది" అని సెలవిచ్చారు.

దానికి నేను "దైవ ప్రవక్తా ! ధర్మజ్ఞానం ఎలా నశిస్తుంది? మేము దివ్య ఖుర్ఆన్‌ను పఠిస్తూనే ఉన్నాము, మా సంతానానికి నేర్పుతున్నాము కూడా. మా సంతానమూ తన సంతానానికి నేర్పుతూ ఉంటుంది" అని విన్నవించుకున్నాను.

అప్పుడు మహాప్రవక్త, "భలేవాడివి జియాద్, నిన్ను మదీనా అంతటిలోనే గొప్ప బుద్ధిమంతుడని భావించేవాణ్ణి, నీవు యూదుల్ని, క్రైస్తవుల్ని చూడటం లేదా, వాళ్ళు తౌరాహ్ (TORAH) ను బైబిల్‌ను ఎంత భక్తి శ్రద్ధలతో పఠిస్తారో!? కాని వాటి బోధల ప్రకారం వారు నడుచుకోరు" అని అన్నారు. (ఇబ్ను మాజా)

---

హునైన్ పోరాటం కూడా తటస్థ పడతాయి; ధర్మ పథంలో బీదరికం ఆకలి బాధలు ఎదురవుతాయి. మనిషికి కలిగే బాధల్లో ఆర్థిక బాధ చాలా తీవ్రమయింది. దాన్ని ఎదుర్కోవడం కేవలం అల్లాహ్‌పై గల భరోసా, ఆయన పట్ల ప్రేమలాంటి ఆయుధాలతోనే సాధ్యం. ఆ పరిస్థితుల్లో నిజమయిన విశ్వాసి ఆలోచనాసరళి ఈ విధంగా ఉంటుంది: 'అల్లాహ్ మాత్రమే నా సంరక్షకుడు, నేను అనాధను మాత్రం కాను; కేవలం ఒక దాసుణ్ణి, యజమాని అభీష్టానికి అనుగుణంగా జీవించడమే దాసుని కర్తవ్యం. నేను ఎవరి సేవలో నిమగ్నమయి ఉన్నానో ఆయన ప్రేమమయుడు, న్యాయశీలుడు, నా

# అదృష్టం పట్ల విశ్వాసం

٢٤ـــ عَنْ عَلِيٍّ ، قَالَ ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : مَا مِنْ أَحَدٍ إِلَّا وَقَدْ كُتِبَ مَقْعَدُهُ مِنَ النَّارِ وَمَقْعَدُهُ مِنَ الْجَنَّةِ ـ قَالُوْا : يَا رَسُوْلَ اللّٰهِ ! أَفَلَا نَتَّكِلُ عَلَى كِتٰبِنَا وَنَدَعُ الْعَمَلَ ؟ قَالَ : اِعْمَلُوْا فَكُلٌّ مُيَسَّرٌ لِمَا خُلِقَ لَهُ ـ أَمَّا مَنْ كَانَ مِنْ أَهْلِ السَّعَادَةِ فَسَيُيَسَّرُ لِعَمَلِ السَّعَادَةِ ، وَأَمَّا مَنْ كَانَ مِنْ أَهْلِ الشَّقَاوَةِ ، فَسَيُيَسَّرُ لِعَمَلِ الشَّقَاوَةِ ـ ثُمَّ قَرَأَ " فَأَمَّا مَنْ أَعْطٰى وَاتَّقٰى وَصَدَّقَ بِالْحُسْنٰى فَسَنُيَسِّرُهُ لِلْيُسْرٰى وَأَمَّا مَنْ بَخِلَ وَاسْتَغْنٰى وَكَذَّبَ بِالْحُسْنٰى فَسَنُيَسِّرُهُ لِلْعُسْرٰى " ـ

(بخاری ومسلم)

24. హజ్రత్ అలీ (రజి.అ.) ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త ఒకసారి ఇలా సెలవిచ్చారు : "మీలో ప్రతి ఒక్కని నివాస స్థలం స్వర్గమో, నరకమో ముందే వ్రాయబడింది." ఇది విని అక్కడున్నవారు, "దైవప్రవక్తా! మేము మా విధివ్రాతను నమ్ముకుని 'ఆచరణ' (సత్క్రియలు చెయ్యడం) ఎందుకు వదులుకోకూడదు?" అని అడిగారు. దానికి ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ఉపదేశించారు: "అలా కాదు, ఆచరణను వదలకండి. ఏ వ్యక్తిని ఏ పనుల నిర్వహణ కొరకు సృష్టించటం జరిగిందో అతనికి ఆ

---

శ్రమ వృథా పోదు.' ఈ భావనవల్ల ఒక విశ్వాసి ఆపదల్ని అవలీలగా దాటిపోగలుగుతాడు; షైతాన్ కుట్రలన్నీ వమ్మయిపోతాయి.

21. హదీసులో, మొత్తం ఖుర్ఆన్ ప్రవచనాలను అయిదే రకాలుగా వర్గీకరించడం జరిగింది. ఆ అయిదు అంశాలు ఇవి : "హలాల్" అంటే ధర్మసమ్మతమయినవి. "హరామ్" అంటే నిషిద్ధమయినవి; "ముహ్కమ్" అంటే నిర్దిష్టమయినవి, విస్పష్టమయినవి; "ముతషాబిహ్" అంటే పరస్పరం పోలి ఉండేవీ సందేహజనకమయినవి; "అమ్సాల్" అంటే ఉపమానాలు అని అర్థం.

హలాల్‌ను హలాల్‌గానే భావించడమంటే, ధర్మసమ్మతమయిన వాటిని నిషేధించడం కానీ, వాటిపై అమలు జరపటానికి జంకడం కానీ జరగరాదని భావం.

కార్యాలను చేసే బుద్ధే కలుగుతుంది. తదనుగుణంగా ఎవరయితే సౌభాగ్యవంతుడో అతనికి స్వర్గం ప్రాప్తించే పనులు చేసే భాగ్యం లభిస్తుంది. దౌర్భాగ్యునికి నరకాన్ని చేరువచేసే పనుల బుద్ధి కలుగుతుంది." ఆ తరువాత మహాప్రవక్త (సఅసం) దివ్య ఖుర్ఆన్‌లోని అల్‌లైల్ సూరా ఆయత్‌లు రెండు పఠించారు :

"ఏ మనిషయితే దానధర్మాలు చేస్తాడో, భయ భక్తుల మార్గాన్ని అవలంబిస్తాడో, సద్వచనాన్ని ధృవపరుస్తాడో, (ఇస్లాంను స్వీకరిస్తాడో) అతనికి మేము ఉత్కృష్టమయిన జీవితాన్ని (స్వర్గాన్ని)పొందే అవకాశం కల్పిస్తాము. మరెవరయితే పిసినారిగా వ్యవహరిస్తాడో, (దైవం ఎడల) ఉపేక్షాభావం కనబరుస్తాడో, మంచి మాటను త్రోసిరాజంటాడో అతనికి మేము వ్యధాభరిత జీవనాన్ని (నరకాన్ని) గొనితెచ్చే బుద్ధిని కలుగచేస్తాము."

(బుఖారి, ముస్లిమ్)

---

హరామ్‌ను హరామ్‌గానే పరిగణించడం అంటే, నిషిద్ధమయినవాటిని అనుమతించడం కానీ వాటిని ఎలాగైనా అమలు జరపాలని సాకులు వెదకటం కానీ చెయ్యరాదని, అలా చెయ్యడం అపరాధం అనీ అర్థం.

ముహ్కమ్‌ను అమలుపరచడమంటే, విశ్వాసాలను గురించి, శాసనాంగం గురించి తెలిపే ఖుర్ఆన్‌బోధనలను అర్థం చేసుకుని వాటి ప్రకారం జీవన వ్యవస్థను రూపొందించుకోవడం అన్నమాట.

ముతషాబిహ్‌ని విశ్వసించడమంటే స్వర్గం, నరకం, ఇత్యాది అజ్ఞాత విషయాలు ప్రస్తావించబడిన ఖుర్ఆన్ వాక్యాలను పెకిలించే ప్రయత్నం చెయ్యకుండా, వాటి గురించి రంధ్రాన్వేషణ జరపకుండా వాటిని యధాతథంగా గ్రహించి, విశ్వసించడమే శ్రేయస్కరమని భావం.

అమ్సాల్ ద్వారా గుణపాఠం పొందడం అంటే గతంలో సమసిపోయిన జాతుల ఖురానీ గాథల వెలుగులో తమ స్థితిని సమీక్షించుకుంటూ తమ్మును తాము సంస్కరించుకోవడం అని అర్థం.

24. మనిషి ఏ కర్మల వల్ల నరకపాత్రుడవుతాడో మరే కర్మల వల్ల స్వర్గానికి అర్హుడవుతాడో అంతా దైవ సన్నిధిలో నిర్దిష్టంగా విస్పష్టంగా ఉంది. ఈ "విధివ్రాత"ను అల్లాహ్ దివ్య ఖుర్ఆన్‌లో అతి విపులంగా సూచించాడు. మహాప్రవక్త కూడా దాన్ని

٢٥۔ عَنْ أَبِي خِزَامَةَ عَنْ أَبِيهِ قَالَ: قُلْتُ: يَا رَسُولَ اللهِ! أَرَأَيْتَ رُقًى نَسْتَرْقِيهَا وَدَوَاءً نَتَدَاوَى بِهِ تُقَاةً نَتَّقِيهَا هَلْ يَرُدُّ مِنْ قَدَرِ اللهِ شَيْئًا؟ قَالَ: هِيَ مِنْ قَدَرِ اللهِ۔ (ترمذی)

25. అబీఖిజామా (ర.అ) తన తండ్రి ద్వారా విన్నది ఇలా ఉల్లేఖించారు: నేను (అబీఖిజామా తండ్రి) ఒకసారి మహాప్రవక్త (సఅసం)ను అడిగాను- 'మేము రోగనివారణ కోసం చేసే ప్రార్థనలు, వేసుకునే తావిత్తులు, వాడే మందులు, కష్టాలు ఆపదల బారినుండి రక్షణ పొందడానికి తీసుకునే ముందు జాగ్రత్తలు విధాత చేసిన నిర్ణయాలను మార్చగలవా?' అని. దానికి ఆయన "ఇవన్నీ కూడా అల్లాహ్ చేసిన నిర్ణయాల ప్రకారం జరిగినవేగా!" అని సమాధానం ఇచ్చారు. (తిర్మిజి)

٢٦۔ عَنِ ابْنِ عَبَّاسٍؓ قَالَ: كُنْتُ خَلْفَ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَوْمًا فَقَالَ: يَا غُلَامُ! إِنِّي أُعَلِّمُكَ كَلِمٰتٍ، إِحْفَظِ اللهَ يَحْفَظْكَ، إِحْفَظِ اللهَ تَجِدْهُ تُجَاهَكَ، إِذَا سَأَلْتَ فَاسْئَلِ اللهَ وَإِذَا اسْتَعَنْتَ فَاسْتَعِنْ بِاللهِ، وَاعْلَمْ أَنَّ الْأُمَّةَ لَوِ اجْتَمَعَتْ عَلٰى أَنْ يَّنْفَعُوْكَ بِشَيْءٍ لَمْ يَنْفَعُوْكَ بِشَيْءٍ إِلَّا مَا قَدْ كَتَبَهُ اللهُ لَكَ، وَلَوِ اجْتَمَعُوْا عَلٰى أَنْ يَّضُرُّوْكَ بِشَيْءٍ لَمْ يَضُرُّوْكَ إِلَّا بِشَيْءٍ قَدْ كَتَبَهُ اللهُ عَلَيْكَ۔ (مشکوٰۃ)

26. 'ఒక రోజు నేను వాహనంమీద మహాప్రవక్త (సఅసం) వెనక కూర్చొని ఉండగా ఆయన -"అబ్బాయీ! చూడు, నీకు కొన్ని మాటలు బోధిస్తున్నాను; శ్రద్ధగా విను, నీవు సదా దైవాన్ని జ్ఞాపకముంచుకో, దేవుడూ నిన్ను జ్ఞాపకముంచుకుంటాడు; నీవు దేవుణ్ణి తలచుకుంటూ ఉండు, దేవుణ్ణి నీ ఎదుట చూస్తావు. అర్థించేదంతా దైవాన్నే అర్థించు. సహాయం కావాలంటే దైవాన్నే సహాయం కోరు. దేవుణ్ణే ఆపదల్లో ఆదుకునేవాడుగా భావించు. ఒకటి మాత్రం బాగా తెలుసుకో, జనులంతా ఒక్కటై నీకు

మేలు చెయ్యదలచుకున్నా వారు ఏ మాత్రం మేలు చెయ్యలేరు - అల్లాహ్ నీ కొరకు వ్రాసి పెట్టింది తప్ప. అలాగే ప్రజలంతా చేరి నీకు కీడు కలుగజేయాలనుకున్నా వారు నీకు ఇసుమంతైనా కీడు జెయ్యలేరు- అల్లాహ్ నీ కోసం నిర్ణయించింది తప్ప" అన్నారు' అని ఇబ్నె అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖించారు. (మిష్కాత్)

٢٧ـــ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: اَلْمُؤْمِنُ الْقَوِيُّ خَيْرٌ
وَأَحَبُّ إِلَى اللّٰهِ مِنَ الْمُؤْمِنِ الضَّعِيْفِ، وَفِيْ كُلٍّ خَيْرٌ، إِحْرِصْ عَلٰى مَا
يَنْفَعُكَ وَاسْتَعِنْ بِاللّٰهِ وَلَا تَعْجِزْ، وَإِنْ أَصَابَكَ شَيْءٌ فَلَا تَقُلْ: لَوْ إِنِّيْ
فَعَلْتُ كَانَ كَذَا وَكَذَا وَلٰكِنْ قُلْ: قَدَّرَ اللّٰهُ، مَا شَاءَ فَعَلَ، فَإِنَّ
"لَوْ" تَفْتَحُ عَمَلَ الشَّيْطٰنِ۔ (مشکوٰۃ ـــ ابوہریرۃؓ)

27. "శక్తిశాలి అయిన విశ్వాసి బలహీనుడయిన విశ్వాసికంటే ఎంతో మేలు, అతడు అల్లాహ్‌కు ప్రేమపాత్రుడు కూడా. ఇంతకు, మేలు అనేది ప్రతి వ్యక్తిలోనూ ఉంటుంది. అయితే పరలోకంలో ప్రయోజనకరమయిన దాన్నే ఆశించు, అభిలషించు; కష్టాల్లో దైవాన్నే సహాయం అర్థించు; ధైర్యాన్ని వీడకు; ఆపదలు ఆసన్నమైనప్పుడు 'అధవా నేను

---

విశదపరిచారు. అయితే తాను స్వర్గమార్గాన్ని అవలంబించడాన్ని అభిలషిస్తాడో నరకపు త్రోవను త్రొక్కడాన్ని కోరుకుంటాడో - రెంటిలో ఏ బాటను ఎన్నుకుంటాడో అది మనిషి ఇష్టం, అతని బాధ్యత. ఈ బాధ్యత అతనిపై ఎలా పడిందంటే దేవుడు మనిషికి సంకల్ప స్వేచ్ఛను ప్రసాదించి ఇష్టపడిన జీవన పథాన్ని ఎన్నుకునేలా స్వతంత్రుడిగా వదిలాడు. ఈ స్వాతంత్ర్యమే అతణ్ణి శిక్షకూ గురిచేస్తుంది, ఈ స్వాతంత్ర్యం మూలంగానే అతడు స్వర్గాన్నీ పొందగలుగుతాడు - అయితే చాలా మంది మూఢులు తమ బాధ్యతలను దైవంపై పడేసి తాము "నిమిత్తమాత్రులం" తమ చేతుల్లో ఏమీ లేదని వాపోతారు.

25. మహాప్రవక్త (సఅసం) సమాధానానికి భావమేమంటే, ఈ మందుమాకులు, మన జాగ్రత్తలు కూడా దైవ నిర్ణయం ప్రకారమే ఉపయోగపడుతున్నాయి. వ్యాధుల్ని మన విధి లిఖితం చేసిన దైవమే ఇవి ఫలానా మందువల్ల, ఫలానా ఉపాయం వల్ల నయం

ఆ విధంగా చేసి ఉంటే మరో విధంగా జరిగి ఉండేది' అని తలపోయకు. దానికి బదులుగా, ఇదంతా అల్లాహ్ నిర్ణయం, ఆయన తనకు ఇష్టమయిన దాన్నే చేశాడు అని భావించు. ఎందుకంటే "అధవా" అన్నది షైతాను చర్యల ద్వారాల్ని తెరుస్తుంది."

(మిష్కాత్ - అబూహురైరా [రజిఅన్])

## పరలోకాన్ని విశ్వసించడం

۲۸ــــ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: كَيْفَ أَنْعَمُ وَصَاحِبُ الصُّوْرِ قَدِ الْتَقَمَهُ وَأَصْغٰى سَمْعَهُ وَحَنٰى جَبْهَتَهُ، يَنْتَظِرُ، مَتٰى يُؤْمَرُ بِالنَّفْخِ، فَقَالُوْا: يَا رَسُوْلَ اللّٰهِ! فَمَاذَا تَأْمُرُنَا؟ قَالَ: قُوْلُوْا، حَسْبُنَا اللّٰهُ وَنِعْمَ الْوَكِيْلُ۔" (ترمذی ــــ ابوسعید خدریؓ)

28. మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం) ఒకసారి అన్నారు: "ఒకవైపున 'సూర్' ఊదేదూత, 'ఇస్రాఫీల్' బాకా నోటిలో పెట్టుకుని, దైవాదేశం కొరకు చెవులప్పగించి, తలవంచి బాకా ఊదే ఆజ్ఞ ఎప్పుడవుతుందా అని నిరీక్షిస్తూ ఉండగా నేను సుఖంగా నిశ్చింతగా ఎలా జీవితం గడపగలను?" అక్కడున్న జనులు "దైవప్రవక్తా! అయితే మమ్మల్ని ఏమి చెయ్యమంటారో కాస్త చెప్పండి" అని అడిగారు. 'హస్బునల్లాహు వ నియ్‌మల్ వకీల్' అని పఠిస్తూ ఉండండి" అని బోధించారు ప్రవక్త మహనీయులు (సఅసం). (తిర్మిజి - అబూసయీద్ ఖుద్రీ [రజిఅన్])

---

కాగలవని కూడా వ్రాసి పెట్టాడు. అల్లాహ్ వ్యాధినీ సృజించాడు, దాని మందునూ సృష్టించాడు. ఇదంతా విధాత నిర్ణయాలకు నియమాలకు లోబడే ఉంది.

26. ఎవరూ ఏ మాత్రం 'మేలు' లేక 'కీడు' చెయ్యలేరు అన్నదానికి భావమేమంటే, ఇవ్వడానికి ఎవరివద్దయినా ఏమీ లేదు. విశ్వంలో ఉన్న సర్వస్వమూ అల్లాహ్‌కు చెందినదే. ఆయన ఎవరికి ఎంత ఇవ్వదలిస్తే వారికి అంతే లభిస్తుంది - అది ఎవరి ద్వారా లభించినా. కనుక అల్లాహ్‌పైనే భారం మోపాలి, అల్లాహ్ పైనే ఆధారపడాలి.

٢٩ــــ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ سَرَّهُ أَنْ يَّنْظُرَ إِلٰى يَوْمِ الْقِيٰمَةِ كَأَنَّهُ رَأْيُ عَيْنٍ فَلْيَقْرَأْ: "إِذَا الشَّمْسُ كُوِّرَتْ - وَإِذَا السَّمَاءُ انْفَطَرَتْ - وَإِذَا السَّمَاءُ انْشَقَّتْ -" (ترمذی ـــ ابن عمر)

29. "ఎవరయినా ప్రళయ దినాన్ని కనులారా చూడదలచు కుంటే, 'ఇజష్షమ్సు కువ్విరత్', 'ఇజస్సమాఉన్ ఫతరత్', 'ఇజస్సమా ఉన్ షక్కత్' అనే సూరాలు పఠించాలి" అని ఉపదేశించారు దైవప్రవక్త (సఅసం). (తిర్మిజి- ఇబ్ను ఉమర్)

---

27. "శక్తిశాలి" అంటే శారీరక శక్తి, లేక మేధాశక్తిగల విశ్వాసి అని అర్థం. అతను తన శక్తి సామర్థ్యాలను దైవ మార్గంలో వినియోగించినప్పుడు ధార్మిక కార్యకలాపాలు ఇతని ద్వారా అధికంగానే నెరవేరుతాయి. అయితే బలహీనుడయిన, ఆరోగ్యం బాగాలేని వ్యక్తి లేక ఆలోచనాపరంగా అంతగా ఎదగని వ్యక్తి కూడా దైవమార్గంలో యథాశక్తిగా కృషి చేస్తాడు, కాని ఆ కృషి శక్తిమంతుని కృషికి సమానం కాజాలదు. అందుకే మొదటి వ్యక్తికి బహుమానం కూడా అధికంగా లభిస్తుంది. అయితే ఇద్దరూ పయనించేది ఒకే మార్గం - దైవమార్గం - కనుక బహుమానం అన్నది ఇద్దరికీ లభిస్తుంది.

అసలు ఇక్కడ, శక్తిశాలి అయిన విశ్వాసిని ఉద్దేశించి ఒక విషయం నొక్కి చెప్పడం జరిగింది. నీ శక్తి సామర్థ్యాలను గుర్తించు, వాటిని అలక్ష్యపరచకు, వాటిద్వారా సన్మార్గాన ఎంత పురోగమించగలిగితే అంత ముందుకు సాగు. బలహీనత వచ్చి తిష్ఠ వేసిందంటే ఏది చెయ్యదలచుకున్నా చెయ్యలేవు.

చివరి భాగంలో చెప్పబడిందేమంటే, విశ్వాసి తన శక్తి సామర్థ్యాల భరోసాపై జీవితం గడపడు. ఏదయినా విపత్తు విరుచుకుపడినప్పుడు, ఇది నా ప్రభువు తరపున వచ్చింది. నా పరీక్ష, నా శిక్షణా ప్రణాళికలోని భాగమే అని భావిస్తాడు. ఈ విధంగా ఆ కష్టం అతనిలో దైవంపై భారం మోపే గుణాన్ని పెంపొందిస్తుంది.

28. 'సూర్' అంటే సైన్యానికి ప్రమాదాన్ని సూచించడానికి సూచనగా లేదా సైన్యాన్ని సమీకరించడానికి వినియోగించే బాకా లేక బిగిల్ అని అర్థం. అయితే ప్రళయ సూచనగా ఊదబడే బాకాను అర్థం చేసుకోవడం ఎవరి తరం?

పరలోక జీవితంపట్ల మహాప్రవక్త కనబరచిన వ్యాకులత, విచారాన్ని చూచి ప్రజలు మరీ భయాందోళనలకు లోనయ్యారు ! అందుకే "మీరే ఇలా తల్లడిల్లిపోతూ ఉంటే, ఇక మా గతేమి అవుతుందో. ఆ విషమ పరిస్థితిని దాటుకుపోయే మార్గమేమిటో చెప్పండ"ని అడిగారు. దానికి సమాధానంగా మహాప్రవక్త (సఅసం) నేర్పిన దివ్య వచనానికి అర్థం.

٣٠ــــ قَرَأَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ هٰذِهِ الْاٰيَةَ: "يَوْمَئِذٍ تُحَدِّثُ أَخْبَارَهَا-" قَالَ: أَتَدْرُوْنَ مَا أَخْبَارُهَا؟ قَالُوْا: اَللّٰهُ وَرَسُوْلُهٗ اَعْلَمُ، قَالَ: فَإِنَّ أَخْبَارَهَا أَنْ تَشْهَدَ عَلٰى كُلِّ عَبْدٍ وَّأَمَةٍ بِمَا عَمِلَ عَلٰى ظَهْرِهَا أَنْ تَقُوْلَ: عَمِلَ عَلَيَّ كَذَا وَكَذَا يَوْمَ كَذَا وَكَذَا، قَالَ: فَهٰذِهٖ أَخْبَارُهَا- (ترمذی ــــ ابوھریرہؓ)

30. ఒక రోజున మహాప్రవక్త (సఅసం) "యోమయిజిన్ తుహద్దిసు అఖ్‌బారహా" (ఆ దినం ధరణి తన సకల సమాచారాలూ వెల్లడిచేస్తుంది) అనే ఆయత్‌ను పఠించి "సమాచారాలు వెల్లడి చెయ్యడం అంటే అర్థం ఏమిటో తెలుసా?" అని తన సహచరుల్ని అడిగారు. "అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకే అన్నీ తెలుసు" అని సమాధానమిచ్చారు అక్కడున్నవారు. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా వివరించారు.

"నా వెన్నుపై ఫలానా పురుషుడు లేదా ఫలానా స్త్రీ ఫలానా రోజున ఫలానా సమయాన, ఒకానొక మంచిపనో లేక చెడు కార్యమో చేశారనే యదార్థానికి, భూమి ప్రళయదినాన సాక్ష్యమిస్తుంది. ఈ ఆయత్‌కు అర్థమిదే. ప్రజలు చేసే కర్మల్ని ఈ ఆయత్ (ఖుర్ఆన్ వాక్యం)లో 'సమాచారం' అని పేర్కొనడం జరిగింది." (తిర్మిజీ-అబూహురైరా)

---

"మాకు అల్లాహ చాలు, ఆయనే సర్వోత్తమ సంరక్షకుడు, వరప్రదాత."

ఈ వచనాన్ని పఠించడమంటే ఆ విధంగా ఆచరించడం అన్నమాట. దైవంపై భారం మోపి ఆయన శరణులో, ఆయన అండనీడల్లో, ఆయన ఊడిగంలో మనుగడ సాగించిన వారికే ఆ (ప్రళయం) నాడు సాఫల్యం సిద్ధిస్తుందన్న మాట.

29. ఈ హదీసులో ప్రస్తావించబడిన సూరాలు మూడింటిలోనూ ప్రళయ దినాన జరగబోయే సంఘటనల వివరాలు, కన్నులకు కట్టినట్టుగా, ఒక్కొక్క దృశ్యాన్ని ఒక్కొక్క కోవకు చెందిన వ్యక్తుల ప్రవర్తనను, ఆ రోజున సూర్యచంద్రాది గ్రహాలు దాల్చే రూపాల్ని అతి ప్రస్ఫుటంగా చిత్రించడం జరిగింది.

٣١— قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : مَامِنْكُمْ مِنْ أَحَدٍ إِلَّا سَيُكَلِّمُهُ رَبُّهُ لَيْسَ بَيْنَهُ وَبَيْنَهُ تَرْجُمَانٌ وَلَاحَاجِبٌ يَحْجُبُهُ فَيَنْظُرُ أَيْمَنَ مِنْهُ فَلَا يَرَىٰ إِلَّا مَا قَدَّمَ مِنْ عَمَلِهِ ، وَيَنْظُرُ أَشْأَمَ مِنْهُ فَلَا يَرَىٰ إِلَّا مَا قَدَّمَ ، وَيَنْظُرُ بَيْنَ يَدَيْهِ فَلَا يَرَىٰ إِلَّا النَّارَ تِلْقَاءَ وَجْهِهِ فَاتَّقُوا النَّارَ وَلَوْ بِشِقِّ تَمْرَةٍ - (متفق عليه — عدیؓ)

31. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: (ప్రళయ దినాన) మీలో ప్రతి ఒక్కనితో అల్లాహ్ ప్రత్యక్షంగా మాట్లాడుతాడు. అక్కడ అతనికై సిఫారసు చేసే వాడు కాని, అతడు తప్పించుకునేందుకు తల దాచుకు నేందుకు కానీ చోటు దొరకదు. సహాయం కొరకు అతడు తన కుడి ప్రక్కనచూస్తాడు అక్కడ తాను చేసిన కర్మలు తప్ప మరేదీ కనిపించదు. మళ్ళీ ఎడమవైపునకు చూపును మరలిస్తాడు. అక్కడా తన కర్మలు తప్ప మరేమీ కానరావు. ముందుకు చూస్తాడు. అటు అతి భయంకరమైన నరకం తప్ప మరేమీ అగుపించదు. కనుక ప్రజలారా! నరకాగ్ని నుండి రక్షించుకునేందుకు తాపత్రయపడండి - ఖర్జూరప్పండులో సగభాగం దానం చేసయినా సరే." (ముత్తఫకున్ అలైహ్ - అదీ బిన్ హాతిమ్)

---

30. ఈ హదీసు ద్వారా, మనుషులు ప్రపంచానచేసే ప్రతి కార్యం, ప్రతి కదలిక, ఆడిన ప్రతి మాట పొల్లుపోకుండా భద్రంగా ఉందని ఆ రోజు అంతా వెల్లడి అవుతుందని తెలుస్తోంది.

31. ఈ హదీసులో, ప్రళయదినాన మనిషి తనముందు ప్రత్యక్షమయ్యే నరక జ్వాలల నుండి తప్పించుకోవడానికి మార్గాలు అన్వేషిస్తే, అతనికి ఎలాంటి రక్షణ దొరకకపోవడమేకాక ఆనాడు అతనికి తోడుగా కుడి ఎడమల నిలిచేవి కేవలం అతను చేసిన కర్మలు మాత్రమే అని తెలుపడం జరిగింది. ఇలాంటి పరిస్థితిలో వీలయినన్ని సత్కర్మలు ఆచరించి ఆనాటి నరకయాతన నుండి తప్పించుకునేందుకు కృషి చెయ్యాలని బోధించడం జరిగింది. అలాంటి సత్కర్మల్లో బీద సాదలకు అనాథలకు చేసే సహాయాన్ని, అందించే సహకారాన్ని ఇక్కడ పేర్కొనడం జరిగింది. 'ఖర్జూరపు సగభాగమయినా దానం చెయ్యడం', అన్నదానికి భావమేమంటే మనిషి వద్ద కేవలం

٣٢ــــ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: فَيَلْقَى الْعَبْدَ فَيَقُوْلُ: اَیْ فُلَانُ! أَلَمْ اُكْرِمْكَ وَأُسَوِّدْكَ وَأُزَوِّجْكَ وَأُسَخِّرْ لَكَ الْخَيْلَ وَالْإِبِلَ وَاَذَرْكَ تَرْأَسُ وَتَرْبَعُ؟ فَيَقُوْلُ: بَلٰى، قَالَ: فَيَقُوْلُ: أَفَظَنَنْتَ أَنَّكَ مُلَاقِيَّ؟ فَيَقُوْلُ: لَا، فَيَقُوْلُ: فَإِنِّیْ قَدْ أَنْسَاكَ كَمَا نَسِيْتَنِیْ، ثُمَّ يَلْقَى الثَّانِیْ فَذَكَرَ مِثْلَهٗ ثُمَّ يَلْقَى الثَّالِثَ فَيَقُوْلُ لَهٗ مِثْلَ ذَالِكَ، فَيَقُوْلُ يَا رَبِّ! اٰمَنْتُ بِكَ وَبِكِتٰبِكَ وَبِرُسُلِكَ وَصَلَّيْتُ وَصُمْتُ وَتَصَدَّقْتُ وَ يُثْنِیْ بِخَيْرٍ مَّا اسْتَطَاعَ فَيَقُوْلُ: هٰهُنَا إِذًا، ثُمَّ يُقَالُ: اَلْاٰنَ نَبْعَثُ شَاهِدًا عَلَيْكَ، فَيَتَفَكَّرُ فِیْ نَفْسِهٖ مَنْ ذَا الَّذِیْ يَشْهَدُ عَلَيَّ فَيُخْتَمُ عَلٰى فِيْهِ، وَيُقَالُ لِفَخِذِهٖ انْطِقِیْ، فَتَنْطِقُ فَخِذُهٗ وَلَحْمُهٗ وَعِظَامُهٗ بِعَمَلِهٖ وَ ذَالِكَ لِيُعْذِرَ مِنْ نَفْسِهٖ، فَذٰلِكَ الْمُنَافِقُ وَذَالِكَ الَّذِیْ سَخِطَ اللهُ عَلَيْهِ۔ (مسلم ــــ ابوہریرہؓ)

32. ఒకసారి దైవప్రవక్త ఇలా వివరించారు : '(ప్రళయదినాన) దైవ సన్నిధానంలో ఒక వ్యక్తి హాజరయినప్పుడు, అల్లాహ్ అతన్ని పేరు పెట్టి పిలిచి, అతనితో ఫలానావాడా! నేను నీకు ప్రజల్లో గౌరవ మర్యాదలు ప్రసాదించలేదా? నీ తోడుకై భార్య నివ్వలేదా? గుర్రాలు, ఒంటెలూ అధీనంలో వుంచలేదా? నీవు అధికారం చెలాయించడానికి, ధనాన్ని ప్రోగుచెయ్యడానికి అవకాశం కల్పించలేదా? అని ప్రశ్నిస్తాడు. దానికి ఆ వ్యక్తి అంతా నిజమేనని అంగీకరిస్తాడు. అప్పుడు అల్లాహ్ మళ్ళీ అడుగుతాడు, 'ఒక రోజున నీవు నా ఎదుట హాజరుకావలసి ఉంటుందని భావించేవాడివా?' అని. ఆ వ్యక్తి, 'లేదు' అని సమాధానమిస్తాడు; అయితే

---

ఒక్క ఖర్జూరప్పండే వున్నప్పుడు అందులో సగం పండు తన నిరుపేద సోదరునికి ప్రదానం చేస్తే అది కూడా గొప్ప సత్కార్యమే, ఎందుకంటే అల్లాహ్ సత్కర్మల పరిమాణాన్ని చూడడు, దాని వెనుకనున్న సంకల్పాన్నే పరిగణనలోకి తీసుకుంటాడు.

32. ఈ హదీస్‌లో కపటాచారి (మునాఫిక్)ని గురించి ప్రస్తావించటం జరిగింది. తనలోని కాపట్యం మూలంగా అతడు, ఏ విధంగానయితే ప్రపంచంలో ప్రవక్తల ఎదుట, చిత్తశుద్ధిగల విశ్వాసుల ఎదుట లజ్జావిహీనంగా అబద్ధాలు చెప్పి బూటకపు

ప్రపంచంలో నీవు ఏ విధంగానయితే నన్ను విస్మరించావో అదే విధంగా నేడు నేను నిన్ను ఉపేక్షిస్తున్నాను అనంటాడు ప్రభువు. ఆ తరువాత మరో పరలోక తిరస్కారి హాజరవుతాడు. అతన్ని సయితం ఇలాగే ప్రశ్నించటం జరుగుతుంది. తదనంతరం మూడోవ్యక్తి ముందుకు వస్తాడు. అల్లాహ్ అతన్ని కూడా అలాగే ప్రశ్నిస్తాడు. దానికి ఆ వ్యక్తి సమాధానంగా విన్నవించుకుంటాడు: 'ప్రభూ! నేను నిన్ను, నీ గ్రంథాన్ని, నీ ప్రవక్తల్ని విశ్వసించాను. నమాజ్ చేశాను, ఉపవాస వ్రతాన్ని పాటించాను. నీ మార్గంలో దాన ధర్మాలు చేశాను.' ఇలా ఆ వ్యక్తి తాను చేసిన అనేక సత్కార్యాలను ఎంతో గట్టిగా ఏకరువు పెడతాడు. అప్పుడు అల్లాహ్ అతనితో 'ఇక చాలించు. నీకు ప్రతికూలంగా సాక్ష్య మిచ్చే వారిని రప్పిస్తున్నాను' అనంటాడు. 'ఎవరబ్బా నాకు వ్యతిరేకంగా సాక్ష్య మిచ్చేవారు?' అని ఆ వ్యక్తి లోలోనే అనుకుంటూ ఉంటాడు. అతని నోటికి సీలువేయబడుతుంది. అప్పుడు అతని తొడల్ని, కండరాలను, ఎముకల్ని విచారించగా ఆ వ్యక్తి చేసిన ఒక్కొక్క నయవంచననే అవి చాటిచెబుతాయి. ఈ విధంగా అతడు సాకులు చెప్పే మార్గాలన్నీ అల్లాహ్ మూసివేస్తాడు. ఇదంతా వివరించి ప్రవక్త(శ్రేష్ఠులు (సఅసం), ఆ వ్యక్తి ప్రపంచంలో కపట వైఖరిని అవలంబించినవాడని, దైవాగ్రహానికి గురిఅయ్యే వ్యక్తి ' అని తెలిపారు. (ముస్లిమ్ - అబూహురైరా)

٣٣۔ عَنْ عَائِشَةَ قَالَتْ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ فِيْ بَعْضِ صَلٰوتِهٖ : اَللّٰهُمَّ حَاسِبْنِيْ حِسَابًا يَّسِيْرًا۔ قُلْتُ : يَا نَبِيَّ اللّٰهِ ! مَا الْحِسَابُ الْيَسِيْرُ؟ قَالَ : أَنْ يُّنْظَرَ فِيْ كِتٰبِهٖ فَيُتَجَاوَزَ عَنْهُ ، إِنَّهٗ مَنْ نُوْقِشَ الْحِسَابَ يَا عَائِشَةُ ! هَلَكَ ۔ (مسند احمد)

33. హ|జత్ ఆయిషా (రజిఅన్) ఈ విధంగా ఉల్లేఖించారు. ప్రవక్త మహనీయులు (సఅసం) కొన్ని నమాజుల్లో "అల్లాహుమ్మ హాసిబ్ నీ హిసాబయ్యసీరా" (దేవా, నా వ్యవహారాన్ని విచారించేటప్పుడు తేలికయిన విచారణ జరుపు) అని ప్రార్థిస్తూ ఉండటం నేను విన్నాను. అప్పుడు

'తేలికయిన విచారణ జరపడం' అంటే భావం ఏమిటి? అని నేనడగ్గా ఆయన ఇలా సెలవిచ్చారు : "తేలికయిన విచారణ అంటే, అల్లాహ్ తన దాసుని కర్మపత్రాన్ని చూచి అందులో ప్రస్తావించబడిన అతని అపరాధాలను మన్నించివెయ్యడం అన్న మాట." ఆయన ఇంకా ఇలా అన్నారు: "ఎవరి కర్మల విచారణలోనైతే ఒక్కొక్క విషయాన్ని తూచితూచి చూడటం జరుగుతుందో, ఆయిషా, ఇక అతని వినాశమే అయిందనుకో."

(ముస్నద్ అహ్మద్)

٣٤ عَنْ أَبِي سَعِيدِنِ الْخُدْرِيِّ أَنَّهُ أَتَىٰ رَسُولَ اللهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، فَقَالَ: أَخْبِرْنِي مَنْ يَّقْوىٰ عَلَى الْقِيَام يَوْمَ الْقِيٰمَةِ الَّذِي قَالَ اللّٰهُ عَزَّ وَجَلَّ: "يَوْمَ يَقُوْمُ النَّاسُ لِرَبِّ الْعَالَمِيْنَ." فَقَالَ: يُخَفَّفُ عَلَى الْمُؤْمِنِ حَتّٰى يَكُوْنَ عَلَيْهِ كَالصَّلٰوةِ الْمَكْتُوْبَةِ- (مشكوٰة)

34. హజ్రత్ అబూసయీద్ ఖుద్రీ వివరించారు: నేను ప్రవక్త మహనీయుల (సఅసం) సన్నిధిలో హాజరయి, 'అల్లాహ్ దివ్యగ్రంథంలో "ఏ దినమయితే జనులు విచారణల కొరకు సకల లోకాల ప్రభువు సన్నిధిలో నిల్చుంటారో ఆ దినాన్ని ఊహించు'' అని ఉందే, మరి ఆ దినాన ఎవరు నిలబడగలుగుతారు?' అని సందేహాన్ని వెలిబుచ్చాను. దానికి మహాప్రవక్త (సఅసం) యిలా సెలవిచ్చారు, " ఆ రోజు విశ్వాసులకు ఎంతో తేలిగ్గా ఉంటుంది. అంతే కాదు అది, ఫర్జ్ (విధిఅయిన) నమాజుల్లాగా (అతని కంటికి చలువగా) పరిణమిస్తుంది."

(మిష్కాత్)

---

ధర్మనిరతి ప్రదర్శించేవాడో అలాగే దైవం సమక్షంలోనూ అసత్య ప్రలాపనలకుజంకడు. అందుకే అతని నోరు కట్టివేయబడి, అతని అవయవాల ద్వారా నిజం నిరూపించటం జరుగుతుంది.

33. దివ్య ఖుర్ఆన్లోనూ, ఇతర హదీసుల్లోనూ ఈ శుభసూచన అతి స్పష్టంగా వివరించటం జరిగింది : ఎవరయితే దైవమార్గాన ముందడుగువేసి దుష్టశక్తులతో పోరాడుతారో వారి జీవన వ్యవధి ఈ సంఘర్షణలో సమాప్తమయితే తీర్పు దినాన

۳۵ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: قَالَ اللّٰهُ تَعَالٰى: "أَعْدَدْتُّ لِعِبَادِیَ الصّٰلِحِيْنَ مَا لَا عَيْنٌ رَأَتْ وَلَا أُذُنٌ سَمِعَتْ وَلَا خَطَرَ عَلٰى قَلْبِ بَشَرٍ- إِقْرَءُوْا إِنْ شِئْتُمْ: "فَلَا تَعْلَمُ نَفْسٌ مَّا أُخْفِیَ لَهُمْ مِنْ قُرَّةِ أَعْيُنٍ-"
(بخاری-مُسلم)

35. "నేను నా సద్వర్తనులయిన దాసుల కొరకు ఏదయితే పొందు పరిచానో దాన్ని ఏ కన్నూ కానలేదు, ఏ వీనులూ వినలేవు, అది ఏ మేధకూ అందదు." అని అల్లాహ్ నుడివినట్లు మహాప్రవక్త సెలవిచ్చి, కావలిస్తే మీరు ఈ ఆయత్‌ను పఠించండి అని ప్రబోధించారు. ఆ ఆయత్: "సదాచార సంపన్నులైన వారి కొరకు ఎన్నో సంతోషకర, శుభకర విషయాలున్నాయి, అవి దాచిపెట్టబడి ఉన్నాయి, వారికి ప్రళయ దినాన ప్రాప్తమవుతాయి". (బుఖారీ, ముస్లిమ్)

۳۶ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَوْضِعُ سَوْطٍ فِی الْجَنَّةِ خَيْرٌ مِّنَ الدُّنْيَا وَمَا فِيْهَا- (بخاری — مُسلم)

36. "స్వర్గంలో ఒక కమ్చి పెట్టుకొనేంతచోటయినా, అది, యీ లోకం కంటే, లోకంలోని సకల సామాగ్రికంటే ఎన్నో రెట్లు మేలయినది" అని మహాప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) సెలవిచ్చారు.
(బుఖారి, ముస్లిమ్)

---

అల్లాహ్ వారి తప్పిదాలను మన్నించి, వారి సత్క్రియల్ని ఆదరించి, వారికి స్వర్గప్రవేశం కల్పించి సత్కరిస్తాడు.

34. ఇందులో ప్రస్తావించబడినది అత్-తత్ఫీఫ్ సూరాలోని 6వ ఆయత్. విశ్వాసుల కొరకు విధిగా నిర్ణయించబడిన నమాజులా ఉంటుందనడానికి భావమేమంటే, ఒక విశ్వాసి "ఫర్జ్" నమాజ్ చేస్తూ ఏ విధంగా తన హృదయంలో హాయినీ, ఉల్లాసాన్ని అనుభవిస్తాడో, శాంతిని, ప్రశాంతతను పొందుతాడో, పారవశ్యం, తన్మయత్వం, మాధుర్యం ఆస్వాదిస్తాడో అదే విధంగా విచారణాకాలం అతనికి ఓ మధుర ఘట్టంగా రూపొందుతుంది. అయితే అపరాధులకు, దైవధిక్కారులకు తలబిరుసురోగంతో సత్యాన్ని తిరస్కరించిన వారికయితే అప్పుడు ఒక్కోదినం వెయ్యేండ్లలా పరిణమిస్తుంది.

٣٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: يُؤْتَى بِأَنْعَمِ أَهْلِ الدُّنْيَا مِنْ أَهْلِ النَّارِ يَوْمَ الْقِيٰمَةِ، فَيُصْبَغُ فِي النَّارِ صَبْغَةً ثُمَّ يُقَالُ: يَا ابْنَ آدَمَ! هَلْ رَأَيْتَ خَيْرًا قَطُّ؟ هَلْ مَرَّ بِكَ نَعِيْمٌ قَطُّ؟ فَيَقُوْلُ: لَا، وَاللّٰهِ، يَا رَبِّ. وَيُؤْتَى بِأَشَدِّ النَّاسِ بُؤْسًا فِي الدُّنْيَا مِنْ أَهْلِ الْجَنَّةِ فَيُصْبَغُ صَبْغَةً فِي الْجَنَّةِ فَيُقَالُ لَهُ: يَا ابْنَ آدَمَ! هَلْ رَأَيْتَ بُؤْسًا قَطُّ؟ هَلْ مَرَّ بِكَ شِدَّةٌ قَطُّ؟ فَيَقُوْلُ: لَا، وَاللّٰهِ يَا رَبِّ! مَا مَرَّ بِيْ بُؤْسٌ وَلَا رَأَيْتُ شِدَّةً قَطُّ۔ (مسلم)

37. మహాప్రవక్త (సఅసం) ఒకసారి ఇలా బోధించారుః ప్రపంచంలో అత్యధికంగా సుఖభోగాలను అనుభవించిన నరకార్హుడయిన వ్యక్తిని ప్రళయ దినాన హాజరుపరచి అతన్ని నరకాగ్నిలో పడవేయటం జరుగుతుంది. నరక జ్వాలల్లో అతని దేహం దహించుకుపోయి ఆ రంగును పరిగ్రహించి నప్పుడు అతనితో - "ఓ ఆదం పుత్రుడా, నీవు ఎప్పుడయినా మంచి రోజులు చూశావా? సుఖాన్ని, భోగభాగ్యాలను ఒక్కసారయినా అనుభవించావా?" అని అడిగితే, అతడు "లేదు మహాప్రభో! నీ సాక్షిగా! ఎన్నడూ లేదు" అని మొరపెట్టుకుంటాడు.

అలాగే ప్రపంచంలో ఎంతో బీదరికాన్ని, లేమిని అనుభవించిన స్వర్గార్హుడయిన ఒక వ్యక్తిని హాజరు పరచి స్వర్గంలో ప్రవేశ పెడతారు. స్వర్గసుఖాలరంగు అతనికి బాగా ఎక్కి, అతను వాటిలో తేలియాడు తున్నప్పుడు అతన్ని, "నీవు ఎప్పుడయినా బీదరికాన్ని చవిచూశావా? కష్టాల నెప్పుడయినా ఎదుర్కొన్నావా?" అని అడగటం జరుగుతుంది. అతడు "లేదు నా ప్రభూ! ఎన్నడూ లేమిని ఎరుగను, కష్టాన్నీ అనుభవించలేదు." అంటాడు. (ముస్లిం)

---

ఆపదలో ఒక్కొక్క ఘడియ ఒక్కొక్క యుగంగా మారడం మన దైనందిన అనుభవమే.

٣٨ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: حُفَّتِ النَّارُ بِالشَّهَوَاتِ وَحُفَّتِ الْجَنَّةُ بِالْمَكَارِهِ - (بخاری — مسلم)

38. "నరకానికి రుచికరమయిన మనోవాంఛలతో కంచె వెయ్యబడింది. స్వర్గానికి ఆపదలతో ప్రహరి కట్టబడింది." అని తెలిపారు మహాప్రవక్త (సఅసం) (బుఖారీ, ముస్లిం)

٣٩ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَا رَأَيْتُ مِثْلَ النَّارِ نَامَ هَارِبُهَا وَمَا رَأَيْتُ مِثْلَ الْجَنَّةِ نَامَ طَالِبُهَا - (ترمذی)

39. మహాప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: నరకం కంటే భీకరమైన దాన్ని నేను చూడలేదు - అయితే దాన్ని తప్పించుకు పారిపోవలసిన వాడు నిద్రపోతున్నాడు. స్వర్గం కంటే ఉత్తమమయినదాన్నీ నేను చూడ లేదు - దాన్ని పొందగోరేవాడు కూడా గాఢనిద్రలో ఉన్నాడు. (తిర్మిజి)

---

35. మహాప్రవక్త (సఅసం) పరలోక శుభాలను ప్రస్తావిస్తూ అక్కడి అనుపమ వరాలు, అపురూప సుఖాలను అల్లాహ్ తన విధేయులూ, సన్మార్గగాములయిన వారికి మాత్రమే కేటాయించారని తెలిపారు. తన మాటకు నిదర్శనంగా "అస్ సజ్దా" సూరాలోని 17వ ఆయత్‌ను సూచించారు.

36. "కమ్చీ ఉంచే చోటు" అంటే, మనిషి కనీసం తన చాప అదీ పరచు కుని పడి ఉండే ఇరుకయిన చోటు అని అర్థం. దీని భావమేమంటే దైవ ధర్మాన్ని అనుసరించడంలో ఇహలోకాన మనిషి తన సర్వస్వాన్ని కోల్పోయినా, ప్రపంచ సామగ్రి అంతా పోగొట్టుకున్నా దానికి బదులుగా స్వర్గంలో ఏ మాత్రం చోటు - కాలు నిలపడానికయినా సరే - లభిస్తే అదే ఉత్తమం అని. అశాశ్వతమయినదాన్ని త్యాగం చెయ్యడం ద్వారా శాశ్వతమయింది ప్రాప్తం కావడం, అది ఎంత స్వల్పమయినదయినా మేలే కదా !

37. అంటే నరకవాసి, ప్రపంచంలో ఎంత సుఖభోగాలలో తులతూగినా నరకంలో దాపురించే ఒక్క దెబ్బకే అనుభవించిన సర్వసుఖాలను మరచిపోతాడు. తాను సుఖపడినదంతా లిప్తకాలంగా, గుర్తు తెలియని విధంగా మారిపోతుంది. అలాగే స్వర్గవాసి తాను ప్రపంచంలో ఎన్ని కష్టనష్టాలకుగురయినా స్వర్గంలో పొందే ఆహ్లాద కరమయిన మారుతానికే అతను జరిగిన విపత్తునంతా మరచిపోతాడు అని భావం.

38. అంటే, మనోవాంఛల్ని, క్షణికమయిన ప్రాపంచిక రుచుల్ని చవిచూడడంలో

۴۰ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنِّي فَرَطُكُمْ عَلَى الْحَوْضِ، مَنْ مَرَّ عَلَيَّ شَرِبَ، وَمَنْ شَرِبَ لَمْ يَظْمَأْ أَبَدًا، لَيَرِدَنَّ عَلَيَّ أَقْوَامٌ أَعْرِفُهُمْ وَيَعْرِفُوْنَنِيْ ثُمَّ يُحَالُ بَيْنِيْ وَبَيْنَهُمْ فَأَقُوْلُ: إِنَّهُمْ مِنِّيْ، فَيُقَالُ: إِنَّكَ لَا تَدْرِيْ مَا أَحْدَثُوْا بَعْدَكَ. فَأَقُوْلُ: "سُحْقًا، سُحْقًا لِمَنْ غَيَّرَ بَعْدِيْ." (بخاری، مسلم — سہل بن سعدؓ)

40. దైవ సందేశహరులు (సఅసం) తన సహచరుల్ని ఉద్దేశించి ఇలా ప్రబోధించారు. " (ప్రళయ దినాన) నేను కోనేటి వద్దకు మీకంటే ముందే చేరి మీకు ఎదురు వచ్చి స్వాగతం పలుకుతాను. మీ దాహం తీర్చే ఏర్పాటు చేస్తాను. నా వద్దకు వచ్చిన ప్రతి వ్యక్తీ ( ఆ కోనేటినీరు) త్రాగుతాడు. అలా త్రాగిన వ్యక్తికి మరెప్పుడూ దాహం వేయదు. ఆ సందర్భంలోనే కొంతమంది నా వద్దకు రావాలని ప్రయత్నిస్తారు. వారు నాకు తెలిసిన వారే, నన్ను వారు ఎరిగినవారే అయివుంటారు. కాని వారిని నా వద్దకు రాకుండా వారించడం జరుగుతుంది. అప్పుడు నేను 'వీరు నా వారే (రానివ్వండి)' అంటాను. దానికి, 'మీకు తెలీదు, మీ నిష్క్రమణ తరువాత వారు ధర్మంలో ఎన్ని (కొత్త) విషయాలు మిశ్రమం చేశారో!' అని సమాధానం వస్తుంది. అది విని, 'దూరం, దూరం నా తరువాత ధర్మ స్వరూపాన్ని మార్చివేసిన వారు దూరమవ్వాలి' అని నేనంటాను." (బుఖారి, ముస్లిం, సహల్ బిన్ సఅద్)

---

పడ్డ మనిషి చేరేది నేరుగా నరకానికే ! కాని స్వర్గాన్ని చేరదలిచినవాడు ముళ్ళ కంచెల్ని దాటుకుంటూ మనోకాంక్షల్ని జయించి మనస్సును సకల విధాలైన కష్టనష్టాలకు ఓర్చుకునేలా మలుచుకుని ముందుకు సాగుతాడు. కష్టభూయిష్టమయిన, కఠినమయిన ఈ ఘట్టాన్ని దాటనంతవరకు ఎవరయినా సరే సౌఖ్యం, సౌభాగ్యాల స్వర్గాన్ని ఎలా చేరగలుగుతారు?

39. భావమేమంటే, భయంకర వస్తువును దేన్నయినా చూస్తే మనిషి అసలు నిద్రపోలేడు. దాన్నుండి బహుదూరంగా పారిపోవాలని కోరుకుంటాడు, దాన్ని తాను

٤١ عَنْ أَبِي هُرَيْرَةَ عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ:
أَسْعَدُ النَّاسِ بِشَفَاعَتِي يَوْمَ الْقِيٰمَةِ مَنْ قَالَ: لَا إِلٰهَ إِلَّا اللهُ
خَالِصًا مِنْ قَلْبِهِ أَوْ نَفْسِهِ - (بخاری)

41. హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖనం ప్రకారం "ఎవరయితే పరిపూర్ణ చిత్త శుద్ధితో 'లా ఇలాహ ఇల్లల్లాహు' అనే సద్వచనాన్ని పలుకుతారో వారే ప్రళయదినాన నా సిఫారసుకు అర్హులవుతారు" అని మహాప్రవక్త సెలవిచ్చారు. (బుఖారి)

---

తప్పించుకున్నాడు అన్న తృప్తి కలగనంతవరకు అతడు సుఖంగా నిద్రపోలేడు. అలాగే ఎవరయినా ఒక ఇష్టమయిన పదార్థాన్ని పొందగోరితే అది ప్రాప్తమయ్యేవరకు స్థిమితంగా కూర్చోవడం కూడా అతనికి కష్టమయిపోతుంది.

ఈ సూత్రాలు నిజమయినవయితే నరకాన్నుండి తప్పించుకుని స్వర్గాన్ని పొందాలని అభిలషించేవారు అలక్ష్యంగా, ఈ ధ్యేయాలకై అవసరమయిన కృషి చెయ్యకుండా ఎలా కాలంవెళ్ళబుచ్చుతున్నారు? భయమున్న వాడయినా, ఒకదాన్ని కోరుకునే వాడయినా తమ లక్ష్యసాధనలో ఏ మాత్రం ఏమరుపాటు, ఉపేక్షాభావం కలిగి ఉండరు.

40. హదీసులో ప్రస్తావించబడిన కోనేరు "కౌసర్" కోనేరు.

దీనిలో ఎంత గొప్ప శుభవార్త ఉందో అంతే తీవ్రమయిన హెచ్చరిక కూడా ఉంది. మహాప్రవక్త(సఅసం) అందజేసిన ధర్మాన్ని, దానికి ఆధారభూతములైన దివ్యఖుర్ఆన్, మహాప్రవక్త సంప్రదాయాలను నిష్కల్మషంగా స్వీకరించి వాటిలో ఎలాంటి హెచ్చుతగ్గులు చెయ్యకుండా ఆచరించిన ధర్మపరాయణులనే, ఒక్కొక్క నీటి బొట్టుకై మానవాళి అంతా పరితపిస్తున్న ఆ ప్రళయ ఘడియల్లో, మహాప్రవక్త (సఅసం) కౌసర్ కోనేరు వద్ద ఆహ్వానిస్తారన్నది, ఆయన ఆధ్వర్యాన కౌసర్ జలం ప్రాప్తమవుతుందన్నది శుభవార్త. మరెవరయితే ధార్మిక విషయాల్లో ధర్మ విరుద్ధమయిన విషయాలను ధర్మం పేరిట మిశ్రమం చేస్తారో వారు మహాప్రవక్త వద్దకు చేరనూ లేరు కౌసర్ జలాన్ని త్రాగి శాశ్వతంగా దాహాన్ని తీర్చుకునే భాగ్యానికి నోచుకోనూ లేరు అన్నది హెచ్చరిక.

41. హదీసులోని సద్వచనానికి భావం "అల్లాహ్ తప్ప మరేదైవం లేనే లేడు" అని.

ఈ హదీసులోని మాటలు చిన్నవయినా అర్థం ఎంతో ఘనమయింది, ఎంతో విస్తృతమయింది. దానివల్ల తెలిసేదేమంటే :

1. ఎవరు దేవుని ఏకత్వాన్ని నమ్మి ఇస్లాం (ధర్మానికి స్వయం సమర్పణ) ను స్వీకరించరో, బహు దైవారాధన ఊబిలో ఇరుక్కుని ఉంటారో వారికి మహాప్రవక్త

٤٢ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ..... قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: يَا مَعْشَرَ قُرَيْشٍ! اِشْتَرُوْا أَنْفُسَكُمْ لَا أُغْنِيْ عَنْكُمْ مِنَ اللهِ شَيْئًا، وَيَا بَنِيْ عَبْدِ مَنَافٍ! لَا أُغْنِيْ عَنْكُمْ مِنَ اللهِ شَيْئًا يَا عَبَّاسَ بْنَ عَبْدِ الْمُطَّلِبِ! لَا أُغْنِيْ عَنْكَ مِنَ اللهِ شَيْئًا، وَيَا صَفِيَّةُ عَمَّةَ رَسُوْلِ اللهِ! لَا أُغْنِيْ عَنْكِ مِنَ اللهِ شَيْئًا، وَيَا فَاطِمَةُ بِنْتَ مُحَمَّدٍ! سَلِيْنِيْ! مَا شِئْتِ مِنْ مَالِيْ، لَا أُغْنِيْ عَنْكِ مِنَ اللهِ شَيْئًا۔ (بخاری، مسلم)

42. అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారం : మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు. "ఖురైష్ ప్రజలారా! నరకాగ్ని నుండి మిమ్మల్ని మీరు రక్షించుకునేందుకు సన్నాహాలు చేసుకోండి, నేను దైవ శిక్షనుండి మిమ్మల్ని ఏమాత్రం రక్షించలేను. అబ్దుల్ మునాఫ్ సంతానమా! నేను మిమ్మల్ని దైవాగ్రహాన్నుండి కాపాడలేను. అబ్బాస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్! (సొంత బాబాయి) జాగ్రత్త! నిన్నుకూడా నేను దైవం విధించే శిక్షనుండి తప్పించలేను. సఫియ్యా! (మహాప్రవక్త మేనత్త) నేను దైవాగ్రహం నీనుండి దూరమయ్యేలా చెయ్యలేను. అమ్మా ఫాతిమా! (సొంతకూతురు) నా ఆస్తిలో నీవు ఏది కోరినా ఎంత కోరినా ఇచ్చి వెయ్యగలను కాని దేవుని పట్టునుండి నిన్ను ఏ మాత్రం కాపాడలేను." (బుఖారి, ముస్లిం)

---

(సఅసం) సిఫారసు ప్రళయ దినాన ప్రాప్తం కాదు.

2. నోటితోమాత్రం సద్వచనాన్ని పలికి ధర్మ పరిధిలో ప్రవేశించినా మనస్ఫూర్తిగా దానిలో పరిపూర్ణ విశ్వాసంలేని వ్యక్తి కూడా మహాప్రవక్త సిఫారసును పొందలేడు.

3. మనఃపూర్వకంగా దేవుని ఏకత్వాన్ని విశ్వసించి ఇస్లాంను సవ్యమయిన జీవన వ్యవస్థగా, దృఢంగా నమ్మేవారికే ప్రళయదినాన దైవ ప్రవక్త సిఫారసు లభిస్తుంది.

4. మనిషిని ఆచరణకు పురికొలిపేది నిత్యం విశ్వాసమే - ఆ నమ్మకమే లేకపోతే మనిషి నిత్య జీవితంలోనూ ఏ పనీ చెయ్యడు, తన కొడుకు నూతిలో పడి పోయాడని వార్త విన్న తండ్రికి ఆ చెప్పే వానిపై ఇతర నిదర్శనాల ద్వారా నమ్మకం కుదిరిన వెంటనే తన బాబును రక్షించడానికి సన్నాహాలు చేస్తాడు, అచ్చంగా ఇదే స్థితిలో ఉంటుంది

٤٣ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ: قَامَ فِينَا رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ ذَاتَ يَوْمٍ، فَذَكَرَ الْغُلُولَ فَعَظَّمَهُ وَعَظَّمَ أَمْرَهُ، ثُمَّ قَالَ:
لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيءُ يَوْمَ الْقِيٰمَةِ عَلٰى رَقَبَتِهِ بَعِيرٌ لَّهُ رُغَاءٌ
يَّقُولُ: يَا رَسُولَ اللّٰهِ! أَغِثْنِيْ، فَأَقُولُ: لَا أَمْلِكُ لَكَ شَيْئًا، قَدْ
أَبْلَغْتُكَ لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيءُ يَوْمَ الْقِيٰمَةِ عَلٰى رَقَبَتِهِ فَرَسٌ
لَّهُ حَمْحَمَةٌ يَّقُولُ: يَا رَسُولَ اللّٰهِ! أَغِثْنِيْ فَأَقُولُ: لَا أَمْلِكُ
لَكَ شَيْئًا قَدْ أَبْلَغْتُكَ؛ لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيءُ يَوْمَ الْقِيٰمَةِ عَلٰى
رَقَبَتِهِ شَاةٌ لَّهَا ثُغَاءٌ يَّقُولُ: يَا رَسُولَ اللّٰهِ! أَغِثْنِيْ فَأَقُولُ: لَا أَمْلِكُ
لَكَ شَيْئًا قَدْ أَبْلَغْتُكَ لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيءُ يَوْمَ الْقِيٰمَةِ عَلٰى
رَقَبَتِهِ نَفْسٌ لَّهَا صِيَاحٌ فَيَقُولُ: يَا رَسُولَ اللّٰهِ! أَغِثْنِيْ، فَأَقُولُ: لَا أَمْلِكُ
لَكَ شَيْئًا قَدْ أَبْلَغْتُكَ لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيءُ يَوْمَ الْقِيٰمَةِ عَلٰى رَقَبَتِهِ
رِقَاعٌ تَخْفُقُ فَيَقُولُ: يَا رَسُولَ اللّٰهِ! أَغِثْنِيْ فَأَقُولُ: لَا أَمْلِكُ لَكَ شَيْئًا
قَدْ أَبْلَغْتُكَ لَا أُلْفِيَنَّ أَحَدَكُمْ يَجِيءُ يَوْمَ الْقِيٰمَةِ عَلٰى رَقَبَتِهِ صَامِتٌ فَيَقُولُ:
يَا رَسُولَ اللّٰهِ! أَغِثْنِيْ فَأَقُولُ: لَا أَمْلِكُ لَكَ شَيْئًا قَدْ أَبْلَغْتُكَ۔

(بُخاری، مُسلم بالفاظ مُسلم)

43. అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖనం: ఒక రోజున దైవ సందేశహరులు (సఅసం) మా మధ్య ఓ ప్రసంగం చేశారు. అందులో దొంగతనం గురించి ఎంతో ప్రముఖంగా చర్చించారు. ఆ తరువాత ఇలా సెలవిచ్చారు: "ప్రళయ దినాన మీలో ఏ ఒక్కరినయినా కలుసు కున్నప్పుడు అతని మెడపై ఓ ఒంటె ఉండటం, అది గట్టిగా రోదిస్తూ ఉండటం, ఆ వ్యక్తి 'ఓ దైవ ప్రవక్తా, నాకు కాస్త సహాయం చెయ్యండి (ఈ పాపభారం నుండి రక్షించండి) అని వేడుకోవడం, అప్పుడు నేను, 'నేనెలాంటి సహాయాన్నీ నీకు చెయ్యలేను. ప్రపంచంలో ఈ విషయాన్ని స్పష్టంగా నీకు తెలియజేశాను కదా' అనడం ఇలాంటి పరిస్థితిలో మీలో ఎవ్వరూ

ఉండరాదని నేను కోరుకుంటున్నాను. మీలో ఏ ఒక్కరినయినా ప్రళయ దినాన కలుసుకున్నప్పుడు అతని మెడపై ఓ గుర్రం స్వారీ చేస్తూ సకిలిస్తూ ఉండగా ఆ వ్యక్తి 'ఓ దైవ సందేశహరా! నా సహాయానికి రండి' అని అర్థించడం, నేనేమో, 'నేను ఏమీచెయ్యలేను. ప్రపంచంలోనే అంతా స్పష్టపరిచాను' అనడం – ఈ పరిస్థితిలో కూడా మీలో ఎవ్వరూ నాకు తటస్థపడరాదని కోరుకుంటున్నాను.

నేను ప్రళయం రోజున మీలో ఏ ఒక్కరినయినా కలుసు కున్నప్పుడు వారి మెడపై ఓ మేక తిష్ఠవేసి ఎలుగెత్తి ఏడ్వడం, ఆ వ్యక్తి 'దైవ ప్రవక్తా, నాకు సహాయపడండి' అని కోరడం, అప్పుడు నేను, 'ఏ సహాయమూ నేను నీకు చెయ్యలేను, ప్రపంచంలోనే అన్ని విషయాలూ తెలిపాను' అని చెప్పడం – ఇలాంటి స్థితినీ మీలో ఎవరూ ఎదుర్కోరాదని నేను అభిలషిస్తున్నాను.

---

మనిషి ధర్మాచరణ. దైవంపట్ల, దైవాజ్ఞలపట్ల మనిషి అంతరాళంలో విశ్వాసం స్థానమేర్పరచుకుంటే అదే ఆచరణకు ప్రేరణనిస్తుంది. ముందుకు నడుపుతుంది. ఇహలోక సౌఖ్యం కన్నా పరలోక సాఫల్యం పొందటానికి పురికొలుపుతుంది.

42. అసలు ఇది ఒక పెద్ద హదీసులోని భాగం. మహాప్రవక్త ముహమ్మద్(సఅసం) దేవుని అంతిమ సందేశహరునిగా నియమించబడిన తరువాత కొంతకాలానికి "వన్‌జిర్ అషీరత కల్ అక్‌రబీన్" అనే ఆదేశం అవతరించింది. ఇది "షోరా" సూరాలోని 214వ ఆయత్‌లో ఉంది. "నీ దగ్గరి బంధువుల్ని పరలోకాన్ని గురించి, అక్కడ, విశ్వాసం ఆచరణల ఆధారంగా తీర్పు జరగటాన్ని గురించి హెచ్చరించి ఇస్లాంను ఆశ్రయించేందుకు సందేశమివ్వవలసింది" అన్నది దాని భావం. ఆ ప్రకారమే మహా ప్రవక్త (సఅసం) ఖురైష్‌తెగలో తన ఆప్తులయిన వారిని, కొన్ని విందులు ఏర్పాటుచేసి వాటికి పిలిచారు. విందు తరువాత సాధారణంగా మహాప్రవక్త (సఅసం) ఇస్లాం సందేశాన్ని అందజేసేవారు, అలాంటి ఒక విందు తరువాత మహాప్రవక్త పరలోక జీవితాన్ని గురించి హెచ్చరించిన సంఘటనను ఈ హదీసులో ప్రస్తావించడం జరిగింది.

ముందు మహాప్రవక్త (సఅసం) మొత్తం తెగను సంబోధించారు. తరువాత ఆ తెగలో తమ వంశానికి సంబంధించిన వారిని (అబ్దుల్ మునాఫ్ సంతానం) తదుపరి తన బాబాయిని, మేనత్తను ఆ తరువాత తన సొంత కూతురును సంబోధించారు.

ఈ సంబోధనలో మహాప్రవక్త ఒకే విషయాన్ని నొక్కి చెప్పారు. అంటే, మరణానంతర జీవితంలో దైవప్రవక్తతో ఉన్న సంబంధం దృష్ట్యా ఎవరయినా సరే వంశీయులయినా,

మీలో ఏ ఒక్కరినీ ఇదిగో ఈ స్థితిలో కూడా కలసుకోవడం నాకు ఇష్టం లేదు - అప్పుడు అతని మెడపై ఓ మనిషి కూర్చుని బిగ్గరగా గోల చెయ్యడం, ఆ వ్యక్తి, 'ఓ ప్రవక్తా నా సహాయానికి ముందుకు రండి' అని వేడుకోవడం, నేనేమో, 'ఇక్కడ నేను ఎలాంటి సహాయమూ చెయ్యలేను ప్రపంచంలోనే అసలు విషయం అందజేసాను' అని చెప్పడం జరుగుతుంది.

ప్రళయదినాన మీలో ఏ ఒక్కరినయినా కలుసుకున్నప్పుడు అతని మెడలో బట్ట పేలికలు (గాలిలో) ఎగురుతూ ఉండటం, అతడేమో 'దైవప్రవక్తా, నాకు సహాయం చెయ్యండి' అని కోరడం నేను, 'ఏమీ చెయ్యలేను, ప్రపంచంలోనే విషయాన్నంతా విశదపరచానుకదా' అనడం- ఈ పరిస్థితిని ఎదుర్కోవడం కూడా నాకు ఇష్టం లేదు.

మీలో ఎవరినయినా నేను ప్రళయదినాన కలుసుకున్నప్పుడు అతని మెడపై వెండి, బంగారాల భారం మోపబడడం అతడు, 'ఓ దైవ ప్రవక్తా, నా సహాయానికి రండి' అని అర్థించడం నేను 'నీ పాప భారాన్ని ఏ మాత్రం తగ్గించలేను, ప్రపంచంలోనే అన్నీ తెలియజేశాను' అని అనడం- ఈ స్థితినీ చూడడం నేను ఇష్టపడటం లేదు." (బుఖారి, ముస్లిం)

---

బంధువులయినా చివరికి సొంత కూతురయినా సరే మోక్షాన్ని, దైవ ప్రీతిని పొందలేరు.

దైవ ప్రవక్త హజ్రత్ ఇబ్రహీం (అస్సలాం) వంశీయులమని చెప్పుకునే ఖురైష్ ప్రజల అహానికి ఇది గొప్ప దెబ్బ.

43. పశువులు రోదించడం, బట్టలు ఎగరడం అన్న ఉపమానానికి భావమేమంటే ప్రళయదినాన ఎవరయినా తాము ప్రపంచంలో చేసిన దొంగతనాలను ఆనాడు దాయాలని ప్రయత్నం చేసినా అవి దాగవు, తమ ఉనికిని ఎలుగెత్తి చాటుతాయి. ప్రతి పాపం రూపం ధరించి ఆ వ్యక్తి అపరాధాన్ని బహిర్గతం చేస్తుంది. కేవలం దొంగతనం విషయంలోనే ఇలా జరగదు, మనిషిచేసే ప్రతి అపరాధం, ప్రతినేరం ఆరోజు అతన్ని చుట్టుముట్టుతుంది. ఇలాంటి నికృష్టమయిన పరిణామం నుండి దైవమే రక్షించాలి. ప్రతివ్యక్తి తన అంతం జరిగి ఆచరణ ద్వారాలు మూసుకునే ముందే ఆ రాబోవు స్థితినుండి రక్షించుకునేందుకు సన్నాహాలు చేసుకోవాలి.

# ఆరాధనలు

## నమాజ్ ప్రాముఖ్యం

٤٤ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: أَرَأَيْتُمْ لَوْأَنَّ نَهْرًا بِبَابِ أَحَدِكُمْ يَغْتَسِلُ فِيْهِ كُلَّ يَوْمٍ خَمْسًا، هَلْ يَبْقَى مِنْ دَرَنِهِ شَيْءٌ؟ قَالُوْا: لَا يَبْقَى مِنْ دَرَنِهِ شَيْءٌ- قَالَ: فَذٰلِكَ مَثَلُ الصَّلَوَاتِ الْخَمْسِ، يَمْحُوْاللهُ بِهِنَّ الْخَطَايَا- (بُخاری، مُسلم، ابوھریرۃؓ)

44. దైవప్రవక్త (సఅసం) ఒకసారి, "మీలో ఎవరిగడప ముందయినా ఒక కాలువ ప్రవహిస్తూ ఉండి, అతడు అందులో ప్రతిదినం ఐదు మార్లు స్నానం చేస్తూ ఉంటే, అతని దేహంపైన ఏమయినా మలినం ఉండగలదా చెప్పండి?" అని ప్రశ్నించారు. దానికి సహచరులు (రజి అల్లాహు అన్హుమ్) "వీల్లేదు, మలినం ఉండటానికి ఏ మాత్రం వీల్లేదు" అని సమాధానమిచ్చారు. అప్పుడు ప్రవక్తమహనీయులు (సఅసం) ఇలా బోధించారు: "ఐదువేళల నమాజ్ కూడా ఇంతే. అల్లాహ్ ఈ నమాజ్‌ల ద్వారా పాపాలను తుడిచి వేస్తాడు."

(బుఖారి, ముస్లిం - అబూహురైరా)

---

44. ఈ హదీసుద్వారా దైవప్రవక్త (సఅసం) నమాజ్‌లు మనిషి పాపాలమన్నింపుకు మార్గమవుతాయనే సత్యాన్ని వెల్లడించారు. ఈ విషయాన్ని సులభగ్రాహ్యమయిన ఉపమానం ద్వారా బోధపరిచారు. అయిదు వేళలా నమాజ్ చెయ్యటం మూలాన మనిషి మాటిమాటికి దైవాన్ని స్మరిస్తాడు. దాని ద్వారా అతనిలో దైవం పట్ల కృతజ్ఞతా భావం ఏర్పడుతుంది. పరిణామంగా అతడు తన పరమోపకారి అయిన దైవానికి విధేయత చూపే మార్గాన పురోగమిస్తూనే పోతాడు. అవిధేయతా భావాలు అతని మస్తిష్కం నుండి సమసిపోతూ వుంటాయి. అతడు ఏదైనా అపరాధం చేసినా అది తెలిసీ చేసింది కాజాలదు. దాని స్ఫురణ అతనికి కలగగానే అతడు తన స్వామి వైపునకు మరలుతాడు. ఆయన సన్నిధిలో పడి విలపిస్తాడు, క్షమాపణ కొరకు వేడుకుంటాడు.

٤٥ عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ: إِنَّ رَجُلاً أَصَابَ مِنِ امْرَأَةٍ قُبْلَةً فَأَتَى النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَأَخْبَرَهُ فَأَنْزَلَ اللّٰهُ تَعَالٰى: " وَأَقِمِ الصَّلٰوةَ طَرَفَيِ النَّهَارِ وَزُلَفًا مِّنَ اللَّيْلِ، إِنَّ الْحَسَنَاتِ يُذْهِبْنَ السَّيِّاٰتِ." فَقَالَ الرَّجُلُ: أَلِيْ هٰذَا؟ قَالَ: لِجَمِيْعِ أُمَّتِيْ كُلِّهِمْ.

(بُخاری، مُسلم)

45. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ ఇలా ఉల్లేఖించారు : పరస్త్రీని ముద్దుపెట్టుకున్న ఒక వ్యక్తి మహాప్రవక్త (సఅసం) సన్నిధిలో హాజరయ్యాడు. ఆయనతో తాను చేసిన అపరాధాన్ని గురించి విన్నవించుకున్నాడు. దానికి సమాధానంగా మహాప్రవక్త (సఅసం), దైవం అవతరింపచేసిన ఈ ఆయత్‌ను పఠించారు : " ఇరు సంధ్యల మధ్యవేళల్లోను రాత్రి కొన్ని ఘడియల్లోనూ నమాజ్‌ను ఆచరించండి. నిస్సందేహంగా సత్కార్యాలు దుష్కృత్యాలను దూరం చేస్తాయి."ఆపై ఆ వ్యక్తి, "దైవ ప్రవక్తా! ఇది నాఒక్కనికే ప్రత్యేకమా?" అని అడగ్గా మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు "కాదు నా అనుచర సమాజంలోని అందరికీ ఇది వర్తిస్తుంది."

(బుఖారి, ముస్లిం)

---

45. ఈ హదీసు పై హదీసును విశదీకరిస్తుందని చెప్పవచ్చు. ఇందులో పేర్కొనబడిన వ్యక్తి, దైవ విశ్వాసంగల వ్యక్తి. తెలిసి పాపం చెయ్యడు. కాని మానవ సహజమయిన క్షణిక ఉద్రేకాలకు లోనయి పొరపాటు చేసేశాడు. అయితే దాని వల్ల అతనికి కలిగిన మనస్తాపం అతన్ని మహాప్రవక్త వద్దకు తీసుకు వచ్చింది. తన తప్పుకు శిక్షను అర్థించాడు. అప్పుడు మహాప్రవక్త "హూద్" సూరాలోని 114వ ఆయత్ పఠించి తదనుగుణంగా నడచుకోమని చెప్పి పంపించారు. అందులో అయిదు వేళల నమాజ్‌ను ఆచరించే ఆదేశంతోపాటు, సత్క్రియలు దుష్కర్మలనివారణగా పరిణమిస్తాయనే సత్యాన్ని బోధించటం జరిగింది. ఈ హదీసు ద్వారా, మహాప్రవక్త సహచరులు తమ ఆచరణపట్ల ఎంత జాగరూకత వహించేవారో వారికి మహాప్రవక్త ఎంత జాగ్రత్తగా శిక్షణ గరిపేవారో బోధపడుతుంది.

٤٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: خَمْسُ صَلَوَاتٍ افْتَرَضَهُنَّ اللّٰهُ تَعَالٰى، مَنْ أَحْسَنَ وُضُوْءَهُنَّ وَصَلَّاهُنَّ لِوَقْتِهِنَّ وَأَتَمَّ رُكُوْعَهُنَّ وَخُشُوْعَهُنَّ كَانَ لَهُ عَلَى اللّٰهِ عَهْدٌ أَنْ يَّغْفِرَ لَهُ وَمَنْ لَّمْ يَفْعَلْ فَلَيْسَ لَهُ عَلَى اللّٰهِ عَهْدٌ، إِنْ شَاءَ غَفَرَ لَهُ وَإِنْ شَاءَ عَذَّبَهُ

(ابوداؤد — عبادة بن صامتؓ)

46. మహాప్రవక్త (సఅసం) బోధించారు : "ఈ అయిదు వేళల నమాజ్ అల్లాహ్ తన దాసులపై విధించాడు. ఎవరయితే సరయిన రీతిలో వుజూ చేసి, వేళ తప్పకుండా నమాజ్ చేస్తాడో, రుకూ సజ్దాలు సరిగ్గా ఆచరిస్తాడో, ఎవరి హృదయం నమాజ్ చేసేటప్పుడు దైవ సమక్షంలో వినమ్రత కలిగిఉంటుందో అలాంటి వాని మన్నింపు, క్షమాపణల్ని అల్లాహ్ తన బాధ్యతగా గ్రహిస్తాడు. కాని ఎవరయితే ఇలా చెయ్యరో అలాంటి వారి పట్ల అల్లాహ్ చేసిన ఈ వాగ్దానం వర్తించదు. తాను తలిస్తే అల్లాహ్ అతన్ని మన్నించనూవచ్చు, దండించనూ వచ్చు."

(అబూదావూద్ - అబాదహ్ బిన్ సామిత్)

---

46. వుజూ సరిగ్గా చెయ్యడమంటే మహనీయ ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) చేసినట్లుగా జాగ్రత్తగా చెయ్యడం అని భావం. అయిదు వేళల నమాజ్ కాలం నిర్ణీతమయినదే. సకాలంలో మరువకుండా, కాలం మించి పోకుండా, తొందరపడకుండా, నింపాదిగా చెయ్యడం అని అర్థం. హృదయ వినమ్రతతో నమాజ్ చెయ్యటమంటే, నమాజ్ చేసేటప్పుడు నేను దేవుని సమక్షంలో నిల్చున్నాననే ధ్యాసతో, భయభక్తులతో, ప్రాపంచిక కార్యకలాపాలవైపునకు మనసు మరలకుండా, ఏకాగ్రతతో చెయ్యడం అని భావం. ఎవరయితే ఇంత శ్రద్ధాభక్తులతో రోజూ అయిదు వేళలా చైతన్యవంతంగా నమాజ్ చేస్తారో వారు తమ నిత్య జీవితంలోనూ నిజమయిన దేవుని దాసులుగా జీవించడానికి, ఆయనపట్ల విధేయత కనబరచడానికి చిత్తశుద్ధితో కృషి చేస్తారని ఆశించవచ్చు. అలాంటి వారికి కాకపోతే మరెవరికి లభిస్తుంది దేవుని క్షమాభిక్ష ?

٤٧ عَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرِو بْنِ الْعَاصِ عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَ
سَلَّمَ أَنَّهُ ذَكَرَ الصَّلٰوةَ يَوْمًا - فَقَالَ : مَنْ حَافَظَ عَلَيْهَا كَانَتْ لَهُ نُوْرًا
وَبُرْهَانًا وَنَجَاةً يَوْمَ الْقِيٰمَةِ ، وَمَنْ لَّمْ يُحَافِظْ عَلَيْهَا لَمْ تَكُنْ لَّهُ
نُوْرًا وَلَا بُرْهَانًا وَّنَجَاةً -

47. అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ అల్ ఆస్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: ఒకరోజు మహాప్రవక్త (సఅసం) నమాజ్ గురించి ప్రసంగించారు. అందులో ఈ విధంగా ఉపదేశించారు, "ఏ వ్యక్తి అయితే తన నమాజ్‌ను జాగ్రత్తగా కాపాడుకుంటాడో, ప్రళయ దినాన అతని కొరకు అది జ్యోతిగా, నిదర్శనంగా, మోక్షానికి కారణభూతంగా రూపొందుతుంది. ఎవరైతే తమ నమాజ్‌ను కాపాడుకోరో వారికై అది జ్యోతి కాదు, నిదర్శనమూ కాదు, మోక్షానికి కారణభూతమూ కాజాలదు."

٤٨ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : تِلْكَ صَلٰوةُ الْمُنَافِقِ
يَجْلِسُ يَرْقُبُ الشَّمْسَ حَتّٰى إِذَا اصْفَرَّتْ وَكَانَتْ بَيْنَ قَرْنَيِ الشَّيْطٰنِ
قَامَ فَنَقَرَ أَرْبَعًا ، لَا يَذْكُرُ اللهَ فِيْهَا إِلَّا قَلِيْلًا - (مسلم ، انسؓ)

48. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు : "మునాఫిక్" (కపట విశ్వాసి) చేసే నమాజ్ ఎలా ఉంటుందంటే, అతడు, సూర్య కాంతిలో పసుపు వన్నె (సంధ్యవేళ) ఆసన్నమయే వరకు నిరీక్షిస్తూ కూర్చుంటాడు. ఈ విధంగా 'షైతాన్ కాలం' దగ్గరపడినప్పుడు అతడు లేచి గబగబా నాలుగు రకాతుల నమాజ్ టకటకా జరిపి అయిందనిపించి లేస్తాడు. ఈ వ్యక్తి తన నమాజ్‌లో అల్లాహ్‌ను ఏ మాత్రం స్మరించడు.

(ముస్లిం-అనస్)

---

47. ఈ హదీసులో 'ముహాఫిజత్' అన్న పదం వాడబడింది. దానికి, సరిగ్గా కనిపెట్టి ఉండటం, పరిరక్షించుకోవడం అని అర్థం. నమాజ్‌ను కాపాడుకోవడం అంటే సరిగ్గా వుజూ చెయ్యడం, సరయిన వేళకు నమాజ్ చెయ్యడం, నమాజ్‌లోని ప్రతి అంశాన్నీ అంటే రుకూ, సజ్దా, జల్సా తదితర వాటినన్నింటినీ నింపాదిగా ఆచరించడం, మనసు

۴۹ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ: یَتَعَاقَبُوْنَ فِیْکُمْ مَلٰٓئِکَۃٌ بِاللَّیْلِ وَمَلٰٓئِکَۃٌ بِالنَّہَارِ، وَیَجْتَمِعُوْنَ فِیْ صَلٰوۃِ الْفَجْرِ وَ صَلٰوۃِ الْعَصْرِ، ثُمَّ یَعْرُجُ الَّذِیْنَ بَاتُوْا فِیْکُمْ فَیَسْأَلُہُمْ رَبُّہُمْ وَھُوَ اَعْلَمُ بِہِمْ، کَیْفَ تَرَکْتُمْ عِبَادِیْ؟ فَیَقُوْلُوْنَ: تَرَکْنَاھُمْ وَھُمْ یُصَلُّوْنَ وَأَتَیْنَاھُمْ وَھُمْ یُصَلُّوْنَ۔ (بخاری، مسلم — ابوھریرۃؓ)

49. దైవ సందేశహరుడు (సఅసం) ఈ విధంగా సెలవిచ్చారు : "భూ వ్యవస్థలో ఏర్పాట్లకై నియుక్తులై రేయింబవళ్ళు మీతో పాటు ఉండే దైవ దూతలు తమ విధివేళలు మార్చుకుంటారు. వారు ఫజ్ర్, అస్ర్ నమాజ్ కాలాల్లో కలుసుకుంటారు. అప్పుడు మీతోపాటు ఉండిన దైవదూతలు తమ ప్రభువు సన్నిధిలో హాజరయినప్పుడు ఆయన, 'నా దాసుల్ని మీరు ఏ స్థితిలో వదలి వచ్చారో చెప్పండి' అని అడుగుతాడు. 'మేము వారి వద్దకు వెళ్ళినప్పుడు వారు నమాజ్ చేస్తూ ఉండటం చూశాము. తిరిగి మేము వచ్చే సమయాన కూడా వారు నమాజ్ చేస్తూ వుండగానే వదలి వచ్చాము' అని సమాధానమిస్తారు.

(బుఖారి, ముస్లిం - అబూహురైరా)

---

పరిపరివిధాలా చంచలంగా సంచరించకుండా ఏకాగ్రతతో, దీక్షతో, శ్రద్ధాభక్తులతో నమాజ్ చెయ్యడమని భావం. అలాంటి వ్యక్తి చేసిన నమాజ్, ఏ ఆసరా దొరకని ప్రళయ దినాన అతని మార్గంలో జ్యోతి కావడం, అతడు దైవ విధేయుడుగా జీవించాడనడానికి నిదర్శనమవడం, ఈ విధంగా అతని మోక్షానికి కారణభూతమవడంలో ఆశ్చర్యమేముంది?

48. ఈ హదీస్ ద్వారా నిజమయిన విశ్వాసి, కపట విశ్వాసి చేసే నమాజ్‌లలోని వ్యత్యాసం బోధపడుతుంది. కపట విశ్వాసి (మునాఫిక్), నమాజ్ సకాలంలో చెయ్యడు; రుకూ, సజ్దాలను సరిగ్గా ఆచరించడు; అతని మనస్సు కూడా దైవ ధ్యానంపై లగ్నమయి ఉండదు.

హదీసులో ప్రస్తావించబడిన నమాజ్ "అస్ర్" నమాజ్. అంటే సంధ్యవేళ దగ్గరపడకమునుపు చేసే నమాజ్. "షైతాన్ కాలం" అంటే బహుదైవారాధకులు పూజలు జరుపుకునే సంధ్యా సమయం అని భావం. వాస్తవానికి అయిదు వేళల నమాజ్‌లో ప్రతి నమాజ్ కూడా ముఖ్యమయిందే. కాని 'ఫజ్ర్' మరియు "అస్ర్" వేళల నమాజ్

٥٠ عَنْ عُمَرَ بْنِ الْخَطَّابِ رَضِيَ اللهُ عَنْهُ أَنَّهُ كَتَبَ إِلَىٰ عُمَّالِهِ إِنَّ أَهَمَّ أُمُوْرِكُمْ عِنْدِيَ الصَّلٰوةُ، فَمَنْ حَفِظَهَا وَحَافَظَ عَلَيْهَا حَفِظَ دِيْنَهُ وَمَنْ ضَيَّعَهَا فَهُوَ لِمَا سِوَاهَا أَضْيَعُ ۔ (مشکوٰۃ)

50. హ్రజత్ ఉమర్ (రజిఅన్) తన గవర్నర్లందరికి లేఖ వ్రాస్తూ "మీరు చేసే పనులన్నిటిలో నావద్ద ప్రాముఖ్యత నమాజ్ కే వుంది. ఏ వ్యక్తి తన నమాజ్ ను పరిరక్షించుకుంటాడో, దాన్ని నిర్వర్తించడంలో జాగ్రత్తగా మసలుకుంటాడో, అతను దైవ ధర్మాన్ని (పరిపూర్ణ జీవిత విధానాన్ని) పరిపూర్ణంగా కాపాడుకుంటాడు. ఎవరయితే నమాజ్ (పట్ల శ్రద్ధ)ను కోల్పోతాడో అతడు మిగతా అన్నింటిని అత్యధికంగా కోల్పోయే వాడుగా రూపొందుతాడు" అని వ్రాశారు. (మిష్కాత్)

٥١ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: سَبْعَةٌ يُظِلُّهُمُ اللهُ فِيْ ظِلِّهِ يَوْمَ لَا ظِلَّ إِلَّا ظِلُّهُ ؛ إِمَامٌ عَادِلٌ ، وَشَابٌّ نَشَأَ فِيْ عِبَادَةِ اللهِ ، وَرَجُلٌ قَلْبُهُ مُعَلَّقٌ بِالْمَسْجِدِ ، إِذَا خَرَجَ مِنْهُ حَتّٰى يَعُوْدَ إِلَيْهِ ، وَرَجُلَانِ تَحَابَّا فِي اللهِ ، إِجْتَمَعَا عَلَيْهِ وَتَفَرَّقَا عَلَيْهِ ، وَرَجُلٌ ذَكَرَ اللهَ خَالِيًا فَفَاضَتْ عَيْنَاهُ ، وَرَجُلٌ دَعَتْهُ إِمْرَأَةٌ ذَاتُ حَسَبٍ وَّجَمَالٍ فَقَالَ: إِنِّيْ أَخَافُ اللهَ ، وَرَجُلٌ تَصَدَّقَ بِصَدَقَةٍ فَأَخْفَاهَا حَتّٰى لَا تَعْلَمَ شِمَالُهُ مَا تُنْفِقُ يَمِيْنُهُ ۔ (مُتفق علیہ — ابوھریرۃؓ)

51. దైవ సందేశహరుడు (సఅసం) ఈ విధంగా సెలవిచ్చారు. ఏ రోజు అల్లాహ్ నీడ తప్ప వేరే నీడ లభ్యం కాదో ఆ రోజు అల్లాహ్ ఏడు రకాల మనుష్యులకు తన నీడలో ఆశ్రయమిస్తాడు. 1) న్యాయశీలుడయిన పాలకునికి, 2) తన యవ్వనాన్ని దైవ విధేయత, దైవారాధనలో గడిపిన యువకునికి, 3) మస్జిద్ లోనే తన మనస్సు లగ్నం చేసుకున్న వ్యక్తికి- ఇతను మస్జిద్ నుండి వెలుపలికి రాగానే మస్జిద్ లోకి వెళ్ళటానికి నిరీక్షిస్తూ

ఉంటాడు, 4) దైవం, దైవ ధర్మం కొరకు మాత్రమే మైత్రీ ప్రేమాభిమానాలుకల ఇద్దరు వ్యక్తులకు - వారు దైవం కొరకే కలుసు కుంటారు, దైవం కొరకే వేరౌతారు, 5) ఏకాంతంలో దైవ ధ్యానం చేసుకుంటూ ఉండగా అతని కళ్ళనుండి కన్నీరు కారినటువంటి వ్యక్తికి, 6) ఉన్నత వంశీయురాలైన అందమయిన జవ్వని దుష్ట క్రియకు ఆహ్వానిస్తే కేవలం దైవ భీతితో ఆ ఆహ్వానాన్ని త్రోసిపుచ్చిన వ్యక్తికి, 7) రహస్యంగా దాన ధర్మాలు చేసే వ్యక్తికి - తన కుడి చేయి దానం చేసిన దేమిటో ఎడమచేయికి తెలియని వ్యక్తి.

(ముత్తఫకున్ అలైహ్ - అబూహురైరా)

٥٢ عَنْ شَدَّادِ بْنِ أَوْسٍ قَالَ: سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ
سَلَّمَ يَقُوْلُ: مَنْ صَلّٰى يُرَاءِىْ فَقَدْ أَشْرَكَ، وَمَنْ صَامَ يُرَاءِىْ فَقَدْ
أَشْرَكَ، وَمَنْ تَصَدَّقَ يُرَاءِىْ فَقَدْ أَشْرَكَ۔ (مسند احمد)

52. మహాప్రవక్త (సఅసం) ఈ విధంగా బోధిస్తూ ఉంటే నేను విన్నాను: "ఏ వ్యక్తి ప్రదర్శనా బుద్ధితో నమాజ్ చేస్తాడో అతను షిర్క్ చేశాడు (దేవునితోపాటు ఇతరుల్ని సహవర్తులుగా చేశాడు). ఏ వ్యక్తి ప్రదర్శనా బుద్ధితో రోజా (ఉపవాస వ్రతం) పాటించాడో అతడూ షిర్క్ చేశాడు. ఏ వ్యక్తి ఇతరుల మెప్పు కొరకు దాన ధర్మాలు చేశాడో అతనూ షిర్క్ చేశాడు" అని షద్దాద్ బిన్ ఔస్ (రజిఅన్) తెలిపారు.

(ముస్నద్ అహ్మద్)

---

మహత్పూర్వకమయినవి. అస్ర్ కాలం సామాన్యంగా ఏమరుపాటుకు గురయ్యేకాలం. సాధారణంగా ప్రజలు తమ కార్యకలాపాలన్నీ, వ్యాపార వ్యవహారాలన్నీ చీకటి పడకమునుపే ముగించుకుని పోవడానికి పనుల్లో తలమునకలై ఉంటారు. ఈ కారణంవల్ల విశ్వాసి జాగరూకతతో వ్యవహరించకపోతే కాలందాటిపోయి అస్ర్ నమాజ్ ప్రమాదానికి గురయ్యే అవకాశముంటుంది. ఈ కాలాన్ని అలక్ష్యపరచడం కపట విశ్వాసానికి తార్కాణం అని ఈ హదీస్ ద్వారా తెలుస్తోంది. అలాగే ఫజ్ర్ నమాజ్ కూడా ముఖ్యమయింది. రాత్రి చివరి భాగంలో (సూర్యోదయం కంటే ముందు) గాఢ నిద్ర

# సామూహిక నమాజ్

٥٣ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: صَلٰوةُ الْجَمَاعَةِ تَفْضُلُ صَلٰوةَ الْفَذِّ بِسَبْعٍ وَّعِشْرِيْنَ دَرَجَةً۔ (بخاری، مسلم۔ عبدالله بن عمرؓ)

53. ముస్లిమ్ సముదాయం నుండి వేరయి, ఒంటరిగా చేసుకునే నమాజ్ కంటే సామూహికంగా చేసే నమాజ్, ఇరువయిఏడు రెట్లు అధికంగా ఘనత కలిగి ఉంటుంది. (బుఖారి, ముస్లిం, - అబ్దుల్లాహ్ బిన్ ఉమర్)

٥٤ إِنَّ صَلٰوةَ الرَّجُلِ مَعَ الرَّجُلِ أَزْكٰى مِنْ صَلٰوتِهٖ وَحْدَهٗ، صَلٰوتُهٗ مَعَ رَجُلَيْنِ أَزْكٰى مِنْ صَلٰوتِهٖ مَعَ الرَّجُلِ، وَمَا أَكْثَرَ فَهُوَ أَحَبُّ إِلَى اللهِ۔

(ابوداؤد۔ ابی بن کعبؓ)

54. "మనిషి తాను ఒంటరిగా చేసే నమాజ్ కంటే మరొక వ్యక్తితో కలిసి చేసే నమాజ్, విశ్వాసపరమయిన ఆధ్యాత్మిక వృద్ధీ వికాసాలకు ఇతోధికంగా దోహదపడుతుంది. అతను ఒక వ్యక్తితో కలిసి చేసిన నమాజ్ కన్నా ఇద్దరు వ్యక్తులతో కలిసి చేసిన నమాజ్ విశ్వాస వికాసానికి కారణభూతమవుతుంది. ఇలాగే జనులు ఎంత అధిక సంఖ్యలో కలిసి నమాజ్ చేస్తారో అది అంతగా దైవ ప్రసన్నతకు పాత్రమవుతుంది. (అంతగానే దేవునితో సంబంధం పటిష్టం అవుతుంది)" అని మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. (అబూదావూద్ - ఉబై బిన్ కఅబ్)

---

వేళ, మనిషి అంతర్యంలో నిజవిశ్వాసం లేకపోతే, అతడు తన సుఖ నిద్రను వదలి దైవ ధ్యానం కొరకు లేవలేడు.

49. ఈ హదీస్ ద్వారా తెలిసేదేమంటే, ఫజ్ర్ మరియు అస్ర్ కాలంలో భూవ్యవస్థ నిర్వహణలో పనిచేసే దైవదూతలు తమ బాధ్యతల మార్పిడి చేసుకుంటారు; రాత్రి డ్యూటీ చేసి పోయేవారు, పగటి వేళ పనిలో చేరేవారు ఫజ్ర్ నమాజ్‌లో కలుసుకుంటారు. అలాగే అస్ర్ కాలంలో, పగటి దైవ దూతలు మరియు రాత్రి డ్యూటీవారు కలుసుకుంటారు; ఇంకా, వారు తమ నివేదికను నమాజ్‌తో సహా అల్లాహ్‌కు సమర్పించుకుంటారు. దైవ దూతల సాంగత్యం లభించడం విశ్వాసికి ఎంత గొప్ప వరం!

٥٥ مَامِنْ ثَلٰثَةٍ فِیْ قَرْیَةٍ وَلَا بَدْوٍ لَا تُقَامُ فِیْهِمُ الصَّلٰوةُ اِلَّا قَدِ اسْتَحْوَذَ عَلَیْهِمُ الشَّیْطٰنُ، فَعَلَیْكَ بِالْجَمَاعَةِ فَاِنَّمَا یَاْكُلُ الذِّئْبُ الْقَاصِیَةَ۔ (ابوداؤد — ابودرداءؓ)

55. ఒక బస్తీలో లేదా పల్లెలో ముగ్గురు ముస్లిములు నివసిస్తూ ఉండి, వారు అక్కడ జమాఅత్‌తో నమాజ్ చేయకపోతే వారి (అంతర్యాల)పై షైతాన్ ఆధిపత్యం సంపాయిస్తాడు. అందువల్ల నీవు జమాఅత్‌తో నమాజ్ ఆచరించడం నీ విధిగా నిర్ణయించుకోవాలి. ఎందుచేతనంటే, తన కాపరి నుండి బహుదూరంగా, తన మంద నుండి వేరయి పోయిన మేకనే తోడేలు సునాయాసంగా హతమార్చుతుంది." (మహాప్రవక్త ప్రవచనం). (అబూదావూద్-అబూదర్దా)

---

52. ఈ ఉపదేశం ద్వారా మహాప్రవక్త (సఅసం) తెలిపిన విషయమేమంటే - ఏ సత్కార్యం చేసినా అది దైవప్రసన్నత బడయడానికే చేయాలి. మనసులో "ఇది నా ప్రభువు ఆదేశం, ఆయన ప్రసన్నత పొందడమే నా ధ్యేయం" అనే సంకల్పం ఉండాలి. ఇతరుల దృష్టిలో సదాచారునిగ ఎంచబడడానికో, ఇతరుల్ని సంతోషపెట్టడానికో చేయబడే కార్యాలకు ఎలాంటి విలువలేదు. కేవలం దైవ ప్రసన్నతను పొందే ధ్యాసతో చేయబడే సత్కార్యానికే విలువ.

53. హదీస్‌లో 'ఫజ్జ్' అనే పదం వచ్చింది. దీనికి అందరికీ ఎడంగా వేరుగా ఉండటం అని అర్థం. సామూహిక నమాజుకు అన్ని కోవలకు చెందిన ముస్లింలు సమావేశమవుతారు. ధనవంతులు, నిరుపేదలు, ఆడంబరంగా దుస్తులు ధరించిన వారున్నూ చిరిగిన అతుకు సతుకుల బట్టలు ధరించిన వారున్నూ ఉంటారు. ఎవరైతే తమ పెద్దరికపు గర్వంలో ఉంటారో, ధన మదాంధులయి ఉంటారో వారు తమకు సమానంగా మరొకరు నిలుచుండటం సహించరు. అందుకే వారు తమ ఇండ్లల్లో నమాజ్ చేసుకుంటారు. దైవప్రవక్త (సఅసం) ఈ మానసిక రోగానికి నివారణగా సామూహిక నమాజ్‌ను ఆచరించడానికి ప్రబోధించారు. తన గదిలో - లేదా మస్జిద్‌లోనో ఒంటరిగా నమాజ్ చేయడాన్ని ప్రోత్సహించలేదు.

మరొకమాట ఏమంటే సామూహికంగా చేసే నమాజుల్లో సాధారణంగా షైతాన్ ప్రేరేపించే పైశాచిక ఆశంకలు, సందేహాలు, దురాశలు జనించడం తగ్గిపోతుంది. మనిషి సంబంధం దేవునితో దృఢమవుతుంది. అందువల్లనే జమాఅత్‌తోచేసే నమాజ్

٥٦ مَنْ سَمِعَ الْمُنَادِيَ فَلَمْ يَمْنَعْهُ مِنْ إِتِّبَاعِهِ عُذْرٌ ـــ قَالُوْا: وَمَا الْعُذْرُ؟ قَالَ: خَوْفٌ أَوْ مَرَضٌ ـــ لَمْ تُقْبَلْ مِنْهُ الصَّلٰوةُ الَّتِيْ صَلّٰى۔ (ابوداؤد – ابن عباسؓ)

56. మహాప్రవక్త (సఅసం) ఒకసారి ఇలా ప్రవచించారు : "ఎవరయినా దైవం వైపునకు పిలిచే వాని (ముఅజ్జిన్) పిలుపు విని, ఆ పిలుపును అనుసరించి వెళ్ళడానికి ఎలాంటి అవరోధం లేనట్టి పరిస్థితిలోనూ ఒంటరిగా నమాజ్ చేస్తే అది దైవం వద్ద స్వీకారయోగ్యం కాదు." అది విన్న సహచరులు 'అవరోధం' అంటే భావమేమిటి అని అడిగారు. దానికి 'భయం, అనారోగ్యం' అని సమాధానమిచ్చారాయన (సఅసం).

(అబూదావూద్ - ఇబ్నె అబ్బాస్)

---

మహత్తు మహాప్రవక్త నుడివిన ప్రకారం ఇరువైఏడురెట్లు అధికంగా ఉంటుంది. ఇదే భావాన్ని ముందువచ్చే హదీసు 54లో స్పష్టపరచడం జరిగింది.

55. ఈ హదీసులో ఒక సత్యాన్ని గురించి తెలుపడం జరిగింది. జమాఅత్‌తో (సామూహికంగా) నమాజ్ చేసే వ్యక్తులపై దేవుని కరుణానుగ్రహాలు కలుగుతాయి. ఆయన వారిని పరిరక్షిస్తాడు. కాని ఎక్కడయినా "జమాఅత్" స్థాపన జరగకపోతే, అల్లాహ్ తన రక్షణ ఏర్పాట్లను ఎత్తివేస్తాడు. అలాంటి వారు షైతాన్ హస్తగతమయిపోతారు. మరి, షైతాన్ వారిని యధేచ్ఛగా వేటాడతాడు. తన ఇష్టానుసారం వక్రమార్గాలలో నడిపిస్తాడు. మందలోని మేకలు మందలో ఉన్నంతసేపు ద్వివిధ రక్షణలో వుంటాయి. ఒకటి, కాపరి రక్షణ, రెండవది, వారి ఐకమత్యం. ఈ రెండు కారణాలుగా తోడేలు వాటిని పట్టజాలదు! కాని ఏ మేక అయినా అవివేకంగా తన కాపరి అభీష్టానికి భిన్నంగా మందనుండి వేరయి ముందుకు వెళ్ళిపోతే లేక వెనుకపడిపోతే అతి సులువుగా తోడేలు దాన్ని కాజేస్తుంది. ఎందుకంటే అది ఒంటరిగానూ బలహీనంగానూ ఉంటుంది, తన యజమాని అండకు దూరమయి ఉంటుంది.

56. 'భయం' అంటే ప్రాణ భయం అని భావం. అది శత్రువులవల్లనూ కావచ్చు లేదా క్రూర జంతువు, విష కీటకాల వల్లనూ కావచ్చు. "అనారోగ్యం" అంటే మనిషి మస్జిద్‌కు వెళ్ళలేని పరిస్థితి అని భావం. తీవ్రమైన తుఫాను, వర్షం, అసాధారణమైన చలి ఇవన్నీ అవరోధాల జాబితాలో కానవస్తాయి. అయితే శీతల ప్రదేశాల్లోని చలి అక్కడి ప్రజలకు అవరోధం కాజాలదు. కేవలం ఉష్ణప్రదేశాల్లో అప్పుడప్పుడూ ఏర్పడే

٥٧ عَنْ عَبْدِ اللهِ بْنِ مَسْعُوْدٍ قَالَ: رَأَيْتُنَا وَمَا يَتَخَلَّفُ عَنِ الصَّلٰوةِ إِلَّا مُنَافِقٌ قَدْ عُلِمَ نِفَاقُهُ أَوْ مَرِيْضٌ، إِنْ كَانَ الْمَرِيْضُ لَيَمْشِيْ بَيْنَ رَجُلَيْنِ حَتّٰى يَأْتِيَ الصَّلٰوةَ، وَقَالَ: إِنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ عَلَّمَنَا سُنَنَ الْهُدٰى، وَإِنَّ مِنْ سُنَنِ الْهُدٰى الصَّلٰوةَ فِي الْمَسْجِدِ الَّذِيْ يُؤَذَّنُ فِيْهِ، وَفِيْ رِوَايَةٍ قَالَ: مَنْ سَرَّهُ أَنْ يَّلْقَى اللهَ غَدًا مُّسْلِمًا فَلْيُحَافِظْ عَلٰى هٰذِهِ الصَّلَوَاتِ الْخَمْسِ حَيْثُ يُنَادٰى بِهِنَّ - فَإِنَّ اللهَ شَرَعَ لِنَبِيِّكُمْ سُنَنَ الْهُدٰى وَإِنَّهُنَّ مِنْ سُنَنِ الْهُدٰى - وَلَوْ أَنَّكُمْ صَلَّيْتُمْ فِيْ بُيُوْتِكُمْ كَمَا يُصَلِّيْ هٰذَا الْمُتَخَلِّفُ فِيْ بَيْتِهِ لَتَرَكْتُمْ سُنَّةَ نَبِيِّكُمْ وَلَوْ تَرَكْتُمْ سُنَّةَ نَبِيِّكُمْ لَضَلَلْتُمْ۔ (مُسلم)

57. అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజిఅన్) ఇలా తెలిపారు: "మహా ప్రవక్త (సఅసం) కాలంలో మా పరిస్థితి ఎలాగుండేదంటే మాలో జమాఅత్ తోటి నమాజ్‌ను తప్పించుకునేవారు ఎవరూ ఉండేవారు కాదు. మునాఫిక్ అయినవాడు - అతని నిఫాక్ (కాపట్యం) అందరికీ తెలిసే ఉండేది - లేదా వ్యాధిగ్రస్తుడయినవాడు తప్ప. ఒకవేళ మనిషి వ్యాధి గ్రస్తుడయినా ఇద్దరు వ్యక్తుల సహాయంతో మస్జిద్ కి వచ్చి జమాఅత్ లో పాల్గొనేవాడు." ఆయన ఇంకా ఇలా అన్నారు. "దైవ సందేశహరుడు (సఅసం) మాకు 'సుననుల్ హుదా'ని ఉపదేశించారు. సుననుల్ హుదాలో నమాజ్ కొరకు పిలుపు (అజాన్) ఇవ్వబడిన మస్జిద్ లో నమాజ్ చెయ్యడం కూడా చేరి ఉంది." మరో ఉల్లేఖనంలో ఆయన ఈ విధంగా తెలిపారు. "ఏ వ్యక్తి దైవ విధేయునిగా, దైవాజ్ఞల్ని పాలించే దాసునిగా ప్రళయ దినాన దైవాన్ని సందర్శించాలని అభిలషిస్తాడో అతను ఐదు వేళల నమాజుల్ని కాపాడుకోవాలి. వాటిని మస్జిద్ లో సామూహికంగా ఆచరించాలి. ఎందు

కంటే అల్లాహ్, మీ ప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు సుననుల్ హుదా బోధించాడు. నమాజులు కూడా సుననుల్ హుదా లోనివే. మునాఫిక్‌లు తమ ఇండ్లల్లో నమాజ్ చేసినట్లే మీరున్నూ మీ ఇండ్లల్లో నమాజ్ చేస్తే మీరు మహాప్రవక్త (సఅసం) పద్ధతిని విడిచిపెట్టిన వారవుతారు. మీరు మీ ప్రవక్త మార్గాన్ని త్యజించారంటే రుజుమార్గాన్ని కోల్పోతారు."

(ముస్లిమ్)

## ఇమామత్

٥٨ عَنْ أَبِي هُرَيْرَةَ : قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: اَلْإِمَامُ ضَامِنٌ وَالْمُؤَذِّنُ مُؤْتَمَنٌ ۔ اَللّٰهُمَّ أَرْشِدِ الْأَئِمَّةَ وَاغْفِرْ لِلْمُؤَذِّنِيْنَ

(ابوداؤد)

58. మహాప్రవక్త (సఅసం) ఈ విధంగా సెలవిచ్చారని హజ్రత్ అబూహురైరా (రజిఅన్) తెలిపారు: "ఇమామ్ బాధ్యుడు, ముఅజ్జిన్ అప్పగింతను కాపాడేవాడు. అల్లాహ్! ఇమాములను సదాచారులుగా, సద్వర్తనులుగా రూపొందించు; ముఅజ్జిన్‌లకు మన్నింపు, క్షమాభిక్ష ప్రసాదించు."

(అబూ దావూద్)

---

తీవ్రమైన శీతల వాతావరణం మాత్రమే అక్కడ నివసించే ప్రజలకు ప్రమాదకరంగా పరిణమిస్తుంది. ఇలాంటి చలి నిస్సందేహంగా అవరోధంగా పరిగణించబడుతుంది. అలాగే సరిగ్గా నమాజ్ సమయానికే మల మూత్ర విసర్జన అవసరం ఏర్పడితే అది కూడా అవరోధం కిందికి వస్తుంది.

57. 'సుననుల్ హుదా' అంటే చట్టబద్ధమైన ఆచారాలు, సంప్రదాయాలు అని అర్థం. వీటిని పాటించటం ముస్లిం సమాజంలోని ప్రతి వ్యక్తి యొక్క బాధ్యత. ఉదాహరణకు ఈ హదీసులో జమాఅత్‌తోటి చెయ్యబడే నమాజ్ (సామూహిక నమాజ్) ను పేర్కొనడం జరిగింది.

58. 'ఇమామ్' అంటే నమాజ్‌లో నాయకత్వం వహించి ప్రార్థన చేయించే నాయకుడు, 'ముఅజ్జిన్' అంటే నమాజ్ కొరకు అయిదు వేళలా అజాన్ (నమాజ్ పిలుపు) ఇచ్చే సజ్జనుడు.

٥٩ إِنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: إِذَا صَلَّى أَحَدُكُمْ لِلنَّاسِ فَلْيُخَفِّفْ فَإِنَّ فِيهِمُ الضَّعِيفَ وَالسَّقِيمَ وَالْكَبِيرَ، وَإِذَا صَلَّى أَحَدُكُمْ لِنَفْسِهِ فَلْيُطَوِّلْ مَا شَاءَ - (بخاری، مسلم — ابوھریرۃؓ)

59. "మీలో ఎవరయినా ఇమామత్ (నమాజ్‌లో నాయకత్వం) వహించినట్లయితే (పరిస్థితుల రీత్యా) తేలికయిన నమాజ్ చెయ్యాలి. ఎందుకంటే మీ వెనుక బలహీనులు, వ్యాధిగ్రస్తులు, ముసలి వారు కూడా ఉంటారు. అయితే మీరు ఒంటరిగా నమాజ్ చేసేటప్పుడు మాత్రం యథేచ్ఛగా సుదీర్ఘమయిన నమాజ్ చెయ్యవచ్చు." అని మహాప్రవక్త ఉద్బోధించారు. (బుఖారీ, ముస్లిం - అబూహురైరా)

٦٠ عَنْ أَبِي مَسْعُودٍ قَالَ: جَاءَ رَجُلٌ إِلَى رَسُولِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ: إِنِّي لَأَتَأَخَّرُ عَنْ صَلٰوةِ الصُّبْحِ مِنْ أَجْلِ فُلَانٍ مِمَّا يُطِيلُ بِنَا، فَمَا رَأَيْتُ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ غَضِبَ فِي مَوْعِظَةٍ قَطُّ أَشَدَّ مِمَّا غَضِبَ يَوْمَئِذٍ، فَقَالَ: يَاأَيُّهَا النَّاسُ إِنَّ مِنْكُمْ مُنَفِّرِينَ، فَأَيُّكُمْ أَمَّ النَّاسَ فَلْيُوْجِزْ، فَإِنَّ مِنْ وَّرَائِهِ الْكَبِيْرَ وَالصَّغِيْرَ وَذَا الْحَاجَةِ - (مُتّفق علیه)

60. అబూ మస్‌ఊద్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : ఒక వ్యక్తి మహాప్రవక్త (సఅసం) సన్నిధిలో వచ్చి, "ఫలానా ఇమామ్ ఫజ్ర్ నమాజ్ సుదీర్ఘంగా చేస్తాడు. అందువల్ల నేను సామూహిక ఫజ్ర్ నమాజ్ (జమాఅత్‌తో) చెయ్యడానికి ఆలస్యంగా పోతాను." అని ఆరోపించాడు. ఆ రోజు మహాప్రవక్త (సఅసం) కనబరచిన ఆగ్రహావేశాలు మరే బోధనా ప్రసంగాల్లోనూ నేను చూడలేదు. అప్పుడాయన ఇలా సెలవిచ్చారు. "జనులారా! మీలో కొందరు ఇమాములు దేవుని దాసులకు దైవారాధన పట్ల అయిష్టాన్ని కలిగిస్తున్నారు. జాగ్రత్త! మీలో ఎవరు ఇమామత్

(నమాజ్ నాయకత్వం) వహించినా నమాజ్‌ను క్లుప్తంగా చెయ్యాలి. ఎందుచేతనంటే అతని వెనుక ముసలివాళ్ళూ ఉంటారు, పిల్లలూ, పనిపాట్లకు వెళ్ళే ప్రజలు కూడా ఉంటారు. దీన్ని వారు దృష్టిలో ఉంచుకోవాలి." (ముత్తఫఖున్ అలైహ్)

٦١ عَنْ جَابِرٍ قَالَ : كَانَ مُعَاذُ بْنُ جَبَلٍ يُصَلِّي مَعَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، ثُمَّ يَأْتِي فَيَؤُمُّ قَوْمَهُ فَصَلَّى لَيْلَةً مَعَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ الْعِشَاءَ ثُمَّ أَتَى قَوْمَهُ فَافْتَتَحَ بِسُوْرَةِ الْبَقَرَةِ، فَانْحَرَفَ رَجُلٌ فَسَلَّمَ ثُمَّ صَلَّى وَحْدَهُ وَانْصَرَفَ ، فَقَالُوْا لَهُ : نَافَقْتَ يَا فُلَانُ! قَالَ : لَا ، وَاللّٰهِ لَآتِيَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، فَقَالَ : يَارَسُوْلَ اللّٰهِ ! إِنَّا أَصْحٰبُ نَوَاضِحَ نَعْمَلُ بِالنَّهَارِ ، وَإِنَّ مُعَاذًا صَلّٰى مَعَكَ الْعِشَاءَ ثُمَّ أَتَى قَوْمَهُ فَافْتَتَحَ بِسُوْرَةِ الْبَقَرَةِ ، فَأَقْبَلَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَلٰى مُعَاذٍ - فَقَالَ ، يَامُعَاذُ! أَفَتَّانٌ أَنْتَ؟ اِقْرَأْ " وَالشَّمْسِ وَضُحٰهَا "، " وَاللَّيْلِ إِذَا يَغْشٰى "، وَ " سَبِّحِ اسْمَ رَبِّكَ الْأَعْلٰى ". (بخاری ، مسلم)

61. హజ్రత్ జాబిర్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : ముఆజ్ బిన్ జబల్ (రజిఅన్) మహాప్రవక్త (సఅసం)తో పాటు నఫిల్ సంకల్పంతో నమాజ్ చేసి వెళ్ళి తన తెగవారిలో ఇమామత్ చేసేవారు. ఒకరోజు ఆయన ఇషా నమాజ్ మహాప్రవక్త (సఅసం)తో చేసిన తరువాత వెళ్ళి తన వీధి వారికి ఇమామత్ చేశారు. అప్పుడు బఖరా సూరా మొదలెట్టారు. జమాఅత్‌తోటి నమాజ్ చేస్తున్న ఒక వ్యక్తి సలామ్ చేసి నమాజ్‌ను వదిలేసి తన నమాజ్‌ను ఒంటరిగానే పూర్తిచేసుకుని వెళ్ళిపోయాడు. నమాజ్ ముగిసిన పిదప ఇతర మిత్రులు అతని ఇంటికి వెళ్ళి "నీవు మునాఫికత్ (కాపట్య కార్యం)చేశావు." అని నిలదీసి అడిగారు. దానికి

అతను "కాదు, నేను మునాఫికత్ చెయ్యలేదు, అల్లాహ్‌పై ఒట్టు. నేను దైవప్రవక్త వద్దకు వెళతాను.(నా విషయాన్ని విన్నవించు కుంటాను)" అని సమాధానం ఇచ్చాడు. తదనుగుణంగా అతను మహా ప్రవక్త సన్నిధి లోకి వచ్చి, "ప్రవక్తా! మేము కూలీకి ఒంటెలతో నీరు తోడేవాళ్ళం. పగలంతా ఈ పనుల్లో నిమగ్నమై ఉంటాము. ఇక ముఆజ్ విషయమా? ఆయన మీతో కలిసి ఇషా నమాజ్ చేసి వెళతారు. అక్కడ బఖరా సూరా మొదలెడతారు." అని విన్నవించుకున్నాడు. అది విన్న మహాప్రవక్త (సఅసం) ముఆజ్ (రజిఅన్)ని ఉద్దేశించి ఇలా బోధించారు: "ముఆజ్! ప్రజల్ని పరీక్షకు గురిచేస్తావా? 'వష్షమ్సి వజ్జుహాహా', 'వల్లయిలి ఇజా యగ్‌షాహా', 'సబ్బిహిస్మరబ్బికల్ ఆలా' లాంటి సూరాలు పఠించు."

(బుఖారి, ముస్లిమ్)

---

ఇమామ్ 'బాధ్యుడు' అంటే, ప్రజల నమాజ్‌కు బాధ్యుడని భావం. అతడు సద్వర్తనుడు సచ్ఛీలుడూ కాకపోతే అందరి నమాజ్‌ను చెడగొడతాడు. అందుకే మహాప్రవక్త ఇమాములకు సద్వర్తనులుగా చెయ్యమని దైవాన్ని వేడుకున్నారు. ముఅజ్జిన్ కాపాడేవాడు అన్న దానికి భావమేమంటే, ప్రజలు తమ నమాజ్‌కు సంబంధించిన వ్యవహారాన్ని అతనికి అప్పగించారు. సకాలంలో అజాన్ ఇవ్వడం అతని కర్తవ్యం. అప్పుడే ప్రజలు అజాన్ విని నమాజ్ కొరకు సిద్ధమవగలరు, సావధానంగా నమాజ్‌లో పాల్గొనగలరు. సమయానికి అజాన్ కాలేకపోతే చాలా మంది జమాఅత్ తోటి నమాజ్‌ను పూర్తిగానో, పాక్షికంగానో కోల్పోయే ప్రమాదముంది.

ఈ హదీస్ ఒక వైపు ఇమాముల్ని, ముఅజ్జిన్‌లను వారి బాధ్యతల పట్ల హెచ్చరిస్తుంది. మరోవైపు ప్రజలు ఇమాం పదవిపై ఒకరిని నియమించేటప్పుడు శీలవంతుని, సదాచార వర్తనుణ్ణి ఎన్నుకోవాలని, బాధ్యతాయుతుడయిన, విశ్వసనీయుడైన వ్యక్తిని ముఅజ్జిన్‌గా నియమించాలని సూచిస్తుంది.

60. నమాజ్‌ని క్లుప్తపరచడం అంటే అడ్డదిడ్డంగా వేగిరపాటుతో నమాజ్ చేయాలనీ, నాలుగు రకాతులు గబగబా రెండు నిమిషాల్లో ముగించాలనీ భావం కాదు. ఇలాంటి నమాజ్ ఇస్లాంలో వాంఛనీయం కాదు. అయితే నమాజ్ కొరకు వచ్చిన వారినీ, పరిస్థితుల్నీ దృష్టిలో ఉంచుకుని సమయోచితంగా ఆచరించడం శ్రేయస్కరం.

61. మహాప్రవక్త (సఅసం) ఇషా నమాజ్ సాధారణంగా ఒక జాము రాత్రి గడిచిన తరువాత చేసేవారు. హజ్రత్ ముఆజ్ మహాప్రవక్త (సఅసం) తో పాటు ఇషా

# జకాత్, సదకా, ఫిత్రా, ఉష్ర్

٦٢ إِنَّ اللّٰهَ قَدْ فَرَضَ عَلَيْهِمْ صَدَقَةً تُؤْخَذُ مِنْ أَغْنِيَاءِهِمْ فَتُرَدُّ عَلٰى فُقَرَاءِهِمْ ۔ (مُتفق عليه)

62. "అల్లాహ్ ప్రజలపై 'సదకా'ను విధించాడు. అది ధనికుల నుండి వసూలు చెయ్యబడుతుంది. నిరుపేదలకు తిరిగి అందజెయ్యబడుతుంది" అని ప్రబోధించారు మహాప్రవక్త (సఅసం). (ముత్తఫకున్ అలైహ్)

٦٣ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ اٰتَاهُ اللّٰهُ مَالًا فَلَمْ يُؤَدِّ زَكٰوتَهُ مُثِّلَ لَهُ يَوْمَ الْقِيٰمَةِ شُجَاعًا أَقْرَعَ لَهُ زَبِيْبَتَانِ يُطَوَّقُهُ يَوْمَ الْقِيٰمَةِ، ثُمَّ يَأْخُذُ بِلِهْزِمَتَيْهِ يَعْنِيْ شِدْقَيْهِ ثُمَّ يَقُوْلُ: أَنَا مَالُكَ، أَنَا كَنْزُكَ، ثُمَّ تَلَا: وَلَا يَحْسَبَنَّ الَّذِيْنَ يَبْخَلُوْنَ الْاٰيَةَ ۔

(صحیح البخاری)

63. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు: "అల్లాహ్ ఎవరి కయితే ఐశ్వర్యం ప్రసాదించాడో ఆ వ్యక్తి తన ధనంలో నుండి జకాత్ చెల్లించక పోతే ఆ ధనం తీర్పుదినాన విషసర్పం రూపు ధరిస్తుంది. దాని పడగపై రెండు నల్లటి చుక్కలుంటాయి. ఆ సర్పం అతని కంఠాన్ని భారమైన హారంలా చుట్టుకుంటుంది. 'నేను నీ ధనాన్ని, నీవు కూడబెట్టిన నిధిని' అంటూ ఆ సర్పం అతని దవడల్ని గట్టిగా కరచుకుంటుంది." మహాప్రవక్త (సఅసం) ఆ తరువాత ('ఆలి ఇమ్రాన్' సూరాలోని 180వ ఆయత్) పఠించారు ; దాని భావం :

'ఎవరికయితే అల్లాహ్ తన అనుగ్రహాలను ప్రసాదించాడో వారు పిసినారులుగా ప్రవర్తిస్తే, తమ ఈ పిసినారితనం తమకు ఉపకరిస్తుందన్న అపోహలోపడి ఉన్నారేమో, కాదు అది వారికి ఎంతో హానికరంగా పరిణ

మిస్తుంది. వీరు పేరాశతో కూడబెట్టేదంతా ప్రళయదినాన బరువయిన కంఠహారంగా రూపొందుతుంది.' (బుఖారి)

عَنْ عَائِشَةَ قَالَتْ: سَمِعْتُ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ: مَا خَالَطَتِ الزَّكٰوةُ مَالاً قَطُّ إِلاَّ أَهْلَكَتْهُ۔ (مشکوٰۃ) ٦٤

64. "ఒక సంపదలో నుండి జకాత్ తీయక అది ఆ ధనంలోనే మిశ్రమమయి ఉంటే, చివరికి అది ఆ ధనాన్ని సర్వనాశనం చేసివేస్తుంది" అని మహాప్రవక్త (సఅసం) చెప్పగా నేను విన్నాను అని హజ్రత్ ఆయిషా (రజిఅన్) ఉల్లేఖించారు. (మిష్కాత్)

---

జమాఅత్‌లో పాల్గొని, తన వీధికి వెళ్ళే వరకు ఇంకా కాస్త రాత్రి గడుస్తుంది. అలాంటప్పుడు 'బఖరా' లాంటి సుదీర్ఘమయిన సూరాలు పఠిస్తే ఎక్కువ కాలం పడుతుంది. అటు పగలంతా పొలాల్లో, తోటల్లో కష్టపడి నలిగివచ్చేవారికి సుదీర్ఘమయిన ప్రార్థన హదీసులో ముందుకు వచ్చిన విధంగాకాక మరే పర్యవసానాన్ని ఇవ్వగలదు ?

62. "సదకా" అనే పదం 'జకాత్' అనే అర్థంలోనూ ప్రయోగించబడుతుంది. 'జకాత్' చెల్లించడం ఇస్లామీయ శాసనాంగం (షరీఅత్) రీత్యా అనివార్యమయిన విధి. ఈ హదీసులో 'సదకా' అనే పదం ఈ అర్థంలోనే వచ్చింది. మనిషి ఐచ్ఛికంగా దైవ మార్గంలో చేసే ఇతర దానానికి కూడా ఇది వర్తిస్తుంది. ఈ హదీసు ద్వారా తెలిసేదేమంటే, జకాత్ సమాజంలోని నిరుపేదల హక్కు. అందువల్ల అది సమాజంలోని ధనిక వర్గం నుండి వసూలు చెయ్యబడి సమాజంలోని నిరుపేదలయిన వారికి తిరిగి ఇప్పించబడుతుంది. తద్వారా సమాజంలో కొంతకాలానికి వర్గ విభేదాలే నామరూపాల్లేకుండా సమసిపోతాయి.

63. సమాజంలోని హక్కుదారులకు వారి హక్కు అయిన జకాత్‌ను ఇప్పించక పోయినట్లయితే అది పరలోక జీవితంలో ఎంత దుర్భర శిక్షగా పరిణమిస్తుందో తెలుస్తోంది. అయితే ధనవంతుల నుండి జకాత్ వసూలు చేసి హక్కుదారులైన వారికి ఇప్పించే భారం ముస్లిం సమాజంపై మోపటం జరిగింది. సమాజం ఆ బాధ్యత పట్ల అలక్ష్యం వహిస్తే ఆ శిక్ష భారం కొంతవరకు సమాజ సభ్యులు కూడా భరించవలసి ఉంటుంది.

64. 'సర్వనాశనం చేస్తుంది' అంటే జకాత్ చెల్లించక ఆ ధనాన్ని స్వయంగానే ఆరగించేవారి ధనం తప్పనిసరిగా అంతమైపోతుందని భావం కాదు, బీదవారి హక్కయిన జకాత్‌ను, దానిపై ఎలాంటి హక్కులేని ధనికుడు కాజేయడం మూలాన అది పరలోక

٦٥ فَرَضَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ زَكوٰةَ الْفِطْرِ طُهْرًا لِّلصِّيَامِ
مِنَ اللَّغْوِ وَالرَّفَثِ وَطُعْمَةً لِّلْمَسٰكِيْنِ ۔ (ابوداؤد)

65. మహాప్రవక్త (సఅసం) 'ఫిత్రా' జకాత్‌ను ముస్లిమ్ సమాజంపై వాజిబ్ గా నిర్ణయించారు. అది రోజా కాలంలో మనిషిచేసిన వ్యర్థమయిన, అసభ్యకరమయిన కార్యాలకు ప్రాయశ్చిత్తంగా మారుతుంది. తద్వారా బీదలకు, అనాధలకు భోజన సదుపాయం కలుగుతుంది.

(అబూదావూద్)

٦٦ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : فِيْمَا سَقَتِ السَّمَاءُ وَالْعُيُوْنُ
أَوْ كَانَ عَثَرِيًّا الْعُشْرُ، وَمَا سُقِيَ بِالنَّضْحِ نِصْفُ الْعُشْرِ ۔ (بخاری، ابن عمرؓ)

66. "ఏ భూములయితే వర్షపు నీటితో లేక పారే సెలయేటి నీటితో లేక నది సమీపంలో ఉండి నీటి పారుదల లేకుండానే సాగుబడి అవుతాయో వాటి పంటలో పదవవంతును, ఏ భూములయితే (మోట వగైరాల ద్వారా, ధనం వెచ్చించి) నీటి పారుదల ద్వారా సాగు చెయ్య బడతాయో వాటి పంటలో ఇరువయ్యో వంతును జకాత్ గా చెల్లించాలి" అని మహాప్రవక్త (సఅసం) ఆదేశించారు. (బుఖారి-ఇబ్ను ఉమర్)

---

జీవితంలో అతనికి వినాశకరంగా పరిణమిస్తుంది, అతని ధార్మిక జీవితం నాశనమవుతుంది అని అర్థం. అయితే జకాత్ చెల్లించక ధనాన్ని కాజేసిన వారి ధనం యావత్తు, ఇహలోకంలోనే క్షణాల్లో నాశనమయిన ఉదంతాలు మనం కళ్ళారా చూస్తుంటాము, చెవులారా వింటుంటాము.

65. "ఫిత్రా" దానం వల్లనే రమజాన్ నెల ముగిసాక జరుపుకునే పండుగకు "ఈదుల్ ఫిత్ర్" అనే పేరు వచ్చింది. ఈ హదీసులో ఫిత్రా దానాన్ని విధించడంలోగల రెండు మర్మ హేతువులు ప్రస్తావించడం జరిగింది. ఒకటి, రోజావస్థలో మనిషి ఎంతజాగ్రత్తగా మసలుకున్నా లోటుపాట్లు జరిగే అవకాశం ఉంటుంది. ఆ లోటును పూరించడానికి ఈ దానం ఉపకరిస్తుంది. రెండవది, ముస్లింలందరూ పండుగ వేడుకలో మునిగి ఉన్నప్పుడు సమాజంలోని నిరుపేదలు, అవసరమున్న వారు పస్తులు పడి ఉండకుండా వారు కూడా పండుగ సంబరాల్లో ఎంతో కొంత భాగం పంచుకునేందుకు ఈ ఫిత్రా

# రోజా

٦٧ عَنْ سَلْمَانَ الْفَارِسِيِّ قَالَ، خَطَبَنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ فِيْ اٰخِرِ يَوْمٍ مِّنْ شَعْبَانَ، فَقَالَ: يٰاَيُّهَا النَّاسُ! قَدْ أَظَلَّكُمْ
شَهْرٌ عَظِيْمٌ شَهْرٌ مُّبَارَكٌ، فِيْهِ لَيْلَةٌ خَيْرٌ مِّنْ اَلْفِ شَهْرٍ، جَعَلَ اللّٰهُ
صِيَامَهٗ فَرِيْضَةً وَّقِيَامَ لَيْلِهٖ تَطَوُّعاً، مَنْ تَقَرَّبَ بِخَصْلَةٍ مِّنَ الْخَيْرِ
كَانَ كَمَنْ أَدّٰى فَرِيْضَةً فِيْمَا سِوَاهُ، وَمَنْ أَدّٰى فَرِيْضَةً فِيْهِ كَانَ
كَمَنْ أَدّٰى سَبْعِيْنَ فَرِيْضَةً فِيْمَا سِوَاهُ، وَهُوَ شَهْرُ الصَّبْرِ. وَالصَّبْرُ
ثَوَابُهُ الْجَنَّةُ، وَشَهْرُ الْمُوَاسَاةِ - (مشکوٰۃ)

67. హజ్రత్ సల్మాన్ ఫార్సి (రజి) ఇలా ఉల్లేఖించారు: "షాబాన్ చివరి తేదీన మహాప్రవక్త (సఅసం) ప్రసంగం చేశారు. అందులో, 'జనులారా! ఒక మహోజ్వలమయిన, ఎనలేని శుభాల నెల త్వరలో రానున్నది. అందులోని ఒక్క రేయి వేయి నెలలకన్నా శుభప్రదమయినది. అల్లాహ్ ఈ నెలలో రోజా (ఉపవాసవ్రతం) పాటించడం విధిగా నిర్ణయించాడు. ఈ నెల రాత్రుల్లో 'తరావీహ్ నమాజ్' చేయడం నఫిల్‌గా నియమించాడు. (అంటే ఇది విధి కాదు-'సున్నత్,' మహాప్రవక్త (సఅసం) సంప్రదాయం, అల్లాహ్‌కు పసందయిన ప్రార్థన అని అర్థం). ఈ నెలలో ఎవరయినా ఒక సత్కార్యాన్ని అంతర్ ప్రేరణతో, సంతోషంగా చేస్తే అది ఇతర మాసాల్లో విధిని నిర్వర్తించిన దానికి సమానం. ఎవరైనా ఈ మాసంలో ఫర్జ్ (విధిగా నిర్ణయించిన కార్యాన్ని) నిర్వహిస్తే అది ఇతర నెలల్లో డెబ్బయి విధుల్ని నిర్వర్తించిన దానికి సమానం.

ఇది సహనం వహించవలసిన నెల, సహనానికి ప్రతిఫలం స్వర్గం. ఇది సమాజంలోని బీదసాదల పట్ల సానుభూతి వహించవలసిన నెల.'

(మిష్కాత్)

٦٨ مَنْ صَامَ رَمَضَانَ إِيْمَانًا وَّاِحْتِسَابًا غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهٖ،
وَمَنْ قَامَ رَمَضَانَ اِيْمَانًا وَّاِحْتِسَابًا غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهٖ ـ

(مُتّفق عليه)

68. "ఏ వ్యక్తి ధర్మనిష్ఠతో, ఆత్మపరిశీలనతో పరలోక ప్రతిఫలా పేక్షతో రమజాన్ రోజాలు పాటిస్తాడో, అతను పూర్వం చేసిన పాపాలను అల్లాహ్ మన్నించి వేస్తాడు. ఎవరియితే ధర్మనిష్ఠతో ఆత్మ పరిశీలనతో పరలోక ప్రతిఫలాపేక్షతో తరావీహ్ నమాజ్ చేస్తాడో అతడు పూర్వం చేసిన అపరాధాలను అల్లాహ్ క్షమిస్తాడు." (ముత్తఫకున్ అలైహి)

---

దోహదపడుతుంది. ఈ కారణం మూలంగానే ఇంటిల్లిపాది అందరి పైనా ఫిత్రా దానం విధించడం జరిగింది. ఈ ఫిత్రాను పండుగకు వీలయినంతముందే చెల్లించడం అవసరం అని తాకీదు చెయ్యబడింది.

66. జకాత్ కేవలం వెండి, బంగారాలపైనే కాదు భూములుండి సాగుబడి చేసి సంపాదిం చుకునే భూస్వాములపై కూడా విధించబడింది. దీని ఉద్దేశ్యం కూడా సమాజంలోని ఆర్థిక అసమానతల్ని వీలయినంతమేరకు దూరం చేసి ప్రజలందరూ అన్నిటా సమస్థాయిలో, సమభావంతో మెలిగే అవకాశం కల్పించడమే.

వ్యాపారులు, భూస్వాములు ఈ వ్యవస్థను సక్రమంగా పాటిస్తే వర్గ పోరాటాలకు, ఆర్థిక తారతమ్యాలకు సమాజంలో తావే ఉండదు.

67. "సహనం వహించవలసిన నెల" అంటే రోజా ద్వారా విశ్వాసికి, దైవమార్గంలో స్థిరంగా నిలిచేందుకు, తన వాంఛలపై నిగ్రహం, స్వాధీనం పొందడానికి శిక్షణ ఇవ్వబడుతుంది. "రోజా"లో ఒక నెల వరకు, ప్రతి దినం ఒక నిర్ణీత సమయం నుంచి మరొక నిర్ణీత సమయం వరకు మధ్యగల కాలంలో మనిషి, దైవాదేశానుసారం ఏదీ తినడు, త్రాగడు. లైంగిక వాంఛల చేరువకుపోడు. తద్వారా అతనిలో దైవ విధేయతా భావం జనిస్తుంది. అవసరం కలిగితే తన భావోద్రేకాలను, వాంఛల్ని, ఆకలిదప్పుల్ని మనిషి ఎంతవరకు స్వాధీనంలో ఉంచుకోగలుగుతాడో తేలుతుంది - దానికి శిక్షణ లభిస్తుంది. ప్రపంచంలో విశ్వాసి రణరంగంలోని సిపాయి లాంటివాడు. అతను పైశాచిక వాంఛలతో, దుష్టశక్తులతో పోరాడవలసివుంటుంది. అతనిలో సహనం, ఓరిమి గుణాలు లేకపోతే దాడి జరిగిన మరుక్షణమే శత్రువుకు లొంగిపోతాడు. సానుభూతి వహించవలసిన నెల అంటే దైవం ధనం ప్రసాదించిన విశ్వాసులు, ఎంతో

٦٩ اَلصِّيَامُ جُنَّةٌ، وَإِذَا كَانَ يَوْمُ صَوْمِ أَحَدِكُمْ فَلَا يَرْفُثْ وَلَا يَصْخَبْ،
فَإِنْ سَابَّهُ أَحَدٌ أَوْ قَاتَلَهُ فَلْيَقُلْ إِنِّي امْرُؤٌ صَائِمٌ۔ (بخاری، مسلم)

69. "రోజా డాలువంటిది. మీలో ఎవరయినా, రోజా పాటిస్తున్నట్లయితే, ఆ దినాన నోటితో అశ్లీలమయిన పలుకులు పలకరాదు. అల్లరి పనులు చెయ్యరాదు, ఇతరులెవరయినా తిట్టినా, జగడానికి దిగినా, 'నేను రోజా పాటిస్తున్నాను' అని గుర్తుంచుకోవాలి" అని మహాప్రవక్త (సఅసం) ఉపదేశించారు. (బుఖారీ, ముస్లిమ్)

٧٠ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: اَلصِّيَامُ وَالْقُرْاٰنُ
يَشْفَعَانِ لِلْعَبْدِ، يَقُوْلُ الصِّيَامُ: اَیْ رَبِّ! إِنِّي مَنَعْتُهُ الطَّعَامَ
وَالشَّهَوَاتِ بِالنَّهَارِ فَشَفِّعْنِيْ فِيْهِ، وَيَقُوْلُ الْقُرْاٰنُ: مَنَعْتُهُ النَّوْمَ
بِاللَّيْلِ فَشَفِّعْنِيْ فِيْهِ فَيُشَفَّعَانِ۔ (بیہقی، مشکوٰۃ، عبداللہ بن عمرؓ)

70. మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు:"రోజా, కుర్ఆన్ ఈ రెండూ విశ్వాసి (మోమిన్) కొరకు సిఫారసు చేస్తాయి. రోజా అంటుంది, 'ప్రభూ! నేను ఈ వ్యక్తిని పగల్లో భోజనానికి, ఇతర వాంఛలకు దూరం చేశాను. ఇతడు దానికి శిరసావహించాడు; (అందువల్ల ప్రభూ! అతని మోక్షానికై) నా సిఫారసును స్వీకరించు.' అలాగే దివ్యకుర్ఆన్ అంటుంది: 'నేను ఇతన్ని రాత్రిళ్ళల్లో సుఖనిద్రకు దూరం చేశాను కనుక స్వామీ! ఇతని ఎడల నా సిఫారసును స్వీకరించు.' అప్పుడు అల్లాహ్ ఈ రెంటి సిఫారసును స్వీకరిస్తాడు." (బైహకీ, మిష్కాత్-అబ్దుల్లా బిన్ ఉమర్)

---

కొంత ఉన్నవాళ్లయిన రోజాదార్లు, తమకు దైవం ఇచ్చిన సిరిలో ఇరుగుపొరుగులోని అగత్యపరులకు, అర్థులకు కొంత భాగం కల్పించి వారి సహరీ, ఇఫ్తార్ల కొరకు కావలసిన సదుపాయాలు చేయాలని అర్థం. సహరీ అంటే రోజా ప్రారంభించేముందు చేసే భోజనం అని అర్థం.
హదీసులోని "మువాసాత్" అన్న పదానికి మేము సానుభూతి అని అనువదించాము.

٧١ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : مَنْ لَّمْ يَدَعْ قَوْلَ الزُّوْرِ وَالْعَمَلَ بِهِ فَلَيْسَ لِلّٰهِ حَاجَةٌ فِىْ أَنْ يَّدَعَ طَعَامَهُ وَشَرَابَهُ ـ

(بخاری ، ابوهریرة)

71. మహాప్రవక్త (సఅసం) ఉపదేశం: "ఎవరైతే (రోజా పాటిస్తున్న ప్పటికీ) అసత్యం పలకడం, అసత్యాన్ని ఆచరించడం మానడో అటువంటివాడు ఆకలిదప్పులతో పడుండటం పట్ల అల్లాహ్‌కు ఏ మాత్రం ఆసక్తి లేదు." (బుఖారి)

٧٢ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : كَمْ مِّنْ صَائِمٍ لَيْسَ لَهُ مِنْ صِيَامِهِ إِلَّا الظَّمَأُ ، وَكَمْ مِنْ قَائِمٍ لَيْسَ لَهُ مِنْ قِيَامِهِ إِلَّا السَّهَرُ ـ

72. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు : "ఎందరో రోజా పాటించే వ్యక్తులకు తమ ఉపవాసవ్రతం ద్వారా కేవలం ఆకలిదప్పులు తప్ప మరేమీ లభించదు. అలాగే ఎందరో తరావీహ్ నమాజ్ చేసే వ్యక్తులకు తమ తరావీహ్ ద్వారా కేవలం జాగరణ తప్ప మరేదీ ప్రాప్తం కాదు."

---

అంటే ఆర్థిక సానుభూతి అని అర్థం. ఇందులో సానుభూతి పలుకులు కూడా చేరి ఉన్నాయి.

68. సంకల్ప శుద్ధితో చేసే ఏ కార్యమయినా ఫలప్రదమవుతుంది. రోజాను, రమజాన్ నెలలో చేసే తరావీహ్ ప్రార్థనలనూ ప్రదర్శనాబుద్ధితో కాక, చేసిన పాపాలపై పశ్చాత్తాపంతో ఆచరిస్తే అవి పరలోకంలో దైవానుగ్రహానికి దోహదపడతాయనటంలో సందేహం లేదు.

69. రోజాను పాటించే వ్యక్తి కేవలం దైవాజ్ఞాపాలన చెయ్యాలనే ఉద్దేశ్యంతోనే అన్న పానీయాలు, ఇతర వాంఛలకు దూరంగా ఉంటాడు. ఈ వ్రతం సాగినంతకాలం అతడు ఎలాంటి చెడుపనిని తలంచలేడు, ఎలాంటి అవిధేయతా భావం అతనిలో దారిచేసుకోదు. దుష్క్రియలను ప్రేరేపించే విషయాలు తటస్థించినా అతడు తాను అనుసరిస్తున్న దైవ విధేయతా విధానం (ఉపవాస వ్రతం) గుర్తు చేసుకుని ఆ చెడు నుండి తప్పించుకుంటాడు. అందుకే రోజాను డాలు అని పేర్కొనడం జరిగింది.

٧٣ قَالَ حُذَيْفَةُ: أَنَا سَمِعْتُهُ يَقُوْلُ: فِتْنَةُ الرَّجُلِ فِيْ أَهْلِهِ وَمَالِهِ
وَجَارِهِ يُكَفِّرُهَا الصَّلٰوةُ وَالصِّيَامُ وَالصَّدَقَةُ - (بخاری باب الصوم)

73. హజ్రత్ హుజైఫా (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: నేను మహాప్రవక్త చెప్పగా విన్నాను: "మనిషి తన గృహస్తుల విషయంలో తన సంపాదన విషయంలో తన పొరుగువారి విషయంలో తప్పు చేస్తాడు, అయితే నమాజ్, రోజా, సద్కాలు ఆ తప్పులకు ప్రాయశ్చిత్త మవుతాయి."

(బుఖారి)

٧٤ قَالَ أَبُوْهُرَيْرَةَ: إِذَا صَامَ فَلْيَدَّهِنْ لَا يُرٰى عَلَيْهِ أَثَرُ الصَّوْمِ-
(الادب المفرد)

74. హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఇలా తెలిపారు: "మనిషి ఉపవాస వ్రతం పాటిస్తున్నప్పుడు (తలకు) నూనె రాసుకోవాలి, తద్వారా రోజా చిహ్నాలు, దాని ప్రభావం మనిషి ముఖంలో వ్యక్తం కావు."

(అల్ అదబుల్ ముఫ్రద్)

---

70. రోజా, కుర్ఆన్ సిఫారసు చెయ్యడమంటే, మనిషి పాటించిన ధర్మనిష్ఠకు ఇవి పరలోక వ్యవస్థలో సాక్షిభూతములయి నిలుస్తాయని భావం. దైవం వీటికి వ్యక్తిత్వం ప్రసాదించగా ఇవి హదీసులోని మాటలు పలుకడం కూడా సంభవమే. రమజాన్ నెలలో రాత్రిళ్ళు తరావీహ్ నమాజ్లోనూ ఇతరత్రా దివ్య కుర్ఆన్ని పఠించడం, అధ్యయనం చేయడం శుభప్రదమని కూడా దీని ద్వారా తెలుస్తోంది.

71. మనిషి సద్వర్తనుడుగా మారాలన్నదే రోజా ఉద్దేశ్యం కాని రోజా పాటించినా మనిషి తన జీవితపు కట్టడాన్ని సత్యం పునాదిగా నిర్మించుకోకపోతే, అబద్ధాలు పలుకుతూ అపకార్యాలు చేస్తూ కాలం వెళ్ళబుచ్చితే, రమజాన్ తరువాత కూడా అతని జీవితంలో సత్యం అన్నది కానరాదు. అలాంటి వ్యక్తి తాను ఉషోదయం నుండి సూర్యాస్తమయం వరకు ఆకలిదప్పులతో ఉండవలసిన అవసరమేముంది?

ఉపవాస వ్రతంలో అన్నపానీయాలు విసర్జించడానికి కారణం దైవాజ్ఞాపాలనా భావం అన్నది మనిషికి అనుక్షణం జ్ఞప్తినందుండాలి అన్నదే.

72. రోజా పాటిస్తూ కేవలం ఆకలిదప్పుల్ని పొందిన వ్యక్తికంటే దౌర్భాగ్యుడెవడు? రోజా పాటించే, రాత్రి తరావీహ్ నమాజ్ చేస్తూ కేవలం జాగరణ పొందేవానికంటే అదృష్ట హీనుడెవడు? ఈ హదీసు కూడా పై హదీసుల్లా రోజా ముఖ్య ఉద్దేశ్యాన్ని క్షణకాలం కూడా

٥٧ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: تَسَحَّرُوْا، فَإِنَّ فِي السُّحُوْرِ بَرَكَةً۔ (بخاری)

75. "సహరీ భుజించండి, సహరీలో శుభముంది" అని దైవప్రవక్త (సఅసం) ఉపదేశించారు. (బుఖారీ)

٧٦ عَنْ سَهْلِ بْنِ سَعْدٍ أَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: لَا يَزَالُ النَّاسُ بِخَيْرٍ مَّا عَجَّلُوا الْفِطْرَ۔ (بخاری)

76. సహల్ బిన్ సఅద్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : "ప్రజలు వేగిరంగా ఇఫ్తార్ చేస్తున్నంతకాలం వారు శుభానికి దూరమవ్వరు" అని మహాప్రవక్త సెలవిచ్చారు. (బుఖారీ)

---

మరువకూడదని బోధిస్తోంది.

73. అంటే, మనిషి తన భార్యాపిల్లల సంరక్షణ, పోషణ కొరకు పొరపాటున పాపపు చేష్టల్లో పడిపోవచ్చు. అలాగే ఉపాధి సముపార్జనలో క్షణికమయిన లాభం కొరకు ధర్మాధర్మాల తారతమ్యం అతని కనుమరుగయ్యే అవకాశం ఉంది. ఇంకా, పొరుగువాని పట్ల ప్రతి మనిషిపై తారసిల్లే బాధ్యతల నిర్వహణలో కూడా లోటుపాట్లకు తావుంది. అలాంటప్పుడు ఈ అపరాధాలు అసంకల్పితంగా, ఏమరుపాటులో జరిగినవయితే అల్లాహ్ వాటిని ఈ ఆరాధనల మూలంగా మన్నిస్తాడని ఈ హదీసు చాటుతుంది.

74. రోజా పాటించే వ్యక్తి దాన్ని ప్రదర్శనా బుద్ధితో కాక చిత్తశుద్ధితో కేవలం దైవ ప్రసన్నత బడయటానికి పాటించాలి. ఇంకా తన రోజా ప్రదర్శితంకాకుండా వీలయిన జాగ్రత్తలు తీసుకోవాలి. 'నూనె రాయడం' అన్నది సూచనప్రాయంగా పేర్కొన బడింది. ఉపవాస వ్రతం పాటించే వ్యక్తి ఉల్లాసంగా, హుషారుగా, తాజాగా అగుపడాలి అనీ, రోజా వల్ల జనించే బలహీనత కానరాకుండా వ్యవహరించాలి అనీ దాని భావం.

75. అంటే సహరీ భుజించి వ్రతాన్ని పాటిస్తే పగలంతా తేలిగ్గా దొర్లిపోతుంది. దైవారాధన, కుర్ఆన్ పఠనం ఇత్యాది కార్యాల్లో అలసట రాదు. సహరీ పుచ్చుకోకపోతే ఆకలివల్ల గ్లాని, బలహీనతలు కలుగుతాయి. మనస్సు ఆరాధనలో లగ్నం కాదు. ఇది దురదృష్టకరం, అందుకే మరో హదీసులో ఇలా ఉంది :

اِسْتَعِيْنُوْا بِطَعَامِ السَّحَرِ عَلٰى صِيَامِ النَّهَارِ وَبِقَيْلُوْلَةِ النَّهَارِ عَلٰى قِيَامِ اللَّيْلِ۔

٧٧ عَنْ اَنَسِ بْنِ مَالِكٍ قَالَ: كُنَّا نُسَافِرُ مَعَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَلَمْ يَعِبِ الصَّائِمُ عَلَى الْمُفْطِرِ وَلَا الْمُفْطِرُ عَلَى الصَّائِمِ۔

(بخاری)

77. "మేము రమజాన్ మాసంలో మహాప్రవక్తవెంట ప్రయాణం చేసే టప్పుడు కొందరు రోజా పాటించేవారు, మరికొందరు పాటించక పోయే వారు; అయినా పాటించేవారు పాటించనివారిని, పాటించనివారు పాటించే వారినీ తప్పుపట్టేవారు కారు" అని హజ్రత్ అనస్ బిన్ మాలిక్ తెలిపారు. (బుఖారి)

٧٨ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لِعَبْدِ اللّٰهِ بْنِ عَمْرٍو: أَلَمْ أُخْبَرْ أَنَّكَ تَصُوْمُ النَّهَارَ وَتَقُوْمُ اللَّيْلَ؟ قُلْتُ: بَلٰى يَا رَسُوْلَ اللّٰهِ! قَالَ: فَلَا تَفْعَلْ، صُمْ وَأَفْطِرْ وَنَمْ وَقُمْ، فَإِنَّ لِجَسَدِكَ عَلَيْكَ حَقًّا وَّإِنَّ لِعَيْنِكَ عَلَيْكَ حَقًّا، وَّإِنَّ لِزَوْجِكَ عَلَيْكَ حَقًّا، وَّإِنَّ لِزَوْرِكَ عَلَيْكَ حَقًّا، وَّإِنَّ بِحَسْبِكَ أَنْ تَصُوْمَ فِيْ كُلِّ شَهْرٍ ثَلٰثَةَ أَيَّامٍ۔ (بخاری)

78. దైవ సందేశహరుడు (సఅసం) ఒక రోజున అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్‌ని, 'నీవు ఎడతెప్పకుండా పగలంతా ఉపవాస వ్రతం పాటిస్తూ రాత్రుల్లో నమాజ్ చేస్తూఉంటావని నాకు అందిన సమాచారం వాస్తవ మేనా?' అని అడిగారు. దానికి ఆయన 'అవును నిజమే దైవ ప్రవక్తా!' అని బదులిచ్చారు. అప్పుడు మహాప్రవక్త ఇలా ఉపదేశించారు: "అలా చెయ్యకు; ఒకప్పుడు రోజా పాటిస్తే మరొకప్పుడు తింటూ త్రాగుతూ గడుపు. అలాగే హాయిగా నిద్ర కూడా పోవాలి, తహజ్జుద్ నమాజ్ (రాత్రివేళ చేసే అదనపు ప్రార్థన) కూడా చేస్తూ ఉండాలి. ఎందుకంటే నీ పైన నీ శరీరానికీ హక్కు వుంది; నీపైన నీ భార్యకూ హక్కుంది; నీ పైన నీ అతిథుల హక్కుకూడా ఉంది. ప్రతినెలమూడు రోజులు మాత్రం నీవు ఉపవాసవ్రతం పాటించు. నీకు అదే చాలు." (బుఖారి)

٧٩ عَنْ أَبِيْ جُحَيْفَةَ قَالَ اٰخَى النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بَيْنَ
سَلْمَانَ وَأَبِي الدَّرْدَاءِ ، فَزَارَ سَلْمَانُ أَبَا الدَّرْدَاءِ فَرَاٰى أُمَّ الدَّرْدَاءِ
مُتَبَذِّلَةً فَقَالَ : مَا شَانُكِ ؟ قَالَتْ : أَخُوْكَ أَبُوْالدَّرْدَاءِ لَيْسَ لَهُ
حَاجَةٌ فِي الدُّنْيَا - فَجَاءَ أَبُوْالدَّرْدَاءِ فَصَنَعَ لَهُ طَعَامًا ، فَقَالَ لَهُ : كُلْ
فَإِنِّيْ صَائِمٌ قَالَ : مَا أَنَا بِاٰكِلٍ حَتّٰى تَأْكُلَ ، فَلَمَّا كَانَ اللَّيْلُ ذَهَبَ أَبُوْ
الدَّرْدَاءِ يَقُوْمُ فَقَالَ لَهُ : نَمْ ، فَنَامَ ثُمَّ ذَهَبَ يَقُوْمُ ، فَقَالَ لَهُ :
نَمْ ، فَلَمَّا كَانَ مِنْ اٰخِرِ اللَّيْلِ قَالَ سَلْمَانُ : قُمِ الْاٰنَ ، فَصَلَّيَا جَمِيْعًا ،
فَقَالَ لَهُ سَلْمَانُ : إِنَّ لِرَبِّكَ عَلَيْكَ حَقًّا ، وَإِنَّ لِنَفْسِكَ عَلَيْكَ حَقًّا ،
إِنَّ لِأَهْلِكَ عَلَيْكَ حَقًّا ، فَاَعْطِ كُلَّ ذِيْ حَقٍّ حَقَّهُ - فَأَتَى النَّبِيَّ صَلَّى اللّٰهُ
عَلَيْهِ وَسَلَّمَ ، فَذَكَرَ ذَالِكَ لَهُ ، فَقَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ :
صَدَقَ سَلْمَانُ - (بخاری)

79. అబూజుహైఫా (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : "ప్రవక్త మహనీయులు (సఅసం) అబూదర్దా, సల్మాన్ ఫార్సీల మధ్య సోదరత్వం ఏర్పరిచారు. ఒకసారి సల్మాన్ (రజిఅన్) అబూదర్దా (రజిఅన్) ఇంటికి వెళ్ళారు. అక్కడ ఆయన ఉమ్మెదర్దా (అబూదర్దా సతీమణి)ని అతి సాధారణస్థితిలో చూసి 'నీ స్థితి ఇలా తయారయిందేమిటీ?' అని అడిగారు. 'మీ అన్నయ్య అబూదర్దాకు లోకమేమయినా పట్టి ఉంటేనా?' అని మారు ప్రశ్న వేశారామె. కొంతసేపటికి అబూదర్దా వచ్చి అతని కొరకు భోజనం తయారు చేయించారు. 'నేనయితే ఉపవాసం పాటిస్తున్నాను,

---

'పగల్లో వ్రతాన్ని పాటించడానికి సహరీ ద్వారాను తహజ్జుద్ (రాత్రిపూట చేసే అదనపు ఆరాధన) ప్రార్థనకై మధ్యాహ్నం ఒక కునుకు ద్వారాను, సహాయం పొందండి.'

76. యూదులు బాగా చీకటిపడనంతవరకు ఉపవాస విరమణ చేసేవారు కారు. ముస్లింలు వారిని వ్యతిరేకించాలని, అంటే ధార్మికంగా ఇతరులను అనుసరించకుండా తమ నియమాలనే పాటించాలని అలా పాటించినంతకాలం వారు ధార్మికంగా, ప్రాపంచికంగా మంచి స్థితిలో ఉంటారని ఈ హదీసు ఉద్బోధిస్తుంది.

నీవు భోజనం కానివ్వు' అని చెప్పారు సల్మాన్‌తో అబూదర్దా (రజిఅన్). 'నీవు భోంచేయనంతవరకు నేను ముట్టుకోను' అన్నారు సల్మాన్. అప్పుడాయన రోజా విరమించి సల్మాన్‌తోపాటు భోంచేశారు. కాస్త రాత్రి గడిచాక అబూ దర్దా ప్రార్థన కొరకు లేవగా సల్మాన్ 'పోయి పడుకో' అనగానే అబూదర్దా లోపలికెళ్ళి పడుకున్నారు. ఇంకా కాస్త రాత్రి గడిచాక అబూదర్దా తిరిగి ప్రార్థనకై లేవగా పడుకొమ్మని సల్మాన్ మళ్ళీ పంపించివేశారు. తరువాత రాత్రి చివరి భాగాన సల్మాన్ (రజిఅన్) ఆయన్ని లేపారు. ఇద్దరూ కలిసి ప్రార్థనచేశారు. ఆ తరువాత సల్మాన్(రజిఅన్) ఆయనతో అన్నారు, 'చూడు, నీపై నీ ప్రభువు హక్కు ఉంది, నీ ఆత్మహక్కుంది, నీ భార్య హక్కు కూడా ఉంది. అయితే అన్ని హక్కుల్నీ నిర్వర్తించు' ఈ విషయాన్నంతా అబూదర్దా వచ్చి మహాప్రవక్త (సఅసం) కు వినిపించగా ఆయన, "అవును సల్మాన్ చెప్పిందంతా నిజమే" అని ధృవీకరించారు. (బుఖారి)

---

77. ప్రయాణీకులు రోజా పాటించనవసరంలేదని దివ్య ఖుర్‌ఆన్‌లో అనుమతించబడింది. అయితే ఎవరయినా ప్రయాణావస్థలోనూ అతి సులభంగా రోజాను పాటించగలిగితే వారు అలా చెయ్యడమే శ్రేయస్కరం. అలాగే ఎవరు ప్రయాణంలో రోజా పాటించడం కష్టమని భావిస్తారో వారు విరమించడమే ఉచితం. అయితే ఎవరున్నూ మరొకరిపై ఎలాంటి ఆక్షేపణలు చెయ్యడం సముచితం కాదు.

78. ఈ హదీసులో ప్రస్తావించబడిన ఉపవాస వ్రతం రమజాన్ నెలకు సంబంధించింది కాదు, అది కేవలం ఇతర మాసాల్లో పాటించే అదనపు (నఫిల్) రోజా అని తెలుసుకోవాలి.

మరో విషయమేమంటే ఆధ్యాత్మిక సాధనలో (ఉపవాస వ్రతాలు, ప్రార్థనలు పాటించడంలో) మనిషి తన భౌతిక అవసరాలు, హక్కులు సామాజిక బాధ్యతలు, విధులు విస్మరించరాదు. ఇస్లాం ఇలాంటి 'ఏకపక్ష' నిర్ణయాన్ని నిరసిస్తుంది. సమస్తజీవన రంగాల్లో సమన్వయం, సామరస్యం చేకూర్చడమే ఇస్లాం విశిష్టత.

ఇంకా, నిరంతరం ఉపవాస వ్రతం పాటించడం వల్ల, రాత్రిళ్ళు జాగరణచేసి ప్రార్థన చేయడం మూలాన ఆరోగ్యంపై, ముఖ్యంగా కంటిపై చెడు ప్రభావం పడేందుకు ఆస్కారముంది. విశ్వాసి ప్రతిపనిలోనూ మధ్యే మార్గాన్ని అనుసరించాలని మహాప్రవక్త (సఅసం) తన సహచరునిపై ప్రతిబంధం విధించారు.

79. మక్కా నుండి మహాప్రవక్త మదీనాకు 'హిజ్రత్' (వలస పోవడం) చేశాక, మక్కానుండి ఇంటినీ ఉపాధినీ వదలుకుని వచ్చిన 'ముహాజిరీన్'(వలస వచ్చిన వారు)

٨٠ عَنْ مُجِيْبَةَ الْبَاهِلِيَّةِ عَنْ أَبِيْهَا أَوْعَمِّهَا أَنَّهُ اَتٰى رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، ثُمَّ انْطَلَقَ، فَأَتَاهُ بَعْدَ سَنَةٍ وَّقَدْ تَغَيَّرَتْ حَالَتُهُ وَهَيْئَتُهُ فَقَالَ: يَارَسُوْلَ اللّٰهِ! أَمَاتَعْرِفُنِيْ؟ قَالَ: مَنْ أَنْتَ؟ قَالَ: أَنَا الْبَاهِلِيُّ الَّذِيْ جِئْتُكَ عَامَ الْأَوَّلِ، قَالَ: فَمَا غَيَّرَكَ وَقَدْ كُنْتَ حَسَنَ الْهَيْئَةِ؟ قَالَ: مَا أَكَلْتُ طَعَامًا مُنْذُ فَارَقْتُكَ إِلَّا بِلَيْلٍ، فَقَالَ رَسُوْلُ اللّٰهِ عَذَّبْتَ نَفْسَكَ، ثُمَّ قَالَ: صُمْ شَهْرَ الصَّبْرِ وَيَوْمًا مِّنْ كُلِّ شَهْرٍ، قَالَ: زِدْنِيْ فَإِنَّ بِيْ قُوَّةً- قَالَ: صُمْ يَوْمَيْنِ، قَالَ: زِدْنِيْ، قَالَ: صُمْ ثَلٰثَةَ أَيَّامٍ، قَالَ: زِدْنِيْ، قَالَ: صُمْ مِنَ الْحُرُمِ وَاتْرُكْ، صُمْ مِنَ الْحُرُمِ وَاتْرُكْ وَقَالَ بِأَصَابِعِهِ الثَّلٰثِ فَضَمَّهَا ثُمَّ أَرْسَلَهَا- (ابوداؤد)

80. బాహిలా తెగకు చెందిన మహిళ ముజీబా (రజిఅన్) తన తండ్రి లేదా బాబాయిని గురించి ఈ వివరాలు తెలిపారు: "ఆయన ధర్మజ్ఞాన సముపార్జన కోసం మహాప్రవక్త సన్నిధికిపోయి, తిరిగి ఇంటికి వచ్చారు. ఒక ఏడాది తరువాత తిరిగి మహాప్రవక్త (సఅసం) సన్నిధిలో హాజరయ్యారు. అప్పుడు ఆయన పరిస్థితి పూర్తిగా మారిపోయింది. 'దైవప్రవక్తా నన్ను మీరు గుర్తుపట్టలేదా?' అని ఆయన అడగ్గా, మహాప్రవక్త (సఅసం) 'లేదే, మీరెవరో కాస్త వివరంగా చెప్పండి' అని అడిగారు. అప్పుడు, 'నేను బాహిలా తెగకు చెందినవాణ్ణి, నిరుడు కూడా హాజరయ్యాను' అని ఆయన చెప్పుకున్నాడు. దానికి 'అరే, నీవా? ఇలా

---

మరియు మదీనాలో ఆహ్వానించి ఆశ్రయమిచ్చిన 'అన్సార్' (సహాయకులు) లోని ఒక్కో వ్యక్తిని ఎన్నుకుని మహాప్రవక్త 'సోదరత్వం' ఏర్పరిచారు. హదీసులో అదే ప్రస్తావించబడింది. హజ్రత్ అబూ దర్దా (రజిఅన్) ధర్మం పాటింపులో అతిశయానికిపోయి నిరంతర ఉపవాసాలు పాటించడం, రాత్రిళ్ళు ప్రార్థనలో గడపడం మూలానా ఆయన సతీమణి అలంకరణ, సింగారాలను వదలి అతి సాధారణంగా కనిపించారు. అందువల్ల హజ్రత్ సల్మాన్ (రజిఅన్) అబూదర్దా (రజిఅన్) చేత రోజా

మారిపొయ్యావేమిటీ? లోగడ వచ్చినప్పుడు ఎంతో బాగున్నావే!' అని అడిగారు కారుణ్యమూర్తి (సఅసం). అప్పుడాయన ఇలా విన్నవించు కున్నాడు, 'మీ వద్ద సెలవు తీసుకున్నప్పటి నుండి ఇంతవరకు నిరంతరం ఉపవాస వ్రతం పాటిస్తున్నాను, రాత్రిళ్ళు మాత్రం భోంచేస్తున్నాను.' అప్పుడు ప్రవక్త మహనీయులు (సఅసం), 'నిన్ను నీవు యాతనకు గురిచేసుకున్నావు' అని చెప్పి, 'రమజాన్ నెల తప్ప ఇతర నెలల్లో ప్రతి నెలా ఒక దినం మాత్రం రోజా పాటించు' అని బోధించారు. దానికి ఆయన 'కాస్త అధికం చెయ్యండి, నాలో శక్తి ఉంది' అని కోరాడు. 'సరే, ప్రతి నెల రెండు దినాలు ఉపవాసం పాటించు' అని సెలవిచ్చారు ప్రవక్త శ్రేష్ఠులు (సఅసం). ఆయన తిరిగి ఇంకా అధిక రోజుల కొరకు అర్థించగా, 'ప్రతి నెలా మూడు రోజులు' అనుమతించా రాయన (సఅసం) ఇంకా అధికం కావాలని వేడుకున్నాడాయన, దానికి మహాప్రవక్త (సఅసం) అయితే సంవత్సరంలో పర్వ మాసాల్లో రోజా పాటించి వదిలేయి ఇలాగే ఏటేటా చెయ్యి' అని ఉపదేశిస్తూ ఆయన తన మూడు వ్రేళ్ళను కలుపుతూ వదిలేశారు. (అబూదావూద్)

## ఇ'తెకాఫ్

٨١ عَنِ ابْنِ عُمَرَ قَالَ: كَانَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَعْتَكِفُ الْعَشْرَ الْأَوَاخِرَ مِنْ رَمَضَانَ ۔ (بخاری، مسلم)

81. దైవప్రవక్త (సఅసం) రమజాన్ మాసం చివరి పది రోజులు ఇ'తెకాఫ్ చేసేవారని అబ్దుల్లా బిన్ ఉమర్ (రజిఅన్) తెలిపారు. (బుఖారి, ముస్లిమ్)

٨٢ عَنْ عَائِشَةَ أَنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ كَانَ إِذَا دَخَلَ الْعَشْرُ الْأَوَاخِرُ أَحْيَا اللَّيْلَ وَأَيْقَظَ أَهْلَهُ وَشَدَّ الْمِئْزَرَ ۔

82. హజ్రత్ ఆయిషా (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: దైవ సందేశహరులు (సఅసం) రమజాన్ చివరి పది రోజులు రాగానే రాత్రిళ్ళు ఇతోధికంగా జాగరణ చేసి దైవారాధనలో గడిపేవారు. తన సతీమణుల్ని కూడా మేల్కొలిపేవారు. అధికోత్సాహంతో దైవారాధనలో నిమగ్నులయ్యేవారు.

# హజ్

٨٣ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ، خَطَبَنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ،
فَقَالَ: يَاأَيُّهَا النَّاسُ! قَدْ فَرَضَ اللّٰهُ عَلَيْكُمُ الْحَجَّ فَحُجُّوْا۔ (منتقى)

83. హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఈ విధంగా తెలిపారు : దైవ ప్రవక్త (సఅసం) ఒకసారి ఉపన్యసిస్తూ 'ప్రజలారా, హజ్‌ను మీకు విధిగా నిర్ణయించాడు అల్లాహ్. హజ్ తప్పక చెయ్యండి' అన్నారు.
(మున్తకా)

٨٤ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ أَتَى هٰذَا الْبَيْتَ
فَلَمْ يَرْفُثْ وَلَمْ يَفْسُقْ، رَجَعَ كَمَا وَلَدَتْهُ أُمُّهُ۔

84. దైవ ప్రవక్త (సఅసం) ప్రబోధించారు : "ఎవరయితే ఈ గృహాన్ని (కాబాను) సందర్శించడానికి వస్తారో, వారు ఎలాంటి వాంఛలకు లోనవకుండా, దైవాజ్ఞల్ని ఉల్లంఘించకుండా (హజ్ పూర్తి చేసుకుని) తిరిగి వెళ్ళితే, వారు తమ తల్లి గర్భాన్నుంచి పుట్టినప్పటి స్థితిలో వెళ్ళుతారు."

---

విరమింపజేశారు. (అది అదనపు రోజా అని గమనించాలి). అలాగే రాత్రంతా నమాజ్‌లో గడపటాన్ని మాన్పించి తన ఇంటివారితో పడుకోవడానికి పంపించారు. (ఇదీ అదనపు నమాజ్ అన్న విషయమూ తెలుసుకోవాలి).

80. తన్ను తాను యాతనకు గురి చేసుకోవడం అంటే దైవం నిర్దేశించని ఆరాధనల్లో నిమగ్నమయి దేహాన్ని కృశింపజేయడం అన్నమాట.
వ్రేళ్ళను కలిపి విడదీయటం అంటే, ఒక్కో ఏడాది పాటించి మరోసారి మానెయ్యడం అని భావం. పర్వమాసాలంటే రజబ్, జికఅదా, జిల్ హజ్జ మరియు ముహర్రం నెలలని భావం.

81. ఇ'తెకాఫ్ అంటే కేవలం దైవారాధన, దైవస్మరణ ధ్యేయంతో మస్జిద్‌లో కొంత కాలం గడపటం. రమజాన్ చివరి పదిరోజులు ఇ'తెకాఫ్ చెయ్యడం మహాప్రవక్త సంప్రదాయం.
దైవ ప్రవక్త జీవితం అంతా నిత్యం దైవారాధన, దైవ విధేయతలతో నిండి ఉన్నప్పటికీ రమజాన్ నెలలో ఆయనలో దైవ విధేయతా భావం, దానిపట్ల ఉత్సాహం ద్విగుణీకృతం అయ్యేది. అందులో చివరి పదిరోజులయితే పూర్తిగా దైవారాధన కోసం

۸۵ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ: سُئِلَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ:
أَيُّ الْأَعْمَالِ أَفْضَلُ؟ قَالَ: إِيْمَانٌ بِاللّٰهِ وَبِرَسُوْلِهِ قِيْلَ: ثُمَّ مَاذَا؟
قَالَ: الْجِهَادُ فِيْ سَبِيْلِ اللّٰهِ - قِيْلَ: ثُمَّ مَاذَا؟ قَالَ: ثُمَّ حَجٌّ مَبْرُوْرٌ-
(منتقى)

85. హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఉల్లేఖనం: మహాప్రవక్తను ఎవరో 'అన్నిటికంటే ఉత్కృష్టమయిన కార్యం ఏది?' అని అడిగారు. 'దైవాన్ని, దైవ ప్రవక్తను విశ్వసించడం' అని బదులిచ్చారు ప్రవక్త మహనీయులు (సఅసం). అడిగిన వ్యక్తి, 'దాని తరువాత' అని ప్రశ్నించగా, 'దైవ సమ్మత మయిన ధర్మం కొరకు పాటుపడడం' అని సమాధాన మిచ్చారు. 'దాని తరువాత?' అని తిరిగి అడగ్గా 'మనిషి దైవాజ్ఞల్ని ఉల్లంఘించకుండా పూర్తి చేసే హజ్' అని సమాధానం ఇచ్చారు దైవ ప్రవక్త (సఅసం).
(మున్తకా)

۸۶ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ أَرَادَ الْحَجَّ فَلْيَتَعَجَّلْ
فَإِنَّهُ قَدْ يَمْرَضُ الْمَرِيْضُ وَتَضِلُّ الرَّاحِلَةُ وَتَعْرِضُ الْحَاجَةُ-
(ابن ماجه، ابن عباسؓ)

86. దైవ సందేశహరుడు (సఅసం) ఇలా ఉపదేశించారు : 'ఎవరయితే హజ్ యాత్ర సంకల్పం చేసుకుంటారో వారు జాప్యం చెయ్యకుండా తొందరపడాలి. ఎందుకంటే, వారు వ్యాధిగ్రస్తులు కావచ్చు లేదా ఒంటె తప్పిపోవడం కూడా జరగవచ్చు. లేక హజ్ ప్రయాణం సాధ్యపడకుండా ఏదయినా అవసరం వచ్చిపడవచ్చు. (ఇబ్ను మాజా - ఇబ్ను అబ్బాస్)

---

కేటాయించేవారు. ఇతోధిక అదనపు (నఫిల్) నమాజులలో దివ్య ఖుర్ఆన్ పారాయణంలో, దైవసంస్మరణలో కాలాన్ని గడిపేవారు. ఎందుకంటే రమజాన్ మాసం విశ్వాసికి శిక్షణా వ్యవధి లాంటిది. అది రాబోయే 11 నెలల్లో షైతాన్, అతని పైశాచికమయిన ఎత్తుగడలతో తలపడటానికి శక్తిని సమీకరించుకునేకాలం.
82. రమజాన్ చివరి రాత్రుళ్ళు మహాప్రవక్త (సఅసం) స్వయంగా తాను మాత్రమే

٨٧ عَنِ الْحَسَنِ قَالَ: قَالَ عُمَرُ بْنُ الْخَطَّابِ، لَقَدْ هَمَمْتُ أَنْ أَبْعَثَ رِجَالاً إِلَى هٰذِهِ الْأَمْصَارِ فَيَنْظُرُوا كُلَّ مَنْ كَانَ لَهُ جِدَةٌ وَلَمْ يَحُجَّ فَيَضْرِبُوا عَلَيْهِمُ الْجِزْيَةَ، مَا هُمْ بِمُسْلِمِيْنَ، مَا هُمْ بِمُسْلِمِيْنَ

(المنتقى)

**87.** హసన్ (రహ్మాలై) ఇలా ఉల్లేఖించారు : "ఈ (ఇస్లామీయ రాజ్యంలో ఉన్న) నగరాల్లో గూఢచారుల్ని పంపి, హజ్ చేయగల శక్తి ఉన్నప్పటికీ హజ్ చేయని వారి వివరాలు సేకరించాలనీ, అలాంటి వారిపైన 'జిజ్‌యా' విధించాలనీ నా సంకల్పం. అలాంటివారు ముస్లింలు కారు, ముమ్మాటికీ కారు. (ముస్లిములయితే అప్పుడే హజ్ చేసి ఉండేవారు. ముస్లిమ్ అంటేనే స్వయాన్ని అల్లాహ్‌కు సమర్పించు కునేవాడని అర్థం. వాస్తవంగా మనిషి తన్నుతాను అల్లాహ్‌కు సమర్పించు కుంటే ఏ కారణమూ లేకుండా హజ్ లాంటి మహత్తర ఆరాధనను ఉపేక్షిస్తాడా?)" అని హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజిఅన్) చెప్పేవారు. (అల్ మున్తకా)

---

మేల్కొని ప్రార్థనలు చెయ్యడం కాక తన ఇంటివారిని సయితం లేపి రాత్రిపూట చేసే 'తహజ్జుద్' ప్రార్థన కొరకు ఉపదేశించేవారని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది.

83. 'హజ్' అంటే మక్కా నగరంలో ఉన్న కాబా గృహాన్ని దర్శించి అక్కడ ప్రత్యేక ప్రార్థనాచారాలను పాటించేందుకు చేసే యాత్ర అని అర్థం. ఇది చంద్రమాన మాసం జిల్ హజ్జా 10 నుండి 13వ తారీఖు వరకు జరుగుతుంది.

84. అంటే హజ్‌వల్ల మనిషి పాపప్రక్షాళన జరిగి అతడు పుట్టుక నాటివలే పునీతుడవుతాడనీ భావం - అయితే అతడు ఐహిక వాంఛలకు, దైవాజ్ఞోల్లంఘనకు పాల్పడకుండా, ప్రదర్శనా బుద్ధికి గురికాకుండా, ఏకాగ్ర చిత్తంతో నిర్మల మనస్సుతో కేవలం దైవ ప్రసన్నత బడయటానికే ఈ హజ్ చేసి ఉండాలన్న షరతు కూడా హదీసులోనే ఉంది.

85. మానవునికి తన జీవితంలో తన నిజ ప్రభువును, స్వామిని గుర్తించడం, ఆయన పంపిన సందేశాలను తెలుసుకుని వాటిని ఆచరించడం కంటే గొప్ప వరం ఏదీ లేదు. అందుకే దైవప్రవక్త దాన్ని అత్యుత్తమ కార్యంగా అభివర్ణించారు. ఈ 'అత్యుత్తమ కార్యం' చేసిన వ్యక్తిపై తారసిల్లే ప్రప్రథమ బాధ్యత ఆ విశ్వాసానికనుగుణంగా తన ఆచరణా విధానాన్ని మలచుకోవడం ఆ 'అత్యుత్తమ కార్యా'నికి తోటి మానవ సోదరుల్ని ప్రోత్సహించడం, అది సర్వోన్నతం కావడానికి కృషి చెయ్యడం. అందుకే

٨٨ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ خَرَجَ حَاجًّا أَوْ مُعْتَمِرًا أَوْ غَازِيًا ثُمَّ مَاتَ فِيْ طَرِيْقِهٖ كَتَبَ اللّٰهُ لَهُ أَجْرَ الْغَازِيْ وَالْحَاجِّ وَالْمُعْتَمِرِ۔

(مشکوٰۃ - ابوھریرۃؓ)

88. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు: ఎవరయితే హజ్ లేక ఉమర లేక జిహాద్ (దైవమార్గంలో కృషి కడకు పోరాటం) కొరకు బయలుదేరుతాడో అతనికి మార్గ మధ్యంలోనే మృత్యువు సంభవిస్తే, అల్లాహ్ సమక్షంలో ఒక హాజీకి, ఒక యోధునికి లేక ఉమర చేసే వ్యక్తికి లభించవలసిన నిర్ణీత పుణ్యం అతనికీ లభిస్తుంది.

(మిష్కాత్ - అబూహురైరా)

---

'దైవ సమ్మతమయిన ధర్మం' ఉన్నతికి పాటుపడటాన్ని రెండవదశలో పెట్టడం జరిగింది. ఇక మూడవ దశలో అంటే దైవ ధర్మాన్ని విశ్వసించడానికి, దాని ఔన్నత్యానికై పాటు పడటానికి తదుపరి, పరిపూర్ణ దైవారాధనకు చిహ్నమైన హజ్‌ను పేర్కొనడం జరిగింది. హజ్ ప్రాముఖ్యత దీని ద్వారా అవగతమవుతూనే ఉంది.

86. ఒంటె తప్పిపోవడమంటే ప్రయాణపు సౌకర్యాలు అంతమవడం, మార్గం ప్రమాద కరమవడం, ప్రయాణపు ఖర్చుల నిమిత్తం కట్టిపెట్టిన ధనం ఖర్చయిపోవడం అన్నీ వస్తాయి. ఏ అవాంతరమయినా వాటిల్లి దైవగృహం యాత్ర చేసే అదృష్టాన్ని కోల్పోయే ప్రమాదం ఆసన్నమవక ముందే హజ్ ప్రయాణానికి సన్నద్ధులవ్వాలని ఈ హదీసు బోధిస్తోంది.

87. ఇస్లామీయ రాజ్యంలో ముస్లిమేతర పౌరులపై వారి పరిరక్షణకుగాను విధించబడే రుసుమును 'జిజ్‌యా' అనంటారు. ముస్లిమ్ పౌరులకు విధించబడిన జకాత్ చెల్లించే బాధ్యత ముస్లిమేతర పౌరులపైన ఉండదని ఇక్కడ గమనించాలి.

88. హజ్ కాలంలో కాక సాధారణ సమయాల్లో చేసే కాబా యాత్రను 'ఉమర' అనంటారు.

# వ్యవహారసరళి

## హలాల్ సంపాదన

٨٩ قَالَ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : مَا أَكَلَ اَحَدٌ طَعَامًا قَطُّ
خَيْرًا مِنْ اَنْ يَأْكُلَ مِنْ عَمَلِ يَدَيْهِ ، وَإِنَّ نَبِيَّ اللهِ دَاؤُدَ عَلَيْهِ السَّلَامُ
كَانَ يَأْكُلُ مِنْ عَمَلِ يَدَيْهِ - (بخاری - مقدام بن معدی کربؓ)

89. "తన చేతి సంపాదనతో చేసిన భోజనం కంటే మంచి భోజనం మనిషి ఎప్పుడూ చేయలేదు. దైవప్రవక్త దావూద్ (అస్సలాం) స్వహస్తాలతో పనిచేసి, సంపాదించి భుజించేవారు" అని బోధించారు మహనీయ ముహమ్మద్ (సఅసం). (బుఖారి, మక్దామ్ బిన్ మఅదీకర్బ్)

٩٠ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : إِنَّ اللهَ طَيِّبٌ لَا
يَقْبَلُ إِلَّا طَيِّبًا ، وَإِنَّ اللهَ أَمَرَ الْمُؤْمِنِيْنَ بِمَا أَمَرَ بِهِ الْمُرْسَلِيْنَ فَقَالَ:
يَاَيُّهَا الرَّسُوْلُ كُلُوْا مِنَ الطَّيِّبٰتِ وَاعْمَلُوْا صَالِحًا ، وَقَالَ تَعَالٰى :
"يٰاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوْا كُلُوْا مِنْ طَيِّبٰتِ مَا رَزَقْنٰكُمْ" ثُمَّ ذَكَرَ الرَّجُلَ
يُطِيْلُ السَّفَرَ اَشْعَثَ اَغْبَرَ يَمُدُّ يَدَيْهِ إِلَى السَّمَاءِ : يَا رَبِّ ، وَمَطْعَمُهُ
حَرَامٌ وَمَشْرَبُهُ حَرَامٌ وَمَلْبَسُهُ حَرَامٌ وَغُذِيَ بِالْحَرَامِ فَاَنّٰى يُسْتَجَابُ
لِذٰلِكَ - (مسلم - ابوہریرہؓ)

90. దైవప్రవక్త (సఅసం) ప్రబోధనః అల్లాహ్ పరమ పరిశుద్ధుడు, ఆయన పరిశుద్ధ వస్తువులనే తప్ప స్వీకరించడు. అల్లాహ్ తన సందేశహరులకు దేన్ని గురించి అయితే ఆదేశమిచ్చాడో ఆ ఆదేశమే విశ్వాసులకు ఇచ్చాడు. కాగా "ఓ ప్రవక్తలారా! పరిశుద్ధమయిన ఉపాధిని తినండి. సత్కార్మలను

ఆచరించండి" అని ఆదేశించాడు. అలాగే విశ్వాసుల్ని సంబోధించి "ఓ విశ్వాసులారా! మేము మీకు ఏ పరిశుద్ధమైన వస్తువులనయితే ఇచ్చామో ఆ వస్తువులనే భుజించండి." అని సెల విచ్చాడు. ఆ పైన ఆయన (సఅసం) ఒక వ్యక్తిని ప్రస్తావించి ఇలాచెప్పారు. "అతను బహుదూరాన్నుంచి ప్రయాణంచేసి పుణ్యస్థలానికి వస్తాడు, ధూళిలో పూర్తిగా మునిగి వుంటాడు, వంటినిండా దుమ్ముపట్టి ఉంటుంది. అతను తన రెండు చేతులూచాచి, "ఓ నా ప్రభూ!" అని (ప్రార్థనలో) వేడుకుంటాడు. వాస్తవానికి అతను తినేది అధర్మమైంది. అతను త్రాగేదీ అధర్మమైంది, అతని దుస్తులు సయితం అధర్మమైనవి. అధర్మ ఉపాధి ద్వారానే అతని జీవిక సాగుతోంది. అలాంటి వ్యక్తి ప్రార్థనలెలా ఆలకించబడతాయి?'

(ముస్లిమ్ - అబూహురైరా)

۹۱ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: يَأْتِيْ عَلَى النَّاسِ
زَمَانٌ لَا يُبَالِي الْمَرْءُ مَا أَخَذَ مِنْهُ مِنَ الْحَلَالِ، أَمْ مِنَ الْحَرَامِ۔

(بخاری۔ابوھریرہؓ)

91 "ప్రజలు ఒక కాలాన్ని ఎదుర్కోబోతున్నారు. ఆ కాలంలో మనిషి తాను ఆర్జించే సంపద (హలాల్) ధర్మసమ్మతమైనదా లేక (హరామ్) అధర్మమయినదా? అనే విషయాన్ని పట్టించుకోడు." అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. (బుఖారీ - అబూహురైరా)

---

89. భిక్షాటన, అన్యుల ముందు చేయిచాచి అర్థించే అలవాటుకు దూరంగా ఉంచడమే ఈ హదీసు ఉద్దేశ్యం. మనిషి తన ఉపాధి తానే సంపాదించుకోవాలనీ, ఇతరులపై ఆధారపడి జీవించడం అతనికి తగదనీ బోధించడమయింది.

90. ఈ హదీసులో చెప్పిన తొలిమాట, దైవం స్వీకరించే సదకా (దానధర్మాలు) కేవలం పరిశుద్ధమైనవీ ధర్మసమ్మతమైనవే అయి ఉండాలి. అధర్మ సంపాదన ఆయన మార్గాన ఖర్చుపెడితే అది ఆయన స్వీకరించడు అన్నది రెండవమాట, ఎవరి సంపద అధర్మమైందో మరెవరు అధర్మ పద్ధతుల ద్వారా ధనమార్జిస్తాడో అతని ప్రార్థనలకు దైవామోదం లభించదు.

۹۲ عَنْ عَبْدِ اللّٰهِ بْنِ مَسْعُوْدٍ عَنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
قَالَ: لَا يَكْسِبُ عَبْدٌ مَالَ حَرَامٍ فَيَتَصَدَّقُ مِنْهُ فَيُقْبَلُ مِنْهُ، وَلَا
يُنْفِقُ مِنْهُ فَيُبَارَكُ لَهُ فِيْهِ وَلَا يَتْرُكُهُ خَلْفَ ظَهْرِهِ إِلَّا كَانَ زَادَهُ
إِلَى النَّارِ، إِنَّ اللّٰهَ لَا يَمْحُوا السَّيِّئَ بِالسَّيِّئِ وَلٰكِنْ يَمْحُو السَّيِّئَ
بِالْحَسَنِ، إِنَّ الْخَبِيْثَ لَا يَمْحُوا الْخَبِيْثَ۔" (مشكوٰة)

92. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా బోధించినట్లు అబ్దుల్లా బిన్ మస్‌ఊద్ (రజిఅన్) ఉల్లేఖించారు: "దేవుని దాసుడు ఒకడు అధర్మ సంపాదన ఆర్జించి అందులో నుంచి దైవ మార్గాన సదకా (దానం) చేస్తే ఆ దానాన్ని దైవ సమక్షంలో స్వీకరించడం జరగదు. అతడు ఆ సంపదను (తన కోసం, తన ఇంటి వారి కోసం) ఖర్చు చేస్తే అందులో శుభాన్నీ, తృప్తినీ పొందలేడు. దాన్ని వదలి అతడు మరణిస్తే అది అతని నరక మార్గాన్ని సుగమం చేస్తుందే తప్ప మరోలా ఉపయోగపడదు. అల్లాహ్ చెడును మరో చెడు ద్వారా చెరిపి వేయడు. దుష్కార్యాన్ని సత్కార్యంతోనే చెరిపివేస్తాడు. దుష్టత్వం మరో దౌష్ట్యాన్ని రూపు మాపలేదు." (మిష్కాత్)

۹۳ | عَنْ سَعِيْدِ بْنِ أَبِي الْحَسَنِ قَالَ: كُنْتُ عِنْدَ ابْنِ عَبَّاسٍ إِذْ جَاءَهُ
رَجُلٌ فَقَالَ: يَا ابْنَ عَبَّاسٍ، إِنِّي رَجُلٌ إِنَّمَا مَعِيْشَتِي مِنْ صَنْعَةِ يَدِي
وَإِنِّي أَصْنَعُ هٰذِهِ التَّصَاوِيْرَ۔ فَقَالَ ابْنُ عَبَّاسٍ: لَا أُحَدِّثُكَ إِلَّا مَا سَمِعْتُ
مِنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، سَمِعْتُهُ يَقُوْلُ: مَنْ صَوَّرَ
صُوْرَةً فَإِنَّ اللّٰهَ مُعَذِّبُهُ حَتّٰى يَنْفُخَ فِيْهِ الرُّوْحَ وَلَيْسَ بِنَافِخٍ فِيْهَا
أَبَدًا۔ فَرَبَا الرَّجُلُ رَبْوَةً شَدِيْدَةً وَاصْفَرَّ وَجْهُهُ فَقَالَ: وَيْحَكَ، إِنْ
أَبَيْتَ إِلَّا أَنْ تَصْنَعَ فَعَلَيْكَ بِهٰذَا الشَّجَرِ وَكُلِّ شَيْءٍ لَيْسَ فِيْهِ رُوْحٌ۔"

(بخاری)

93. సయీద్ బిన్ అబుల్ హసన్ ఉల్లేఖించారు : నేను అబ్దుల్లాహ్‌బిన్ అబ్బాస్ వద్ద కూర్చుని ఉండగా ఒక వ్యక్తి వచ్చి 'ఇబ్ను అబ్బాస్! చేతి పనులే నా బ్రతుకు తెరువు సాధనాలు. నేను ప్రాణుల చిత్రాలు గీసి అమ్ముకుంటాను. ఈ వృత్తి అధర్మమయింది కాదుకదా? అని అడిగాడు. దానికి సమాధానంగా ఇబ్ను అబ్బాస్ అన్నారు : నేను మహాప్రవక్త (సఅసం) ద్వారా విన్న హదీసును తప్ప మరే అభిప్రాయాన్నీ నీకు చెప్పను. ఆయన ఇలా బోధించగా నేను విన్నాను : "ఏ వ్యక్తి ప్రాణుల బొమ్మలు చిత్రిస్తాడో అతను ఆ బొమ్మలకు ప్రాణం పోసేవరకు దేవుడు అతన్ని శిక్షిస్తాడు - అతడు వాటికి ఎన్నటికీ ప్రాణం పొయ్యలేడు." ఈ హదీసు వినగానే ఆ వ్యక్తి ముఖం వివర్ణమయింది. అతను దీర్ఘంగా నిట్టూర్చాడు. అప్పుడు ఇబ్ను అబ్బాస్, 'నీకు ఈ వృత్తే చెయ్యాలని ఉంటే చెట్లు, చేమలు తదితర ప్రాణంలేని వస్తువుల చిత్రాలు వేసుకో!" అని సలహాయిచ్చారు. (బుఖారి)

---

92. ఈ హదీసు ద్వారా తెలిసిందేమంటే ఏదయినా సత్కార్యం, 'సత్కార్యం' గా పరిగణించబడాలంటే, దానికి దైవసన్నిధిలో విలువ ప్రాప్తం కావాలంటే, దాన్ని ధర్మ సమ్మతమయిన పద్ధతిలోనే చెయ్యాలి. కేవలం లక్ష్యమే పవిత్రమయిందయితే చాలదు, సాధనా మార్గం కూడా పరిశుద్ధమయినదయి ఉండాలి. లక్ష్యశుద్ధితో పాటు కార్యశుద్ధికూడా అవసరమని ఈ హదీసు బోధిస్తోంది.

93. మనిషి అంతర్యంలో ధర్మాచరణ, పరలోకసాఫల్యం ,దైవప్రసన్నతలు చోటుచేసుకుని అధర్మంపట్ల ఏహ్యం, పరలోకపరాజయంపట్ల ఆందోళన, దైవానుగ్రహంపట్ల భయభీతులు ఉంటే అతడు నిత్యవ్యవహారాలలో, సంపాదనా వ్యయాలలో కూడా దైవాదేశమేదో, పరలోకంలో శిక్ష నుండి తప్పించే పద్ధతి ఏదో, దైవ సంతోషానికి గొనిపోయే మార్గమేదో అన్వేషిస్తూ ఉంటాడు. ఈ హదీసులో అలాంటి ఒక వ్యక్తిని గురించే ప్రస్తావన ఉంది. అలాగే మనుషులలోని కళా నైపుణీని ఇస్లాం నశింపజేయదని, దానికి సవ్యమయిన సక్రమమయిన రూపం కల్పిస్తుందని కూడా ఈ హదీసు చాటుతుంది. చిత్రలేఖనాన్ని సజీవ పదార్థాలనుండి నిర్జీవ పదార్థాల వైపునకు మళ్ళించిన ఇస్లాం ప్రపంచంలో అనుపమకళ, కాలిగ్రాఫీ (Caligraphy) అక్షరలేఖనకళను సృష్టించింది.

# వ్యాపారం

۹۴ عَنْ رَافِعِ بْنِ خَدِيْجٍ قَالَ، قِيْلَ: يَا رَسُوْلَ اللهِ! "اَيُّ الْكَسْبِ اَطْيَبُ؟ قَالَ: عَمَلُ الرَّجُلِ بِيَدِهٖ وَكُلُّ بَيْعٍ مَّبْرُوْرٍ۔" (مشکوٰۃ)

94. రాఫె బిన్ ఖదీజ్ ఉల్లేఖించారు : దైవప్రవక్త (సఅసం)ను ఎవరో అడిగారు: 'దైవ ప్రవక్తా! సంపాదనలలో ఉత్తమమయినది ఏది?' "చేతిపనుల ద్వారా సంపాదించడం, అబద్ధం, వంచనల్లేకుండా చేసే వ్యాపారం" అని సమాధానమిచ్చారాయన. (మిష్కాత్)

۹۵ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "رَحِمَ اللهُ رَجُلًا سَمْحًا اِذَا بَاعَ وَاِذَا اشْتَرٰى وَاِذَا اقْتَضٰى۔" (بخاری ـ جابرؓ)

95. ఒకసారి మహాప్రవక్త (సఅసం)ఇలా దీవించారు: "కొను గోలులో, అమ్మకంలో ఇచ్చిన అప్పును తిరిగి అడగటంలో నెమ్మదిని, మంచి నడ వడికను ప్రదర్శించే వ్యక్తిని దైవం కరుణించుగాక". (బుఖారి, జాబిర్)

۹۶ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: اَلتَّاجِرُ الصَّدُوْقُ الْاَمِيْنُ مَعَ النَّبِيِّيْنَ وَالصِّدِّيْقِيْنَ وَالشُّهَدَاءِ۔ (ترمذی ـ ابوسعید خدریؓ)

96. "సత్య సంధతతో వ్యవహరించే విశ్వసనీయుడయిన వ్యాపారి ప్రళయదినాన ప్రవక్తల, సిద్దీకుల, షహీదుల సహచర్యంలో ఉంటాడు." అని మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. (తిర్మిజీ-అబూసయీద్ ఖుద్రి)

---

94. ఒకరికి బానిసలుగా మారకుండా స్వతంత్ర జీవిగా మనగలుగుతూ కష్టార్జితంతో జీవితాన్ని సాగించటాన్ని ఇస్లాం ఎంతగా అభిలషిస్తుందో తెలుస్తోంది. ముస్లింలు వృత్తిపనుల్ని, వ్యాపారాన్ని తమ జీవనోపాధిగా పెట్టుకున్నంత కాలం ప్రపంచంలోనూ ఎంతో ఉన్నతంగా బ్రతికారు. కాని బానిసలుగా "ఉద్యోగాల" వెంటబడి పతనమయ్యారు.

95. వ్యాపారం విషయంలో నీతీ నిజాయితీతో పాటు వినయ విన్రమతలకు కూడా ప్రధాన స్థానముందని 1400 ఏళ్ళ ముందు మహాప్రవక్త బోధించారు. నేడు ఉత్తమ Salesman కు అవసరమయిన ప్రథమ లక్షణంగా దాన్ని గుర్తించిన విషయం అందరికీ విదితమే.

٩٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: اَلتُّجَارُ يُحْشَرُوْنَ
يَوْمَ الْقِيٰمَةِ فُجَّارًا إِلَّا مَنِ اتَّقٰى وَبَرَّ وَصَدَقَ۔ (ترمذی — رفاعہ)

97. ప్రవక్త మహనీయులు(సఅసం) ఇలా ప్రవచించారు: 'ప్రళయ దినాన వ్యాపారులు దుష్టులు, దురాచారుల స్థితిలో నిలబెట్టబడతారు - తమ వ్యాపారంలో దైవభీతితో మెలిగినవారు, రుజువర్తనులు, సత్యసంధులుతప్ప.'
(తిర్మిజి - రిఫాఅ)

٩٨ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِيَّاكُمْ وَكَثْرَةَ
الْحَلْفِ فِى الْبَيْعِ فَإِنَّهُ يُنْفِقُ ثُمَّ يَمْحَقُ۔ (مسلم — ابوقتادہؓ)

98. వ్యాపారుల్ని హెచ్చరిస్తూ దైవసందేశహరులు (సఅసం) ఇలా బోధించారు : "సరుకును అమ్మటానికి మాటి మాటికీ ఒట్టు వేసుకోవటం మానండి. ఇది వృద్ధిపరిచేదిగా కనిపించినా చివరికి నష్టపరుస్తుంది, శుభాన్ని దూరంచేస్తుంది." (ముస్లిం - అబూకతాదా)

---

96. వ్యాపారం సాధారణంగా ఒక ప్రాపంచిక, లౌకిక విషయంగా కనబడుతుంది. కాని అందులో నీతి, నిజాయితీ, సత్యసంధత, విశ్వసనీయతలు చోటుచేసుకుంటే అదే 'ఆరాధన'గా మారుతుంది. ఇలాంటి వ్యాపారికి, దేవుని పరిశుద్ధదాసులు అంటే ప్రవక్తలు, సిద్దీకులు, దైవమార్గంలో ప్రాణార్పణచేసుకున్న అమరగతులు - వారి సహచర్యం లభిస్తుంది.

'సిద్దీకులు' అంటే జీవితాంతం సత్యసంధతలో గడిపిన విశ్వాసి అని, దైవంతో, దైవప్రవక్తలతో చేసిన వాగ్దానాన్ని జీవితాంతం నిలబెట్టుకున్న వ్యక్తి అని, తన జీవితంలో మాటలకు, చేతలకు వైరుధ్యంలేని వ్యక్తి అని అర్థం.

97. దైవభీతితో మెలగటం అంటే వ్యాపారం చెయ్యడంలో దైవాజ్ఞల్ని ఉల్లంఘించకుండా ధర్మాధర్మాలను పాటించడం అని, రుజువర్తన అంటే ప్రజల హక్కుల్ని సక్రమంగా అందజేయడమని, కొలతల్లో తూకంలో న్యాయంగా వ్యవహరించడమని, సత్యసంధత అంటే సరకులోని మంచి చెడులను హెచ్చుతగ్గులు లేకుండా చెప్పడమని భావం.

98. సాధారణంగా వ్యాపారులు తమ సరుకును అమ్ముకోవడానికి ధరపట్ల, వస్తువు నాణ్యతపట్ల నమ్మకం కలిగించడానికి ఒట్టు వేసుకుంటారు. దానివల్ల తాత్కాలికంగా

٩٩ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ : ثَلٰثَۃٌ لَا یُکَلِّمُھُمُ اللّٰہُ یَوْمَ الْقِیٰمَۃِ وَلَا یَنْظُرُ اِلَیْھِمْ وَلَا یُزَکِّیْھِمْ وَلَھُمْ عَذَابٌ اَلِیْمٌ۔ قَالَ اَبُوْذَرٍّ : خَابُوْا وَخَسِرُوْا مَنْ ھُمْ یَا رَسُوْلَ اللّٰہِ ؟ قَالَ : "اَلْمُسْبِلُ وَالْمَنَّانُ وَالْمُنَفِّقُ سِلْعَتَہٗ بِالْحَلْفِ الْکَاذِبِ۔" (مُسلم — ابوذر غفاریؓ)

99. "ప్రళయ దినాన మూడు విధాల మనుషులతో అల్లాహ్ సంభాషించడు, వాళ్ళవైపు చూడనైనా చూడడు, వాళ్ళను పరిశుద్ధ పరచి స్వర్గంలో ప్రవేశపెట్టడు, వాళ్ళను బాధాకరమయిన నరకయాతనకు గురిచేస్తాడు." అని మహాప్రవక్త ఓ సారి సెలవీయగా హజ్రత్ అబూజర్ గిఫారి (రజి అన్) "దైవ ప్రవక్తా, ఆ ఆ దౌర్భాగ్యులు ఎవరూ?" అని అడిగారు. దానికి ఆయన ఇలా సమాధానం పలికారు : "ఒకడు, పొగరుమోతుతనంతో తన లుంగీని తన మడమల క్రిందికి జారవిడిచేవాడు; రెండవవాడు, మేలుచేసి ఎత్తిపొడిచే వాడు; మూడవవాడు, అసత్య ప్రమాణంచేసి తన సరుకును అమ్ముకునేవాడు." (ముస్లిమ్- అబూజర్ గిఫారి)

١٠٠ عَنْ قَیْسِ اَبِیْ غَرْزَۃَ قَالَ : کُنَّا نُسَمّٰی فِیْ عَھْدِ رَسُوْلِ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ السَّمَاسِرَۃَ فَمَرَّبِنَا رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ فَسَمَّانَا بِاسْمٍ ھُوَ اَحْسَنُ مِنْہُ فَقَالَ : "یَا مَعْشَرَ التُّجَّارِ ! اِنَّ الْبَیْعَ یَحْضُرُہُ اللَّغْوُ وَالْحَلْفُ فَشُوْبُوْہُ بِالصَّدَقَۃِ۔" (ابوداؤد)

100. హజ్రత్ కైస్ అబూగర్జ (రజిఅన్) ఉల్లేఖించారు : మహాప్రవక్త (సఅసం) కాలంలో మమ్మల్ని (వ్యాపారుల్ని) 'సమాసిర' అని పిలిచేవారు. ఒకసారి మహాప్రవక్త (సఅసం) మా అంగళ్ళవైపుగా పోతూ మాకు అంత కంటే మంచిపేరును ప్రసాదించారు. ఆయన మమ్మల్ని 'తుజ్జార్' (వాణిజ్య వర్గం వారలారా!) అని సంబోధించి ఇలా అన్నారు : "మీరు సరుకును విక్రయించడంలో అసత్యం పలికే, అబద్ధపు ఒట్టు వేసుకునే ఆస్కారం ఉంటుంది. కాగా వ్యాపారంలో మీరు దానం మిశ్రమం చేసుకోండి (తద్వారా వ్యాపారాన్ని పరిశుద్ధపరచుకోండి.)" (అబూదావూద్)

١٠١ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: لِأَصْحَابِ الْكَيْلِ وَالْمِيْزَانِ، "إِنَّكُمْ قَدْ وُلِّيْتُمْ أَمْرَيْنِ هَلَكَتْ فِيْهِمَا الْأُمَمُ السَّابِقَةُ قَبْلَكُمْ۔" (ترمذی — ابن عباسؓ)

101. మహాప్రవక్త (సఅసం)ఒకసారి కొలతలు, తూనికలవారిని (వ్యాపారుల్ని) ఉద్దేశించి ఇలా ఉపదేశించారు : "మీపైన రెండు విధాలయిన బాధ్యతలు మోపబడ్డాయి. కేవలం ఈ బాధ్యతల మూలంగానే మీకు పూర్వం గతించిన జాతులు సర్వనాశనమయ్యాయి."

(తిర్మిజి-ఇబ్నె అబ్బాస్)

---

వ్యాపారికి లాభం కలిగినా, ఆ తరువాత అతని మాట బూటకమే అని తేలిపోతే, అతడు శాశ్వతంగా ఒక కొనుగోలుదారుని కోల్పోతాడు. వ్యాపారం దెబ్బతింటుంది. అందుకే ఒట్టు వేసుకుని అమ్మడం శుభకరం కాదని మహాప్రవక్త బోధించారు.

99. అల్లాహ్ మాట్లాడకపోవడం, చూడకపోవడం అంటే ఆగ్రహం కలిగి ఉండడం అని అర్థం.

లుంగీ లేక పైజామాను గర్వకారణంగా, లేదా దర్పాన్ని, పెద్దరికాన్ని చాటుకోవడానికి మడమల క్రిందికి జారవిడిచే వారికి ఈ హదీసులో అతి తీవ్రమైన హెచ్చరిక ఉంది. ఇకపోతే గర్వం లేని వారు కూడా ఇలా చెయ్యడం మంచిదికాదు, ఎందుకంటే మహాప్రవక్త (సఅసం) లుంగీ లేక పైజామాను మడమల క్రిందికి జారేలా కట్టడాన్ని వారించారు. కాగా గర్వకారణంగా కాకపోయినా తప్పు చెయ్యడంవల్ల ఇలాంటి వ్యక్తులుకూడా శిక్షార్హులు కాగలరు. విశ్వాసి ఎంత తేలికయిన శిక్షనయినా తన పాలిటి ప్రళయంగానే భావిస్తాడు !

100. వ్యాపారంలో మనిషి తనకు తెలియకనే కొన్నిసార్లువ్యర్థ ప్రలాపనలు చేసి వేస్తాడు. అప్పుడప్పుడు ఒట్టు వేసుకుంటాడు; అందువలన వ్యాపారులు విశేషంగా దాన ధర్మాలు చెయ్యడం, సత్కార్యాల్లో విరివిగా పాల్గొనటం అవసరం. దీనివల్ల వారు తెలియకచేసిన పొరపాట్లకు కొంతవరకయినా ప్రాయశ్చిత్తం కలగవచ్చు అని ఈ హదీసు బోధిస్తోంది.

101. భావమేమంటే కొలతల్లో, తూనికల్లో, తీసుకునే ప్రమాణాలు వేరు, ఇచ్చే ప్రమాణాలు వేరయినట్లయితే అది అలా చేసే వారి సర్వనాశనానికి దారితీస్తుంది. ఇది

١٠٢ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنِ احْتَكَرَ فَهُوَ خَاطِئٌ".

102. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "ఎవరయితే ఎహ్‌తెకార్ చేస్తాడో అతడు పరమ పాపిష్ఠి."

١٠٣ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "اَلْجَالِبُ مَرْزُوْقٌ وَّالْمُحْتَكِرُ مَلْعُوْنٌ". (سُنن ابن ماجه - حضرت عمرؓ)

103. "నిత్యావసర పదార్థాల్ని నిలువచెయ్యక సమయానికి బజారులోకి తెచ్చి విక్రయించే వ్యక్తి దైవానుగ్రహానికి అర్హుడవుతాడు. అతనికి అల్లాహ్ పుష్కలంగా జీవికను ప్రసాదిస్తాడు. అయితే నిలువచేసే వ్యక్తి అల్లాహ్ శాపానికి గురవుతాడు" అని దైవ ప్రవక్త (సఅసం) ప్రవచించారు.

*[ఇబ్నుమాజా-ఉమర్ (రజిఅన్)]*

١٠٤ عَنْ مُعَاذٍ قَالَ: سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ: "بِئْسَ الْعَبْدُ الْمُحْتَكِرُ، إِنْ اَرْخَصَ اللّٰهُ الْاَسْعَارَ حَزِنَ، وَإِنْ اَغْلَاهَا فَرِحَ". (مشكوٰة)

104. హజ్రత్ ముఆజ్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : "నేను దైవ సందేశహరుడు (సఅసం) చెప్పగావిన్నాను -నిత్యావసర వస్తువుల్ని నిలువ చేసుకునే వ్యక్తి ఎంత నీచుడు! సరుకుల్ని అల్లాహ్ అగ్గువచేసినప్పుడు అతడు బాధపడతాడు, ధరలు పెరిగిపోతే సంబరపడతాడు." (మిష్కాత్)

---

సమాజం మొత్తాన్నీ పతనానికి గురిచేస్తుంది. ఎందుకంటే దీనివల్ల సమాజంలో వ్యక్తుల మధ్య పరస్పరం విశ్వసనీయత సమసిపోయి అనుమానాలు, అపనమ్మకాలు పెరుగుతాయి. ప్రతి మనిషి ఎదుటి మనిషిని నమ్మేస్థితిలో ఉండదు.

దివ్య ఖుర్ఆన్‌లోనూ కొలమానాల్లో హెచ్చు తగ్గులు చేసి వ్యాపారులు ఎలా సర్వనాశనమయింది వివరించబడింది. ఆ విషయాన్నే మహాప్రవక్త ఇక్కడ ప్రస్తావించి పూర్వపు ప్రజలకు సన్మార్గం బోధించినప్పటికీ వారు దాన్ని త్రోసిపుచ్చారనీ, అలాంటి ద్రోహబుద్ధిగల ప్రజలు నామరూపాల్లేకుండా నాశన మవుతారని హెచ్చరిస్తున్నారు.

۱۰۵ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "لَا يَحِلُّ لِأَحَدٍ أَنْ يَبِيعَ شَيْئًا إِلَّا بَيَّنَ مَا فِيهِ، وَلَا يَحِلُّ لِأَحَدٍ يَعْلَمُ ذٰلِكَ إِلَّا بَيَّنَهُ۔

(منتقٰی ۔ وائلہ)

105. అంతిమ దైవ సందేశహరుని (సఅసం) ప్రవచనం : "అమ్ముతున్న సరుకులోని లోపాలు కొనుగోలుదారులకు వివరించి మరీ అమ్మాలి, అలాకాక మరే పద్ధతి అవలంబించినా అది ఎట్టి పరిస్థితిలోనూ ధర్మ సమ్మతంకాదు. అంతేకాదు, ఆ లోపం తెలిసి ఉన్న వ్యక్తి దాన్ని స్పష్టపరచ కుండా ఉండడం కూడా ధర్మసమ్మతమైన విషయం కాదు."

*(మున్తకా- వాసిలా [రజిఅన్])*

---

102. "ఏహతెకార్" అంటే నిత్యావసర వస్తువుల్ని బజారులోకి తేకుండా నిలువచేసుకుని ధరలు బాగా పెరిగిన తరువాత వెలుపలికి తీసి విక్రయించడం అని అర్థం. దాన్నే మనంనేడు Hoarding అనీ, అక్రమనిల్వలనీ అంటున్నాము. ఈ దుర్బుద్ధి మనిషిని కర్కశ హృదయునిగా రూపొందిస్తుంది. హృదయకాఠిన్యం వల్లనే కదా మనిషి తోటి మానవుల అవసరాలను ఖాతరు చెయ్యకుండా కేవలం స్వార్థబుద్ధిలో స్వలాభాపేక్షతో నిత్యావసర వస్తువుల్ని నిల్వచేసుకుని ఇతర దైవ దాసులైన సోదర మానవులను కష్టాలకు గురిచేస్తాడు ! అలాంటి వారిని ఈ హదీసులో "పరమ పాపిష్ఠి" అని అభివర్ణించడం జరిగింది. పాపి అన్న చిన్నపదం, ప్రపంచంలో అతని నీచాతినీచమయిన స్థాయిని, పరలోకంలో అతని పరాజయాన్ని, నిష్ఫలతను సూచిస్తోంది. ఈ పదం దేవుని అభిశాపం! (దైవం రక్షించుగాక!) ఇస్లామ్ మానవుల్లో పరస్పర ప్రేమానురాగాలను అభిమానాన్ని సృష్టించగోరుతుంది. మనిషిని ఉన్నత శ్రేణికి చెందిన నైతిక జీవిగా తీర్చిదిద్దాలని అభిలషిస్తుంది.

దేవుని ఈ అభిశాపం నిత్యావసర వస్తువుల అక్రమ నిల్వలన్నింటికి వర్తిస్తుంది.

103. ఈ హదీసులో దొంగ నిల్వలకు పాల్పడక నిజాయితీగా ప్రజలకు వారి అవసరాలను అందజేసేవానికి కలిగే ప్రాపంచిక లాభాన్ని ప్రత్యేకంగా వివరించటం జరిగింది. ఏ వ్యాపారి అయితే నిజాయితీగా, అవసరమున్న వారి కష్టాల పట్ల సానుభూతితో వ్యవహరిస్తాడో అతని పట్ల ప్రజల ఆదరాభిమానాలేకాక అతని వ్యాపారం కూడా పెరిగి అతని ఉపాధి వృద్ధి వికాసాలు పొందుతుందనడంలో సందేహమేముంది?

104. ఈ హదీసులో దొంగనిల్వదారుని మానసిక స్థితిని చిత్రించడం జరిగింది. ఇతని పట్ల ప్రజలకు ఎప్పుడయినా సానుభూతి కలుగుతుందా?

# ఋణగ్రస్తుడిపట్ల మెతక వైఖరి

۱۰۶ إِنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: كَانَ رَجُلٌ يُدَايِنُ النَّاسَ فَكَانَ يَقُوْلُ لِفَتَاهُ: إِذَا اَتَيْتَ مُعْسِرًا اتَجَاوَزْعَنْهُ لَعَلَّ اللّٰهَ أَنْ يَتَجَاوَزَعَنَّا - قَالَ: "فَلَقِيَ اللّٰهَ فَتَجَاوَزَعَنْهُ -" (بخاری۔ مسلم)

106. దైవప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "ఒక వ్యక్తి ఉండేవాడు. అతడు అవసరమున్న వారికి అప్పు అందజేసి ఆదుకునేవాడు. తరువాత తన ఉద్యోగిని వసూళ్ళకు పంపేటప్పుడు 'నీవు నిరుపేద అయిన ఋణగ్రస్తుడి వద్దకు వెళ్ళినప్పుడు అతన్ని మన్నించి వదలిపెట్టు, దానిద్వారా అల్లాహ్ కూడా మనపట్ల మన్నింపు వైఖరి అవలంబించవచ్చు' అని ఆదేశించేవాడు" అని చెప్పి మహాప్రవక్త ఇంకా ఇలా అన్నారు. "ఆ వ్యక్తి అల్లాహ్ సన్నిధిలో హాజరయినప్పుడు అల్లాహ్ అతని పట్ల మన్నింపు వైఖరినే అవలంబిస్తాడు." (బుఖారి, ముస్లిమ్)

۱۰۷ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ سَرَّهُ أَنْ يُّنْجِيَهُ اللّٰهُ مِنْ كُرَبِ يَوْمِ الْقِيَامَةِ فَلْيُنَفِّسْ عَنْ مُّعْسِرٍ أَوْيَضَعْ عَنْهُ - (مسلم۔ ابوقتادہؓ)

107. "ప్రళయ దినాన కలిగే వ్యధాభరితమయిన బాధ నుండి తమను అల్లాహ్ రక్షించడాన్ని ఇష్టపడేవారు ఋణగ్రస్తునికి వీలయినంత వ్యవధి నివ్వాలి లేదా అతని ఋణ భారాన్నే దూరం చెయ్యాలి." అని మహాప్రవక్త (సఅసం) ఉపదేశించారు. (ముస్లిమ్ - అబూకతాదా)

---

105. ఈ హదీసులో వ్యాపారులతోబాటు ఆ పదార్థాల్లో ఉన్న లోపాన్ని ఎరిగున్నవారికి కూడా ఆదేశాలున్నాయి. వ్యాపారులు తమ సరుకులోని లోపాలు స్పష్టంగా బహిరంగంగా కానవచ్చేలా పెట్టాలి. కొనుగోలుదారులకు ఆ లోపం గురించి తెలియజేయాలి. ఆ లోపం గురించి తెలిసిన వ్యక్తులు సయితం దాన్ని గురించి ఇతరులకు చెప్పివెయ్యాలి. మనకెందుకు వచ్చిన చిక్కు అని నిర్లిప్త వైఖరి అవలంబించడం ద్వారా వారు సమాజంలో వంచనాపరుల్ని ప్రోత్సహిస్తున్నారన్నమాట. అది సమాజానికి హానికరమే.

١٠٨ عَنْ أَبِيْ سَعِيْدِنِ الْخُدْرِيِّ قَالَ: "أُتِيَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ
سَلَّمَ بِجَنَازَةٍ لِيُصَلِّيَ عَلَيْهَا، فَقَالَ: هَلْ عَلَىٰ صَاحِبِكُمْ دَيْنٌ؟ قَالُوْا:
نَعَمْ، قَالَ: هَلْ تَرَكَ لَهُ مِنْ وَّفَاءٍ؟ قَالُوْا: لَا، قَالَ: صَلُّوْا عَلَىٰ صَاحِبِكُمْ،
قَالَ عَلِيُّ بْنُ أَبِيْ طَالِبٍ: عَلَيَّ دَيْنُهُ يَا رَسُوْلَ اللّٰهِ! فَتَقَدَّمَ فَصَلَّىٰ عَلَيْهِ
وَفِيْ رِوَايَةٍ مَّعْنَاهُ، وَقَالَ: فَكَّ اللّٰهُ رِهَانَكَ مِنَ النَّارِ كَمَا
فَكَكْتَ رِهَانَ أَخِيْكَ الْمُسْلِمِ، لَيْسَ مِنْ عَبْدٍ مُّسْلِمٍ يَّقْضِيْ عَنْ
أَخِيْهِ دَيْنَهُ إِلَّا فَكَّ اللّٰهُ رِهَانَهُ يَوْمَ الْقِيَامَةِ۔ (شرح السنّة)

108. హజ్రత్ అబూసయీద్ ఖుద్రి ఉల్లేఖించారు: దైవ సందేశహరుని (సఅసం) సన్నిధిలో ఒక శవపేటికను నమాజ్ కొరకు తెచ్చారు, "మీ మరణించిన మిత్రునిపై ఋణభారం లేదుకదా?" అని అడిగారాయన. అక్కడున్న వారు, 'ఆ! ఉంది' అని పలికారు. 'అయితే దాన్ని తీర్చ డానికి ఏమయినా ధనం వదిలాడా?' అని తిరిగి ప్రశ్నించారు. దానికి లేదని సమాధానమిచ్చారు. 'అయితే ఈ ప్రార్థన (జనాజా నమాజ్) మీరే చేసుకోండి' అన్నారు మహాప్రవక్త (సఅసం). ఈ పరిస్థితిని చూసి హజ్రత్ అలీ (రజి) ముందుకు వచ్చి "దైవప్రవక్తా! ఇతని అప్పు తీర్చే పూచీ నాది" అని హామీ ఇచ్చారు. అప్పుడాయన (సఅసం) ముందుకు వచ్చారు. అలాగే శవప్రార్థన చేశారు. ఆ తరువాత మరో హదీసులో ఉంది ఇలా అన్నారు : "అలీ ఈ ముస్లిమ్ సోదరుని ఋణాన్ని స్వీకరించి అతణ్ణి ఆ భారం నుండి విడుదల చేసినట్లే, అల్లాహ్ నీకు నరకాగ్ని నుండి విడుదల, రక్షణ ప్రసాదించుగాక! తోటి సోదరుని ఋణాన్ని తీర్చిన ముస్లిమ్‌కు ప్రళయ దినాన అల్లాహ్ (శిక్ష నుండి) విమోచనం ప్రసాదించడం తథ్యం." (షర్హుసున్నహ్)

---

దైవప్రవక్త (సఅసం) ఒకసారి ఓ వ్యాపారి సమీపంగా వెళ్ళారు. అతడు ధాన్యం అమ్ముతున్నాడు. ఆయన ధాన్యంలో తన చెయ్యివేశారు. అది లోపల తడిగా అగుపించింది. "ఇదేమిటి?" అని ఆయన అడిగినదానికి అతడు, వర్షంవల్ల తడిసిందని సంజాయిషి చెప్పాడు. "అయితే, దాన్ని పైకి కనిపించేలా ఎందుకు పెట్టలేదు" అని అతన్ని మందలించి, "మమ్మల్ని మోసగించేవారు మా వారు కారు" అని హెచ్చరించారు.

١٠٩ إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: يُغْفَرُ لِلشَّهِيْدِ كُلُّ ذَنْبٍ إِلَّا الدَّيْنَ - (مُسلم - عبداللہ بن عمرؓ)

109. "దైవమార్గంలో ప్రాణమర్పించిన వ్యక్తి పాపాలన్నీ మన్నించబడతాయి - ఒక్క అప్పు తప్ప" అని ప్రవక్త మహనీయులు (సఅసం) సెలవిచ్చారు. (ముస్లిమ్ - అబ్దుల్లాహ్ బిన్ ఉమర్)

## అప్పు తీర్చకుండా వాయిదాలు వెయ్యడం నిషిద్ధం

١١٠ عَنْ أَبِيْ رَافِعٍ قَالَ: إِسْتَسْلَفَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بَكْرًا فَجَاءَتْهُ إِبِلٌ مِّنَ الصَّدَقَةِ، قَالَ أَبُوْرَافِعٍ: فَأَمَرَنِيْ أَنْ أَقْضِيَ الرَّجُلَ بَكْرَهُ فَقُلْتُ: لَا أَجِدُ إِلَّا جَمَلًا خِيَارًا رَبَاعِيًا، فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: أَعْطِهِ إِيَّاهُ فَإِنَّ خَيْرَ النَّاسِ أَحْسَنُهُمْ قَضَاءً - (مُسلم)

110. హజ్రత్ అబూరాఫె ఇలా ఉల్లేఖించారు : కారుణ్యమూర్తి (సఅసం) ఒకసారి ఓ ఒంటె పిల్లను ఒకరి వద్ద అరువు తీసుకున్నారు. ఆ పైన ఆయన (సఅసం)కు జకాత్ ఒంటెలు అందినప్పుడు వాటి లోనుంచి ఆ చిన్న ఒంటె బదులు తీర్చివెయ్యవలసిందిగా నన్ను పురమాయించారు. అప్పుడు నేను, "ఈ ఒంటెల్లో ఏడేళ్ళ చిన్న ఒంటె ఉన్న దొక్కటే. అదీ ఎంతో శ్రేష్ఠమయింది" అన్నాను. దానికి ప్రవక్త మహనీయులు, దాన్నే ఆ వ్యక్తికి ఇచ్చెయ్యి. ఉత్తమమయిన రీతిలో అప్పు తీర్చేవాడే ఉత్తమమయిన వ్యక్తి" అని సెలవిచ్చారు. (ముస్లిమ్)

---

106. ఈ హదీసులో ఒక ధనికుడయిన ముస్లిం వైఖరిని చిత్రించడం జరిగింది. అవసరంలో అప్పు ఇవ్వడమేకాక బీదవారిపట్ల ఉదారంగా వ్యవహరించడం ఎంత ఉత్తమ లక్షణమో, పరలోకంలో ఎంత సత్ఫరిణామాన్ని తెస్తుందో దీని ద్వారా తెలుస్తోంది.

١١١ إِنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "مَطْلُ الْغَنِيِّ ظُلْمٌ فَإِذَا أُتْبِعَ أَحَدُكُمْ عَلَى مَلِيءٍ فَلْيَتْبَعْ" (بخاری ومسلم- ابوھریرۃ)

111. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా బోధించారు : "డబ్బుగలవారు అప్పు తీర్చడంలో జాప్యం చేస్తూ వాయిదాలు వెయ్యడం అన్యాయం. అయితే ఋణగ్రస్తుడు తన అప్పును వేరొక స్థితిపరుడయిన వ్యక్తి నుండి వసూలు చేసుకోమని అభ్యర్థిస్తే దాని ప్రకారమే చెయ్యాలి."

(బుఖారీ, ముస్లిమ్ - అబూహురైరా)

---

మరో విషయమేమంటే ఋణం అంటే కేవలం వడ్డీలేని ఋణమే. వడ్డీ నిషిద్ధం గనుక దాని ప్రస్తావన ప్రశ్నే ఇక్కడ రాదు.

107. సామాజిక జీవితంలో అప్పు ఇచ్చి పుచ్చుకోవడాలు సర్వసామాన్యం. కొన్ని సందర్భాల్లో అనివార్యం కూడా. అయితే ఈ అప్పుల వల్ల అమితంగా బాధపడేవారు బీదవాళ్ళే. 'అప్పు' వారి ఆర్థిక వ్యవస్థలో ప్రథమాంశం. అందువల్ల బీదవాళ్ళకు అప్పులిచ్చినవారు వారి అవస్థను దృష్టిలో ఉంచుకుని తగిన వ్యవధి నివ్వడమో లేదా ఋణాన్ని పూర్తిగా మాఫీ చెయ్యడమో చెయ్యాలి. ఇది పుణ్యప్రదం.

108. మానవులు ప్రపంచంలో నెరవేర్చవలసిన విధులు రెండు విధాలు. దైవిక సంబంధమయినవి, మానవ సంబంధమైనవి. దైవిక సంబంధమయిన విధుల నిర్వహణలో ఏవైనా లోటుపాట్లుంటే ప్రళయదినాన, కర్మలు పరీక్షించబడే సమయాన అల్లాహ్ వాటిని మన్నించి దాసునికి మోక్షం ప్రసాదించడం సంభవమే కాని, మానవ సంబంధమయిన విధుల నిర్వహణలో మాత్రం తత్సంబంధమైన మానవులు మన్నించి వదలనంతవరకు అల్లాహ్ కూడా మన్నించడు. అప్పు ఇచ్చిపుచ్చుకోవడం మానవ సంబంధమైన విధులు, హక్కుల కోవకు చెందినది. దీన్ని తీర్చకుండా మృతిచెంది దైవ సన్నిధిన చేరడమంటే ఒక మానవీయ హక్కు భారాన్ని మోయడమన్నమాట. అలాంటి ఒక వ్యక్తి శవప్రార్థన చెయ్యడానికి మహాప్రవక్త నిరాకరించడంలో అంతరార్థం ఏమంటే అప్పును గురించి ప్రాముఖ్యాన్ని ప్రజలు సవ్యంగా అర్థం చేసుకోవాలి. అప్పును దాని హక్కుదారునికి అందివ్వడంలో ఎలాంటి జాప్యం, ఉపేక్షాభావం చూపరాదు అన్నదే.

109. ఈ హదీసు కూడా అప్పును తిరిగి చెల్లించవలసిన ప్రాముఖ్యాన్ని వెల్లడిస్తోంది. అప్పు తీసుకోవడంలో ఏ మాత్రం దోషం లేదు. కాని దాన్ని తీర్చకపోవడమే అపరాధం. దైవం పట్ల ఏవయినా చిన్నచిన్న పొరపాట్లు జరిగినా దైవం మన్నించడం

١١٢ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : مَنْ أَخَذَ اَمْوَالَ النَّاسِ يُرِيْدُ أَدَاءَهَا أَدَّى اللهُ عَنْهُ ، وَمَنْ أَخَذَ يُرِيْدُ اِتْلَافَهَا أَتْلَفَهُ اللهُ عَلَيْهِ ۔ (بخاری – ابوھریرہؓ)

112. మానవోత్తములు (సఅసం) సెలవిచ్చారు : "ఎవరికయితే ఇతరుల వద్ద అప్పు తీసుకుని దాన్ని తీర్చే సంకల్పం వుందో అతని బాకీని అల్లాహ్ తన తరఫున చెల్లిస్తాడు. కాని ఎవరయితే అప్పు తీసుకుని దాన్ని ఎగ్గొట్టే సంకల్పంతో ఉంటాడో, అతని ఈ వైఖరి కారణంగా అల్లాహ్ అతన్ని వినాశానికి గురిచేస్తాడు." (బుఖారి–అబూహురైరా)

١١٣ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : لَيُّ الْوَاجِدِ يُحِلُّ عِرْضَهُ وَعُقُوْبَتَهُ ۔ (ابوداؤد – شرید سُلَمیؓ)

113. "అప్పు తీర్చగలిగే శక్తిగల వ్యక్తి దాన్ని వాయిదాలు వెయ్యడానికి ఉపక్రమిస్తే అతని ఈ వైఖరి అతన్ని పరాభవానికీ, శిక్షకూ పాత్రునిగా చేస్తుంది" అని ప్రవక్త మహనీయులు తెలియజేశారు.

(అబూదావూద్– షరైద్ సులమి)

---

సాధ్యమే. కాని మానవుల పట్ల జరిగే అన్యాయాలను దేవుడు మన్నించడు. తత్సంబంధిత మానవులే మన్నించాలి. దైవ మార్గాన ప్రాణత్యాగంలాంటి మహోత్కృష్టమయిన ధార్మిక క్రియ ఆచరించినా రుణగ్రస్తునిగా మానవీయ హక్కును నెరవేర్చకుండా దైవ సన్నిధిలో హాజరయిన వ్యక్తిని క్షమించడం జరగదు. మనిషి అప్పు తీర్చే సంకల్పంతోనే ఉన్నా తీర్చలేకపోయి మరణిస్తే ప్రళయ దినాన అల్లాహ్ ఆ హక్కుదారుని పిలిపించి మన్నించవలసిందిగా చెబుతాడు. ఆ మన్నింపుకు బదులుగా స్వర్గంలోని వరాలను అనుగ్రహిస్తానని అంటాడు. అప్పుడు ఆ హక్కుదారుడు రుణాన్ని మాఫీ చేస్తాడు.

అయితే ఎవరయినా అప్పును తీర్చే స్తోమత ఉన్నా దాన్ని తీర్చక, హక్కుదారుని హక్కును నెరవేర్చక లేదా ప్రపంచంలోనే దాన్ని మాఫీ చేయించుకోక ప్రపంచాన్ని వదలిపోతే అలాంటి అప్పు మాఫీ జరిగే అవకాశం ప్రళయంలో ఏదీ లేదు.

110. అబూరాఫె (రజిఅన్) దైవ ప్రవక్త అరువుగా తెచ్చుకున్న ఒంటె లాంటిదాన్నే

# అపహరణ

١١٤ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ أَخَذَ شِبْرًا مِّنَ الْأَرْضِ ظُلْمًا فَإِنَّهُ يُطَوَّقُهُ يَوْمَ الْقِيَامَةِ مِنْ سَبْعِ أَرْضِيْنَ۔"
(بخاری۔ مُسلم۔ سعید بن زیدؓ)

114. "ఎవరయితే ఇతరుల జానెడు భూభాగాన్ని అన్యాయంగా దోచుకుంటారో అల్లాహ్, ప్రళయ దినాన ఏడు భూముల భారం అతని మెడలో వ్రేలాడవేస్తాడు" అని మహాప్రవక్త (సఅసం) తెలిపారు.
(బుఖారి, ముస్లిం-సయీద్ బిన్ జైద్)

١١٥ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "أَلَا لَا تَظْلِمُوْا، أَلَا يَحِلُّ مَالُ امْرِئٍ إِلَّا بِطِيْبِ نَفْسٍ مِّنْهُ۔ (بیہقی)

115. దైవ సందేశహరుడు (సఅసం) ఇలా బోధించారు : "బాగా వినండి, అత్యాచారం చెయ్యకండి. ఒకరి సొత్తు దాని యజమాని సంతోషంగా ఇచ్చేస్తే తప్ప మరొకరు తీసుకోవడం ధర్మసమ్మతం కాదు." (బైహకీ)

---

న్యాయవంతంగా తిరిగి ఇవ్వాలని వెదికారు. అయితే దైవ ప్రవక్త (సఅసం) వద్ద ఆనాడు వచ్చిన ఒంటెల్లో అలాంటిది దొరకలేదు. కాని అంతకంటే మేలయిన ఒంటె ఒకటుంది. ఆ మాటే ఆయన ప్రవక్త (సఅసం)తో విన్నవించుకున్నారు. తన అనుయాయుల్లో దైవ ప్రవక్త ఎలాంటి మనస్తత్వం సృజించదలిచారో ఈ సందర్భంలో ప్రవక్త మహనీయుని ఉపదేశాన్ని గమనిస్తే బోధపడుతుంది. ఇతరులకు ఇచ్చేటప్పుడు అరువుగానయినా, కానుకగానయినా ఇచ్చే వస్తువు ఉత్తమమయిందిగా ఉండాలన్న ఆదేశం ఇతర హదీసుల ద్వారా కూడా తెలుస్తోంది.

111. ఒక వ్యక్తి అప్పు తీర్చే శక్తి లేక ఇతరుల్ని పూచీగా పెట్టినప్పుడు, పూచీ తీసుకున్న వ్యక్తి కూడా దాన్ని ఒప్పుకున్న పక్షంలో రుణదాత కాదు పోదు అని నిష్కర్షగా త్రిప్పికొట్టక అతని అభ్యర్థనను మన్నించి, కాస్త శాంతం వహించి ఆ రెండో వ్యక్తి వద్ద వసూలు చేసుకోడానికి సమ్మతించాలి.

112. అప్పు తీసుకుని తిరిగి చెల్లించే ఉద్దేశ్యం లేకపోవడమన్నది ఎంతో నీచమయిన మనస్తత్వం. ఇలాంటివారు ఎక్కువకాలం ప్రజల్ని మోసపుచ్చలేరు. వారి గుణం కాస్తా ఒకనాడు బయటపడి, సమాజంలో వారికి ఎలాంటి విలువ లేకుండా పోతుంది. దానికి

١١٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "اَلْعَارِيَةُ مُؤَدَّاةٌ وَالْمِنْحَةُ مَرْدُوْدَةٌ وَالدَّيْنُ مَقْضِيٌّ وَالْكَفِيْلُ غَارِمٌ"۔ (ترمذی-ابوامامہؓ)

116. "ఆరియా" చెల్లించబడాలి, "మిన్‌హ" తిరిగి ఇవ్వబడాలి, అప్పు తీర్చబడాలి, జామీను ఉన్న వ్యక్తి జామీన్‌ని పూర్తిచెయ్యాలి" అని బోధించారు ప్రవక్త మహనీయులు (సఅసం). (తిర్మిజి-అబూఉమామ)

١١٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: أَدِّ الْأَمَانَةَ إِلٰى مَنِ ائْتَمَنَكَ وَلَا تَخُنْ مَنْ خَانَكَ۔" (ترمذی - ابوہریرہؓ)

117. మహాప్రవక్త (సఅసం) ఉపదేశించారు, "ఒక వ్యక్తి నిన్ను విశ్వసనీయునిగా భావించి తన సొత్తును నీవద్ద భద్రపరచుకుంటే అతని అమానతు అతనికి అప్పజెప్పు. నీ పట్ల విశ్వాసఘాతుకం చేసిన వ్యక్తిపట్ల నీవున్నూ విశ్వాస ఘాతుకాన్ని తలపెట్టకు." (తిర్మిజి-అబూహురైరా)

---

భిన్నంగా చెల్లించే ఉద్దేశ్యమే ఉన్నట్లయితే అలాంటివారి ప్రయత్నాలు ఫలించే అవకాశం కల్పించి అల్లాహ్ వారూహించని మార్గాల ద్వారా సాయపడతాడు. ఇది మన నిత్య అనుభవమే.

113. 'పరాభవానికీ, శిక్షకూ' అనంటే, అలాంటి వ్యక్తి ఎంతో కాలం గౌరవంగా బ్రతకలేడు, ప్రజల్లో ఆదరణ కోల్పోవడమే కాక ఇస్లామీయ రాజ్యంలో శాసనాంగం ప్రకారం శిక్షకు కూడా గురవుతాడని అర్థం.

114. ప్రళయ దినాన, మనిషి ఆ యాతనామయ ఘడియల్లో వీలయినంత తేలిగ్గా, హాయిగా ఉండాలని కోరుకునే తరుణంలో, అల్లాహ్ ఏడు భూమండలాల బరువు మనిషి కంఠంలో వ్రేలాడదీస్తే ఎలా ఉంటుందో ఆలోచించండి. నేడు జానెడు భూమికై కక్కుర్తిపడే చాలా మంది 'సజ్జనులు' ఆత్మ విమర్శన చేసుకోవడం అవసరం.

115. ఒకరి సొత్తు మరొకరి వద్దకు చేరే మార్గాలు రెండే. ఒకటి క్రయ విక్రయాల ద్వారా, మరొకటి కానుకల ద్వారా. అయితే ఈ రెండూ కానిదే అత్యాచారం, అదే అధర్మం.

116. "ఆరియా" అంటే, అరువు తెచ్చుకున్న వస్తువని అర్థం. ఇక్కడ భావమేమంటే, ఎవరినయినా అడిగి ఏదయినా వస్తువు బదులు తెచ్చుకుంటే దాన్ని తిరిగి ఇచ్చివెయ్యాలి "మిన్‌హ" అంటే పాలిచ్చే ఒంటె అని అర్థం. అరబ్బులు ధనికులయినవారు తమ బంధుమిత్రులు పాలు పిదికి వినియోగించుకోవడానికి ఒంటెల్ని ఇచ్చేవారు, మహాప్రవక్త

١١٨ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ اللّٰهَ عَزَّوَجَلَّ يَقُوْلُ:
أَنَا ثَالِثُ الشَّرِيْكَيْنِ مَالَمْ يَخُنْ أَحَدُهُمَا صَاحِبَهُ فَإِذَا خَانَهُ خَرَجْتُ
مِنْ بَيْنِهِمَا (وَفِيْ رِوَايَةٍ) وَجَاءَ الشَّيْطٰنُ۔ (ابوداؤد - ابوهريرةؓ)

118. "మహా గౌరవనీయుడు ఘనతగల ప్రభువు అల్లాహ్ ఈ విధంగా సెలవిచ్చాడు: ఒక వ్యాపారంలోని ఇద్దరు వాటాదారుల్లో ఏ ఒక్కడు కూడా మరొకని యెడల విశ్వాసఘాతుకం చేయనంతవరకు నేను వారికి తోడుగా మూడోవానిగా ఉంటాను. కాని వారిలో ఒకడు ద్రోహం చెయ్యగానే నేను వారి మధ్య నుండి నిష్క్రమిస్తాను. అప్పుడు వారి మధ్య షైతాన్ చోటుచేసుకుంటాడు" అని దైవ సందేశహరులు (సఅసం) తెలియపరిచారు. (అబూదావూద్ - అబూహురైరా)

---

(సఅసం) ఉద్దేశ్యం ఏమంటే, అలా ఇచ్చిన జంతువుల్ని, వాటి ఉపయోగం తీరిన తరువాత యజమానికి తిరిగి అప్పజెప్పాలి. అలాగే అప్పును ఏమాత్రం దిగమ్రింగకుండా తీర్చి వెయ్యాలని ఈ హదీసు సూచిస్తోంది. అప్పుపట్ల నిర్లక్ష్యభావం న్యాయదినాన పెద్ద ముప్పు తెచ్చిపెడుతుందని మరువకూడదు. జామీను ఇచ్చే వ్యక్తి తాను ఎవరికి వత్తాసుగా ఉంటున్నాడో, దేని బాధ్యత స్వీకరిస్తున్నాడో అర్థం చేసుకుని మరీ జామీను ఇవ్వాలి. అంతేగాని జామీను ఇచ్చిన తరువాత దాన్ని దాటెయ్యడానికి ప్రయత్నించడం మహాపరాధం.

117. ఎవరయినా విశ్వాసఘాతుకం తలపెట్టి వంచనకు పాల్పడితే దాని ప్రతీకారానికి అవకాశం కోసం ఎదురుచూస్తూ ఉండడం, అవకాశం దొరకగానే ప్రతీకారం తీర్చుకోవడం, అతని విశ్వాసఘాతుకానికి బదులుగా అతన్ని వంచించడం అపరాధమని, అతని ద్రోహాన్ని సక్రమ మార్గాల ద్వారానే బయటపెట్టి తన హక్కును పొందే ప్రయత్నం చేసుకోవాలని ఈ హదీసు బోధిస్తోంది.

118. అంటే వ్యాపారంలో భాగస్వాములయిన వారు పరస్పరం నమ్మకద్రోహం తలపెట్టక, మోసం చెయ్యక మసలుకున్నంతకాలం దైవ సహకారం, సహాయం, కరుణానుగ్రహాలు వారికి లభిస్తాయన్నమాట. వారి వ్యాపారంలోనూ అన్యోన్య బాంధవ్యాల్లోనూ శుభప్రదమయిన వృద్ధీవికాసాలు దేవుడు కలుగజేస్తాడు. కాని వారిలో ఏ ఒక్కరి సంకల్పమయినా కలుషితమయినట్లయితే అప్పుడే దైవ కారుణ్యం, అన్యోన్య ప్రేమభావం విశ్వసనీయతలు అంతమయి షైతాన్ వచ్చేసి అపనమ్మకపు వాతావరణాన్ని సృజిస్తాడు. వ్యాపారంలో ఇద్దరికీ శ్రద్ధాసక్తులు క్షీణిస్తాయి పర్యవసానంగా వ్యాపారం దెబ్బతింటుంది. దీన్ని ఉమ్మడి వ్యాపారులు నిత్యం గుర్తుంచుకోవలసిన అవసరం ఎంతయినా ఉంది.

# వ్యవసాయం

١١٩ عَنْ أَنَسٍ قَالَ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَا مِنْ مُسْلِمٍ يَزْرَعُ زَرْعًا أَوْ يَغْرِسُ غَرْسًا فَيَأْكُلُ مِنْهُ طَيْرٌ أَوْ إِنْسَانٌ أَوْ بَهِيْمَةٌ إِلَّا كَانَ لَهُ بِهِ صَدَقَةٌ. (مُسلم)

119. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) బోధించినట్లు హజ్రత్ అనస్ (రజిఅన్) ఉల్లేఖించారు : "ఒక ముస్లిమ్ వ్యక్తి వ్యవసాయం చేసి, లేదా చెట్ల మొక్కలునాటి, పండించిన ధాన్యఫలాదులలో కొంత పక్షులు లేక మనుషులు లేదా పశువులు తినివేస్తే అది అతనిపట్ల సదకాగా పరిణమిస్తుంది." (ముస్లిమ్)

١٢٠ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: ثَلٰثَةٌ لَا يُكَلِّمُهُمُ اللّٰهُ يَوْمَ الْقِيَامَةِ وَلَا يَنْظُرُ إِلَيْهِمْ، رَجُلٌ حَلَفَ عَلٰى سِلْعَةٍ لَقَدْ أُعْطِيَ بِهَا أَكْثَرَ مِمَّا أُعْطِيَ وَهُوَ كَاذِبٌ، وَرَجُلٌ حَلَفَ عَلٰى يَمِيْنٍ كَاذِبَةٍ بَعْدَ الْعَصْرِ لِيَقْتَطِعَ بِهَا مَالَ رَجُلٍ مُسْلِمٍ، وَرَجُلٌ مَنَعَ فَضْلَ مَاءٍ فَيَقُوْلُ اللّٰهُ: "اَلْيَوْمَ أَمْنَعُكَ فَضْلِيْ كَمَا مَنَعْتَ فَضْلَ مَاءٍ لَمْ تَعْمَلْ يَدَاكَ".

(بخاری، مُسلم)

120. మహాప్రవక్త (సఅసం) ప్రబోధన: "మూడు రకాల మనుషులతో అల్లాహ్ ప్రళయ దినాన పలుకడు, వారివైపు కన్నెత్తి కూడా చూడడు. వారిలో ఒక రకం వారు తమ వర్తకపు సరుకును అమ్మేటప్పుడు, అంతకు పూర్వం ఇంతకంటే అధిక ధర వచ్చిందని అసత్య ప్రమాణం చేసేవారు. రెండవకోవకు చెందిన వారు, తోటి ముస్లిమ్ సోదరుని ధనాన్ని అపహరించుకోవడానికి అస్ర్ తరువాత అసత్య ప్రమాణం చేసేవారు; మూడో రకం మనుషులు, తమ అవసరానికి మించి నీటిని నిలుపుకునేవారు. ప్రళయ దినాన అల్లాహ్ ఈ వ్యక్తితో, 'నీవు నీటిని సృష్టించకపోయినా దాన్ని ఏ విధంగా నిలిపేశావో నేడు నేను నా కారుణ్యాన్ని నీ కొరకు అదే విధంగా నిలిపి వేస్తాను' అని అంటాడు." (బుఖారీ, ముస్లిమ్)

# వేతనం

١٢١ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "أَعْطُوا الْأَجِيْرَ أَجْرَهُ قَبْلَ أَنْ يَّجِفَّ عَرَقُهُ." (ابن ماجه - ابن عمرؓ)

121. "శ్రామికుని చెమటలు ఆరకమునుపే అతని కూలీ చెల్లించి వేయండి" అని దైవసందేశహరుడు (సఅసం) ఆదేశించారు.

(ఇబ్నుమాజా–ఇబ్ను ఉమర్)

١٢٢ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: قَالَ اللّٰهُ تَعَالَى: ثَلٰثَةٌ أَنَا خَصْمُهُمْ يَوْمَ الْقِيَامَةِ، رَجُلٌ أَعْطٰى بِيْ ثُمَّ غَدَرَ، وَرَجُلٌ بَاعَ حُرًّا فَأَكَلَ ثَمَنَهُ، وَرَجُلٌ اسْتَاجَرَ أَجِيْرًا فَاسْتَوْفٰى مِنْهُ وَلَمْ يُعْطِهٖ أَجْرَهُ." (بخاری - ابوهريرهؓ)

122. "అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు : 'ప్రళయ దినాన నాకూ ముగ్గురు వ్యక్తులకు వివాదం జరుగుతుంది. ఒకడు నా పేరిట ఒప్పందం చేసి దాన్ని విఘ్నం చేసే వ్యక్తి; రెండో వాడు ఒక స్వేచ్ఛా జీవిని బానిసనుచేసి అమ్మి ఆ డబ్బును తినే వ్యక్తి; మూడోవాడు ఒక శ్రామికుని తన పనికి కుదుర్చుకుని, అతని చేత పని పూర్తిగా చేయించుకుని అతని కూలి ఎగ్గొట్టే వాడు" అని మహాప్రవక్త (సఅసం) తెలిపారు.

(బుఖారీ - అబూహురైరా)

---

119. "సదకా" అంటే దైవమార్గంలో మనిషి స్వచ్ఛందంగా చేసే దాన ధర్మాలని భావం. ఈ హదీసు ద్వారా తెలిసే దేమంటే, ఒక ముస్లిం వ్యక్తి సంకల్ప శుద్ధితో తన దైనందిన వ్యవహారాల్లో పాల్గొంటూనే దైవ ప్రసన్నతను పొందే అనేక శుభ తరుణాలు అతనికి ఆసన్నమవుతాయి. అతనికి తెలియకుండా ఇతరులకు అతని వల్ల కలిగే మేలు ద్వారా కూడా అతనికి పుణ్యం ప్రాప్తిస్తుంది.

120. అవసరానికి మించి నీటి నిలుపుదల అంటే, తోటలకు, మళ్ళకు నీరు కట్టుకునేటప్పుడు, తమ అవసరం తీరినా పల్లపు పొలాల వారికి నీరు అందకుండా చెయ్యడానికి నీరు నిలిపివెయ్యడం అని భావం.

# అధర్మమయిన వీలునామా

١٢٣ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ الرَّجُلَ لَيَعْمَلُ وَالْمَرْأَةَ بِطَاعَةِ اللّٰهِ سِتِّيْنَ سَنَةً ثُمَّ يَحْضُرُهُمَا الْمَوْتُ فَيُضَارَّانِ فِي الْوَصِيَّةِ فَتَجِبُ لَهُمَا النَّارُ" ثُمَّ قَرَأَ أَبُوْهُرَيْرَةَ "مِنْ بَعْدِ وَصِيَّةٍ يُوْصٰى بِهَا أَوْدَيْنٍ غَيْرَ مُضَارٍّ" إِلٰى قَوْلِهٖ تَعَالٰى "وَذَالِكَ الْفَوْزُ الْعَظِيْمُ"-

(مسند احمد - ابوهريرةؓ)

123. మహాప్రవక్త (సఅసం) ఇలా ఉద్బోధించారు: "ఒక పురుషు డయినా ఒక స్త్రీ అయినా అరవై ఏళ్లు దైవ విధేయతలో, సదాచరణలో గడుపుతారు. తరువాత అవసాన దశ ఆసన్నమయినపుడు తమ 'వీలు నామా' ద్వారా తమ వారసులకు నష్టం కలుగజేసి పోతారు. వారిరువురికి నరకం తప్పనిసరి అవుతుంది." అని చెప్పి ఈ హదీసు ఉల్లేఖిన కర్త అయిన అబూహురైరా (రజిఅన్) "మింబాది వసియ్యతిన్.... నుండి జాలికల్ ఫౌజుల్ అజీమ్" వరకు పఠించారు.

(ముస్నద్ అహ్మద్ - అబూహురైరా)

---

121. శ్రామికులు, కూలీలు మామూలుగా ఏరోజు భృతి ఆరోజు సంపాదించుకు బ్రతుకుతారు. అలాంటి వారికి వారి కూలీ ఇవ్వకుండా వాయిదా వేయడమో, ఎగ్గొట్టడమో చేస్తే కూలీవాడు పస్తులుపడి చావడం తప్ప మరేదీ జరుగదు. మహాప్రవక్త బోధించిన ఈ ఆదేశంలో పారిశ్రామికవేత్తలూ, శ్రామికుల మధ్య సత్సంబంధాలను పెంపొందించే గొప్ప సూత్రం నిగూఢమయి ఉంది. ఎన్నో అలజడులకు అశాంతులకు మూలమయిన ఈ "కూలీ"ని చెమట ఆరక మునుపు ఇచ్చివేస్తే అంతా ప్రశాంతత నెలకొంటుంది.

122. అల్లాహ్‌తో వాదన జరగటమంటే మనిషి తాను చేసిన ఎన్నో సత్కార్యాలకు పూజా పురస్కారాలకు ప్రతిఫలం పొందాలనే ఆశతో ప్రళయ దినాన పరమ ప్రభువు సమక్షంలో హాజరయినప్పుడు మానవ సంబంధమైన హక్కుల్ని కాజేసిన ఈ మూడు వర్గాల మనుషులకు నిరాశే ఎదురవుతుంది. ఆ క్షణాన వారి ఈ అయోమయ పరిస్థితినే అల్లాహ్‌తో వివాదంగా హదీసులో పేర్కొనడం జరిగింది.

۱۲۴ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ: "مَنْ قَطَعَ مِیْرَاثَ وَارِثِہٖ قَطَعَ اللّٰہُ مِیْرَاثَہٗ مِنَ الْجَنَّۃِ یَوْمَ الْقِیَامَۃِ۔" (ابن ماجہ - انس)

124. "ఎవరయితే తన వారసులను వారసత్వం నుండి దూరం చేస్తాడో ప్రళయ దినాన అల్లాహ్ అతన్ని స్వర్గపు వారసత్వం నుండి దూరం చేస్తాడు" అని మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

(ఇబ్నుమాజా - అనస్)

۱۲۵ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ: "لَا تَجُوْزُ وَصِیَّۃٌ لِّوَارِثٍ إِلَّآ أَنْ یَّشَآءَ الْوَرَثَۃُ۔" (مشکوٰۃ)

125. "ఒక వారసుని ఎడల మరణించిన వ్యక్తి చేసే వీలునామా, ఇతర వారసులు సమ్మతిస్తే తప్ప చెలామణి కాజాలదు." అని మహాప్రవక్త (సఅసం) బోధించారు. (మిష్కాత్)

---

123. అరవై ఏళ్ళంటే అక్షరాలా అరువయి ఏళ్ళని అర్థంకాదు. 'అత్యధికంగా విధేయతాపూర్వకమయిన జీవితం గడిపిన తరువాత' అని భావం. ఇలాంటి సత్పురుషులు లేక సద్వర్తనగల మహిళలయినా ఏవయినా మనస్పర్థల వల్లతమ వారసులకు తమ వీలునామా ద్వారా అన్యాయం చేస్తే వారి విధేయతా పూర్వకమైన జీవితం వారిని నరక యాతననుండి రక్షించజాలదు.

హజ్రత్ అబూహురైరా హదీసు సమర్థనలో పఠించిన ఆయత్ నిసా సూరాలోని 12, 13వ ఆయత్‌లు. అందులో వారసుల వాటాను నిర్ణయించిన తరువాత "ఈ వాటాలు, మరణించిన వ్యక్తి వీలునామాను, ఋణాలను చెల్లించిన తరువాత వారసుల్లో పంచబడతాయి. అయితే వీలునామా ద్వారా వారసులకు అన్యాయం చేకూర్చకూడదు. ఇది అల్లాహ్ ఆదేశం. అల్లాహ్‌కు అన్నీ తెలుసు. ఆయన వివేచనకు అవధుల్లేవు. ఇవి దైవం నిర్ణయించిన అవధులు. ఎవరయితే అల్లాహ్, ఆయన ప్రవక్త ఆదేశాలను పాటిస్తారో వారిని అల్లాహ్, సెలయేర్లు పారే ఉద్యానవనాల్లో ప్రవేశింపజేస్తాడు. వారు అక్కడ శాశ్వతంగా ఉంటారు. ఇదే మహోన్నతమైన సఫలత!" అని ప్రవచించాడు అల్లాహ్.

124. స్వర్గం మానవుని వారసత్వం ఏ విధంగా అయింది? ఆదిమానవులయిన హజ్రత్ ఆదం (అస్సలాం) కు ప్రారంభంలో స్వర్గమే నివాసస్థలంగా ఇవ్వబడింది. అందువల్ల మానవుని నిజమయిన "మాతృభూమి" లేక "పితృభూమి" అసలు స్వర్గమే! ఆ వారసత్వాన్ని కోల్పోవడమే అత్యంత దౌర్భాగ్యం.

١٢٦ عَنْ سَعْدِ بْنِ أَبِي وَقَّاصٍ قَالَ: عَادَنِي رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: وَأَنَا مَرِيضٌ، فَقَالَ: أَوْصَيْتَ؟ قُلْتُ: نَعَمْ، قَالَ: بِكَمْ؟ قُلْتُ: بِمَالِي كُلِّهِ فِي سَبِيلِ اللهِ، قَالَ: فَمَا تَرَكْتَ لِوَلَدِكَ؟ قُلْتُ: هُمْ أَغْنِيَاءُ بِخَيْرٍ، فَقَالَ: أَوْصِ بِالْعُشْرِ، فَمَا زِلْتُ أُنَاقِصُهُ حَتَّى قَالَ: أَوْصِ بِالثُّلُثِ، وَالثُّلُثُ كَثِيرٌ۔ (ترمذی)

126. హజ్రత్ సఅద్ బిన్ అబీవక్కాస్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: నేను జబ్బుపడి ఉన్నప్పుడు మహాప్రవక్త (సఅసం) నన్ను పరామర్శించ డానికి విచ్చేశారు. అప్పుడు "నీవు వీలునామా వ్రాశావా?" అని నన్ను అడిగారు. "వ్రాశాను" అని సమాధానమిచ్చాను. "ఎంత వ్రాశావు?"అని తిరిగి అడగ్గా "దైవ మార్గంలో నా ఆస్తి అంతా చెల్లి పోయేలా వ్రాశాను" అని చెప్పాను, "నీ భార్యాపిల్లలకు ఏం వదిలావు?" అని ఆయన ప్రశ్నిం చారు. దానికి నేను, "వారంతా బాగా ఉన్నారు, స్థితిపరులు" అన్నాను. అప్పుడు మహాప్రవక్త (సఅసం), "అలా కాదు, దైవమార్గంలో నీ ధనంలోని పదో వంతు అందేలా వీలు వ్రాయి" అని ఆదేశించారు. నేను, "ఇదయితే చాలా తక్కువ, కాస్త పెంచండి" అని పలుమార్లు వేడుకోగా ఆయన చివరికి "సరే, నీ ధనంలో మూడవ వంతుకు వీలువ్రాయి. మూడోవంతు పెద్ద మొత్తమే" అని అనుమతించారు. (తిర్మిజి)

---

125. వారసునికి వాటా దైవమే నిర్ణయించాడు. అందువల్ల అతని పట్ల వీలునామా ప్రశ్నరాదు. ఒక ప్రత్యేక వారసునికి అతని పరిస్థితుల దృష్ట్యా మరణించేవ్యక్తి తన వీలునామాలో వాటా కల్పిస్తే తతిమ్మా వారసులు అలా కల్పించడానికి అంగీకరిస్తే తప్ప ఆ వాటా చెల్లనేరదు అని ఈ హదీసు సూచిస్తోంది.

126. ఈ హదీసుద్వారా వ్యక్తమయ్యేదేమంటే మనిషి కేవలం తన ఆస్తిలో మూడవ వంతు వరకే వీలు వ్రాయగలడు. తతిమ్మా ఆస్తి అంతా చట్టం ప్రకారం వారసుల్లో పంచవలసిందే. ఆ మూడోవంతును మరణించే వ్యక్తి ఏ ధర్మకార్యానికైనా లేక అవసరమున్న ఏ ముస్లిం సోదరునికయినా వీలు వ్రాయడానికి అతనికి స్వేచ్ఛ ఉంది. అయితే తన బంధువుల్లో చట్టం ప్రకారం వారసత్వం లభించని అగత్యపరుడెవరయినా ఉంటే అతనిపట్ల వీలు వ్రాయడం పుణ్యప్రదం.

# వడ్డీ

١٢٧ عَنِ ابْنِ مَسْعُوْدٍ أَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَعَنَ اٰكِلَ الرِّبَا وَمُؤْكِلَهُ وَشَاهِدَيْهِ وَكَاتِبَهُ ـ (بخاری، مُسلم)

127. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (ర.అ) ఉల్లేఖనం ప్రకారం, మహాప్రవక్త (సఅసం) వడ్డీ తినే వానినీ, తినిపించే వానినీ దాని ఉభయ సాక్షుల్నీ, దాని లెక్క పత్రాల్ని వ్రాసే వానినీ శపించారు.

(బుఖారీ, ముస్లిమ్)

# లంచం

١٢٨ عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرٍو قَالَ ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : "لَعْنَةُ اللّٰهِ عَلَى الرَّاشِيْ وَالْمُرْتَشِيْ ـ" (بخاری، مُسلم)

128. అబ్దుల్లా బిన్ అమ్ర్ (రఅ) ఇలా ఉల్లేఖించారు : "లంచం ఇచ్చే వానిపైన లంచం పుచ్చుకునే వానిపైన అల్లాహ్ అభిశాపం కలుగుగాక!" అని దైవప్రవక్త శపించారు. (బుఖారీ, ముస్లిమ్)

---

127. మహాప్రవక్త (సఅసం) శపించిన విషయం ఎంత పెద్ద అపరాధం అయివుంటుందీ! ఇంతేకాదు, మరొక ఉల్లేఖనంలో తెలిసే వడ్డీ తినేవాణ్ణి, వడ్డీ యిచ్చేవాణ్ణి, సాక్ష్యం ఇచ్చేవాణ్ణి, లెక్క వ్రాసేవాణ్ణి ప్రళయదినాన మహాప్రవక్త ధూత్కరిస్తారని, శపిస్తారనీ ఉంది. అంటే అలాంటి వ్యక్తులకు (పశ్చాత్తాప రహితంగా మరణిస్తే) మహాప్రవక్త సిఫారసుకాక ఆయన ఆగ్రహం, ధూత్కారం ప్రాప్తమవుతాయని భావం (దైవం రక్షించుగాక).

128. లంచం పుచ్చుకోవడం ఏ విధంగా అపరాధమో ఇవ్వడం కూడా అపరాధమే. వాస్తవానికి అవినీతిపరులయిన ప్రజలు లేనిదే అవినీతి పరమయిన వ్యవస్థ ప్రపంచంలో మనగల్గుతుందా? నేడు లంచం కడుసాధారణమయిన విషయమయి పోయిందంటే దానికి కారణం లంచం ఇచ్చి పుచ్చుకోవడాల పట్ల ప్రజల్లో ఏహ్య భావం లేకపోవడమే!

129. ఒకరి హక్కును కాజేయడానికి ప్రభుత్వ కార్యకర్తలకు, అధికారులకు సమర్పించుకునే రొక్కాన్నే లంచం అంటారు. అయితే అధర్మమయిన రాజ్యవ్యవస్థలోని అవినీతిపరులయిన కార్యకర్తలనుండి ధర్మబద్ధమయిన హక్కును పొందడానికి మనసుపై బలవంతంచేసి

١٢٩ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ، قَالَ رَسُوْلُ اللّٰهِ عَلَيْهِ وَسَلَّمَ: "لَعْنَةُ اللّٰهِ عَلَى الرَّاشِيْ وَالْمُرْتَشِيْ فِي الْحُكْمِ" (منتقى)

129. "అధికారికి లంచం ఇచ్చే వానిపై, లంచం పుచ్చుకునే అధికారిపై అల్లాహ్ ఛీత్కారం కలుగుగాక" అని మహాప్రవక్త శపించినట్లు హజ్రత్ అబూహురైరా (ర.అ.) ఉల్లేఖించారు. (మున్తకా)

## అనుమానాస్పదమయిన విషయాలు

١٣٠ عَنِ النُّعْمَانِ بْنِ بَشِيْرٍ أَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "اَلْحَلَالُ بَيِّنٌ وَالْحَرَامُ بَيِّنٌ وَبَيْنَهُمَا أُمُوْرٌ مُشْتَبِهَةٌ فَمَنْ تَرَكَ مَا يَشْتَبِهُ عَلَيْهِ مِنَ الْإِثْمِ كَانَ لِمَا اسْتَبَانَ أَتْرَكَ، وَمَنِ اجْتَرَأَ عَلَى مَا يَشُكُّ فِيْهِ مِنَ الْإِثْمِ أَوْشَكَ أَنْ يُّوَاقِعَ مَا اسْتَبَانَ، وَالْمَعَاصِيْ حِمَى اللّٰهِ، مَنْ يَّرْتَعْ حَوْلَ الْحِمٰى يُوْشِكُ أَنْ يُّوَاقِعَهُ" (بخاری، مسلم)

130. హజ్రత్ నోమాన్ బిన్ బషీర్, మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారని ఉల్లేఖించారు: "ధర్మమయినవి విస్పష్టంగా ఉన్నాయి, అధర్మమైనవీ విస్పష్టంగా వున్నాయి. కాని వీటి మధ్య కొన్ని సందేహాస్పదమైన విషయాలున్నాయి. ఎవరయితే ఈ సందేహాస్పదమైన అపరాధాల నుండి దూరంగా ఉంటాడో అతను విస్పష్టమయిన పాప కార్యాలగురించి ఇంకా అధికంగా జాగ్రత్త వహిస్తాడు. ఏ వ్యక్తి సందేహభరితమయిన

---

ఇచ్చే డబ్బు విషయం ఏమిటి? దీని కారణంగా కూడా మనిషి అల్లాహ్ సన్నిధిలో ఛీత్కరించబడతాడా? అలాంటి మనిషి తాను చిక్కుకున్న విషవలయం కారణంగా (దైవ చిత్తమయితే) మన్నించబడవచ్చు అని భావిస్తున్నాము. అందువల్లనే ఇలాంటి పరిస్థితుల్లో దైవధర్మం అధికారంలో ఉండటం, అది ఆధిపత్యం వహించడం అత్యవశ్యమయిపోతుంది. అధర్మ వ్యవస్థలో గత్యంతరంలేక ఈ పాపానికి లోనయ్యేవారు ధర్మపరమయిన వ్యవస్థ సంస్థాపనకై కృషి అధికతరం చెయ్యాలి.

తప్పుల్ని చేయడానికి సాహసిస్తాడో అతను స్పష్టమయిన అపరాధాల్లో విలీనమయ్యే అవకాశాలు ఎక్కువవుతాయి. పాపకార్యాలు నిజానికి అల్లాహ్ నిషేధించిన స్థలాలు (వాటిలో కాలు పెట్టే అనుజ్ఞ ఎవరికీ లేదు. వాటిలో అనుజ్ఞ లేకుండా దూరిపోవడం మహాపరాధం). నిషిద్ధ స్థలానికి పరిసరాల్లో మేసే పశువులు నిషిద్ధ స్థలంలో దూరిపోయే అవకాశం ఎంతో అధికంగా ఉంటుంది." (బుఖారి, ముస్లిం)

١٣١ عَنْ عَطِيَّةَ السَّعْدِيِّ أَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: لَا يَبْلُغُ الْعَبْدُ أَنْ يَكُوْنَ مِنَ الْمُتَّقِيْنَ حَتّٰى يَدَعَ مَالَا بَأْسَ بِهٖ حَذَرًا لِّمَا بِهِ الْبَأْسُ۔ (ترمذی)

131. హజ్రత్ అతియా సఅదీ (ర.అ) ఇలా ఉల్లేఖించారు, "పాపపు కార్యంలో జారిపడే భీతివల్ల, ఏ పాపంలేని కార్యాన్ని కూడా త్యజించనంత వరకు ఒక వ్యక్తి దైవభీతి పరాయణులయిన దాసుల జాబితాలో చేరలేడు" అని మహాప్రవక్త (సఅసం) ప్రబోధించారు. (తిర్మిజీ)

---

130. ధర్మ సమ్మతమయినవీ, నిషిద్ధములైనవీ ప్రస్ఫుటంగానే దివ్య ఖుర్ఆన్‌లోను, మహాప్రవక్త సంప్రదాయాల్లోనూ విశదీకరించబడ్డాయి. అయితే ఒక్కోసారి ఒక విషయం ధర్మసమ్మతమయిందో అధర్మమయిందో ఇదమిత్థంగా తెలియదు. దాని కొన్ని రూపాలు ధర్మ సమ్మతమయినవిగా మరికొన్ని అధర్మ మయినవిగా అగుపిస్తాయి. అలాంటప్పుడు విశ్వాసి దాని దరిదాపులకు పోరాదు. ఇలా సందేహాస్పదమయిన వాటికి ఎడంగా ఉండే మనిషి స్పష్టమైన పాపాలకు దూరంగా ఉంటాడన్న నమ్మకం ఉంటుంది. దీనికి భిన్నంగా, సందేహాస్పదమైన విషయంలో, దాని అధర్మమైన కోణాలు కనిపించినా ఎవరైతే దాన్ని ఆచరిస్తాడో అతని అంతర్యం విస్పష్టమయిన అధర్మపు కార్యాన్ని చెయ్యడంలో వెనుకాడదు. సాహసవంతంగా ముందుకు వస్తుంది. ఇది ఎంతో ప్రమాదభరితమైన మానసిక స్థితి. దీని పర్యవసానం శాశ్వత నిష్ఫలతేతప్ప మరేమీ కాదు.

131. ఒక విషయం 'ముబాహ్' అయినా అంటే దాన్ని చెయ్యడంలో తప్పులేకపోయినా దాని సరిహద్దులు పాపానికి చేరువలో ఉన్న కారణాన మనిషి ఈ ముబాహ్ పని గట్టుపై తారాడుతూ 'కాలుజారి పాపంలో పడిపోతానేమో' అన్న భయంతో, ఆ ముబాహ్ పనిని చేయడం మానుకుంటాడు. ఇటువంటి మనోస్థితికి షరియత్ పరిభాషలో 'తఖ్వా' (దైవభీతి) అని పేరు. ఇటువంటి హృదయం కలవాడే వాస్తవమైన దైవభీతి పరాయణుడు. దివ్య ఖుర్ఆన్‌లో దైవాజ్ఞల్ని ఉల్లంఘించరాదని వారించిన ప్రతి చోటా "నేను నిశ్చయించిన హద్దుల్ని జవదాటరాదు" అని హెచ్చరించ లేదు, "ఈ హద్దుల దరిదాపులకు కూడా వెళ్ళకండి" అని ఉంటుంది.

# సామాజిక వ్యవస్థ

## వివాహం

١٣٢ عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "يَا مَعْشَرَ الشَّبَابِ مَنِ اسْتَطَاعَ مِنْكُمُ الْبَاءَةَ فَلْيَتَزَوَّجْ، فَإِنَّهُ أَغَضُّ لِلْبَصَرِ وَأَحْصَنُ لِلْفَرْجِ، وَمَنْ لَّمْ يَسْتَطِعْ فَعَلَيْهِ بِالصَّوْمِ، فَإِنَّهُ لَهُ وِجَاءٌ۔" (بخاری، مسلم)

132. అబ్దుల్లా బిన్ మస్ఊద్ (ర.అ) ఇలా ఉపదేశించారు: "యువకుల్లారా! మీలో వివాహబాధ్యతల్ని నెరవేర్చే శక్తి గలవారు తప్పక వివాహం చేసుకోవాలి. ఎందుచేతనంటే, వివాహం దృష్టిని క్రిందికివాలేలా చేస్తుంది. మర్మస్థానాన్ని రక్షిస్తుంది. వివాహ బాధ్యతల్ని నెరవేర్చే శక్తి లేనివారు అప్పుడప్పుడు రోజా (ఉపవాసవ్రతం)ని పాటించాలి, అది కామావేశాన్ని నిగ్రహింపచేస్తుంది అని దైవ ప్రవక్త (సఅసం) ప్రబోధించారు."
(బుఖారి, ముస్లిమ్)

١٣٣ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "تُنْكَحُ الْمَرْأَةُ لِاَرْبَعٍ، لِمَالِهَا وَلِحَسَبِهَا وَلِجَمَالِهَا وَلِدِيْنِهَا فَاظْفَرْ بِذَاتِ الدِّيْنِ تَرِبَتْ يَدَاكَ۔" (متفق علیہ - ابوھریرۃؓ)

133. ప్రవక్త మహనీయులు (సఅసం) ప్రబోధన: "స్త్రీని నాలుగు ప్రాతిపదికలపై పెళ్ళి చేసుకుంటారు. ఆమె ఐశ్వర్యాన్ని చూసి,ఆమె వంశప్రాశస్త్యాన్ని చూసి, ఆమె అందచందాలు చూసి, ఆమె ధార్మిక స్థితిని చూసి. మీరు ధార్మికురాలైన స్త్రీనే ఎన్నుకొనండి - మీకు మేలు కలుగుతుంది.
(ముత్తఫకున్ అలైహి-అబూహురైరా)

١٣٤ عَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرٍو أَنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ:
"لَا تَزَوَّجُوا النِّسَاءَ لِحُسْنِهِنَّ فَعَسٰى حُسْنُهُنَّ أَنْ يُّرْدِيَهُنَّ وَلَا تَزَوَّجُوْهُنَّ
لِأَمْوَالِهِنَّ فَعَسٰى أَمْوَالُهُنَّ أَنْ تُطْغِيَهُنَّ وَلٰكِنْ تَزَوَّجُوْهُنَّ عَلَى الدِّيْنِ،
وَلَأَمَةٌ سَوْدَاءُ ذَاتُ دِيْنٍ أَفْضَلُ." (منتقى)

134. ప్రవక్త మహనీయులు (సఅసం) ప్రబోధించారని, హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ (రజిఅన్) ఉల్లేఖించారు : "స్త్రీలను వారి అంద చందాలను బట్టి పెళ్ళాడకండి, వారి అందం వారిని సర్వనాశనం చెయ్యవచ్చు; వారి సిరిని చూసి పెళ్ళాడకండి, వారి కలిమి వారిని తలబిరుసుతనానికి, ధిక్కారానికి గురిచెయ్యవచ్చు. వారిని, వారి ధార్మికత ఆధారంగా పెళ్ళాడండి. ధర్మ పరాయణురాలైన నల్లని బానిస, అల్లాహ్ దృష్టిలో, ఎర్రని కులీన కాంత కంటే ఎంతో మెరుగు." (ముస్తకా)

---

132. వివాహంవల్ల మనిషి కోరికలు ఓ అదుపులోకి వస్తాయి. అతని చూపు పరిపరి విధాలుగా పరిభ్రమించదు. తద్వారా జీవితంలో నిగ్రహం, పరిశుద్ధత, పవిత్రత జనిస్తాయి. కామవాంఛ క్రమబద్ధమవుతుంది. వివాహం ఆ తరువాత దానికి సంబంధించిన బాధ్యతల్ని మోసే స్తోమత లేనివారు ఉపవాస వ్రతాన్ని పాటిస్తే తద్వారా మనో నిగ్రహానికి, కామకోరికల అదుపునకు మార్గం ఏర్పడుతుంది.

133. హదీస్ భావమేమంటే, జనులు ఈ నాలుగు గుణాలను స్త్రీలో వెదుకుతారు. ఒకరు సిరిసంపదలకు ముగ్ధులవుతారు. మరొకరు గొప్ప వంశావళి దృష్ట్యా నిర్ణయం గైకొంటారు. ఇంకొకరు అందచందాలు చూసి పెళ్ళాడుతారు. వేరొకరు ధార్మిక చింతన, ఆచరణ గమనిస్తారు. మహాప్రవక్త (సఅసం) విశ్వాసులకు బోధించిన దేమంటే అసలు విషయం ప్రామాణికంగా చూడవలసింది ధార్మికత, గుణగణాలు, నడవడిక. అయితే అన్ని సుగుణాలూ ధార్మికతకు తోడయితే ఇక వేరే చెప్పాలా? కాని కేవలం అందచందాలను, సిరిసంపదల్ని మాత్రమే ప్రమాణంగా తీసుకుని పెళ్ళాడటం సరయిన పద్ధతి కాదు. ఇది ముస్లిములకు తగదు.

134. కేవలం అందచందాలను, సంపదలను చూసి చేసుకునే నేటి వివాహాలు ఎలాంటి సామాజిక సంక్షోభానికి, కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నానికి దారితీస్తున్నాయో, అందం తెచ్చిపెట్టే అనర్థాలను, ధనం తెచ్చే మదాంధకారాన్నీ ఇరవయ్యో శతాబ్దంలో ఉన్న మనం కళ్ళారా చూస్తున్నాం, వీనులారా వింటున్నాం. మహాప్రవక్త (సఅసం)

١٣٥ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "إِذَا خَطَبَ إِلَيْكُمْ مَنْ تَرْضَوْنَ دِيْنَهُ وَخُلُقَهُ فَزَوِّجُوْهُ، إِنْ لَّا تَفْعَلُوْهُ تَكُنْ فِتْنَةٌ فِي الْأَرْضِ وَفَسَادٌ كَبِيْرٌ." (ترمذی)

135. "మీ వద్దకు పెళ్ళి సంబంధం వచ్చినప్పుడు, ఆ వ్యక్తి ధర్మ పరాయణత, గుణగణాలు మీకు నచ్చినట్లయితే అతనితో పెళ్ళి చేసివేయండి. మీరలా చేయకపోతే ధరణిలో అధర్మం చెలరేగుతుంది, గొప్ప కల్లోలిత పరిస్థితులు ఉత్పన్నమవుతాయి" అని దైవ సందేశహరుడు (సఅసం) ఉపదేశించారు. (తిర్మిజీ)

١٣٦ عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ: عَلَّمَنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ التَّشَهُّدَ فِي الصَّلٰوةِ وَالتَّشَهُّدَ فِي الْحَاجَةِ، وَذَكَرَ تَشَهُّدَ الصَّلٰوةِ قَالَ: وَالتَّشَهُّدُ فِي الْحَاجَةِ إِنَّ الْحَمْدَ لِلّٰهِ نَسْتَعِيْنُهُ وَنَسْتَغْفِرُهُ وَنَعُوْذُ بِاللّٰهِ مِنْ شُرُوْرِ أَنْفُسِنَا، مَنْ يَّهْدِهِ اللّٰهُ فَلَا مُضِلَّ لَهُ وَمَنْ يُّضْلِلْ فَلَا هَادِيَ لَهُ، وَأَشْهَدُ أَنْ لَّا إِلٰهَ إِلَّا اللّٰهُ وَأَشْهَدُ أَنَّ مُحَمَّدًا عَبْدُهُ وَرَسُوْلُهُ قَالَ: وَيَقْرَأُ ثَلَاثَ آيَاتٍ، فَفَسَّرَهَا سُفْيَانُ الثَّوْرِيُّ "اِتَّقُوا اللّٰهَ حَقَّ تُقٰتِهِ وَلَا تَمُوْتُنَّ إِلَّا وَأَنْتُمْ مُّسْلِمُوْنَ. اِتَّقُوا اللّٰهَ الَّذِيْ تَسَآءَلُوْنَ بِهِ وَالْأَرْحَامَ، إِنَّ اللّٰهَ كَانَ عَلَيْكُمْ رَقِيْبًا. اِتَّقُوا اللّٰهَ وَقُوْلُوْا قَوْلًا سَدِيْدًا. الآية

(ترمذی)

136. హ(జత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ (రజిఅన్) ఉల్లేఖనంలో "దైవసందేశహరుడు (సఅసం) మాకు నమాజ్‌లో పఠించవలసిన 'తషహ్హుద్'ను మరియు నికాహ్‌లో పఠించవలసిన తషహ్హుద్‌ను కూడా నేర్పారు" అని చెప్పి, నమాజ్‌లోని తషహ్హుద్ వినిపించిన, తరువాత

వివాహానికి సంబంధించిన తషహ్హుద్ ఇలా పఠించారు; (అనువాదం) స్తోత్రాభి వందనాలు అల్లాహ్‌కే. మేము ఆయన్నే సహాయానికై వేడుకుంటాము, క్షమాభిక్షకై ఆయన్నే అర్థిస్తాము. మా అంతర్యంలోని కీడుల బారి నుండి అల్లాహ్ రక్షణ వేడుతున్నాము. అల్లాహ్ ఎవరికయితే సన్మార్గం చూపుతాడో వారిని మరెవరూ మార్గం తప్పించలేరు. ఎవరినయితే వక్ర మార్గానపడవేస్తాడో వారినెవరూ సన్మార్గానికి తేలేరు. అల్లాహ్ తప్ప ఆరాధ్యుడు ఎవడూ లేడని సాక్ష్యమిస్తున్నాము. ముహమ్మద్ (సఅసం) ఆయన దాసుడు, సందేశహరుడు అని కూడా సాక్ష్యమిస్తున్నాము." ఆ తరువాత దివ్య ఖుర్‌ఆన్‌లోని మూడు ఆయత్‌లు పఠించారు. (తిర్మిజీ) ఆ ఆయత్‌లు సుఫియాన్ సౌరీ (రహ్మలై) ప్రకారం ఇవి:

يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا اتَّقُوا اللَّهَ حَقَّ تُقَاتِهِ وَلَا تَمُوتُنَّ إِلَّا
وَأَنتُم مُّسْلِمُونَ -

*1. విశ్వసించే వారలారా! అల్లాహ్ ఆగ్రహాన్నుండి రక్షించుకునేందుకు ఏ విధంగా కృషి చెయ్యవలసి ఉందో అలా పూర్తిగా చెయ్యండి. మరణించే వరకు దైవాజ్ఞాబద్ధులుగా మసలుకోండి.* ఆలి ఇమ్రాన్: *102*

٢ يَا أَيُّهَا النَّاسُ اتَّقُوا رَبَّكُمُ الَّذِي خَلَقَكُم مِّن نَّفْسٍ وَاحِدَةٍ
وَخَلَقَ مِنْهَا زَوْجَهَا وَبَثَّ مِنْهُمَا رِجَالًا كَثِيرًا وَنِسَاءً ، وَاتَّقُوا اللَّهَ الَّذِي
تَسَاءَلُونَ بِهِ وَالْأَرْحَامَ ، إِنَّ اللَّهَ كَانَ عَلَيْكُمْ رَقِيبًا -

*2. మానవుల్లారా! మీ ప్రభువు ఆగ్రహాన్నుండి మిమ్మల్ని మీరు రక్షించుకుంటూ ఉండండి, ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణాంశం నుండి పుట్టించాడు. దాని ద్వారా దాని జంటను చేశాడు. వారిరువురి ద్వారా పురుషుల్నీ స్త్రీలను విస్తరింపచేశాడు. ఇలాంటి ప్రభువు అయిష్టతకు గురికాకుండా భయపడుతూ ఉండండి. ఆయన పేరిట మీరు పరస్పరం*

---

ఉపదేశం 14 వందల ఏళ్ళ క్రితంనాటి ప్రజలకు ఎంత శిరోధార్యమో నేడు మనకూ అంతకంటే అధికంగా అనుసరణీయం!

మీ హక్కుల్ని అర్థిస్తూ ఉంటారు. మీ బంధువుల హక్కుల్ని కాపాడుతూ ఉండండి. అల్లాహ్ మిమ్మల్ని కనిపెట్టుకుని ఉన్నాడు. అన్-నిసా : 1

٣ يَا أَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ وَقُوْلُوْا قَوْلًا سَدِيْدًا يُّصْلِحْ لَكُمْ أَعْمَالَكُمْ وَيَغْفِرْ لَكُمْ ذُنُوْبَكُمْ وَمَنْ يُّطِعِ اللّٰهَ وَرَسُوْلَهٗ فَقَدْ فَازَ فَوْزًا عَظِيْمًا۔

3. విశ్వసించే వారలారా! అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి. సత్యమైన మాటనే పలకండి. అల్లాహ్ మీ ఆచరణలను సంస్కరిస్తాడు. మీ పొరపాట్లను మన్నిస్తాడు. ఎవరైతే అల్లాహ్ ఆయన సందేశహరుని విధేయత పాటిస్తారో వారే ఘన విజయాన్ని సాధిస్తారు. అల్-అహ్‌జాబ్: 71, 72.

## మహర్

١٣٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: أَحَقُّ الشُّرُوْطِ أَنْ تُوْفُوْا بِهٖ مَا اسْتَحْلَلْتُمْ بِهِ الْفُرُوْجَ۔ (بخاری، مُسلم۔ عقبہ بن عامرؓ)

137. "ఏ షరతు ద్వారా మీకు స్త్రీలతో సంయోగం ధర్మసమ్మతమవుతుందో - షరతుల్లో దానికిగల ప్రాముఖ్యత దృష్ట్యా పాటించేందుకు అదే అత్యధికంగా యోగ్యమయింది" అని మహాప్రవక్త బోధించారు.

(బుఖారి, ముస్లిం-ఉకబా బిన్ ఆమిర్)

135. ఈ హదీసు పై హదీసును ధృవీకరిస్తోంది : పెళ్ళి విషయంలో గమనించవలసింది ధర్మపరాయణత, నీతినియమాలే. సిరిసంపదలకు, వంశవిశేషాలకు ప్రాముఖ్యమిస్తే సమాజంలో ఎన్నో రుగ్మతలు పొడసూపుతాయి. కట్నాలు కానుకల కాశపడి జరిగే నేటి వివాహాల అనుభవం మనకందరికీ ఉంది. 'ప్రపంచ వ్యామోహం తలకెక్కితే ధర్మనిరతి దిగజారుతుంది, అందువల్ల ధర్మం, నీతిగల వ్యక్తులకు కాకుండా కేవలం ప్రాపంచిక సంపాదనాపరులకు ప్రాధాన్యమిస్తే కుటుంబ సౌఖ్యం సామాజిక శ్రేయాలు కొరవడతాయి. దాన్నే మహాప్రవక్త (సఅసం) అధర్మం, కల్లోలం అని అభివర్ణించారు.

136. ఇది వివాహ సందర్భాన చెయ్యబడే ప్రవక్త (సఅసం) సాంప్రదాయిక ప్రసంగం (ఖుత్‌బయే మస్నూన). ఈ సందర్భంలో ఈ ఆయత్‌లు పఠించడానికి గల కారణం ఏమిటంటే, వివాహం కేవలం సంతోష సంరంభమే కాదు, స్త్రీ పురుషుల జంట మధ్య

١٣٨ عَنْ عُمَرَ بْنِ الْخَطَّابِ قَالَ: "أَلَا لَا تُغَالُوا صَدُقَةَ النِّسَاءِ فَإِنَّهَا لَوْ كَانَتْ مَكْرُمَةً فِي الدُّنْيَا وَتَقْوٰى عِنْدَ اللّٰهِ، لَكَانَ أَوْلَاكُمْ بِهَا نَبِيُّ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، مَا عَلِمْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ نَكَحَ شَيْئًا مِنْ نِسَائِهِ وَلَا أَنْكَحَ شَيْئًا مِنْ بَنَاتِهِ عَلٰى أَكْثَرَ مِنِ اثْنَتَيْ عَشْرَةَ أُوْقِيَةً." (ترمذی)

138. హ(జత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ ఒకసారి ప్రసంగిస్తూ ఇలా అన్నారు: "సావధానంగా వినండి, మహిళల మహ్రును నిర్ణయించడంలో అతిశయానికిపోయి పెద్దపెద్ద మొత్తాలు నిర్ణయించకండి. ఎందుచేతనంటే ఇలా చెయ్యడం ప్రపంచంలో ఏమాత్రమయినా గౌరవ కారణమయ్యే విషయమయితే, దేవుని దృష్టిలో భయభక్తులకు గుర్తు అయితే, దీన్ని ఆచరించే అధికారం అత్యధికంగా దైవప్రవక్త (సఅసం)కు ఉండేది. కాని ఆయన, పన్నెండు "ఊకియా"ల కంటే అధికమయిన మహ్రును తన సతీమణుల్లో కానీ, తన కుమార్తెలలో కానీ యే ఒక్కరికీ నిర్ణయించినట్లు నేనెరుగను." (తిర్మిజీ)

---

ఒక ఒప్పందం కూడా! మేమిద్దరం జీవితాంతం అన్యోన్య సహచరులమనీ, పరస్పర సహకారులమనీ సృష్టికర్తకు, సర్వసృష్టికీ సాక్షులుగాచేసి చేసుకునే బాస ! ఈ ఆయత్‌లవల్ల తెలిసే మరో విషయమేమంటే, భర్త లేక భార్య తరపున ఈ ఒప్పందాన్ని భంగపరిచే చర్య జరిగి, దాన్ని దిద్దుకోవడం జరగకపోతే అతిక్రమణ చేసిన వారిపై దైవాగ్రహం కలిగి వారు నరకాగ్నికి పాత్రులవుతారు. అందువల్ల మూడు ఆయతుల్లోనూ విశ్వాసుల్ని దైవాగ్రహాన్నుండి తమ్ముతాము కాపాడుకునేందుకు తాకీదు చెయ్యబడింది.

137. దైవమిచ్చిన ఆదేశానుసారమే స్త్రీతో వివాహ మాడటం పురుషులకు ధర్మసమ్మతమయింది. అయితే ఆ ఆదేశం కేవలం ఒక హక్కును మాత్రమే ప్రసాదించదు. దానితో పాటు కొన్ని విధుల్ని సయితం అది వెంటతెస్తుంది. ఆ విధుల నిర్వహణలోగల ప్రాముఖ్యాన్ని ఈ హదీసు ద్వారా మహాప్రవక్త (సఅసం) విశ్వాసులకు విశదీకరించారు. ఆ విధి లేక షరతు మహ్రును చెల్లించడం.

138. వివాహ సందర్భంలో వరుని తరుపున వధువునకు ఇవ్వబడే కట్నమే మహ్ర్. దాన్ని ఆ సమయంలోనే తీర్చడమో లేదా తరువాత చెల్లించే ఒప్పందమో జరుగుతుంది.

١٣٩ عَنْ عُقْبَةَ بْنِ عَامِرٍ قَالَ ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ سَلَّمَ : خَيْرُ الصَّدَاقِ اَيْسَرُهٗ ۔ (نيل الاوطار)

139. "అత్యుత్తమయిన మహ్ర్, సాధారణమయినదే" అని మహాప్రవక్త (సఅసం) ప్రవచించినట్లు ఉకబా బిన్ ఆమిర్ ఉల్లేఖించారు.
(నైలల్ ఔతార్)

١٤٠ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : شَرُّ الطَّعَامِ طَعَامُ الْوَلِيْمَةِ يُدْعٰى لَهَا الْاَغْنِيَاءُ وَيُتْرَكُ الْفُقَرَاءُ وَمَنْ تَرَكَ الدَّعْوَةَ فَقَدْ عَصَى اللّٰهَ وَرَسُوْلَهٗ ۔ (بخاری ، مسلم ۔ ابوهريرةؓ)

140. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : 'ధనికుణ్ణి ఆహ్వానించి నిరుపేదల్ని కాదన్న వలీమా విందు అతి హేయమైన విందు. అయితే ఎవరైతే వలీమా ఆహ్వానాన్ని తిరస్కరిస్తారో వారు అల్లాహ్‌ను ఆయన సందేశహరుణ్ణి ధిక్కరించినట్లు.' (బుఖారి, ముస్లిమ్-అబూహురైరా)

---

ఇది అనివార్యమైన వధుకట్నం. హజ్రత్ ఉమర్ వాదించే విషయమేమంటే ప్రజలు తమ వంశం పేరు కోసం గర్వంగా పెద్దపెద్ద మొత్తాలను మహ్ర్‌గా నిర్ణయించుకుంటారు. తీరా అది చెల్లించవలసి వచ్చినప్పుడు అది వల్లమాలిన పనిగా పరిణమిస్తుంది. చివరికి వారి కంఠానికి ఉరిగా తయారవుంది. అందువల్లనే రెండవ ఖలీఫా అయిన హజ్రత్ ఉమర్ ముస్లింలు ఇలాంటి ఆడంబరాలు, డంబాచారాలకు గురి అవకూడదని హెచ్చరిస్తున్నారు. నిరాడంబరంగా, మహాప్రవక్త (సఅసం) ఆదర్శానికి అనుగుణంగా బ్రతకాలని బోధిస్తున్నారు.

ఒక్క "ఊకియా" పదితులాల వెండికి సమానం. మహాప్రవక్త తన వివాహానికయినా తన కుమార్తెల వివాహానికయినా 12 ఊకియాలకంటే అధికంగా మహ్ర్ నిర్ణయించలేదని తెలుస్తోంది. ఇది అనుచర సంఘానికి ఆదర్శప్రాయమయిన నమూనా. మహాప్రవక్త సతీమణి ఉమ్మె హబీబా మహ్ర్ మాత్రం దీనికంటే అధికంగా నిర్ణయమయింది. ఈ మహ్ర్‌ను నిర్ణయించింది, కట్టింది అబీసీనియా రాజు "నీగస్". ఈ నికాహ్ జరిగింది కూడా 'గాయిబానా' (పరోక్షం in-absentia) గానే.

139. అధికమయిన మహ్ర్ కుటుంబాల్లో ఎన్నో చిక్కుల్ని తెస్తుంది. ఒక్కో సందర్భంలో భార్యాభర్తలు కూడి ఉండడానికి ఇష్టపడరు. విడాకుల వరకు

۱۴۱ نَهٰی رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ عَنْ إِجَابَۃِ طَعَامِ الْفَاسِقِیْنَ ۔ (مشکوٰۃ ۔ عمران بن حصینؓ)

141. 'దైవప్రవక్త (సఅసం), 'ఫాసిక్' జనుల విందు ఆహ్వానాన్ని స్వీకరించరాదని బోధించారు' అని ఇమ్రాన్ బిన్ హుసీన్ (రజిఅన్)తెలిపారు. (మిష్కాత్)

## తల్లిదండ్రులు, బంధువుల హక్కులు

۱۴۲ قَالَ رَجُلٌ : یَارَسُوْلَ اللّٰہِ ! مَنْ أَحَقُّ بِحُسْنِ صَحَابَتِیْ ؟ قَالَ : أُمُّكَ ، قَالَ : ثُمَّ مَنْ ؟ قَالَ : أُمُّكَ ، قَالَ : ثُمَّ مَنْ ؟ قَالَ : أُمُّكَ ، قَالَ : ثُمَّ مَنْ ؟ قَالَ : أَبُوْكَ ، وَفِیْ رِوَایَۃٍ قَالَ ، أُمُّكَ ثُمَّ أُمُّكَ ، ثُمَّ أُمُّكَ ، ثُمَّ أَبَاكَ ثُمَّ أَدْنَاكَ فَأَدْنَاكَ ۔ (بخاری ، مُسلم ۔ ابوھریرہؓ)

142. ఒక వ్యక్తి మహాప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి "దైవ ప్రవక్తా! నా సేవ, సద్వ్యవర్తనలకు అందరికంటే అధికంగా హక్కుగలవారెవరు?" అని అడిగాడు. 'నీ తల్లి' అని సమాధానమిచ్చారు మహాప్రవక్త (సఅసం). అతను తిరిగి అడిగాడు – 'ఆ తరువాత ఎవరూ?,' 'నీ తల్లి' సమాధానం వచ్చింది. తిరిగి అతను 'ఆ తరువాత?' అని అడగ్గా, తిరిగి 'నీ తల్లి' అనే సమాధానం పలికారాయన. అతడు మరోసారి 'ఆ తరువాత ఎవరు?' అని అడిగాడు. అప్పుడు, "నీ తండ్రి, ఆ తరువాత బంధుత్వపు క్రమంలో నీ సన్నిహితులు" అని బదులు ఇచ్చారు ప్రవక్త మహనీయులు (సఅసం). (బుఖారి, ముస్లిమ్–అబూహురైరా)

---

వ్యవహారం పోతుంది. అయితే ఈ మహ్ర్ బెడదవల్ల భర్త విడాకులివ్వడు. అందువల్ల తాను చెల్లించగలిగే సాధారణమయిన మహ్రనే భర్త ఎప్పుడూ ఒప్పుకోవాలి. లేకపోతే దీని కారణంగా ఇటు విడాకులూ ఇవ్వలేక అటు మనుగడ సవ్యంగా సాగక కొంప నరకకూపంలా తయారవుతుంది.

అయితే ఈ సందర్భంలో ఒక విషయం గుర్తుంచుకోవాలి. పురుషుడు సంపాదనాపరుడు లేక ఆస్తిపరుడయితే తనకు వీలయినంతమేరకు, తనకు కష్టం కలగనంతమేరకు

۱۴۳ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "رَغِمَ أَنْفُهُ، رَغِمَ أَنْفُهُ، رَغِمَ أَنْفُهُ، قِيْلَ: مَنْ يَارَسُوْلَ اللّٰهِ؟ قَالَ: مَنْ أَدْرَكَ وَالِدَيْهِ عِنْدَ الْكِبَرِ أَحَدُهُمَا أَوْ كِلَاهُمَا ثُمَّ لَمْ يَدْخُلِ الْجَنَّةَ."

(مُسلم-ابوهريرةؓ)

143. దైవప్రవక్త (సఅసం) ఒకసారి, "వాడి ముక్కుకు మన్ను తగల" అని మూడు పర్యాయాలు సెలవిచ్చారు. "ఎవరు వాడు, దైవప్రవక్తా!" అని అడిగారు అక్కడున్న వారు. "తన తల్లిదండ్రుల్ని, వారిద్దరినో లేక వారిలో ఒక్కరినో, వృద్ధాప్యంలో చూసి (వారి సేవ చేసి) స్వర్గంలో ప్రవేశించని వాడు." అని పలికారు దైవ ప్రవక్త (సఅసం).

(ముస్లిమ్- అబూహురైరా)

---

అధికంగా మహ్ర్ చెల్లించడం, తద్వారా స్త్రీని సంతోష పెట్టడం ఉచితమే. ఇంతకు, ఏ రూపంలోనూ అతి వాదానికి గురికాకుండా మధ్యే మార్గం అవలంబించడమే ఇస్లాం నేర్పుతుంది.

140. వలీమా అంటే వివాహం జరిగిన తరువాత వధువూ వరుడూ కలిశాక చేసుకునే విందు. ఇది సున్నత్ అంటే అనుసరణీయమయిన ప్రవక్త సంప్రదాయం అని తెలుస్తోంది. అయితే శ్రీమంతుల్ని ఆహ్వానించి సమాజంలోని బీదలను పిలువకపోవడం చాలా అసహ్యమయిన విషయం. ఇది ఇస్లాం చూపే సర్వ సమానతా భావానికి విరుద్ధం.

ఈ హదీసు ద్వారా మరో విషయం కూడా విదితమవుతుంది. విందు భోజనాన్ని ఏ సమంజసమయిన కారణమూ లేకుండా తిరస్కరించడం కూడా మహాప్రవక్త సంప్రదాయానికి విరుద్ధం.

141. "ఫాసిక్" అంటే అల్లాహ్ మరియు ఆయన సందేశహరుని ఆజ్ఞల్ని తెలిసీ, బాహాటంగా ఉల్లంఘించే వ్యక్తి అని, ధర్మాధర్మాలను పాటించకుండా సిగ్గువిడిచి జీవించే వ్యక్తి అనీ భావం. ఇలాంటి వ్యక్తి ఏర్పరచే విందులో పాల్గొనడం దేవుని ఆజ్ఞల్ని ఉల్లంఘించేవారిని ప్రోత్సహించడంతో సమానం. అయితే అతని ఆహ్వానాన్ని మంచితనంతో సముచితంగా ఒక విశ్వాసి అవలంబించవలసిన మృదువయిన వైఖరితో కాదనాలి. ఏ సందర్భంలోనూ ఎదుటివాని హృదయాన్ని గాయపర్చే మాటను నోటిద్వారా రానీయరాదనే నియమాన్ని గుర్తుంచుకుని మెలగాలి.

142. ఈ హదీసు ద్వారా సంతానానికి తమ తల్లిదండ్రుల ప్రాముఖ్యం, అందునా తల్లి అంతస్థు బాగా ద్యోతకమవుతాయి. ముమ్మారు తల్లి ప్రాముఖ్యాన్ని మహాప్రవక్త

قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ اللهَ حَرَّمَ عَلَيْكُمْ ١٤٤
عُقُوقَ الْأُمَّهَاتِ وَوَأْدَ الْبَنَاتِ وَمَنْعًا وَّهَاتِ ، وَكَرِهَ لَكُمْ قِيلَ وَقَالَ
وَكَثْرَةَ السُّؤَالِ وَإِضَاعَةَ الْمَالِ -"

144. "అల్లాహ్, తల్లిదండ్రుల ఎడల దుష్ ప్రవర్తనను, ఆడపిల్లల్ని సజీవంగా సమాధి చెయ్యడాన్ని మీకై అధర్మమయిన కార్యాలుగా నిర్ణయించాడు. లోభత్వాన్ని, పిసినారితనాన్ని వారించాడు. వ్యర్థమయిన సంభాషణల్ని, అధికంగా ప్రశ్నించడాన్ని, ధనం వ్యర్థంగా వ్యయపరచడాన్ని తనకు అయిష్టమయిన కార్యాలుగా చెప్పాడు." అని ప్రవక్త మహనీయులు (సఅసం) బోధించారు.

---

వ్యక్తపరచడం ద్వారా సేవ, ప్రేమాభిమానాల దృష్ట్యా, తండ్రికంటే తల్లి అధికం అని తెలుస్తోంది. ఇదేమాట దివ్య ఖుర్‌ఆన్‌లోనూ ఉంది. లుక్మాన్ సూరాలో ఇలా ప్రవచించబడింది :

"మేము మానవుణ్ణి, తల్లిదండ్రులపట్ల కృతజ్ఞతా పూర్వకంగా ప్రవర్తించేందుకు ఆదేశించాము. అతని తల్లి అతన్ని అష్టకష్టాలు భరించి, తొమ్మిది మాసాలు గర్భంలో పెంచింది. ఆ తరువాత రెండేళ్ళపాటు అతన్ని తన రక్తం( పాలు) ద్వారా పోషించింది".

దీని మూలంగానే విజ్ఞులు, ఆదరణ, వినయ విధేయతల మేరకు తండ్రి అధికంగా అర్హుడనీ సేవ దృష్ట్యా తల్లి స్థానమే గొప్పదనీ అభిప్రాయపడ్డారు.

143. 'వాడి ముక్కుకు మన్ను తగల' అనేది అరబ్బీ నానుడి, తెలుగులో "వాడు పాడుగాను", "వాడి కొంప తగలడ" అనే తిట్టు లాంటిది ఇది. అభాగ్యాన్ని, దురదృష్టాన్ని సూచిస్తుంది. తల్లిదండ్రుల సేవ మనిషికి స్వర్గార్హతను కల్పిస్తుందని, తల్లిదండ్రుల్లో ఏ ఒక్కరు ఉన్నా వారి సేవ చేసి తరించనివాడు దురదృష్టవంతుడనీ ఈ హదీసు ద్వారా తెలుస్తోంది.

144. తల్లిదండ్రుల ఎడల, ప్రవర్తన సవ్యంగా లేకపోతే అది బిడ్డల్ని సజీవంగా పూడ్చి పెట్టే పాతకంతో సమానమవుతుందని ఈ హదీసువల్ల ద్యోతకమవుతోంది.
అధికంగా ప్రశ్నించడమంటే గ్రుచ్చి గ్రుచ్చి అడగటం అన్న మాట, తనకు తెలియని విషయాన్ని అడిగి తెలుసుకోవడం భావ్యమే, అయితే ఒక్కో విషయంలో యూదులు గోబలిని గురించి ప్రశ్నించి చిక్కుల్లో పడినట్లు పడకూడదనీ భావం. యూదులు గోబలి సందర్భంలో ప్రవర్తించిన తీరు బఖరా సూరాలో అభివర్ణించటం జరిగింది. నేడు కూడా ధర్మాదేశాలను ఆచరించదలచనివారు, ఇలాంటి వ్యర్థ ప్రశ్నలువేసి తప్పించుకోడానికి సాకులు వెదికేవారు సమాజంలో మనకు తారసపడుతూనే ఉంటారు.

١٤٥ عَنْ أَبِي أُسَيْدٍ السَّاعِدِيِّ قَالَ: بَيْنَا نَحْنُ عِنْدَ رَسُولِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِذْ جَاءَهُ رَجُلٌ مِّنْ بَنِي سَلِمَةَ فَقَالَ: يَا رَسُولَ اللّٰهِ! هَلْ بَقِيَ مِنْ أَبَوَيَّ شَيْءٌ أَبَرُّهُمَا بِهِ بَعْدَ مَوْتِهِمَا. قَالَ: نَعَمْ، اَلصَّلٰوةُ عَلَيْهِمَا وَالْإِسْتِغْفَارُ لَهُمَا وَإِنْفَاذُ عَهْدِهِمَا مِنْ بَعْدِهِمَا وَصِلَةُ الرَّحِمِ الَّتِي لَا تُوْصَلُ إِلَّا بِهِمَا وَإِكْرَامُ صَدِيْقِهِمَا۔ (ابوداؤد)

145. హజ్రత్ అబూ ఉసైద్ (రజిఅన్) ఉల్లేఖనం : మేము మహాప్రవక్త (సఅసం) సన్నిధిలో కూర్చొని ఉండగా "బనూ సలిమ" తెగకు చెందిన వ్యక్తి ఒకతను ఆయన దగ్గరికి వచ్చాడు. అతను, "దైవ ప్రవక్తా! తల్లి దండ్రులు గతించిన తరువాత వారి ఎడల నాపై ఏదయినా బాధ్యత ఉంటుందా"?అని అడిగాడు. అప్పుడు మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "అవును ఉంటుంది వారి మోక్షం కొరకు, క్షమాపణ కొరకు దైవసన్నిధిలో ప్రార్థించు. వారు వ్రాసిపోయిన ధర్మసమ్మతమయిన విల్లు ప్రకారం ఆచరించు. వారి బంధువుల పట్ల ప్రేమతో, దయతో మెలుగు. వారి మిత్రులతో గౌరవంగా, మర్యాదగా ప్రవర్తించు." (అబూదావూద్)

١٤٦ عَنْ أَبِي الطُّفَيْلِ قَالَ: رَأَيْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقْسِمُ لَحْمًا بِالْجِعِرَّانَةِ إِذْ أَقْبَلَتِ امْرَأَةٌ حَتّٰى دَنَتْ إِلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَبَسَطَ لَهَا رِدَاءَهُ فَجَلَسَتْ عَلَيْهِ فَقُلْتُ مَنْ هِيَ قَالُوْا: هِيَ أُمُّهُ الَّتِي أَرْضَعَتْهُ۔ (ابوداؤد)

146. అబూతుఫైల్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: నేనొకసారి మహాప్రవక్త (సఅసం)ను 'జిహ్రాన' అనే చోట మాంసం పంచిపెడు తుండగా చూసాను. అప్పుడు ఓ మహిళ అక్కడికి వచ్చి మహాప్రవక్త సమీపానికి వెళ్ళింది. ఆమెను చూడగానే ఆయన (సఅసం) తన దుప్పటిని పరచగా ఆమె దానిపై కూర్చుంది. 'ఎవరీమె' అని నేనడగ్గా అక్కడున్న వారు, "ఈమె దైవప్రవక్తకు పాలిచ్చిన తల్లి (ఆయా)" అని తెలిపారు.

(అబూదావూద్)

١٤٧ عَنْ اَسْمَاءَ بِنْتِ أَبِي بَكْرٍ قَالَتْ : قَدِمَتْ عَلَيَّ أُمِّي وَهِيَ مُشْرِكَةٌ فِي عَهْدِ قُرَيْشٍ ، قُلْتُ : يَارَسُوْلَ اللهِ ! إِنَّ أُمِّي قَدِمَتْ عَلَيَّ وَهِيَ رَاغِبَةٌ أَفَأَصِلُهَا ؟ فَقَالَ : نَعَمْ صِلِيْهَا - (بخاری، مُسلم)

**147.** హ|జత్ అబూబ|క్ కుమార్తె హ|జత్ అస్మా (రజిఅన్) ఉల్లేఖనం: ముస్లిమ్‌లు, ఖురైషుల మధ్య ఒడంబడిక జరిగిఉన్న కాలంలో ఓ రోజున నాకు పాలు పట్టిన తల్లి (ఆయా) నా వద్దకు వచ్చింది. అప్పటికి ఆమె ఇంకా ఇస్లామ్ స్వీకరించలేదు. బహుదైవోపాసనావస్థలోనే ఉంది. అప్పుడు నేను మహాప్రవక్త (సఅసం)ను, "నా తల్లి (దాది) నా వద్దకు వచ్చింది. నేనేమయినా ఇస్తానని ఆమె ఆశిస్తోంది. నేనలా ఇవ్వ వచ్చునా?" అని అడిగాను. దానికి ఆయన, "నిరభ్యంతరంగా ఇవవచ్చు- ఆమెపట్ల ప్రేమానురాగాలతో వ్యవహరించు." అని బోధించారు.

(బుఖారి, ముస్లిమ్)

---

145. తల్లి దండ్రులు బ్రతికి ఉండగా వారి సేవ చెయ్యడం, వారిపట్ల గౌరవ మర్యాదలతో వ్యవహరించడం, వారికి విధేయులుగా ఉండటమే కాక వారు గతించిన తరువాత కూడా సంతానంపై ఉన్న వారి హక్కును మహాప్రవక్త ఈ హదీసులో బోధించారు. వారి మోక్షం, క్షమాభిక్షల కొరకు ప్రార్థించడం అన్నింటినీ మించిన హక్కు. విల్లు విషయంలో 'ధర్మసమ్మతమయిన' అన్న ఆంక్షను గుర్తుంచుకోవాలి. తల్లి దండ్రులకు సంబంధించిన బంధువుల హక్కులు సంతానంపై కూడా కొన్ని ఉంటాయి. ఆ హక్కుల నిర్వర్తనలో నిక్కచ్చిగా కాక, కాస్త దయాభావంతో ప్రవర్తించాలని మహాప్రవక్త ఉద్బోధ. వారే లేనప్పుడు వారి మిత్రులతో నాకేమిటి? అని తలచకుండా గౌరవ మర్యాదలతో వ్యవహరించాలని సెలవిచ్చారు మహనీయ ముహమ్మద్(సఅసం).

146. మహాప్రవక్తకు బాల్యంలో పాలుపట్టి పెంచిన దాది హలీమా ఈ హదీసులో ప్రస్తావించబడిన మహిళ. తన చిన్ననాటి దాదిని మహాప్రవక్త(సఅసం) సొంత తల్లివలె గౌరవంగా చూసేవారని ఈ హదీసుద్వారా వెల్లడి అవుతోంది. వంటిమీది దుప్పటిని ఇతరులు కూర్చోడానికి పరచడం అరబ్బు సంప్రదాయంలో అత్యంత మర్యాద సూచకం.

147. ప్రవక్త శ్రేష్ఠులు(సఅసం) మదీనా వలస వెళ్ళిన తరువాత, జరిగిన యుద్ధాలలో తమకు కలిగిన పరాభవాన్ని కప్పిపుచ్చుకోవడానికి, మక్కానాయకులు, దైవ ప్రవక్తను ఆయన అనుచరుల్ని హజ్ చేసేందుకు అనుమతించలేదు.

۱۴۸ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : لَيْسَ الْوَاصِلُ بِالْمُكَافِئِ
وَلٰكِنَّ الْوَاصِلَ الَّذِىْ إِذَا قُطِعَتْ رَحِمُهٗ وَصَلَهَا - (بخاری ، ابن عمرؓ)

148. "బంధువుల ఎడల వారు చేసే మేలుకు బదులుగా మేలు చెయ్యడం సంపూర్ణంగా 'సిలారహ్మ్' అవదు. ఉత్తమమయిన 'సిలారహ్మ్' అంటే, బంధువులు సంబంధాలు తెంపుకున్నా అతను మాత్రం వారితో తన బాంధవ్యాన్ని పెంపొందించుకుంటూ వారి హక్కుల్ని నిర్వర్తిస్తూ ఉండాలి" అని దైవ సందేశహరులు (సఅసం) ఉపదేశించారు.

(బుఖారి - ఇబ్ను ఉమర్)

۱۴۹ إِنَّ رَجُلًا قَالَ : يَا رَسُوْلَ اللهِ ! إِنَّ لِىْ قَرَابَةً أَصِلُهُمْ وَيَقْطَعُوْنِىْ
وَأُحْسِنُ إِلَيْهِمْ وَيُسِيْئُوْنَ إِلَىَّ ، وَأَحْلُمُ عَنْهُمْ وَيَجْهَلُوْنَ عَلَىَّ - فَقَالَ :
" لَئِنْ كُنْتَ كَمَا قُلْتَ فَكَأَنَّمَا تُسِفُّهُمُ الْمَلَّ وَلَا يَزَالُ مَعَكَ مِنَ اللهِ ظَهِيْرٌ
عَلَيْهِمْ مَا دُمْتَ عَلٰى ذٰلِكَ - " (مسلم - ابوہریرہؓ)

149. ఒక వ్యక్తి మహాప్రవక్త (సఅసం) తో ఇలా నివేదించు కున్నాడు: 'దైవప్రవక్తా! మా బంధువులు కొందరున్నారు. నేను వారిపట్లగల వారి హక్కుల్ని నెరవేరుస్తూ ఉంటాను, కాని వారు మాత్రం నా హక్కులను ఖాతరు చెయ్యరు. నేను వారిపట్ల ఎంతో మంచిగా ప్రవర్తిస్తాను, వారు మాత్రం నా ఎడల చెడుగానే వ్యవహరిస్తారు, నేను వారితో సహనంగా ఓరిమితో మెలుగుతుంటాను, వారేమో నాతో మూర్ఖంగా ప్రవర్తిస్తారు.' అది విని మహాప్రవక్త (సఅసం), "నీ ప్రవర్తన నీవన్నట్లే ఉంటే నీవు వారి ముఖాలకు మసిపులుముతున్నావు. నీవు ఇలాగే స్థిరచిత్తంతో వ్యవహరించినంతవరకు వారికి వ్యతిరేకంగా అల్లాహ్ నీకు సహాయపడుతూ ఉంటాడు," అని అభయమిచ్చారు. (ముస్లిమ్ - అబూహురైరా)

---

అయితే అప్పుడు హుదైబియా అనుచోట మక్కా వాసులకు మహాప్రవక్త (సఅసం) కు మధ్య యుద్ధవిరమణ ఒప్పందం కుదిరింది. దాని దృష్ట్యా ఉభయ నగరాల మధ్య శాంతియుతంగా రాకపోకలు ప్రారంభమయ్యాయి. ఈ హదీసులో ప్రస్తావించబడిన సంఘటన ఆ కాలం నాటిదే.

# భార్యల హక్కులు

١٥٠ عَنْ حَكِيمِ بْنِ مُعَاوِيَةَ الْقُشَيْرِىْ عَنْ أَبِيهِ قَالَ : قُلْتُ : يَارَسُوْلَ اللهِ ! مَاحَقُّ زَوْجَةِ أَحَدِنَا عَلَيْهِ ؟ قَالَ : "أَنْ تُطْعِمَهَا إِذَا طَعِمْتَ وَ تَكْسُوْهَا إِذَا اكْتَسَيْتَ وَلَاتَضْرِبِ الْوَجْهَ ، وَلَاتُقَبِّحْ ، وَلَاتَهْجُرْ إِلَّافِى الْبَيْتِ -" (ابوداؤد)

150. తన తండ్రి ఇలా చెప్పినట్లు హకీం బిన్ ముఆవియా ఉల్లేఖించారు: 'మహాప్రవక్త (సఅసం)ను నేను, "భార్యకు తన భర్తపై గల హక్కు ఏమిటి?" అని అడగ్గా ఆయన ఈ విధంగా బోధించారు: "నీవు తిన్నది ఆమెకూ పెట్టాలి; నీవు తొడిగినది ఆమెకు కూడా తొడిగించాలి. ఆమెను ముఖంపై కొట్టకూడదు; ఆమెను శాపనార్థాలతో తిట్టకూడదు; ఆమెతో దూరంగా మెలిగినా అది ఇంటి వరకే." (అబూదావూద్)

---

తల్లిదండ్రులు, ఇతర బంధువులు, చివరికి పాలిచ్చిన దాది అయినా సరే, ఇస్లాం స్వీకరించకపోయినా వారి ఎడల సాధారణ మానవీయ ప్రేమానురాగాల ప్రదర్శనలో, మంచి నడవడిలో ఎలాంటి లోటు రానివ్వకూడదని ఈ హదీసు భావం.

148. బంధువులు, ఆప్తులు మనపట్ల మంచి నడవడిక కనబరచినందుకుగాను మనమూ వారి ఎడల మంచిగా ప్రవర్తించినట్లయితే అందులో ఘనత ఏముందని? బంధువులు ఏ కారణాలవల్లనయినా లేక నిష్కారణంగానయినాసరే ఎంతసేపటికి మనల్ని దూరం చేస్తూనే ఉన్నపక్షంలో మనం వారికి అంతే చేరువవుతూ ఉండాలి. వారు మన విషయంలో తమ బాధ్యతల్ని నిర్వర్తించకపోయినా, మన హక్కును మనకు సవ్యంగా అందించలేకపోయినా మనం మాత్రం వారి హక్కులనన్నింటినీ నెరవేర్చడానికి వారిపట్ల మన బాధ్యతల్ని నిర్వర్తించడానికి సిద్ధంగా ఉండాలి. ఈ నడత అలవరచుకోవడం సులభసాధ్యం కాదు - అయితే మనిషి ఆంతర్యంలో పరమప్రభువు ప్రసన్నత పొందే ఆకాంక్ష ఆయనపట్ల భయభక్తులు ఉన్నత స్థాయిలో ఉన్నట్లయితే ఇది అసాధ్యమూ కాదు.

149. బంధువుల మధ్య ఒకరిపట్ల ఒకరికి కొన్ని హక్కులూ బాధ్యతలు నియమించింది ఇస్లాం. వాటిని నిర్వర్తించడంలో ఏ పక్షం వారయినా ఉపేక్ష చూపరాదు. "ముఖాలకు మసిపులుమడం" అనేది అరబీనానుడి. పరాభవ సూచకం. నీవు నీ బాధ్యతల్ని నెరవేర్చుతుండగా వారు దానికి విరుద్ధమయిన రీతిలో వ్యవహరిస్తే అది పరలోకంలో

١٥١ عَنْ لَقِيْطِ بْنِ صَبْرَةَ قَالَ، قُلْتُ: يَا رَسُوْلَ اللهِ! إِنَّ لِي إِمْرَأَةً فِي لِسَانِهَا شَيْءٌ يَعْنِي الْبَذَاءَ، قَالَ: "طَلِّقْهَا"، قُلْتُ: إِنَّ لِي مِنْهَا وَلَدًا وَلَهَا صُحْبَةٌ- قَالَ: "فَمُرْهَا يَقُوْلُ: عِظْهَا، فَإِنْ يَّكُ فِيْهَا خَيْرٌ فَسَتَقْبَلُ، وَلَا تَضْرِبَنَّ ظَعِيْنَتَكَ ضَرْبَكَ أُمَيَّتَكَ-" (ابوداؤد)

151. లకిత్ బిన్ సబ్ర ఇలా ఉల్లేఖించారు : నేను మహాప్రవక్తతో "నా భార్య నిత్యం దుర్భాషలాడుతూ ఉంటుంది" అని విన్నవించు కున్నాను. దానికి మహాప్రవక్త (సఅసం) "విడాకులిచ్చెయ్యి" అని అన్నారు. నేను, "ఆమె వల్ల నాకు సంతానం కలిగింది. ఎంతో కాలం నాటిది మా సహ చర్యం"అని చెప్పుకున్నాను. అప్పుడు మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "ఆమెకు మంచిని బోధించు. ఆమెలో మంచిని స్వీకరించే గుణమే ఉంటే ఆమె నీ మాట కాదనదు. జాగ్రత్త ! బానిసల్ని కొట్టినట్టు నీ భార్యను ఎన్నటికీ కొట్టబోకు!" (అబూదావూద్)

---

పరాభవానికి కారణమవుతుంది అని దీని భావం. ఈ హదీసు ద్వారా తెలిసే మరో విషయం, మంచిగా ప్రవర్తించే వ్యక్తికి దైవ సహాయం నిత్యం తోడుగా ఉంటుంది అన్న యదార్థం.

150. అంటే అన్న పానీయాల్లో, కట్టుబట్టల్లో ఎలాంటి తారతమ్యాన్నీ, అసమంజస వ్యత్యాసాన్నీ, ఆమెకు బాధ కలిగించే విధానాన్నీ అవలంబించరాదు. మరో విషయం ఏమిటంటే భార్య ఒకవేళ అవిధేయతతో మొండిగా ప్రవర్తిస్తే దివ్య ఖుర్ఆన్ ఆదేశానుసారం ముందు ఆమెకు నచ్చజెప్పి, మంచిగా మలచుకునేలా ప్రయత్నం చెయ్యాలి. ఆమె మారకపోతే తన పడకను మాత్రం వేరుచేసుకోవాలి. అయితే ఇంటి గుట్టు బయటికి పొక్కకుండా చూసుకోవాలి. అంతేగాని ఇంటి మాటల్ని గడపదాటనివ్వడం సంస్కార వంతుల తీరుకాదు. అప్పటికీ ఆమె తన వైఖరిని మార్చుకోకపోతే ఆమెను కొట్టవచ్చు. అయితే ఎంతో నాజూకు చోటయిన ముఖంపై కాదు, వేరేచోట కొట్టాలి. అందులోనూ అక్కసంతా వెళ్ళగక్కుకుంటూ "ఎముకలు విరిగేలా" "వీపు చిట్లేలా" కొట్టడం గాయపరచడం అమానుషం అని కూడా మరో హదీసు ద్వారా తెలుస్తుంది.

151. "విడాకులివ్వ"మని మహాప్రవక్త చెప్పినమాట అర్థవంతమూ మనస్తత్వం రీత్యా భావగర్భితమూ అయింది. ఆ వ్యక్తికి తన భార్య పట్లగల ప్రేమానురాగాల విషయం బహుశా మహాప్రవక్త (సఅసం) కు తెలిసి ఉంటుంది. అందుకే ఆయన అలా అనగానే ఆ వ్యక్తి ఉలిక్కిపడి నాభావం అది కాదు, అన్నట్టు సంజాయిషి చెప్పుకున్నాడు.

١٥٢ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "لَا تَضْرِبُوْا إِمَاءَ اللّٰهِ" فَجَاءَ عُمَرُ إِلَى رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ ذَئِرْنَ النِّسَاءُ عَلٰى أَزْوَاجِهِنَّ ۔ فَرَخَّصَ فِي ضَرْبِهِنَّ فَطَافَ بِآلِ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ نِسَاءٌ كَثِيْرٌ يَشْكُوْنَ أَزْوَاجَهُنَّ، فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "لَقَدْ طَافَ بِآلِ مُحَمَّدٍ نِسَاءٌ كَثِيْرٌ يَشْكُوْنَ أَزْوَاجَهُنَّ۔ لَيْسَ أُولٰئِكَ بِخِيَارِكُمْ" (ابوداؤد - اياس بن عبد اللهؓ)

152. మహాప్రవక్త (సఅసం) ఒకసారి, "ఇదో జాగ్రత్త ! అల్లాహ్ దాసీలను కొట్టరాదు." అని హెచ్చరించారు. కొంత కాలానికి హజ్రత్ ఉమర్ (రజిఅన్) దైవ ప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి, 'మీరు ఆ విధంగా ఉపదేశించిన కారణంగా భర్తలు భార్యల్ని శిక్షించడం బొత్తిగా మానేశారు. అందువల్ల స్త్రీలు భర్తల్ని ఖాతరు చెయ్యడం లేదు,' అని చెప్పుకున్నారు. అప్పుడు మహాప్రవక్త (సఅసం) అవసరమయితే కొట్టే అనుజ్ఞనిచ్చారు, ఆ తరువాత మహాప్రవక్త సతీమణుల వద్దకు మహిళల బృందం ఒకటి తమ భర్తలు కొట్టడం పట్ల ఫిర్యాదు చేశారు. అప్పుడు మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు "మా ఇంటి వారి వద్ద చాలా మంది మహిళలు తమ భర్తల ప్రవర్తనను గురించి ఫిర్యాదులు చేశారు. మీలో అలా ప్రవర్తించే వారు ఏమాత్రం మంచివారు కారు."

(అబూదావూద్-అయాస్ బిన్ అబ్దుల్లాహ్)

---

ఆ తరువాత మహాప్రవక్త చేసిన ఉపదేశంలో ఇమిడి ఉన్న భావం ఏమిటంటే, చిన్న చిన్న విషయాలపై కంగారుపడి భార్యాభర్తల అనుబంధానికి భంగం కలిగించేలా వ్యవహరించరాదు. మరో విషయమేమంటే ఇస్లాంకు పూర్వం ఉన్న బానిసల వ్యవస్థలో వారిని వారి యజమానులు చావబాదేవారు. అదొక అమానుషమయిన చర్య. ఆ విధంగా పరిచారికలనయినా, భార్యలనయినా కొట్టకూడదని మహాప్రవక్త (సఅసం) బోధించారు.

152. అల్లాహ్ దాసీలు అంటే స్త్రీలు, భార్యలు అని అర్థం. ఈ హదీసు ద్వారా కొన్ని ఇతర హదీసుల ద్వారాను, మహిళలు తమ సమస్యల పరిష్కారం కోసం సామూహికంగా ప్రతినిధివర్గం రూపంలో మహాప్రవక్త (సఅసం) సతీమణుల వద్దకు వెళ్ళేవారని, అలా

۱۵۳ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : لَا يَفْرَكْ مُؤْمِنٌ مُّؤْمِنَةً إِنْ كَرِهَ مِنْهَا خُلُقًا رَضِيَ مِنْهَا اٰخَرَ ۔ (مُسلم۔ ابوھریرۃؓ)

153. "ఒక మోమిన్ (విశ్వాసి) మోమినా (విశ్వాసురాలు) అయిన తన భార్యను అసహ్యంచుకోకూడదు. ఆమెలోని ఏదయినా ఒక గుణం తనకు నచ్చకపోయినా ఎన్నో ఇతర గుణాలు తనకు పసందుకావచ్చు." అని దైవ సందేశహరులు (సఅసం) ప్రబోధించారు.

(ముస్లిమ్-అబూహురైరా)

۱۵۴ عَنْ عَمْرِو بْنِ الْأَحْوَصِ الْجُشَمِيِّ أَنَّهُ سَمِعَ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فِيْ حَجَّةِ الْوَدَاعِ يَقُوْلُ بَعْدَ أَنْ حَمِدَ اللّٰهَ تَعَالٰى وَأَثْنٰى عَلَيْهِ وَذَكَّرَ وَوَعَظَ ثُمَّ قَالَ : أَلَا وَاسْتَوْصُوْا بِالنِّسَاءِ خَيْرًا ، فَإِنَّمَا هُنَّ عَوَانٍ عِنْدَكُمْ ۔ لَيْسَ تَمْلِكُوْنَ مِنْهُنَّ شَيْئًا غَيْرَ ذٰلِكَ إِلَّا أَنْ يَّاْتِيْنَ بِفَاحِشَةٍ مُّبَيِّنَةٍ ، فَإِنْ فَعَلْنَ فَاهْجُرُوْهُنَّ فِي الْمَضَاجِعِ وَاضْرِبُوْهُنَّ ضَرْبًا غَيْرَ مُبَرِّحٍ ، فَإِنْ أَطَعْنَكُمْ فَلَا تَبْغُوْا عَلَيْهِنَّ سَبِيْلًا ۔ أَلَا إِنَّ لَكُمْ عَلٰى نِسَائِكُمْ حَقًّا وَّلِنِسَائِكُمْ عَلَيْكُمْ حَقًّا فَحَقُّكُمْ عَلَيْهِنَّ أَنْ لَّا يُوْطِئْنَ فُرُشَكُمْ مَّنْ تَكْرَهُوْنَ ، وَلَا يَأْذَنَّ فِيْ بُيُوْتِكُمْ لِمَنْ تَكْرَهُوْنَ ، أَلَا وَحَقُّهُنَّ عَلَيْكُمْ أَنْ تُحْسِنُوْا إِلَيْهِنَّ فِيْ كِسْوَتِهِنَّ وَطَعَامِهِنَّ ۔"

(ترمذی)

154. అమ్ర్ బిన్ అహ్వస్ జుషమీ ఇలా ఉల్లేఖించారు: మహాప్రవక్త (సఅసం) హజ్జతుల్ విదాలో ప్రసంగిస్తూ ఉండగా నేను విన్నాను. ఆయన ఆ ప్రసంగంలో తొలుత దైవస్తోత్ర వచనాలు పలికారు. పిదప మరెన్నో విషయాలు ఉపదేశించిన మీదట, ఇలా సెలవిచ్చారు, "ప్రజలారా! బాగా వినండి, స్త్రీలపట్ల ఉత్తమరీతిలో ప్రవర్తించండి, ఎందుచేతనంటే, వారు

మీ అధీనంలో ఉన్నారు. వారు బాహాటంగా అవిధేయతకు పాల్పడినప్పుడు మాత్రమే వారిపట్ల కాస్త కఠినంగా వ్యవహరించవచ్చు. అలా చేసినా వారు మాట వినకపోతే పడకల్లో వారికి దూరంగా ఉండండి. అనివార్య మయితే, వారు గాయపడకుండా కొంత దండించవచ్చు. అప్పటికీ వారు మీమాట వినకపోతే, వారిని యేదో ఒక విధంగా ఏడిపించాలన్న ఉద్దేశ్యంతో సాకులు వెదక్కండి. బాగా వినండి, మీ భార్యల హక్కులు కొన్ని మీపైన ఉన్నాయి. మీ హక్కులు కూడా కొన్ని వారిపైనా ఉన్నాయి, వారిపైన ఉన్న మీ హక్కులు ఏవంటే, మీరు ఇష్టపడని వారిని మీ నేలపై అడుగుపెట్టనివ్వకూడదు. మీకు ఇష్టంలేనివారిని మీ గడప తొక్కనివ్వరాదు. ఇంకా, వినండి; అది మీపైన వారికి గల హక్కు. మీరు వారికి సమృద్ధిగా అన్నపానీయాలు, వస్త్రాలు సమ కూర్చాలి."

(తిర్మిజీ)

١٥٥ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : إِذَا أَنْفَقَ الرَّجُلُ عَلٰى اَهْلِهِ يَحْتَسِبُهَا فَهُوَ لَهُ صَدَقَةٌ (متفق عليه - ابومسعود بدرىؓ)

155. "మనిషి పరలోకంలో సత్ఫలితం పొందే ఉద్దేశ్యంతో తన ఇంటివారిపై ఖర్చు చేస్తే, అది అతని "సదకా" (మంచి దానం)గానే పరిగణించబడుతుంది." అని ప్రబోధించారు మహాప్రవక్త (సఅసం).

(ముత్తఫకున్ అలైహ్ - అబూ మస్ఊద్ బద్రి)

---

చెయ్యడంలో తప్పులేదని కూడా తెలుస్తోంది. మహిళలకు బాధకలిగించే విధంగా శిక్షించడం ఉచితం కాదని మహనీయుని ప్రబోధనా సారం.

153. దీని భావమేమంటే భార్య అందంగా లేకపోయినా మరో విధంగా ఆమెలో లోపం, కొరత ఉన్నా కేవలం ఈ కారణంచేత తక్షణం ఆమెతో తెగతెంపులు చేసుకునే ఆలోచనచెయ్యకూడదు. ఒక స్త్రీ కొన్ని విధాలుగా లోపభూయిష్ట మయినదయినా మరెన్నో విధాలుగా తన భర్త హృదయాన్ని చూరగొనగలదు. అయితే ఆమెకు ఆ అవకాశం కల్పించాలి. ఆమెలోని కేవలం ఒకే లోపం వల్ల ఆమెపట్ల సదా ద్వేషం కలిగి ఉండటం సమంజసంకాదు.

154. హజ్జతుల్ విదా ప్రసంగంచాలా ముఖ్యమయింది. చాలా ప్రఖ్యాతిగాంచింది

١٥٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "كَفٰى بِالْمَرْءِ إِثْمًا أَنْ يُّضَيِّعَ مَنْ يَّقُوْتُ." (ابوداؤد-عبدالله بن عمرؓ)

156. దైవసందేశహరులు (సఅసం) ఒకసారి ఇలా ఉపదేశించారు, "మనిషి పాపి కావడానికి తాను పోషించవలసి వున్నవారిని వదలి వెయ్యడం ఒక్కటే చాలు". (అబూదావూద్-అబ్దుల్లా బిన్ ఉమర్)

١٥٧ عَنْ أَبِيْ هُرَيْرَةَ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "إِذَا كَانَتْ عِنْدَ الرَّجُلِ اِمْرَأَتَانِ فَلَمْ يَعْدِلْ بَيْنَهُمَا جَاءَ يَوْمَ الْقِيٰمَةِ وَشِقُّهٗ سَاقِطٌ." (ترمذی)

157. "ఎవరికయినా ఇద్దరు భార్యలుండి, అతడు వారి హక్కుల్ని న్యాయంగా, సమానంగా, సమంజసంగా నిర్వర్తించకపోతే, తీర్పు దినాన అతను తన సగం దేహం కోల్పోతాడు, అదే స్థితిలో లేచివస్తాడు." అని మహాప్రవక్త చెప్పినట్లు అబూహురైరా ఉల్లేఖించారు. (తిర్మిజీ)

---

కూడా. అది మహాప్రవక్త అంతిమ హజ్ యాత్ర గనుక ఆయన (సఅసం) అందులో అనేకమయిన మౌలిక విషయాలను ప్రస్తావించారు. ఎన్నో ముఖ్యవిషయాలను విశదీకరించారు. ఈ హదీసులో కేవలం ఒక విషయాన్ని మాత్రమే ప్రస్తావించడం జరిగింది. అంత ముఖ్యమయిన ప్రసంగంలో స్త్రీల విషయాన్ని చేర్చడాన్ని గమనిస్తే మహిళల సహజమయిన, సమంజసమయిన హక్కుల పట్ల మహాప్రవక్త ఎంతగా శ్రద్ధ వహించేవారో తెలుస్తోంది.

155. "దానం" అనేది నిత్యం ఇతరులకే చెయ్యబడుతుందని సాధారణ భావం. అయితే మనిషి ధర్మబద్ధంగా సంపాదించి ధర్మసమ్మతంగానే తన ఇంటి వారి కొరకు ఖర్చుచేస్తే అది కూడా దానంతో సమానమని, అంటే పుణ్యఫలాన్ని ఇస్తుందని ఈ హదీసులో మహాప్రవక్త బోధించారు. తన భార్యాపిల్లల కొరకు ధనం వెచ్చించడం మనిషి కనీస బాధ్యత. అయితే అందులో కూడా పుణ్యసముపార్జన జరగటం విశ్వాసి భాగ్యం !

156. పాపం అంటే ఏవో కొన్ని నిర్ణీతమయిన చెడులే కాదు. మనిషి తన బాధ్యతను విస్మరించి, తన అండన బ్రతికే వారిని నిర్లక్ష్యంచేసి గొప్పగొప్ప ధర్మనిష్ఠ కార్యాలు చేసినా, మహాభయభక్తులు కలవాడిగా లోకందృష్టిలో వ్యవహరించినా అతడు పాపం

# భర్త హక్కులు

١٥٨ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "اَلْمَرْأَةُ إِذَا صَلَّتْ خَمْسَهَا وَصَامَتْ شَهْرَهَا وَأَحْصَنَتْ فَرْجَهَا وَأَطَاعَتْ بَعْلَهَا فَلْتَدْخُلْ مِنْ أَيِّ أَبْوَابِ الْجَنَّةِ شَاءَتْ۔" (مشکوٰۃ - انس رضؓ)

158. మానవ మహోపకారి (సఅసం) ఒకసారి ఇలా ఉపదేశించారు: "స్త్రీ అయిదు వేళలా నమాజ్ చేస్తూ, రమజాన్ నెలలో ఉపవాసాలు పాటిస్తూ, తన శీలాన్ని కాపాడుకుంటూ భర్త పట్ల విధేయతతో మసలుకుంటూ ఉంటే, ఆమె పరలోకాన స్వర్గ ద్వారాల్లో తనకు ఇష్టమయిన దాని ద్వారా ప్రవేశించవచ్చు. (మిష్కాత్-అనస్)

١٥٩ قِيْلَ لِرَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: اَيُّ النِّسَاءِ خَيْرٌ؟ قَالَ: "اَلَّتِيْ تَسُرُّهُ إِذَا نَظَرَ، وَتُطِيْعُهُ إِذَا أَمَرَ، وَلَا تُخَالِفُهُ فِيْ نَفْسِهَا وَلَا مَالِهَا بِمَا يَكْرَهُ۔" (نسائی - ابوھریرہ رضؓ)

159. మహాప్రవక్తను ఎవరో అడిగారు, "ఉత్తమ మహిళ ఎవరు?" అని. దానికి మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ఏ మహిళయితే, భర్త తన వైపు చూసినప్పుడు అతన్ని ప్రసన్నం చేస్తుందో, ఎవరయితే భర్త ఏదైనా చెయ్యమన్నప్పుడు ఎదురుచెప్పకుండా చేస్తుందో, ఎవరైతే తన విషయంలో, తన సొత్తు విషయంలో తన భర్త మనస్సు నొప్పించే వైఖరి అవలంబించదో ఆమె ఉత్తమ మహిళ." (నసాయి -అబూహురైరా)

---

చేస్తున్నాడనేందుకు తనవారిపట్ల అతని ఉపేక్షాభావమే చాలు అని మహాప్రవక్త ఉపదేశానికి అర్థం.

157. అతడు సగం దేహంతో రావడానికి కారణమేమంటే అతడు ప్రపంచంలో ఏ భార్య హక్కులనయితే సరిగ్గా నిర్వర్తించలేదో ఆమె అతని 'అర్ధాంగి' కదా, తన సగం దేహాన్ని అతడు ప్రపంచంలోనే తెగ్గొట్టుకుంటే అతనికి పరలోకంలో పూర్తి దేహం ఎలా ప్రాప్తమవుతుంది?

١٦٠ عَنْ أَبِي سَعِيدٍ قَالَ: جَاءَتِ امْرَأَةٌ إِلَى رَسُولِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ وَنَحْنُ عِنْدَهُ، فَقَالَتْ: زَوْجِي صَفْوَانُ بْنُ الْمُعَطَّلِ يَضْرِبُنِي إِذَا صَلَّيْتُ، وَيُفَطِّرُنِي إِذَا صُمْتُ، وَلَا يُصَلِّي الْفَجْرَ حَتَّى تَطْلُعَ الشَّمْسُ، قَالَ وَصَفْوَانُ عِنْدَهُ، قَالَ فَسَأَلَهُ عَمَّا قَالَتْ، فَقَالَ: يَا رَسُولَ اللهِ! أَمَّا قَوْلُهَا "يَضْرِبُنِي إِذَا صَلَّيْتُ" فَإِنَّهَا تَقْرَأُ بِسُورَتَيْنِ وَقَدْ نَهَيْتُهَا. قَالَ لَهُ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: لَوْ كَانَتْ سُورَةً وَاحِدَةً لَكَفَتِ النَّاسَ، قَالَ: وَأَمَّا قَوْلُهَا "يُفَطِّرُنِي إِذَا صُمْتُ" فَإِنَّهَا تَنْطَلِقُ تَصُومُ وَأَنَا رَجُلٌ شَابٌّ فَلَا أَصْبِرُ، فَقَالَ: رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: لَا تَصُومُ امْرَأَةٌ إِلَّا بِإِذْنِ زَوْجِهَا. وَأَمَّا قَوْلُهَا " إِنِّي لَا أُصَلِّي حَتَّى تَطْلُعَ الشَّمْسُ"، فَإِنَّا أَهْلُ بَيْتٍ قَدْ عُرِفَ لَنَا ذَالِكَ، لَا نَكَادُ نَسْتَيْقِظُ حَتَّى تَطْلُعَ الشَّمْسُ، قَالَ: فَإِذَا اسْتَيْقَظْتَ يَا صَفْوَانُ فَصَلِّ." (ابوداؤد)

160. హ్రజత్ అబూ సయీద్ ఖుద్రి (రజిఅన్) ఉల్లేఖించారుః "మేము ఒకసారి మహాప్రవక్త (సఅసం) సన్నిధిలో కూర్చొని ఉండగా ఒక మహిళ ఆయన వద్దకు వచ్చి "నా భర్త సఫ్వాన్ బిన్ ముఅత్తిల్, నేను నమాజ్ చేయడాన్ని సహించరు; నన్ను కొడతారు. నేను రోజా పాటిస్తే దాన్ని విరమించమంటారు. ఇక ఆయన పరిస్థితి ఎలా ఉందంటే, పొద్దు పొడవక మునుపు లేవరు, ఫ్రజ్ నమాజ్ చెయ్యరు." అని చెప్పుకుంది. అప్పుడు సఫ్వాన్ అక్కడే ఉన్నారు. భార్య ఫిర్యాదును గురించి దైవ ప్రవక్త సఫ్వాన్‌ను అడగ్గా ఆయన ఇలా సంజాయిషీ చెప్పుకున్నాడు. "దైవ ప్రవక్తా! ఆమె నమాజ్ చేయడాన్ని నేను సహించకపోవడంలోని యదార్థమేమంటే, ఈమె రెండేసి సూరాలు పఠిస్తుంది. నేను వారిస్తూ ఉంటాను." అది విని మహాప్రవక్త ఆమెతో - "ఒక సూరా చాలు" అని సెలవిచ్చారు. సఫ్వాన్ ఇంకా ఇలా చెప్పారుః

"రోజా విరమించ మనడంలోని వాస్తవం ఏమిటంటే, ఈమె ప్రతిదినం రోజా పాటిస్తూనే ఉంటుంది. నేనా యువకుణ్ణి, నిగ్రహించుకోలేను." దానికి మహా ప్రవక్త (సఅసం) ఇలా బోధించారు: "ఏ మహిళా తన భర్త అనుజ్ఞలేనిదే రోజా పాటించరాదు." తరువాత సఫ్వాన్, "నేను సూర్యో దయం అయ్యాక నమాజ్ చెయ్యడం గురించి నిజమేమంటే, మా వంశంలోని వారు పొద్దుపొడవక మునుపు మేల్కొన లేరన్నది జగద్వి దితమే" అని విన్నవించుకోగా దైవప్రవక్త (సఅసం) ఈ విధంగా బోధించారు: "అయితే, సఫ్వాన్, మేల్కొనగానే నమాజ్ చెయ్యడం అలవరచుకో." (అబూదావూద్)

---

158. ఒక ముస్లిమ్ పాటించవలసిన కనీసపు విధుల్ని నిర్వర్తిస్తూ తన భర్తను ప్రసన్నుడుగా ఉంచిన స్త్రీ స్వర్గంలో నిరాటంకంగా యధేచ్ఛగా ప్రవేశించగలదంటే స్త్రీ పురుషుల సత్సంబంధానికి ఇహపర ఉభయ లోకాల దృష్ట్యా ఎంత గొప్ప ప్రాముఖ్యముందో అవగత మవుతూనే ఉంది. ఈ ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకోకపోవడం మూలానే అనేక కుటుంబాలు విచ్ఛిన్నమయి ఇహమూ పరమూ రెంటినీ కోల్పోతున్నాయి.

159. భర్త సంతోషమే తన సంతోషంగా, భర్త ఆజ్ఞ శిరోధార్యంగా మసలు కోవడం, తన సర్వస్వాన్నయినా, తన సొంత ఆస్తి పాస్తులనయినా, ఇంటి యజ మానురాలిగా తనకు భర్త అప్పజెప్పిన సొత్తునయినా, తన జీవన సహచరునికై సంశయరహితంగా త్యాగం చెయ్యడంకన్నా ఉత్తమ ప్రమాణం, సహేతుకమయిన ఆదర్శం మరొకటి కాగలదా? మహాప్రవక్త ఒక ఆదర్శ మహిళకు ఉండవలసిన ముఖ్య లక్షణాలు మూడు ముక్కల్లో చెప్పేశారు. అయితే ఇది కేవలం ప్రేమపూర్వకంగా జరిగే విషయమే కాని బలవంతాన అయ్యే పనికాదు. నియమం అంతకన్నాకాదు.

160. ఈ హదీసు ద్వారా అనేక విషయాలు ద్యోతకమవుతున్నాయి.

(1) హదీసులో ప్రస్తావించబడినదాని ప్రకారం భార్యలు "ఫర్జ్" (విధి) నమాజులు చేస్తూ సుదీర్ఘమైన సూరాలు పఠించడం పట్ల కాస్త తమ భర్తల అవసరాలను దృష్టిలో ఉంచుకుని మరీ మెలగాలి. అయితే స్త్రీలను ఫర్జ్ నమాజ్‌ను వారించే అధికారం పురుషులకు ఏ మాత్రం లేదు. నఫిల్ (అదనపు) నమాజ్ విషయంలో మాత్రం స్త్రీలు తమ భర్తల ఇష్టాన్ని, అభీష్టాన్ని గమనించి మసలుకోవడం మంచిది.

(2) ఈ హదీసులో ప్రస్తావించబడిన రోజాకూడా నఫిల్ (అదనపు) రోజా అనే తెలుస్తోంది. ఎందుకంటే ఫర్జ్ (విధి) రోజాను వారించే అధికారం కూడా ఎవరికీ లేదు. మహిళలు తమ భర్తల ఇష్టాన్ని దృష్టిలో ఉంచుకుని నఫిల్ రోజాను పాటించాలి. అవసరమైతే నఫిల్ రోజాను భగ్నపరచవచ్చు కూడా.

١٦١ عَنْ اَسْمَاءَ بِنْتِ يَزِيْدَ الْاَنْصَارِيَّةِ قَالَتْ مَرَّ بِيَ النَّبِيُّ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَأَنَا فِيْ جَوَارٍ اَتْرَابٍ لِّيْ - فَسَلَّمَ عَلَيْنَا
وَقَالَ : اِيَّاكُنَّ وَكُفْرَ الْمُنْعِمِيْنَ - قَالَ : وَلَعَلَّ اِحْدَاكُنَّ تَطُوْلُ أَيْمَتُهَا
مِنْ أَبَوَيْهَا ، ثُمَّ يَرْزُقُهَا اللّٰهُ زَوْجًا وَيَرْزُقُهَا مِنْهُ وَلَدًا ، فَتَغْضَبُ
الْغَضْبَةَ فَتَكْفُرُ فَتَقُوْلُ : مَارَأَيْتُ مِنْكَ خَيْرًا قَطُّ - " (الادب المفرد)

161. ఎజీద్ కుమార్తె అస్మా ఇలా ఉల్లేఖించారు: "నే నొకసారి నా సమ వయస్కురాలైన అమ్మాయిలతో కలసి కూర్చొని ఉండగా మహాప్రవక్త (సఅసం) అటుగా వెళ్ళారు. ఆయన మాకు సలాంచేసి ఉపదేశించారు: "మంచిగా ప్రవర్తించే భర్తలపట్ల కృతఘ్నతతో మెలగకండి." "మీలో ఎవరయినా తమ తల్లిదండ్రుల ఇంట చాలా కాలం వరకు కూర్చుండి పోవచ్చు. తరువాత దైవం ఆమెకు పతిని ప్రసాదిస్తాడు, అతని వల్ల ఆమెకు సంతానం కూడా కలుగుతుంది. ఆ తరువాత ఎప్పుడైనా మాటల సందర్భాన, ఏదో మాటపై మాట పెరిగి అతనితో వాదులాడుతుంది ఆమె. అప్పుడు కోపావేశంలో ఆమె, అతనితో, 'నీ వల్ల నేను ఏ సుఖానికీ' నోచుకోలేదు. నా కోసం మేలయినదేదీ నీవు చెయ్యలేదు' అని కూడా అంటుంది." (అల్ అదబుల్ ముఫ్రద్)

---

(3) సఫ్వాన్ ప్రాతఃకాలపు నమాజ్ చేసేందుకు ఆలస్యం చెయ్యడం పట్ల ఫిర్యాదుకు కారణమేమంటే సఫ్వాన్ బిన్ ముఅత్తిల్ కుటుంబంవారు, రాత్రిలో అత్యధిక భాగం తోటలకు, పొలాలకు నీరు కట్టి కాయకష్టాల్లోనే గడిపే వారు. వీరు ఫజ్ర్ నమాజ్ వేళకు మేల్కొనడం సాధ్యపడని విషయమని తెల్లమవుతూనే ఉంది. సఫ్వాన్ బిన్ ముఅత్తిల్ ఉత్తమశ్రేణికి చెందిన సహచరుడు. ఆయన ప్రాతఃకాలపు ప్రార్థనపట్ల అశ్రద్ధ వహిస్తారని అనుమానపడటానికి ఆస్కారం లేదు. ఇలా యాదృచ్ఛికంగానే జరిగి ఉంటుంది. రాత్రి ఆలస్యంగా నిద్రపోవడం మూలానా, తెల్లారి లేవలేక పోవడం వల్లనూ, ఎవరూ లేపకపోవడం చేతనూ ఆయన ఆ ప్రార్థన చెయ్యలేకపోయి ఉంటారు. అందుకే మహాప్రవక్త కేవలం "మేల్కొనగానే నమాజ్ చెయ్యి" అని చెప్పి ఆగ్రహించకుండా వదిలేశారు.

161. స్త్రీలు సాధారణంగా ఎంతబాగుపడినా కృతఘ్నతా ధోరణికి లోనయ్యే ఆస్కారముంటుంది. ఈ హదీసులో మహాప్రవక్త స్త్రీ జీవితంలో, ఆమె పట్ల దైవం

۱۶۲ عَنْ ثَوْبَانَ قَالَ: لَمَّا نَزَلَتْ "وَالَّذِيْنَ يَكْنِزُوْنَ الذَّهَبَ وَ
الْفِضَّةَ"، كُنَّا مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فِيْ بَعْضِ أَسْفَارِهِ،
فَقَالَ بَعْضُ اَصْحَابِهٖ : نَزَلَتْ فِي الذَّهَبِ وَالْفِضَّةِ ، لَوْعَلِمْنَا
أَيُّ الْمَالِ خَيْرٌ فَنَتَّخِذَهٗ فَقَالَ: "اَفْضَلُهٗ لِسَانٌ ذَاكِرٌ وَّقَلْبٌ
شَاكِرٌ وَّزَوْجَةٌ مُّؤْمِنَةٌ تُعِيْنُهٗ عَلٰى دِيْنِهٖ - (ترمذی)

162. హజ్రత్ సౌబాన్ (రజిఅన్) ఉల్లేఖనం: మేము దైవప్రవక్తతో పాటు ఒకసారి ప్రయాణం చేస్తూ ఉండగా, "ఎవరైతే బంగారు, వెండిని కూడబెడతారో, దాన్ని దైవమార్గంలో ఖర్చుపెట్టరో వారిని, ఆ (ప్రళయ) దినం లభించే బాధాకరమయిన శిక్షను గురించి హెచ్చరించండి." (అనే ఆయత్) అవతరించింది. అప్పుడు కొందరు సహచరులు, "ఇది వెండి, బంగారు కూడబెట్టడాన్ని గురించి అవతరించింది. దీనివల్ల వీటిని కూడ బెట్టడం అవాంఛనీయమని తెలిసింది. అయితే ఏ సంపద సిరి రూపంలో శుభకరమవుతుందో తెలిస్తే దాన్నే కూడబెట్టేవాళ్ళం" అని చెప్పుకున్నారు. అప్పుడు ఆయన ఇలా బోధించారు, "అన్నిటికంటే శ్రేష్ఠమయినది దైవ నామసంస్మరణ చేసే జిహ్వ, దైవ కృతజ్ఞతతో నిండిన గుండె, ధర్మ పథంలో పతికి తోడ్పడే సుగుణవతి అయిన సతి."

(తిర్మిజి)

---

చూపే కరుణానుగ్రహాల్ని ఎత్తి చూపెడుతూ ఈ దురలవాటుకు దర్పణం పట్టి చూపారు. స్త్రీలు అబలలవడం చేతనూ సున్నిత మనస్కులవడం చేతనూ చిటికెడు బాధ కలిగినా పుట్టెడు వ్యథ వ్యక్తపరుస్తారు. గతంలోని సుఖాన్ని మరచిపోతారు. స్త్రీలు ఈ దురలవాటుకు లోనవకూడదని ఇందులో బోధించబడింది.

162. ఈ హదీసులో ప్రస్తావించబడిన ఆయత్ దివ్య ఖుర్ఆన్‌లోని 9వ సూరా 'తౌబా'లోని 345వ ఆయత్.

ఈ హదీసు ద్వారా తెలిసేదేమంటే, అల్లాహ్ నామసంస్మరణ నోటితో చెయ్యడం అవసరం; అయితే కృతజ్ఞతా భావంతో చెయ్యబడే సంస్మరణే వాంఛనీయం. ఇంకా ధర్మపరాయణుడయిన తన భర్తకు ఎదురయ్యే కష్టనష్టాల్లో ఓరిమితో సహకరించి

۱۶۳ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "كُلُّكُمْ رَاعٍ وَكُلُّكُمْ
مَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهِ - وَالْأَمِيْرُ رَاعٍ وَالرَّجُلُ رَاعٍ عَلٰى أَهْلِ بَيْتِهِ
وَالْمَرْأَةُ رَاعِيَةٌ عَلٰى بَيْتِ زَوْجِهَا وَوَلَدِهِ ، فَكُلُّكُمْ رَاعٍ وَكُلُّكُمْ
مَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهِ وَفِيْ رِوَايَةٍ : وَالْخَادِمُ رَاعٍ عَلٰى مَالِ سَيِّدِهِ"

(متفق علیہ - ابن عمرؓ)

163. మహాప్రవక్త (సఅసం) ప్రబోధించారు: "మీలో ప్రతి వ్యక్తి బాధ్యతాయుతుడయిన సంరక్షకుడే. మీ సంరక్షణలో ఉండేవారిని గురించి మీలో ప్రతి వ్యక్తినీ ప్రశ్నించడం జరుగుతుంది. పాలకుడు పాలిత ప్రజల సంరక్షకుడు; పురుషుడు తన ఇంటి వారికి సంరక్షకుడు; స్త్రీ తన పతి గృహానికి అతని పిల్లలకూ సంరక్షకురాలు; సేవకుడు తన యజమాని ఆస్తికి సంరక్షకుడు. అంటే మీలో ప్రతి ఒక్కడు సంరక్షకుడే, బాధ్యుడే. మీ సంరక్షణలో ఉన్నవారి పట్ల మీలో ప్రతి ఒక్కరినీ అడగటం జరుగు తుంది.." (ముత్తఫకున్ అలైహి - ఇబ్నె ఉమర్)

---

ధర్మపథాన పురోగమించడంలో అతనికి తోడుగా, అండగా నిలుస్తూ, అతని దారికి అడ్డంకులు సృష్టించని భార్య వాస్తవానికి అల్లాహ్ అనుగ్రహించిన అపూర్వమయిన కానుక.

163. ఈ హదీస్ ప్రకారం సమాజంలోని ప్రతి వ్యక్తి అతడు ఏ స్థితిలో ఉన్నా ఏదో ఒకవిధంగా ఎవరికో ఒకరికి బాధ్యుడు. ఇతరులపట్ల జవాబుదారు అని తెలుస్తోంది. ఇందులో ప్రస్తుతం స్త్రీ తన భర్త ఇంటికీ అతని సంతానానికి సంరక్షకురాలు అనే భావం గమనించదగ్గది. దీని ద్వారా తెలిసే ఒక విషయమేమంటే, భర్తపై తన భార్యకు కేవలం అన్నపానీయాలు సమకూర్చే బాధ్యతే కాక ఆమె ధార్మికస్థితిని, నైతికతను పరిరక్షించే భారంకూడా ఉంది. అయితే భార్య బాధ్యత రెండింతలు. ఆమె తన భర్త ఇంటిపై, సామగ్రిపై నిఘా ఉంచటమే కాక అతని సంతానాన్ని సుశిక్షితులుగా చేసే ప్రత్యేక బాధ్యత కూడా ఆమెపై ఉంది. ఎందుకంటే; భర్త జీవనోపాధి సముపార్జనలో, తరచుగా ఇంటిబయటే ఉంటాడు. పిల్లలు తమ తల్లికే బాగా అలవాటయి ఉంటారు. అందువల్ల పిల్లల పోషణ, బాగోగులు విచారించడంతో పాటు వారి సంరక్షణ, వారికి విద్యాబుద్ధులు చెప్పే ద్విగుణబాధ్యత వాళ్ళ తల్లిపై పడుతుంది.

# సంతానం పట్ల తల్లిదండ్రుల బాధ్యతలు

۱۶۴ اِنَّ رَسُوْلَ اللهِ صَلَّی اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "مَا نَحَلَ وَالِدٌ وَلَدَهُ مِنْ نُحْلٍ اَفْضَلَ مِنْ اَدَبٍ حَسَنٍ۔"

(جامع الاصول۔ مشکوٰۃ۔ سعید بن العاصؓ)

164. "తండ్రి తన సంతానానికి బహూకరించే వాటన్నింటిలో శ్రేష్ఠమయిన కానుక ఉత్తమమైన చదువు సంస్కారాలే" అని దైవప్రవక్త (సఅసం) బోధించారు. (మిష్కాత్-సయీద్ బిన్ ఆస్)

۱۶۵ قَالَ رَسُوْلُ اللهِ صَلَّی اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "مُرُوْا اَوْلَادَكُمْ بِالصَّلٰوةِ وَهُمْ أَبْنَاءُ سَبْعِ سِنِيْنَ وَاضْرِبُوْهُمْ عَلَيْهَا وَهُمْ أَبْنَاءُ عَشْرٍ وَّ فَرِّقُوْا بَيْنَهُمْ فِي الْمَضَاجِعِ۔"

165. మహాప్రవక్త (సఅసం) ఆదేశం : "మీ సంతానం ఏడేళ్ళ ప్రాయానికి రాగానే వారిని నమాజ్ చెయ్యమని ఆదేశించండి. వాళ్లు పదేళ్ళ వయసుకి చేరుకోగానే నమాజ్ గురించి వారిని దండించండి. ఈ వయసుకి వచ్చిన తరువాత వాళ్ళ పడకల్ని వేరుచేసి వేయండి."

---

164. తల్లిదండ్రులు తమ సంతానానికి ఎన్నో కానుకలు బహూకరిస్తారు. ఆస్తిపాస్తులు, డబ్బూ దస్కం, పదవీ హోదాలు, సమాజంలో స్థానం ఇత్యాది ఎన్నో భౌతికవిశేషాలు సంతానానికి తల్లిదండ్రులద్వారా లభిస్తాయి. అయితే మహాప్రవక్త బోధనవల్ల తెలిసేదేమంటే, ఉత్తమ విద్యాబుద్ధులు సంస్కారవంతమైన నడవడే అసలు విలువైన కానుక. ఎందుకంటే సుగుణాలు, సత్సంస్కారాలే లేకపోతే ఆస్తి, ధనం, స్థానం అన్నీ ఎంతో కాలం మనలేవు. గొప్ప ధనసంపదలు లేకపోయినా విద్య, సంస్కారం, సత్ప్రవర్తన లాంటి సంపదలుంటే అవి ఇహపరాల్లో సమస్తాన్నీ సముపార్జించి పెడతాయి.

165. ఈ హదీసుద్వారా తెలిసేదేమంటే పిల్లలు ఏడేండ్ల వయసుకు రాగానే వారికి నమాజ్ చేసే పద్ధతి నేర్పి నమాజ్ చేయడానికి తాకీదు చెయ్యాలి. ఆ తరువాత పదేండ్ల ప్రాయం రాగానే వారు నమాజ్ చెయ్యకపోతే వారికి నచ్చజెప్ప ప్రయత్నించాలి. వినకపోతే, అవసరమయితే కొట్టవచ్చుకూడా. వారు నమాజ్ చెయ్యకపోవడం మీ

١٦٦ إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "إِذَا مَاتَ
الْإِنْسَانُ انْقَطَعَ عَمَلُهُ إِلَّا مِنْ ثَلَاثٍ، صَدَقَةٍ جَارِيَةٍ أَوْ عِلْمٍ
يُنْتَفَعُ بِهِ أَوْ وَلَدٍ صَالِحٍ يَدْعُوْلَهُ." (مسلم - ابوهريرةؓ)

166. ప్రవక్త మహనీయులు సెలవిచ్చారు : "మనిషి చనిపోయి నప్పుడు అతని ఆచరణ అంతమయిపోతుంది. అయితే మూడు రకాల ఆచరణలు మటుకు అంతంకావు. వాటి పుణ్యఫలం మనిషి చనిపోయిన తరువాత కూడా అతనికి లభిస్తూనే ఉంటుంది. ఒకటి 'సదకా జారియా' రెండు, ప్రజలకు ఉపయోగపడుతున్న జ్ఞానం, మూడు, అతనికోసం దుఆ చేసే ఉత్తమ సంతానం. (ముస్లిమ్, అబూహురైరా)

కోపానికి కారణమవుతుందని వారికి విశదం కావాలి. మరో ముఖ్య విషయం ఏమంటే వారి పడకలు వేరు చెయ్యాలి. ప్రతి ఒక్కరికీ వేరు పడక ఉంచడం చాలా మంచిదే. అయితే పదేళ్ళలోపుస పిల్లలకు సౌకర్యం లేని చోట ఒకే పడక వేసినా, లేక పడక దగ్గరగా వేసినా ఫరవాలేదు. కాని పదేళ్ళ తరువాత పడక వేరుగా ఎడంగా వెయ్యడం అవసరం.

166. ఆచరణ అంతమవడమంటే అసలు జీవితం ఓ ఆచరణావ్యవధిగనక ఆ వ్యవధి ముగుస్తుందన్న మాట. దానిపై మనిషి కావాలనుకున్నా ఆచరణచేసే ఏ అవకాశమూ మిగలదు. అలాంటి పరిస్థితిలో అతను బ్రతికుండగా చేసిన మూడు పనులు అతనికి పుణ్యఫలాన్ని ఇస్తాయి. 'సదకా జారియా' అంటే చాలా కాలంవరకు ఉపయోగకరంగా ఉండే ధర్మకార్యమన్నమాట. కాలువలు త్రవ్వించడం, బావులు త్రవ్వించడం, ప్రయాణీకులకు సత్రం కట్టించడం, లేదా పాఠశాలలో పుస్తకాలు ధర్మం చెయ్యడం ఇత్యాదివన్నీ ఈ కోవకు చెందినవే. ఎంతకాలం వరకయితే ప్రజలు ఆ ధర్మకార్యం ద్వారా ప్రయోజనం పొందుతూ ఉంటారో అంతవరకూ అతనికి దాని పుణ్యఫలం లభిస్తూనే ఉంటుంది.

అలాగే అతను ఎవరికయినా జ్ఞానబోధన చేసినా లేదా ధార్మిక గ్రంథాలు, ఉపయోగకరమయిన గ్రంథాలు వ్రాసిపెట్టినా వాటి పుణ్యఫలం కూడా అతనికి లభిస్తూ ఉంటుంది.

అతనికి మరణానంతరం కూడా పుణ్యఫలం సంపాయించి పెట్టే మూడవ ఆచరణ అతను తన సంతానానికి తొలి నుండే ఇచ్చిన సుశిక్షణ. అతని ప్రయత్నంవల్ల సంతానం దైవం పట్ల భయభక్తులు గలవారుగా, ధర్మ నిష్ఠాపరులుగా రూపొందినందుకు ఆ సంతానం ప్రపంచంలో బ్రతికి ఉన్నంతకాలం, వారు మంచి పనులు చేస్తూ ఉన్నంతకాలం ఆ సత్కర్మల పుణ్యఫలం వారి తండ్రికీ లభిస్తూ ఉంటుంది. పైగా

١٦٧ عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ
سَلَّمَ : مَنْ اٰوٰى يَتِيْمًا اِلٰى طَعَامِهٖ وَشَرَابِهٖ أَوْجَبَ اللّٰهُ لَهُ
الْجَنَّةَ الْبَتَّةَ إِلَّا أَنْ يَعْمَلَ ذَنْبًا لَّا يُغْفَرُ - وَمَنْ عَالَ ثَلٰثَ بَنٰتٍ اَوْ
مِثْلَهُنَّ مِنَ الْأَخَوَاتِ فَأَدَّبَهُنَّ وَرَحِمَهُنَّ حَتّٰى يُغْنِيَهُنَّ اللّٰهُ ، اَوْجَبَ
اللّٰهُ لَهُ الْجَنَّةَ - فَقَالَ رَجُلٌ : يَارَسُوْلَ اللّٰهِ ، أَوِاثْنَتَيْنِ ؟ قَالَ :
"أَوِاثْنَتَيْنِ" حَتّٰى لَوْ قَالُوْا : أَوْ وَاحِدَةً ؟ " لَقَالَ : وَاحِدَةً " وَمَنْ اَذْهَبَ
اللّٰهُ كَرِيْمَتَيْهِ وَجَبَتْ لَهُ الْجَنَّةُ " قِيْلَ : يَارَسُوْلَ اللّٰهِ وَمَا
كَرِيْمَتَاهُ ؟ قَالَ : عَيْنَاهُ -" (مشكوٰة - ابن عباسؓ)

167. అబ్దుల్లా బిన్ అబ్బాస్ ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు: "ఏ వ్యక్తి అయితే ఓ అనాథను తనతోపాటు భోజన పానీయాలు పెడతాడో (పోషిస్తాడో) నిస్సందేహంగా అతనికి అల్లాహ్ స్వర్గం విధిగా ప్రసాదిస్తాడు - అతను ఏదయినా క్షమార్హం కాని అపరాధం చేస్తే తప్ప. ఏ వ్యక్తి అయితే ముగ్గురు కూతుళ్ళు లేదా ముగ్గురు చెల్లెండ్రను పోషించి, వారికి విద్యాబుద్ధులు చెప్పించి - వారికి ఇతని అవసరం లేని స్థితి వచ్చే వరకు వారి పట్ల దయా వైఖరిని అవలంబిస్తాడో అలాంటి వ్యక్తికై స్వర్గం విధిగా నిర్ణయించాడు అల్లాహ్." ఆ పైన ఓ వ్యక్తి, 'ఇద్దరు మాత్రమే ఉంటే?' అని అడిగాడు. దానికి ఆయన, "ఇద్దరు అమ్మాయిల పోషణకు కూడా ఇదే ప్రతిఫలం." అని సమాధానం పలికారు. ('జనులు ఒక్క అమ్మాయిని గురించి అడిగినా ఒక అమ్మాయి విషయంలోనూ ఆయన ఇదే శుభవార్తనిచ్చివుండేవారు' అని ఇబ్ను అబ్బాస్ అన్నారు) అలాగే "అల్లాహ్ ఏ వ్యక్తి నుండి రెండు ఉత్తమ వస్తువులు వాపసు తీసుకుంటాడో ఆ వ్యక్తి కొరకు కూడా స్వర్గం విధి అవుతుంది. 'దైవ ప్రవక్తా, రెండు ఉత్తమ వస్తువులేమిటి, అని అడగ్గా ఆయన, "అతని రెండు కళ్ళు" అని బదులిచ్చారు.

(మిష్కాత్-ఇబ్ను అబ్బాస్)

١٦٨ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ كَانَتْ لَهُ
أُنْثٰى فَلَمْ يَئِدْهَا وَلَمْ يُهِنْهَا وَلَمْ يُؤْثِرْ وَلَدَهُ عَلَيْهَا يَعْنِى الذُّكُوْرَ
أَدْخَلَهُ اللّٰهُ الْجَنَّةَ." (ابوداؤد - ابن عباسؓ)

168. దైవప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "పాపపుట్టగానే అజ్ఞాన కాలపు ఆచారం ప్రకారం ఆ పాపను సజీవంగా పూడ్చి పెట్టకపోతే, ఆ అమ్మాయిని హీనంగా చూడకపోతే, కొడుకుకు ఆ కూతురిని మించిన ప్రాధాన్యతనివ్వకపోతే అల్లాహ్ ఇలాంటివ్యక్తిని స్వర్గంలో ప్రవేశింపచేస్తాడు."

(అబూ దావూద్ - ఇబ్నె అబ్బాస్)

---

సంతానం సదాచార సంపన్నమయింది గనక వారు తండ్రికై దైవాన్ని సదా ప్రార్థిస్తూ ఉంటారు కూడా.

167. అనాథ బాలబాలికలకు తమతోపాటు భోజన పానీయాలు పెట్టి పోషించడం పుణ్యప్రదమయిన కార్యమనడంలో సందేహమే లేదు. అలాగే ఒక వ్యక్తికి ఆడసంతానమే అధికమయిన పక్షంలో అతను వారిపట్ల దురుసుగా, అసహనంగా ప్రవర్తించరాదు. వారిని సంపూర్ణంగా సంరక్షించాలి, పోషించాలి. వారికి విద్యా బోధనలు ధార్మిక సుశిక్షణ గరపాలి. 'వారికి అతని అవసరం కలగని పరిస్థితి వచ్చేవరకు' అనంటే వారి పెళ్ళిళ్ళు జరిగేవరకు అని అర్థం. అంతవరకు వారిపట్ల ప్రేమానురాగాలతో దయార్ద్రతతో మెలగాలి. వారి పెళ్ళిళ్ళుచేసి ఏలాంటి లోపం రానివ్వకుండా సంతోషంగా సాగనంపాలి. ఇలా చేసే వ్యక్తికి ప్రవక్త మహనీయులు స్వర్గం లభించే శుభవార్తనిస్తున్నారు. అలాగే తన పోషణలో చిన్న చెల్లెండ్రు ఉన్న సోదరుడు కూడా. ఈ చెల్లెండ్రు తన ప్రాణానికి గుదిబండలుగా భావించి చీదరించుకోరాదు. వారి పోషణ, శిక్షణకై అయ్యే ఖర్చులు నిండుహృదయంతో భరించాలి. దయార్ద్రతతో, ప్రేమానురాగాలతో పోషించి, పెళ్ళిళ్ళు చేసి సంతోషంగా సాగనంపాలి. నేటి కట్నపిశాచ కాలాన్ని దృష్టిలో ఉంచుకుని ఈ హదీసుల మహత్తును గమనిస్తే కారుణ్యమూర్తి మహనీయ ముహమ్మద్ దూరదృష్టిని, అనురాగమయ బోధనను సరిగ్గా అర్థం చేసుకోగలము.

168. అరేబియాలో అజ్ఞాన కాలంలో (ఇస్లాంకు పూర్వం) కూతుళ్ళు పుట్టగానే లేదా వారిపట్ల మక్కువ తరగగానే, వారి పెళ్ళిళ్ళు చెయ్యవలసి వస్తుందన్న అర్థంలేని నామోషి భావనవల్ల వారిని సజీవంగా పూడ్చి పెట్టేవారు. నేడు కూడా ఎక్కడ ఆడ పిల్లలు పుడతారో అని పిండం దశలోనే పరీక్షలు జరిపి పుట్టబోయేది ఆడపిల్ల అని తెలియగానే (ఆ పరీక్షలు ఎంతవరకు ప్రామాణిక మయినవో, లోపరహితమయినవో అది వేరే విషయం) ఆ పిండాన్ని హతమార్చే (గర్భస్రావం చేయించుకునే) తల్లి దండ్రులు మన దేశంలోనూ ఉన్నారంటే ఆశ్చర్యపడనవసరం లేదు. ఇది కేవలం

١٦٩ عَنْ عَائِشَةَ قَالَتْ : جَاءَتْنِي امْرَأَةٌ وَمَعَهَا ابْنَتَانِ لَهَا تَسْأَلُنِي ، فَلَمْ تَجِدْ عِنْدِي غَيْرَ تَمْرَةٍ وَّاحِدَةٍ ، فَأَعْطَيْتُهَا إِيَّاهَا فَقَسَمَتْهَا بَيْنَ ابْنَتَيْهَا وَلَمْ تَأْكُلْ مِنْهَا ، ثُمَّ قَامَتْ فَخَرَجَتْ فَدَخَلَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَحَدَّثْتُهُ فَقَالَ : مَنِ ابْتُلِيَ مِنْ هٰذِهِ الْبَنَاتِ بِشَيْءٍ فَأَحْسَنَ إِلَيْهِنَّ كُنَّ لَهُ سِتْرًا مِّنَ النَّارِ " (بُخاری۔مُسلم)

169. హజ్రత్ ఆయిషా (రజిఅన్) ఓ ఉల్లేఖనంలో ఇలా చెప్పారు: 'నా వద్దకు ఒక స్త్రీ వచ్చింది. ఆమెవెంట ఇద్దరు అమ్మాయిలున్నారు. ఆమె నా దగ్గర ఏదో అర్థించడానికి వచ్చింది. అప్పుడు నా వద్ద ఓ ఖర్జూరప్పండు తప్ప మరేమీలేదు. అదే నేను ఆమెకు ఇచ్చి వేశాను. ఆమె దాన్ని ఆ అమ్మాయిలకు పంచిపెట్టింది. స్వయంగా ఆమె ఏమీ తినలేదు. తరువాత ఆమె లేచి వెళ్ళిపోయింది. ఆ పిదప మహాప్రవక్త (సఅసం) వచ్చినపుడు నేను ఆ స్త్రీని గురించి ఆయనకు చెప్పాను. దానికి ఆయన, "ఆడపిల్లల వల్ల పరీక్షకు లోనయిన వారు ఆ పిల్లలతో సవ్యంగా ప్రవర్తించినట్లయితే ఆ పిల్లలు వారికీ నరకాగ్నికీ (మధ్య) తెరగా ఏర్పడతారు." (బుఖారీ, ముస్లిమ్)

---

ఆధునిక విజ్ఞాన కాలంలోనే కాదు, ఈ మూర్ఖత్వం, పాశవికత్వం 14 వందల ఏళ్ళకు పూర్వం అజ్ఞాన కాలం నుండి వస్తున్నదే. ఆ కాలాన్ని అజ్ఞాన కాలం, అంధకార యుగం అని అంటే సకల వైజ్ఞానిక, సాంకేతిక కాంతులతో విరాజిల్లుతున్న ఈ కాలాన్ని ఏ చీకటి రోజుల్లో జమచెయ్యాలో అర్థం కావడం లేదు.

169. మహాప్రవక్త (సఅసం) ప్రవచనానికి అర్థమేమిటంటే, ఎవరికయినా దైవం కేవలం ఆడకూతుళ్ళనే అనుగ్రహిస్తే, ఆ బిడ్డలు కూడా దైవప్రసాదాలే అని గ్రహించాలి. ఈ ఆడపిల్లలతో వారి తల్లిదండ్రులు ఎలా ప్రవర్తిస్తారో పరీక్షించాలనే దైవం కోరేది. ఆడపిల్లలు సంపాదించి తల్లి దండ్రులను పోషించేదీ లేదు సేవ చెయ్యడానికి నిత్యమూ వారితోనూ ఉండరు.అయినప్పటికీ, ఆడ పిల్లలతో మంచిగా వ్యవహరిస్తే, మంచి విద్యా బుద్ధులు, సుశిక్షణగరిపినట్లయితే వారు తమ తల్లిదండ్రుల మోక్షానికి సోపానాలు పరుస్తారు. 'తెర' అంటే నరకాగ్ని నుండి రక్షించే తెర అని భావం.

١٧٠ عَنِ النُّعْمَانِ بْنِ بَشِيْرٍ أَنَّ أَبَاهُ أَتَىٰ بِهِ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ، فَقَالَ: "إِنِّى نَحَلْتُ ابْنِىْ هٰذَا غُلَامًا كَانَ لِىْ. فَقَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: أَكُلَّ وَلَدِكَ نَحَلْتَهُ مِثْلَ هٰذَا؟ فَقَالَ: لَا، فَقَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: فَارْجِعْهُ، وَفِىْ رِوَايَةٍ" فَقَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: اَفَعَلْتَ هٰذَا بِوَلَدِكَ كُلِّهِمْ؟ قَالَ: لَا، قَالَ: اتَّقُوا اللهَ وَاعْدِلُوْا فِىْ اَوْلَادِكُمْ فَرَجَعَ أَبِىْ فَرَدَّ تِلْكَ الصَّدَقَةَ، وَفِىْ رِوَايَةٍ قَالَ: فَلَا تُشْهِدْنِىْ إِذًا، فَإِنِّىْ لَا أَشْهَدُ عَلٰى جَوْرٍ، وَفِىْ رِوَايَةٍ" قَالَ: أَيَسُرُّكَ أَنْ يَّكُوْنُوْا إِلَيْكَ فِى الْبِرِّ سَوَاءً؟ قَالَ بَلٰى، قَالَ: فَلَا إِذًا۔

(بخاری، مُسلم)

170. నోమాన్ బిన్ బషీర్ (రజిఅన్)ఇలా ఉల్లేఖించారు : 'మా నాన్న గారు (బషీర్) నన్ను తీసుకుని ఓసారి ప్రవక్త మహనీయుని (సఅసం) సన్నిధిలో హాజరయ్యారు. ఆయనతో, 'దైవప్రవక్తా! నా వద్ద ఓ బానిస ఉండేవాడు' వాణ్ణి ఈ అబ్బాయికి ప్రదానం చేశాను' అని తెలుపుకున్నారు. మహాప్రవక్త (సఅసం) అడిగారు, "మీ అబ్బాయిలందరికీ ఇలాగే ఇచ్చారా?" "లేదు," నాన్నగారి సమాధానం. 'అయితే ఆ బానిసను తిరిగి తీసుకోండి' అని దైవప్రవక్త ఆదేశించారు. మరో ఉల్లేఖనంలో ప్రవక్త మహనీయులు, "మీ కొడుకులందరితో ఇలాగే వ్యవహరించారా?" అని అడగ్గా ఆయన 'లేదు' అని పలికారు. ఆ పైన దైవ ప్రవక్త ఆయనతో, "అల్లాహ్‌కు భయపడండి, మీ సంతానం పట్ల సమానంగా ప్రవర్తించండి" అని పలకగా మా నాన్న ఇంటికి వచ్చి ఆ బానిస ప్రదానాన్ని వాపసు తీసుకున్నారు.' అని వుంది.

(బుఖారి, ముస్లిమ్)

١٧١ عَنْ أُمِّ سَلَمَةَ قَالَتْ : قُلْتُ : يَا رَسُولَ اللهِ ، هَلْ أَجْرٌ لِي فِي بَنِي أَبِي سَلَمَةَ أَنْ أُنْفِقَ عَلَيْهِمْ وَلَسْتُ بِتَارِكَتِهِمْ هٰكَذَا أَوْ هٰكَذَا ؛ إِنَّمَا هُمْ بَنِيَّ - فَقَالَ : نَعَمْ ، لَكِ أَجْرُ مَا أَنْفَقْتِ عَلَيْهِمْ -

(بُخاری - مُسلم)

171. హజ్రత్ ఉమ్మెసల్మా ఉల్లేఖనం: 'నేను దైవసందేశహరుని (సఅసం) ఒకసారి ఇలా అడిగాను, "అబూసల్మా సంతానానికి నేనేదయినా ఖర్చుచేస్తే నాకు పుణ్యం లభిస్తుందా? నేను వారిని దిక్కులేని వారుగా తిరగనివ్వలేను. ఎటొచ్చీ నా బిడ్డలేకదా!" అప్పుడు మహాప్రవక్త (సఅసం) బోధించారు : "అవును నీవు వారికై ఏది ఖర్చు చేసినా దాని పుణ్యఫలం నీకు లభిస్తుంది." (బుఖారీ, ముస్లిమ్)

١٧٢ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : "أَنَا وَإِمْرَأَةٌ سَفْعَاءُ الْخَدَّيْنِ كَهَاتَيْنِ يَوْمَ الْقِيٰمَةِ وَأَوْمَا يَزِيدُ بْنُ زُرَيْعٍ إِلَى الْوُسْطٰى وَالسَّبَّابَةِ إِمْرَأَةٌ اٰمَتْ مِنْ زَوْجِهَا ذَاتُ مَنْصَبٍ وَّجَمَالٍ حَبَسَتْ نَفْسَهَا عَلٰى يَتَامَاهَا حَتّٰى بَانُوْا أَوْ مَاتُوْا -" (ابوداؤد - عوف بن مالكؓ)

172. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "నేనున్నూ మాడిన ముఖంగల మహిళ ప్రళయ దినాన ఈ రెండు వ్రేళ్ళలా ఉంటాము. (హదీస్ ఉల్లేఖిస్తూ ఎజీద్ బిన్ జూరై తన మధ్య వ్రేలినీ చూపుడు వ్రేలినీ చూపించారు)అంటే, తన భర్త చనిపోగా తాను ఉన్నత కుటుంబం, సౌందర్యం కలిగి ఉన్నప్పటికీ, గతించిన తన భర్త వల్ల కలిగిన సంతానం కొరకు - వారు వేరు పడటమో లేక గతించడమో జరిగితే తప్ప - మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా ఉన్న స్త్రీ" అన్నమాట.

(అబూదావూద్-ఔఫ్ బిన్ మాలిక్)

---

170. ఈ హదీసు ద్వారా, సంతానం పట్ల సమభావంతో మెలగాలని తెలుస్తోంది. అలాకాక వారి మధ్య విచక్షణ చూపినట్లయితే వారిలో పరస్పరం ద్వేషాగ్ని రగులుకోవడమే కాక తమ తల్లిదండ్రుల ఎడల కూడా వారికి సదభిప్రాయం జనించదు. ఈ విధంగా

١٧٣ إِنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "أَلَا أَدُلُّكُمْ عَلَى أَفْضَلِ الصَّدَقَةِ؟ إِبْنَتُكَ مَرْدُوْدَةً إِلَيْكَ لَيْسَ لَهَا كَاسِبٌ غَيْرُكَ." (ابن ماجه - سراقة بن مالكؓ)

173. "అత్యుత్తమ దానం ఏమిటో తెలుపమంటారా? నీ బిడ్డ నీ వద్దకు తిరిగి వచ్చినప్పుడు నీవు తప్ప మరెవరూ ఆమెకు ఆర్జించి పోషించేవారు లేని స్థితిలో (నీవు చేసే సేవ)" అని దైవ సందేశహరులు బోధించారు.

(ఇబ్నుమాజ-సురాకా బిన్ మాలిక్)

## తండ్రిలేని అనాథల హక్కు

١٧٤ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "أَنَا وَكَافِلُ الْيَتِيْمِ لَهُ وَلِغَيْرِهِ فِي الْجَنَّةِ هٰكَذَا"، وَأَشَارَ بِالسَّبَّابَةِ وَالْوُسْطٰى وَفَرَّجَ بَيْنَهُمَا. (بخاری - سهل بن سعدؓ)

174. దైవసందేశహరుడు (సఅసం) ఇలా ప్రవచించారు : "నేనున్నూ (తండ్రిలేని) అనాధుని సంరక్షకుడు లేక ఇతర అగత్యపరుల సంరక్షకుడు స్వర్గంలో ఇలావుంటాము" అంటూ ఆయన తన మధ్య వ్రేలుకు చూపుడు వ్రేలుకూ మధ్య కొంచెం ఎడం ఉంచి చూపించారు.

(బుఖారీ - సహల్ బిన్ సఅద్)

---

సమతూలనంలేని ప్రేమానురాగాలు వంశంలో మనస్పర్థలకు, వైషమ్యాలకు మూలమవుతాయి. ఇలాంటి విధానానికి దూరంగా ఉండాలని ప్రవక్త బోధనకు భావం.

171. ఉమ్మె సల్మా తొలి భర్త పేరు అబూ సల్మా. ఆయన మరణానంతరం ఆమెకు మహాప్రవక్తతో వివాహం జరిగింది. ఆమె అబూసల్మా ద్వారా తనకు కలిగిన సంతానం పట్ల తాను వ్యవహరించవలసిన తీరును మహాప్రవక్త(సఅసం) ను అడిగి తెలుసుకున్నట్లు ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

ఈ హదీసులో మహాప్రవక్త (సఅసం) ప్రబోధం ద్వారా తెలిసేదేమంటే, తన సొంత ఆస్తిపాస్తుల్లో నుంచి తన సంతానం కొరకు ఖర్చు చేసుకునేందుకు స్త్రీకి స్వేచ్ఛ వుంది. అలా ఖర్చు చెయ్యడం ఏ విధంగానూ తప్పుకాకపోగా అది ధార్మికంగా ఎంతోపుణ్యప్రదమయిన కార్యం.

۱۷۵ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: خَيْرُ بَيْتٍ فِي الْمُسْلِمِيْنَ بَيْتٌ فِيْهِ يَتِيْمٌ يُحْسَنُ إِلَيْهِ، وَشَرُّ بَيْتٍ فِي الْمُسْلِمِيْنَ بَيْتٌ فِيْهِ يَتِيْمٌ يُسَاءُ إِلَيْهِ - (ابن ماجه - ابوهريرة رض)

175. ముస్లిమ్‌ల ఇంటిలో ఒక తండ్రిలేని అనాధకు రక్షణ లభించి ఆ అనాథ ఎడల సవ్యంగా ప్రవర్తించడం జరుగుతుందో అదే ఉత్తమ గృహం. మరి యే ఇంటిలోనయినా ఒక అనాధ ఉండి, ఆ అనాధ ఎడల చెడ్డగా ప్రవర్తించడం జరిగితే ఆ ఇల్లు ముస్లిమ్‌ల ఇళ్ళల్లోకెల్లా చెడ్డ ఇల్లు" అని మహాప్రవక్త (సఅసం) తెలిపారు. (ఇబ్నుమాజ-అబూహురైరా)

۱۷۶ إِنَّ رَجُلاً شَكَا إِلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَسْوَةَ قَلْبِهِ، قَالَ: "إِمْسَحْ رَأْسَ الْيَتِيْمِ وَأَطْعِمِ الْمِسْكِيْنَ." (مشكوٰة - ابوهريرة رض)

176. ఒక వ్యక్తి మహాప్రవక్తతో తన హృదయ కాఠిన్యాన్ని గురించి ప్రస్తావించాడు. దానికి ఆయన - "అనాధుని తల నిమురు, ఆర్తులకు భోజనం పెట్టు." అని ఉపదేశించారు. (మిష్కాత్ - అబూహురైరా)

---

172. "మాడిన ముఖంగల మహిళ" అంటే జీవితాంతం ఎలాంటి అలంకరణలు, ఆర్భాటాల్లేకుండా కష్టపడ్డ మహిళ అని అర్థం.

చిన్న చిన్న పిల్లలున్న ఓ స్త్రీ విధవ అయినప్పుడు ఆమె వంశం, సౌందర్యమూచూసి ఆమెతో వివాహమాడటానికి పలువురు ముందుకు వస్తారు. అయినప్పటికీ, ఆమె తన అనాధ సంతానాన్ని దృష్టినందుంచుకుని వారి పెంపకం కొరకు పెళ్ళి చేసుకోకుండా, సౌశీల్యంతో, గౌరవ మర్యాదలతో జీవితం గడుపుకుంటే అలాంటి స్త్రీకి ప్రళయదినాన దైవప్రవక్త (సఅసం) తోడు లభిస్తుందన్నమాట.

173. అంటే, ఏ ఆడపిల్లకయినా కురూపి అవడం చేతనో, లేక అంగవైకల్యం వల్లనో పెళ్ళికాకపోతే లేదా పెళ్ళి అయి భర్త వదలిపెట్టడం మూలానో తండ్రి ఇంట ఉండిపోతే తండ్రి (లేదా సోదరుడు) తప్ప మరో పోషకుడు లేని కారణాన ఆమెకై తండ్రి ఖర్చుచేసేదంతా దైవదృష్టిలో అత్యుత్తమమయిన దానం (సదకా) అన్నమాట.

١٧٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "اَللّٰهُمَّ إِنِّيْ أُحَرِّجُ حَقَّ الضَّعِيْفَيْنِ الْيَتِيْمِ وَالْمَرْأَةِ." (نسائی - خویلد بن عمرؓ)

177. దైవప్రవక్త (సఅసం) ఒకసారి ఇలాచెప్పారు. "దేవా! నేను ఇద్దరు బలహీనులైన వారి హక్కుల్ని ఆదరణీయమయినవిగా పరిగణిస్తున్నాను; ఒకటి అనాథల హక్కు, రెండు భార్యల హక్కు."
(నసాయి-ఖువీలద్‌బిన్ అమ్ర్)

١٧٨ إِنَّ رَجُلًا أَتَى النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ: إِنِّيْ فَقِيْرٌ لَيْسَ لِيْ شَيْءٌ وَّلِيْ يَتِيْمٌ، فَقَالَ: "كُلْ مِنْ مَّالِ يَتِيْمِكَ غَيْرَ مُسْرِفٍ وَّلَا مُبَادِرٍ وَّلَا مُتَأَثِّلٍ." (ابوداؤد)

178. ఒక వ్యక్తి దైవప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి, "నేను ఒక నిరుపేదను, నావద్ద ఏమీ లేదు. అయితే నా సంరక్షణలో (ఆస్తి పరుడయిన) తండ్రిలేని అనాథ ఉన్నాడు. నేను అతని ఆస్తి నుండి తినవచ్చా?" అని అడిగాడు. దానికి ఆయన (సఅసం) ఇలా చెప్పారు. "నీ సంరక్షణలో ఉన్న తండ్రిలేని వాని సొత్తులోనుండి నీవు తినవచ్చు. అయితే దుర్వ్యయం చేయరాదు. తొందర పడరాదు, ఆ ఆస్తిని సమకూర్చు కోవడానికి ప్రయత్నించకూడదు." (అబూదావూద్)

---

174. అంటే అనాథలను పరిరక్షించే వారు స్వర్గంలో మహాప్రవక్తకు చేరువగా ఉంటారు. ఈ శుభవార్త అనాథ సంరక్షకులకేకాక, నిరుపేదలకు, లేని వారికి అండగా నిలిచే వారికి వర్తిస్తుంది.

175. అనాథల పట్ల నిరాదరణ, వారి బాగోగుల పట్ల నిర్లక్ష్యం చూపే చుట్టాలు ఈ హదీసుద్వారా తెలుసుకోవలసింది, తమ నడవడిని మార్చుకోవలసింది ఎంతయినాఉంది.

176. ఈ హదీసు వల్ల తెలియవచ్చిందేమంటే, మనిషి తన హృదయ కాఠిన్యాన్ని దూరం చేసుకోదలచినట్లయితే క్రియాత్మకంగా దయా దాక్షిణ్యాలు గల పనులు చేయడం ప్రారంభించాలి. అగత్యపరుల అవసరాలను తీర్చాలి. అప్పుడు అతని హృదయం దయార్ద్రతను అలవరుచుకుంటుంది. కృపామయంగా మారుతుంది.

177. మహాప్రవక్త (సఅసం) పలికిన ఈ మాట తీరు ఎంతో ప్రభావ వంతమైంది. దీని ద్వారా అనాథల మరియు భార్యల హక్కుల్ని ఆదరించాలని ఎంతో వివేక

١٧٩ عَنْ جَابِرٍ قَالَ : قُلْتُ : يَا رَسُولَ اللهِ ، مِمَّا أَضْرِبُ يَتِيمِي؟ قَالَ : مِمَّا كُنْتَ ضَارِبًا مِنْهُ وَلَدَكَ غَيْرَ وَاقٍ مَالَكَ بِمَالِهِ وَ لَا مُتَأَثِّلًا مِنْ مَالِهِ مَالًا . (معجم طبرانی)

179. హజ్రత్ జాబిర్ (రజి) ఇలా ఉల్లేఖించారు : 'నేను ఒక రోజు మహాప్రవక్త (సఅసం) తో అడిగాను " నా సంరక్షణలో ఉన్న అనాథను నేను ఏ కారణాల వల్ల కొట్టవచ్చు?"అని. "ఏ కారణాలవల్ల నీవు నీ సంతానాన్ని కొడతావో ఆ కారణాలవల్లనే! జాగ్రత్త! నీవు నీ సొత్తును రక్షించుకోవడానికిగాను అతని ధనాన్ని నాశనం చేయరాదు. అతని ధనం ద్వారా సొంతఆస్తిని సమకూర్చుకోనూరాదు" అని ఆయన చెప్పారు. (మోజమ్, తిబ్రాని)

---

వంతంగా ఉపదేశించడం జరిగింది. ఇస్లాం రాకకు పూర్వం అరబ్బు ప్రజలలో ఈ ప్రజలు (అనాథలు, స్త్రీలు) అందరికంటే అధికంగా పీడింపబడేవారు. తండ్రిలేని అనాథలపట్ల సామాన్యంగా కఠినంగా ప్రవర్తించేవారు. వారి హక్కును కాజేసేవారు. ఇలానే స్త్రీకి కూడా సమాజంలో ఆనాడు సరయిన స్థానం లేకపోయింది.

178. ఖుర్ఆన్ ఆదేశానుసారం ధనంగల అనాథ వ్యక్తికి సంరక్షకుడుగా ఉండేవాడు అనాథుని ఆస్తినుండి ఏదీ గ్రహించరాదు. కాని ఆ సంరక్షకుడు బీదవాడయి రక్షణలో ఉన్న అనాథుడు ధనవంతుడైతే ఆ ఆస్తిని రక్షించడంతో పాటు దాని వృద్ధికొరకు పాటుపడుతూ అందులో నుండి తన ఖర్చును తీసుకోగలడు. అయితే అనాథుని ఆస్తిని అతడు ప్రాజ్ఞతకు రాక పూర్వమే కాజేసే బుద్ధితో ఖర్చు చేసేయడం ధర్మసమ్మతం కాదు. ఇంకా అనాథుని ఆస్తి ద్వారా అతడు తన ఆస్తిని ఏర్పరుచుకోలేడు. దైవభీతిలేని విశ్వాస ఘాతకులు అనాథులసొత్తును అతి చాకచక్యంతో తమ ఆస్తిగా మార్చుకుంటారు. లేదా అతను యుక్తవయస్సుకు రాకమునుపే ఆ ఆస్తి నంతటినీ తినీ, త్రాగీ తందనాలాడి నాశనం చేస్తారు. దివ్యఖుర్ఆన్ నిసా సూరాలో అల్లాహ్ ఇచ్చిన క్రింది ఆదేశానికనుగుణంగానే హదీసులో ఉద్బోధించబడింది :

---

وَلَا تَأْكُلُوهَا إِسْرَافًا وَّبِدَارًا أَنْ يَّكْبَرُوا وَمَنْ كَانَ غَنِيًّا فَلْيَسْتَعْفِفْ وَمَنْ كَانَ فَقِيرًا فَلْيَأْكُلْ بِالْمَعْرُوفِ ـ

"ఇంకా, తండ్రిలేని అనాథుల సొత్తును దుర్వ్యయంతో, వారు ప్రాజ్ఞులయ్యే భీతివల్ల తొందరపడి, తినివేయకండి, కలవారు అనాథల సొత్తునుండి చాలా దూరంగా ఉండాలి. నిరుపేదలయిన వారు అనాథుని సొత్తునుండి నియమానుసారం భుజించగలరు."(4: 6)

# అతిథుల హక్కు

۱۸۰ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ : مَنْ کَانَ یُؤْمِنُ
بِاللّٰہِ وَالْیَوْمِ الْاٰخِرِ فَلْیُکْرِمْ ضَیْفَہٗ ۔ (بخاری۔مسلم۔ابوھریرۃؓ)

180. "ఎవరయితే అల్లాహ్‌ను, పరలోక దినాన్నీ విశ్వసిస్తారో, వారు తమ అతిథిని ఆదరించి సత్కరించాలి" అని మహాప్రవక్త (సఅసం) ఆదేశించారు. (బుఖారి-ముస్లిమ్-అబూహురైరా)

۱۸۱ اِنَّ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ : مَنْ کَانَ
یُؤْمِنُ بِاللّٰہِ وَالْیَوْمِ الْاٰخِرِ فَلْیُکْرِمْ ضَیْفَہٗ ۔ جَائِزَتُہٗ یَوْمٌ وَّلَیْلَۃٌ
وَّالضِّیَافَۃُ ثَلٰثَۃُ اَیَّامٍ ۔ فَمَا بَعْدَ ذٰلِکَ فَھُوَ لَہٗ صَدَقَۃٌ وَّلَا
یَحِلُّ لَہٗ اَنْ یَّثْوِیَ عِنْدَہٗ حَتّٰی یُحْرِجَہٗ ۔ (بخاری۔مسلم۔خویلد بن عمروؓ)

181. దైవసందేశహరులు (సఅసం) ఇలా సెలవిచ్చారు : "ఎవరైతే అల్లాహ్‌ను, పరలోకాన్ని విశ్వసిస్తారో, వారు తమ అతిథిని తగు విధంగా సత్కరించాలి. మొదటిరోజు విందు, సత్కరింపుల దినం. ఆ రోజు అతిథికి వీలయినంత స్వాదిష్టమయిన భోజన పానీయాదులను ఇవ్వాలి. ఆతిధ్యం మూడు రోజుల వరకు సాగవచ్చు. (అంటే మిగతా రెండు రోజులు ఆతిధ్యంలో శ్రమపడనవసరం లేదు). ఆ తరువాత అతిథికి చేసే సేవలు, 'సదకా'గా పరిగణించబడతాయి. ఇంటి వారిని కష్టపెట్టే వరకు బస చేయడం అతిథికి ధర్మ సమ్మతం కాదు".

(బుఖారి, ముస్లిం-ఖువీలద్ బిన్ అమ్ర్ [రజి])

---

179. తన సంతానాన్నయినా విద్యాబుద్ధులు గరిపే సందర్భంలో కొట్టవచ్చు. అలాగే ఒక అనాధకు ధర్మం, విద్యాబుద్ధులు సభ్యతా సంస్కారాలు గరపడానికి కొట్టడం సబబే. చీటికి మాటికి బాదడం మహాప్రవక్త విధానానికి విరుద్ధం. అనాధులను కొట్టడమయితే మహాపాతకం!

180. అతిథి సత్కారానికి విశ్వాసాంగాలకూ గల సంబంధం ద్యోతకమవుతోంది. అంటే విశ్వసించే ప్రతి వ్యక్తి అతిథి మర్యాదల్లో ఎలాంటి లోపం రానివ్వకుండా మసలు కోవాలి.

# పొరుగువారి హక్కు

١٨٢ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : "لَا يُؤْمِنُ وَاللّٰهِ لَا يُؤْمِنُ، وَاللّٰهِ لَا يُؤْمِنُ - قِيْلَ مَنْ يَا رَسُوْلَ اللّٰهِ ؟ قَالَ : "اَلَّذِیْ لَا يَأْمَنُ جَارُهٗ بَوَائِقَهٗ -" (بخاری - مسلم - ابوهریرةؓ)

**182.** ఒకసారి మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "అతను విశ్వాసి కాడు, దైవ సాక్షిగా అతను విశ్వాసికాడు." "ఎవరు? దైవప్రవక్తా!" అని అడిగారు అక్కడున్నవారు. "ఎవరి పొరుగువారికయితే వారు పెట్టే కష్టాలవల్ల అశాంతి కలుగుతుందో వారు." అని ప్రవచించారు ప్రవక్త మహనీయులు. (బుఖారి, ముస్లిమ్ - అబూహురైరా)

---

181. ఈ హదీసులో అతిధికి, ఆతిథ్యం ఇచ్చే వారికీ బోధనలున్నాయి. ఇంటివారు అతిథిని తగు విధంగా సత్కరించాలని ఉపదేశించబడింది. సత్కరించడమంటే కేవలం భోజన పానీయాలు సమకూర్చడమని భావం కాదు. చిరునవ్వుతో పలకరించడమనీ, ఆహ్లాదంగా, ఆనందంగా వ్యవహరించడమనీ అర్థం. అతిధుల రాకవల్ల తమకు కలిగిన ఆనందాన్ని వెల్లడించడం అని భావం. అలాగే అతిథి, ఒక చోటికి అతిథిగా వెళ్ళి అక్కడే తిష్టవేసి కూర్చోకూడదు. దానివల్ల ఇంటివారు కష్టానికి లోనవుతారు అని నిర్దేశించడం జరిగింది.

"ముస్లిం" లో మరొక ఉల్లేఖనం ఉంది. అది ప్రస్తుత ఉల్లేఖనాన్ని బాగా వివరిస్తుంది. అందులో మహాప్రవక్త ఇలా బోధించారు : "తన సోదరుణ్ణి ఇబ్బందులకు గురిచేసే వరకూ అతని ఇంట బస చేయడం 'ముస్లిం' అనబడే ఏ వ్యక్తికయినా ఏ మాత్రం తగదు. అప్పుడు అక్కడ ఉన్నవారు, "దైవ ప్రవక్తా! అతను ఆ వ్యక్తిని ఏ విధంగా ఇబ్బందులకు గురిచేయగలడు ?" అని అడిగారు. దానికి సమాధానంగా మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. "ఏ విధంగానంటే, అతను ఆ వ్యక్తి వద్దనే బసచేస్తూ ఉంటే ఆ వ్యక్తి వద్ద అతని ఆతిథ్యానికి ఏదీ లేకపోయినప్పుడు ఆ వ్యక్తికి ఇబ్బంది కలుగుతుంది." మరో విషయం ఏమిటంటే, మూడు రోజులు ఆతిథ్యం ఇవ్వడం, స్వీకరించడం సమంజసమయింది. ఆ తరువాత కూడా అతిధి అవసరానికిగాను ఆతిధేయుడు ఏదైనా చెయ్యగలిగితే అది అతనికి 'సదకా' అంటే పుణ్యప్రదమయిన సత్కార్యంగా పరిణమిస్తుంది. అతిధి కూడా అన్ని విషయాలూ పరిశీలించి మరీ మసలుకోవడం మంచిది.

182. దైవం పట్ల నమ్మకమున్న వ్యక్తి దేవుని దాసులయిన తోటి మానవుల్ని కష్టపెడతాడా? అతను పెట్టే ఇబ్బందుల వల్ల తోటి సోదరునికి నెమ్మది కరవయితే అతనూ ఒక దైవ విశ్వాసి ఎలా అవుతాడు?

۱۸۳ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَا زَالَ جِبْرِيْلُ يُوْصِيْنِيْ
بِالْجَارِ حَتّٰى ظَنَنْتُ أَنَّهٗ سَيُوَرِّثُهٗ" (مُتَّفَق عليه - عائشةؓ)

183. "జిబ్రీల్ (అస్సలాం) పొరుగు వారి పట్ల మంచిగా ప్రవర్తించాలని ప్రతినిత్యం నాకు తాకీదు చేసేవారు. చివరికి ఇరుగుపొరుగు వారిని పరస్పరం వారసులుగా ప్రకటిస్తారేమో అని నాకు అనుమానం కలిగేది." అని దైవ సందేశహరులు (సఅసం) చెప్పారు.

(ముత్తఫకున్ అలైహ్ – ఆయిషా)

۱۸۴ عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ يَقُوْلُ: لَيْسَ الْمُؤْمِنُ بِالَّذِيْ يَشْبَعُ وَجَارُهٗ جَائِعٌ إِلٰى جَنْبِهٖ.
(مشكوٰة)

184. ఇబ్నె అబ్బాస్ ఇలా ఉల్లేఖించారు: "తాను కడుపునిండా భుజించి, తన ప్రక్కన ఉండే పొరుగు వాడు పస్తులుండడాన్ని సహించే వ్యక్తి విశ్వాసి కాజాలడు" అని మహాప్రవక్త (సఅసం) బోధించగా నేను విన్నాను.

(మిష్కాత్)

---

183. జిబ్రీల్ అలైహిస్సలాం మహాప్రవక్త ముహమ్మద్(సఅసం) వద్దకు దేవుని సందేశం తెచ్చే దైవదూత. ఆయన పొరుగు వారి హక్కులపట్ల మాటిమాటికి హెచ్చరించడం మూలాన, దైవం పొరుగు వారికి కూడా తమ పొరుగు వారి వారసత్వంలో ఏదయినా భాగం నియమిస్తాడేమో అన్న సంశయం కలిగింది దైవ ప్రవక్తకు. అయితే అలా జరగలేదు. కాని దీన్నిబట్టి ఒక పొరుగు వాని యెడల ముస్లింల బాధ్యత ఎంత గొప్పదో విదితమవుతుంది. పొరుగు వారంటే కేవలం వీధిలో ఇరుగు పొరుగు వారనీ అర్థంకాదు. బజారులో నడిచేటప్పుడు ప్రయాణంలో, సభల్లో కూర్చున్నప్పుడు తారసపడే పొరుగు వారు కూడా ఇందులో చేరి ఉన్నారు.

184. జీవితావసరాల్లో అత్యంత ముఖ్యమయింది ఆహారం. కోటి విద్యలు కూటి కొరకే అన్నది లోకోక్తి. అయితే ముస్లిం కూటికై జీవించకపోయినా అతని జీవితానికి గొప్ప లక్ష్యం వేరుగా ఉన్నా, జీవించడానికి కూడు అవసరమే. ఇలాంటి నిత్యావసర పదార్థంలో తన పొరుగు వాని వాటాను గుర్తుంచుకున్నప్పుడే ముస్లిముల విశ్వాసం సంపూర్ణమవుతుంది.

١٨٥ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: يَا أَبَا ذَرٍّ، إِذَا طَبَخْتَ مَرَقَةً فَأَكْثِرْ مَاءَهَا وَتَعَاهَدْ جِيْرَانَكَ۔" (مسلم)

**185. అబూజర్** (రజిఅన్)కు దైవ ప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: **"అబూజర్,** నీవు ఏదయినా కూర వండినప్పుడు అందులో కాస్త నీళ్ళు ఎక్కువ పొయ్యి, పొరుగువారిని కూడా కనిపెడుతూ ఉండు." (ముస్లిమ్)

١٨٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "يَا نِسَاءَ الْمُسْلِمَاتِ، لَا تَحْقِرَنَّ جَارَةٌ لِجَارَتِهَا وَلَوْ فِرْسِنَ شَاةٍ۔"

(بخاری۔ مسلم۔ ابوھریرہؓ)

**186.** మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు: "ముస్లిమ్ మహిళల్లారా! పొరిగింటి వనితకు ఇచ్చేందుకు ఏ కానుకనూ తక్కువయినదిగా భావించకండి. అది ఒక మేక కాలిడెక్కయినా సరే."

(బుఖారి, ముస్లిమ్- అబూహురైరా)

---

185. కూర వండేటప్పుడు నీరు ఎక్కువగా పోయడమంటే తప్పనిసరిగా అలాగే చెయ్యాలని కాదు. వీలయితే కూర కాస్త ఎక్కువగా వండి పొరుగు వారికి పంపాలని అర్థం. అలా వీలు కలగకపోతే వండిన దాన్నే (పులుసు, పప్పు, షోర్బా ఇత్యాదివి) "అధికం" చేసి పంపవచ్చు. అసలు ఉద్దేశ్యం పొరుగు వారి హక్కును అందజెయ్యాలన్నమాటను నొక్కి చెప్పడం.

186. సాధారణంగా మహిళలు తమ మనస్తత్వం రీత్యా పొరుగు వారికి ఏదయినా సాధారణమయిన వస్తువును కానుకగా ఇవ్వాలంటే అభిమానం అడ్డువచ్చి సిగ్గుపడతారు. వారి ప్రకారం కానుకగా పంపే వస్తువు ఏదయినా అది కాస్త గొప్పదయి ఉండాలి. ఈ మనస్తత్వాన్ని మార్చడానికే మహాప్రవక్త ఇలా బోధించారు. కడు సాధారణమయిన వస్తువయినా పొరుగింటికి కానుకగా ఇవ్వదలచుకుంటే అందులో సిగ్గుపడవలసిన అవసరం లేదు. అలాగే కానుకగా వచ్చిన వస్తువు ఎంత చిన్నదయినా దాన్ని ప్రేమతో ఆదరణతో స్వీకరించాలి. దాన్ని తుచ్ఛంగా భావించడం కాని, దాన్ని విమర్శించటం కాని తగదు. మరో విషయమేమంటే బీదవారయినాసరే తమ ఇరుగు పొరుగువారికి కానుకలు ఇచ్చిపుచ్చుకోవడాలు జరుపుతూ వుండాలి. 'మా దగ్గరేమున్నది ఇవ్వడానికి?'

۱۸۷ عَنْ عَائِشَةَ قَالَتْ : قُلْتُ يَا رَسُوْلَ اللّٰهِ ، إِنَّ لِي جَارَيْنِ
فَإِلٰى أَيِّهِمَا أُهْدِي ؟ قَالَ : إِلٰى أَقْرَبِهِمَا مِنْكَ بَابًا ـ (بُخاری)

187. "నాకు ఇద్దరు పొరుగు వారుంటే వారిలో కానుక ఎవరికి పంపాలి?" అని నేనడిగిన దానికి మహాప్రవక్త (సఅసం), "నీ వాకిలికి ఎవరి వాకిలి అతి సమీపమో వారికి" అని ప్రవచించారు అని హజ్రత్ ఆయిషా (రజిఅన్) ఉల్లేఖించారు. (బుఖారి)

۱۸۸ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : "مَنْ سَرَّهُ أَنْ يُّحِبَّهُ اللّٰهُ وَرَسُوْلُهُ فَلْيَصْدُقْ حَدِيْثَهُ إِذَا حَدَّثَ ، وَلْيُؤَدِّ أَمَانَتَهُ إِذَا ائْتُمِنَ وَلْيُحْسِنْ جِوَارَ مَنْ جَاوَرَهُ ـ" (مشکوٰۃ ـ عبد الرحمٰن بن ابی قرادؓ)

188. "అల్లాహ్ ఆయన సందేశహరుడు (సఅసం) తనను ప్రేమించాలని అభిలషించే వ్యక్తి వీటిని పాటించాలి : "మాట్లాడితే సత్యమే పలకాలి నమ్మి అమానతు అప్పగించిన యజమానికి తిరిగి దానిని సురక్షితంగా అందజెయ్యాలి, పొరుగు వారితో మంచిగా ప్రవర్తించాలి." అని మహాప్రవక్త (సఅసం) ఉపదేశించారు.

(మిష్కాత్ - అబ్దుర్రహ్మాన్ బిన్ అబీకిరాద్)

---

అని భావించరాదు. ఉన్న దానిలోనే ఎంతో కొంత పొరుగు వారికి కానుకగా సమర్పించుకోవాలి.

187. "పొరుగు" అంటే ఇరుగు పొరుగున ఉన్న నలభయి ఇళ్ళ వరకు దాని పరిధి. వారిలో ఎవరి ఇల్లు ఎంత సమీపాన ఉంటే వారి హక్కు అంతే అధికంగా ఉంటుంది.

188. విశ్వ ప్రభువయిన అల్లాహ్ ప్రేమకు పాత్రులవడం, అల్లాహ్ సందేశహరుని ప్రేమను పొందడం సామాన్యమయిన విషయం కాదు. ఇదే మానవుని అసలుధ్యేయం. ఇంతకు మించిన వరం మరొకటి కాజాలదు కూడా! అయితే దాని ప్రాప్తికి మార్గం ఎంత సులువయినది! పవిత్రమయిన, పరిశుద్ధమయిన జీవితానికి ఈ మూడుముక్కలు మకుటపు మణుల్లాంటివి. పొరుగు వానితో సద్ప్రవర్తన వీటిలో చేరడం గమనార్హం.

١٨٩ قَالَ رَجُلٌ يَّارَسُوْلَ اللهِ ، إِنَّ فُلَانَةَ تُذْكَرُ مِنْ كَثْرَةِ صَلَاتِهَا وَصِيَامِهَا وَصَدَقَتِهَا غَيْرَ أَنَّهَا تُؤْذِيْ جِيْرَانَهَا بِلِسَانِهَا - قَالَ : "هِيَ فِي النَّارِ" قَالَ : يَارَسُوْلَ اللهِ ، فَإِنَّ فُلَانَةَ تُذْكَرُ قِلَّةُ صِيَامِهَا وَصَدَقَتِهَا وَصَلَاتِهَا وَأَنَّهَا تَصَدَّقُ بِالْأَثْوَارِ مِنَ الْأَقِطِ وَلَا تُؤْذِيْ بِلِسَانِهَا جِيْرَانَهَا ، قَالَ : "هِيَ فِي الْجَنَّةِ -" (مشكوٰة - ابوهريرهؓ)

189. ఒక వ్యక్తి మహాప్రవక్త వద్దకు వచ్చి "ఫలానా స్త్రీ ఎన్నెన్నో నఫిల్ నమాజులు చేస్తుంది, నఫిల్ ఉపవాసాలు పాటిస్తుంది, దాన ధర్మాలు చేస్తుంది; ఈ సత్కార్యాల్లో ఆమె చాలా ఖ్యాతి పొందింది కూడా, అయితే ఆమె నోట మాట ద్వారా పొరుగు వారిని కష్టపెడుతుంది." అని చెప్పాడు. దానికి మహాప్రవక్త (సఅసం) "ఆమె నరకానికే పోతుంది" అని పలికారు. తిరిగి ఆ వ్యక్తి అన్నాడు "దైవప్రవక్తా ! ఫలానా మహిళ బహు అరుదుగా నఫిల్ రోజాలు పాటిస్తుందని, అతి స్వల్పంగానే నఫిల్ నమాజులు ఆచరిస్తుందని పాలజున్ను ముక్కలు కొన్ని మాత్రం దానం చేస్తుందని ప్రతీతి. కాని నోటితో తన పొరుగువారిని కష్టపెట్టదని కూడా చెప్పుకుంటారు." ఇది విని మహాప్రవక్త (సఅసం) "ఈమె స్వర్గ నివాసి" అని సెలవిచ్చారు. (మిష్కాత్-అబూహురైరా)

---

189. కేవలం "విధి" గా నిర్ణయించబడిన నమాజ్, రోజా, సదకాలనే కాక అదనపు (నఫిల్) నమాజ్ రోజా, దానధర్మాలను కూడా ఆచరించినా ఇవన్నీ దైవానికి సంబంధించిన హక్కులు. అయితే పొరుగు వాని హక్కు మానవులకు సంబంధించిన హక్కు. దానికి భంగం కలిగినప్పుడు, అది పొరపాటుననైనా లేక అపరాధ బుద్ధితో చేసినా దాన్ని పొరుగు వారు మన్నించనంత వరకు దైవం కూడా దాన్ని మన్నించడు. అందువల్లనే పొరుగు వారి హక్కులను అపహరించిన నోటి దురుసుగల ఆ మహిళ నరక వాసి అని మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

మరో స్త్రీ తనపై విధిగా నిర్ణయించబడిన నమాజ్, ఉపవాసం, దానధర్మాలనే సరిగా పాటిస్తూ దైవం తనకు వీలు కల్పించినంత మేరకే అదనపు ఆరాధనలు చేసినా ఆమె నోరు మంచిదవటం మూలాన ఈమె స్వర్గవాసి అని దైవ సందేశహరులు (సఅసం) నుడివారు.

١٩٠ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "أَوَّلُ خَصْمَيْنِ يَوْمَ الْقِيٰمَةِ جَارَانِ." (مشكوٰة - عقبه بن عامرؓ)

190. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "ప్రళయదినాన ప్రప్రథమంగా విచారణకు హాజరయ్యే వారు ఇద్దరు పొరుగువారు."

(మిష్కాత్ - అకబా బిన్ ఆమిర్)

## అగత్యపరులు, నిరుపేదల హక్కులు

١٩١ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ اللّٰهَ عَزَّ وَجَلَّ يَقُوْلُ يَوْمَ الْقِيٰمَةِ: يَا ابْنَ اٰدَمَ، اِسْتَطْعَمْتُكَ فَلَمْ تُطْعِمْنِيْ قَالَ: يَا رَبِّ، كَيْفَ أُطْعِمُكَ وَأَنْتَ رَبُّ الْعٰلَمِيْنَ؟ قَالَ: أَمَا عَلِمْتَ أَنَّهُ اسْتَطْعَمَكَ عَبْدِيْ فُلَانٌ فَلَمْ تُطْعِمْهُ؟ أَمَا عَلِمْتَ إِنَّكَ لَوْ أَطْعَمْتَهُ لَوَجَدْتَّ ذٰلِكَ عِنْدِيْ؟ يَا ابْنَ اٰدَمَ، اِسْتَسْقَيْتُكَ فَلَمْ تَسْقِنِيْ، قَالَ: يَا رَبِّ، كَيْفَ أَسْقِيْكَ وَأَنْتَ رَبُّ الْعٰلَمِيْنَ؟ قَالَ: اسْتَسْقَاكَ عَبْدِيْ فُلَانٌ فَلَمْ تَسْقِهِ أَمَا إِنَّكَ لَوْ سَقَيْتَهُ لَوَجَدْتَّ ذٰلِكَ عِنْدِيْ." (مسلم - ابوهريرهؓ)

191. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "ప్రళయ దినాన అల్లాహ్ మనిషితో ఇలా సంభాషిస్తాడు, 'ఆదమ్ కుమారా! నేను నిన్ను అన్నం అడిగాను, నీవు నాకు అన్నం పెట్టలేదు.' మనిషి ఇలా బదులిస్తాడు, 'ప్రభూ! నేనేమిటి నీకు అన్నం పెట్టడమేమిటి? ఇదెలా సాధ్యం? నీవే సకలలోకాల పరిపోషకుడివే!' అని అన్నప్పుడు 'నీకు గుర్తులేదా, నా ఫలానా సేవకుడు అన్నం అడగ్గా నీవు అతనికి అన్నం పెట్టలేదు, నీవు అతనికి అన్నం తినిపించి ఉంటే దాన్ని నేడు నా వద్ద పొందేవాడివని నీకు తెలీదా?' అని పలికి దైవం తిరిగి అడుగుతాడు, 'ఆదం కుమారా! నేను దాహంతో నిన్ను నీరు అర్థిస్తే నీవు నా దాహం తీర్చలేదు' అని.

'స్వామీ నేను నీకు దాహం తీర్చే ప్రసక్తే ఏముంది, నీవు యావజ్జగత్తుకూ ప్రభువువయితే!' అని విన్నవించుకుంటాడు మనిషి. అప్పుడు అల్లాహ్ 'నా ఫలానా దాసుడు నిన్ను నీటికై అర్థించాడు. కాని నీవు అతనికి నీరు అందివ్వలేదు. నీవు అతని దాహం తీర్చి ఉంటే ఆ నీటిని ఇప్పుడు నా వద్ద పొందే వాడివి కాదా?' అని పలుకుతాడు." (ముస్లిమ్, అబూహురైరా)

١٩٢ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "أَفْضَلُ الصَّدَقَةِ أَنْ تُشْبِعَ كَبِدًا جَائِعًا." (مشکوٰۃ - انسؓ)

192. దైవప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "శ్రేష్ఠమైన దానం, ఆకలిగొన్న వాడికి కడుపునిండా అన్నం పెట్టడం." (మిష్కాత్-అనస్)

---

190. అంటే ప్రళయ దినాన మానవ హక్కులకు సంబంధించిన కేసుల్లో ప్రప్రథమ కేసు ఇరుగుపొరుగు వారిదయి ఉంటుందన్నమాట. ఇరుగు పొరుగు వారు తమ ప్రపంచజీవితంలో సామరస్యంతో ప్రేమాభిమానాలతో మెలగినవారయితే వారి కేసు అలా రచ్చకెక్కేది కాదు, వారిలో ఏ ఒక్కరో లేదా ఉభయులో తమ పొరుగు వారి పట్ల అన్యాయంగా, అధర్మంగా ప్రవర్తించి ఉంటారు. పరస్పరం బాధ కలిగించుకున్నవారు, ఒకరిపై మరొకరు దౌర్జన్యం, అత్యాచారం చేసుకున్న వారయి ఉంటారు.
దైవం హక్కుల్లో ప్రప్రథమంగా నమాజ్‌ను గురించి విచారించబడుతుందని హదీసుల ద్వారా తెలుస్తోంది. మానవ హక్కుల్లో పొరుగు వారి హక్కుకు అలాంటి ప్రాధాన్యత ఇవ్వబడిందంటే మానవ జీవితంలో దాని ప్రాముఖ్యం ఎలాంటిదో తెలుస్తూనే ఉంది.

191. ఈ హదీసు ప్రకారం అల్లాహ్ తానే ఆకలిగొన్న వానిగా, దప్పికగొన్న వానిగా చెప్పడం వింతగా అగుపడుతుంది. దైవం ఆ రూపంలో వచ్చాడా? అన్న సందేహమూ జనిస్తుంది. ఇది సరి కాదు. అల్లాహ్ ప్రతి మనిషికి తోడుగానే ఉంటాడు. అయితే బాధితులకు మరీ సన్నిహితుడన్నది ఈ హదీసు వెల్లడిస్తోంది. ఆకలిగొన్న వాడికి, దప్పికగొన్న వాడికి వారి అవసరాలను తీర్చడం దైవానికి ఎంత ప్రియమైనవో కూడా ఈ హదీసు ద్వారా విదితమవుతోంది. అంతే కాదు మరో హదీసు ద్వారా తెలిసేదేమంటే ఆకలిదప్పులకు లోనయిన వారి బాధను తీర్చడంవల్ల దైవసామీప్యం, సాన్నిధ్యం లభిస్తాయి. దీనికి భిన్నంగా అన్న పానీయాలకు సంబంధించిన విషయాల్లో ఆర్తులకు అవరోధాలను కల్పించడం గొప్ప పాపకార్యమని కూడా దీని ద్వారా బోధపడుతోంది.

192. ఈ హదీసులోనూ తోటి మానవుని పట్ల ముస్లింల బాధ్యతను వివరించడం జరిగింది. దాన ధర్మాలు ఎన్నో రూపాల్లో చేయవచ్చు. అయితే ఆకలి గొన్న వానికి అతడెవరు, కలిగిన వాడా లేని వాడా, సొంతవాడా పరాయివాడా అన్న విచక్షణ లేకుండా

١٩٣ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : "رُدُّوا السَّائِلَ وَلَوْ بِظِلْفٍ مُّحْرَقٍ۔" (مشکوٰۃ)

193. "అర్థించిన వానికి ఏదయినా ఇచ్చి మరీ సాగనంపండి. అది కాలిపోయిన మేక డెక్క అయినా ఫరవాలేదు." అని దైవ సందేశహరులు (సఅసం) ప్రబోధించారు. (మిష్కాత్)

١٩٤ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : لَيْسَ الْمِسْكِيْنُ الَّذِىْ يَطُوْفُ عَلَى النَّاسِ تَرُدُّهُ اللُّقْمَةُ وَاللُّقْمَتَانِ وَالتَّمْرَةُ وَالتَّمْرَتَانِ وَلٰكِنِ الْمِسْكِيْنُ الَّذِىْ لَا يَجِدُ غِنًى يُّغْنِيْهِ وَلَا يُفْطَنُ لَهٗ فَيُتَصَدَّقَ عَلَيْهِ وَلَا يَقُوْمُ فَيَسْأَلَ النَّاسَ۔" (بخاری۔ مُسلم)

194. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ప్రజలచుట్టూ తిరుగుతూ ముద్దా రెండుముద్దల అన్నమో, ఒకటి రెండు ఖర్జూరపు పళ్ళో తీసుకొని పోయేవాడు అసలయిన బీదవాడు కాడు. వాస్తవానికి, తన అవసరం మేరకు సంపాదించలేనివాడు; తన బీదరికం ప్రజల దృష్టిలో పడకపోవడంచేత వారి దానధర్మాలకి నోచుకోని వాడు; తానుగా జనుల ముందు నిలబడి చెయ్యిచాచి అర్థించనివాడు - ఇలాంటి వాడే నిజమయిన బీదవాడు." (బుఖారి-ముస్లిమ్)

---

అన్నం పెట్టి అతని అవసరాన్ని తీర్చి అతనికి తృప్తి కలిగించడం అన్నిటికంటే ఉత్తమమయినది. అందుకే అన్నదానం అన్ని దానాల్లో మిన్న అయిన దానం.

193. అంటే యాచకులు, నిరుపేదలు వాకిట నిలిచి అర్థించినప్పుడు వారిని వట్టిచేతులతో సాగనంపడం సరికాదు. ఏదయినా అది ఎంత సాధారణమయినదయినా సరే ఇచ్చి పంపడం శ్రేయస్కరం.

194. లేమికి గురయిన వారంతా బీదవారే. అయితే సంఘంలో నిజమయిన బీదవారు తాము బీద వారయినా, అభిమానంవల్ల, ఆత్మగౌరవం వల్ల, తమ సాత్విక గుణంవల్ల తమ పరిస్థితులు ఇతరులకు వెల్లడి కాకుండా జాగ్రత్తపడతారు. నిరుపేదల్లా రూపు ధరించి తిరగరు, ఇతరుల సమక్షంలో చెయ్యి చాచి అర్థించరు. ఇలాంటి అభిమానధనులయిన నిరుపేదలనే వెదకి వెదకి సహాయం చెయ్యమని ముస్లిం

١٩٥ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: السَّاعِيْ عَلَى الْاَرْمَلَةِ وَالْمِسْكِيْنِ كَالْمُجَاهِدِ فِيْ سَبِيْلِ اللّٰهِ، وَاَحْسَبُهٗ قَالَ: وَكَالْقَائِمِ الَّذِيْ لَا يَفْتُرُ وَ كَالصَّائِمِ الَّذِيْ لَا يُفْطِرُ۔" (بُخاری - مُسلم - ابوهريرةؓ)

195. "వితంతువుల కొరకు, నిరుపేదల కొరకు శ్రమించే వాడు దైవ మార్గంలో నిరంతర కృషి సలిపేవానికి సమానం; రేయంతా దైవం సన్నిధిలో నిల్చొని ప్రార్థన చేసినప్పటికీ అలసట చెందనివానితో సమానం; పగటి పూట ఏమీ తినకుండా ఎడతెరపి లేకుండా ఉపవాస వ్రతం పాటించే వానితో సమానం" అని దేవుని అంతిమ సందేశహరులు (సఅసం) నుడివారు. (బుఖారి, ముస్లిమ్ , అబూహురైరా)

## సేవకుల హక్కులు

١٩٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: لِلْمَمْلُوْكِ طَعَامُهٗ وَكِسْوَتُهٗ وَلَا يُكَلَّفُ مِنَ الْعَمَلِ إِلَّا مَا يُطِيْقُ۔" (مُسلم - ابوهريرةؓ)

196. దైవ సందేశహరులు (సఅసం) ఇలా ప్రవచించారు : "బానిస హక్కు ఏమంటే అతనికి అన్నం వస్త్రం సముచితంగా ఇవ్వాలి. అతను భరించగలిగినంత కార్యభారాన్నే అతనిపై మోపాలి."

(ముస్లిమ్- అబూహురైరా)

---

సమాజాన్ని ఈ హదీసు ద్వారా బోధించడం జరిగింది. ఇదే అసలయిన సత్కార్యం.

195. "వితంతువుల కొరకు, నిరుపేదల కొరకు" అంటే వారి బాగోగుల కొరకు, వారికి సహాయం అందజేయటం కొరకు కష్టపడటం అని అర్థం. సమాజంలో లేమికి గురైన వారి సహాయ సహకారాలకు ఇస్లాం ఎంత ప్రాముఖ్యాన్నిస్తుందో ఈ హదీసు ద్వారా కూడా విదితమవుతుంది. దైవ మార్గంలో కృషి చెయ్యడం, అవసరమయితే ఆ కృషిలో ప్రాణ త్యాగాన్ని కూడా చేయడాన్నే జిహాద్ అని, షహాదత్ అని, జిహాద్ చేసే వాణ్ణి ముజాహిద్ అని, షహాదత్ పొందిన వానికి షహీద్ అని అంటారు. అసలు హదీసులో జిహాద్ అన్న పదమే వాడబడింది. జిహాద్ ఆరాధనల్లో (దైవ విధేయతల్లో) కెల్లా ఉత్తమ ఆరాధనగా పేర్కొనడం జరిగింది. ఈ విధంగా చూస్తే నిరుపేదల

١٩٧ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "إِخْوَانُكُمْ جَعَلَهُمُ اللهُ تَحْتَ أَيْدِيكُمْ، فَمَنْ جَعَلَ اللهُ أَخَاهُ تَحْتَ يَدَيْهِ فَلْيُطْعِمْهُ مِمَّا يَأْكُلُ، وَلْيُلْبِسْهُ مِمَّا يَلْبَسُ، وَلَا يُكَلِّفُهُ مِنَ الْعَمَلِ مَا يَغْلِبُهُ، فَإِنْ كَلَّفَهُ مَا يَغْلِبُهُ فَلْيُعِنْهُ عَلَيْهِ." (بخاری - مسلم - ابوہریرۃ)

197. దైవప్రవక్త (సఅసం) ఉపదేశం : "బానిసలు మీ సోదరులు, అల్లాహ్ వారిని మీ ప్రయోజనార్థం మీకు అప్పగించాడు. అయితే వారిని మీలో ఎవరి సేవకోసం నియమించాడో వారు తాము ఏది తింటే అదే వారికి పెట్టాలి. తాము ఏ బట్టలు ధరిస్తారో వారికీ అలాంటి బట్టలే ఇవ్వాలి. వారి శక్తికి మించిన పనిభారాన్ని వారిపై మోపరాదు. ఒకవేళ అతని శక్తికి మించిన పని చెప్పినట్లయితే అందులో అతనికి తోడ్పడాలి."

(బుఖారి, ముస్లిమ్–అబూహురైరా)

---

సహాయం ఉత్తమ ఆరాధనకు సమానమనే భావమే వస్తూంది. ఈ భావాన్ని, పై హదీసుల్లో ఉదాహరించిన సామ్యాలు కూడా సమర్థిస్తున్నాయి.

196. అసలు హదీసులో మమ్లూక్ అనే పదం ప్రయోగించబడింది. దానికి బానిసలు అని అర్థం. ఇస్లాంకు ముందు అరబ్బు సమాజంలో బానిసల వ్యవస్థ ఉండేది. సామాన్యంగా ప్రజలు బానిసలపట్ల పశువుల కన్నా హీనంగా ప్రవర్తించేవారు. వారికి కూడు, గుడ్డలిచ్చేవారు కారు. వారి శక్తికి మించిన పనులు చెప్పేవారు. ఇస్లాం ఆవిర్భవించిన కాలంలో ఈ బానిస వ్యవస్థ సమాజంలో బాగా వ్రేళ్ళూని ఉండింది. దాన్ని ఇస్లాం నిరసించింది. అయితే ఏ వ్యవస్థలో నయినాసరే ఒక్కసారిగా రేయిని పగలుగా మార్చడం సమంజసమూ కాదు, సహజమూ కాదు, సాధ్యమూ కాదు. అందుకే ఇస్లాం ప్రతి మార్పులోనూ ఒక సహజమయిన, సమంజసమయిన, సాధ్యమయిన క్రమపద్ధతిని అనుసరించింది. బానిస వ్యవస్థ విషయంలోనూ అదే జరిగింది. ఈ హదీసులో మహాప్రవక్త, బానిసలు కూడా మానవ సోదరులే అన్న ఇస్లామీయ దృక్పథాన్ని ప్రబోధించి దానికనుగుణంగా వారి ఎడల ఎలా ప్రవర్తించాలో కూడా బోధించారు. ఇంకా అనేక మంది బానిసల్ని ఖరీదు ఇచ్చి, కొని వారికి స్వాతంత్ర్యం ప్రసాదించారు. ఈ విధంగా సమాజంలో పలురకాల ఉద్బోధలవల్ల అవసరమయిన మార్పు తెచ్చి ఈ వ్యవస్థనే సమూలంగా తుడిచిపెట్టేశారు మహాప్రవక్త (సఅసం), ఆ తరువాత ఆయన అనుచరులు. చివరికి ఓ నాటి బానిసలు ఇస్లామీయ సమాజంలో "నాయకులు"గా విరాజిల్లారు.

ఈ హదీసు ద్వారా ద్యోతకమయ్యే మరో విషయమేమంటే, రేయింబవళ్ళు సేవచేసే

١٩٨ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "إِذَا صَنَعَ لِأَحَدِكُمْ
خَادِمُهُ طَعَامَهُ ثُمَّ جَاءَهُ بِهِ وَقَدْ وَلِيَ حَرَّهُ وَدُخَانَهُ فَلْيُقْعِدْهُ
مَعَهُ فَلْيَأْكُلْ، فَإِنْ كَانَ الطَّعَامُ مَشْفُوْهًا قَلِيْلًا فَلْيَضَعْ فِيْ يَدِهِ
مِنْهُ أُكْلَةً أَوْ أُكْلَتَيْنِ." (مُسلم - ابوھریرہؓ)

198. "మీ సేవకుడు అన్నం వండి మీ ముందు ఉంచినట్లయితే, ఆ వంటలో సెగల్ని పొగల్ని అతను భరించి ఉంటాడు. కనుక యజమాని అతన్ని తనతోపాటు భోజనానికి కూర్చో బెట్టుకోవాలి. ఒకవేళ అన్నం కొద్దిగానే ఉంటే రెండు ముద్దలైనా అతనికి పెట్టాలి." అని బోధించారు మానవ శ్రేష్ఠులు (సఅసం). (ముస్లిమ్- అబూహురైరా)

---

నౌకర్లు, పనివాళ్ళు, పాలేరుల విషయంలోనూ ఇదే విధమయిన ప్రవర్తన కలిగి ఉండటమే ధర్మబద్ధమయినది. నౌకరులపట్ల మనం అవలంబించవలసిన వైఖరిని సూచించే ఉల్లేఖనాన్ని గమనించండి. అబూకలాబా ఉల్లేఖించారు :

హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజిఅన్) గవర్నరుగా వున్న కాలంలో ఒక వ్యక్తి ఆయన్ని కలువడానికి వెళ్ళాడు. అప్పుడు ఆయన తన ఇంట్లో (రొట్టె కొరకు) పిండి కలుపుతున్నారు, 'ఇదేమిటి?' అని ఆశ్చర్యంతో అతడు అడిగినదానికి హజ్రత్ సల్మాన్ (రజిఅన్) 'మా పనిమనిషిని బజారుకు పంపాను. అతనిపై రెండు పనుల భారం వెయ్యడం భావ్యం కాదని పిండి నేనే కలుపుతున్నాను' అని సమాధానమిచ్చారు హజ్రత్ సల్మాన్.

197. పై ఉల్లేఖనంలో హజ్రత్ సల్మాన్ ఫార్సీ వైఖరికి ప్రాతిపదిక అయిన దైవప్రవక్త ప్రబోధం ఈ హదీసులో గోచరిస్తోంది. నౌకరుకు పని ఎక్కువగా చెప్పినప్పుడు అతనికి తోడ్పడడం కూడా అవసరమన్న మహాప్రవక్త ఉపదేశాన్ని ఆయన సహచరులు ఏ విధంగా పాటించి ఉంటారో కూడా హజ్రత్ సల్మాన్ పద్ధతుల ద్వారా మనకు బోధపడుతుంది. వాస్తవానికి దైవప్రవక్త "సున్నత్" (సంప్రదాయం) కోసం ప్రాకులాడే మనం పలికేవన్నీ నోటి మాటలే. క్రియా రూపంలో మన పరిస్థితి ఎక్కడుందో - ఆత్మ విమర్శన అవసరం.

198. భోజన పానీయాల్లో నౌకరును తనకు సమంగా కూర్చో బెట్టుకో వడంలోనే మనిషి సర్వమానవ సమానతను కనబరచగలుగుతాడు. ఈ సందర్భంలో అతన్ని దూరం ఉంచి ఎన్ని ఊకదంపుడు ఉపన్యాసాలు దంచినా క్రియా రూపంలో వాటికి విలువ శూన్యం.

١٩٩ عَنْ أَبِي بَكْرٍ الصِّدِّيقِ رَضِيَ اللّٰهُ عَنْهُ قَالَ ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : " لَا يَدْخُلُ الْجَنَّةَ سَيِّئُ الْمَلَكَةِ " قَالُوْا : يَا رَسُوْلَ اللّٰهِ ، أَلَيْسَ أَخْبَرْتَنَا أَنَّ هٰذِهِ الْأُمَّةَ أَكْثَرُ الْأُمَمِ مَمْلُوْكِيْنَ وَيَتَامٰى ؟ قَالَ : " نَعَمْ ، فَأَكْرِمُوْهُمْ كَكَرَامَةِ أَوْلَادِكُمْ وَأَطْعِمُوْهُمْ مِمَّا تَأْكُلُوْنَ ۔" (ابن ماجه)

199. హజ్రత్ అబూబక్ర్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: "తమ బానిసలపై, సేవకులపై అధికార దుర్వినియోగం చేసేవారు, స్వర్గానికి పోలేరు." అని ప్రవక్త మహనీయులు (సఅసం) సెలవీయగా కొందరు, "దైవప్రవక్తా! మీ ఉమ్మత్ (అనుచర సంఘం)లో ఇతర అనుచర సంఘాల కంటే బానిసలు, అనాధలు అధికంగానే ఉంటారని మీరు తెలిపారు కదూ?" అని అడిగారు. దానికి దైవ ప్రవక్త (సఅసం), "అవును, నేను ఈమాట చెప్పిన విషయం నిజమే. అయితే మీరు వారిని (బానిసల్ని, అనాధల్ని)మీ బిడ్డల్లా ఆదరించండి, మీరు భుజించే ఆహారం వారికి పెట్టండి" అని బోధించారు. (ఇబ్నుమాజా)

٢٠٠ إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَهَبَ لِعَلِيٍّ غُلَامًا فَقَالَ " لَا تَضْرِبْهُ فَإِنِّيْ نُهِيْتُ عَنْ ضَرْبِ أَهْلِ الصَّلٰوةِ ، وَقَدْ رَأَيْتُهُ يُصَلِّيْ ۔" (مشكوٰة ۔ ابو امامةؓ)

200. మానవ మహోపకారి (సఅసం), హజ్రత్ అలీ (రజిఅన్)కి ఓ బానిసను ప్రదానం చేసినప్పుడు ఇలా సెలవిచ్చారు : "ఇతన్ని కొట్టకు, ఎందుకంటే నమాజ్ చేసే వారిని కొట్టడం నిషిద్ధం. ఇతను నమాజ్ చెయ్యడం నేను చూశాను." (మిష్కాత్ - అబూఉమామ)

---

199. అనాధలు, బానిసలు ఈ రెండు వర్గాల వారు సమాజంలో పీడిత ప్రజలకు ప్రతీకలు. ఇస్లాం అన్నిరకాల దోపిడిని, జులుంను నిరసించి మానవులకు వారి, జన్మహక్కయిన స్వేచ్ఛను ప్రసాదించాలని అభిలషిస్తుంది, కృషి చేస్తుంది కనుక

# సహ ప్రయాణీకుని హక్కు

۲۰۱ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : سَيِّدُ الْقَوْمِ خَادِمُهُمْ فَمَنْ سَبَقَهُمْ بِخِدْمَةٍ لَّمْ يَسْبِقُوْهُ بِعَمَلٍ إِلَّا الشَّهَادَةَ ـ"

(مشکوٰۃ ـ سہل بن سعدؓ)

201. "జాతికి సేవ చేసే వాడే వారి అసలు నాయకుడు. ప్రజల సేవలో ఎవరయితే అగ్రగామిగా వ్యవహరిస్తాడో అతన్ని, ఒక్క "షహాదత్" (అమరగతి) వల్ల తప్ప మరే సత్కార్యం వల్లనూ ఎవరూ మించి పోలేరు." అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు. (మిష్కాత్-సహల్ బిన్ సఅద్)

۲۰۲ عَنْ أَبِيْ سَعِيْدٍ الْخُدْرِيِّ قَالَ : بَيْنَمَا نَحْنُ فِيْ سَفَرٍ إِذْ جَاءَهُ رَجُلٌ عَلَى رَاحِلَةٍ فَجَعَلَ يَصْرِفُ وَجْهَهُ يَمِيْنًا وَّشِمَالًا فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : مَنْ كَانَ مَعَهُ فَضْلُ ظَهْرٍ فَلْيَعُدْ بِهِ عَلَى مَنْ لَّا ظَهْرَ لَهُ وَمَنْ كَانَ فَضْلُ زَادٍ فَلْيَعُدْ بِهِ عَلَى مَنْ لَّا زَادَ لَهُ" قَالَ: فَذَكَرَ مِنْ أَصْنَافِ الْمَالِ حَتّٰى رَأَيْنَا أَنَّهُ لَا حَقَّ لِأَحَدٍ مِّنَّا فِي الْفَضْلِ ـ

(مُسلم)

202. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : 'ఒకసారి మేము ప్రయాణిస్తూ ఉండగా ప్రవక్త (సఅసం) వద్దకు ఒక వ్యక్తి ఒంటె మీద వచ్చాడు. వచ్చిన వ్యక్తి కుడి ఎడమలు తిరిగి చూడ నారంభించాడు. అప్పుడు మహాప్రవక్త (సఅసం) ఉపదేశించారు : "ఎవరి

---

దాన్ని ఈ పీడిత ప్రజలు అత్యధికంగా ఆశ్రయించడం సహజం. అనుచర సంఘంలో అనాధలు బీదలు అధికంగా ఉంటారన్న దానికి భావం ఇదే.

బానిసలు, నౌకరులపైనే కాకుండా తన అధికారం క్రింద వచ్చిన వారెవరిపై నయినా దౌర్జన్యం, అత్యాచారాలకు తలపడటాన్ని ఇస్లాం గర్హిస్తుంది. ఆ మాటను తెలపడానికే మహాప్రవక్త (సఅసం) అలాంటి వారికి స్వర్గ ప్రవేశం లభించదని చాటి చెప్పారు.

200. నౌకరులు ఎలాంటి వారయినా సరే బాధించటం అనుచితమే. అయితే వారు

వద్దయినా వాహనం అధికంగా ఉంటే దాన్ని వాహనం లేని వారికి ఇచ్చివేయడం ఉచితం. ఎవరి వద్దయినా అధికంగా ఆహారం ఉంటే వారు దాన్ని ఆహారపు కొరత ఉన్న వారికి ఇవ్వాలి." ఇలాగే ఎన్నోరకాల వస్తువుల్ని ప్రవక్త (సఅసం) పేర్కొన్నారు. కడకు, అవసరాన్ని మించివున్న సరకులపైన మాకెలాంటి హక్కు లేదేమో అని మేము భావించ సాగాము.'

(ముస్లిమ్)

۲۰۳ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: تَكُوْنُ إِبِلٌ وَّبُيُوْتٌ لِّلشَّيٰطِيْنِ، فَأَمَّا إِبِلُ الشَّيٰطِيْنِ فَقَدْ رَأَيْتُهَا، يَخْرُجُ أَحَدُكُمْ بِنَجِيْبَاتٍ مَعَهُ قَدْ اَسْمَنَهَا فَلَا يَعْلُوْا بَعِيْرًا مِّنْهَا وَيَمُرُّ بِأَخِيْهِ قَدِ انْقَطَعَ بِهٖ فَلَا يَحْمِلُهُ وَأَمَّا بُيُوْتُ الشَّيٰطِيْنِ فَلَمْ أَرَهَا۔

(ابوداؤد۔سعید بن ابی ھند عن ابی ھریرہؓ)

203. మహాప్రవక్త బోధించారు : "కొన్ని ఒంటెలు షైతానుల వాటాగా ఉంటాయి. కొన్ని ఇళ్ళు సైతం షైతానుల నివాసంగా ఉంటాయి. మీలో ఒకరు చాలా ఒంటెల్ని తీసుకొని బయల్దేరుతారు. అవి బాగా బలిసి ఉంటాయి కూడా. కాని వాటిపై ఆ వ్యక్తి తానూ స్వారీ చేయడు, వాహనం లేని తోటి సోదరుణ్ణి - చూస్తూ పోతాడు కాని - వాటిపై ఎక్కించుకోనన్నా ఎక్కించుకోడు. షైతానుల గృహాలు నేను చూడలేదు." (అబూదావూద్ - సయీద్ బిన్ అబూహింద్ -అబూహురైరా)

---

సజ్జనులయి, సదాచారులయితే ఆ అనౌచిత్యం ఇంకా అధికతరమవుతుంది. ఈ హదీసులో దైవ ప్రవక్త హజ్రత్ అలీని బోధించిన విషయం అదే.

201 జాతి అసలు నాయకుడు తోటి సోదరులకు సహాయం చేసేవాడే. ముఖ్యంగా ఒక బృందంతోపాటు కలసి పనిచేసే వ్యక్తి తన తోటివారి సేవ చెయ్యాలి. వారి అవసరాలను తీర్చాలి. వారికి సకల విధాలా సౌఖ్యం, సౌకర్యం చేకూర్చాలి. ఈ సేవకు పుణ్యఫలం ఎంత ఘనంగా లభిస్తుంది! ఈ సత్కార్యానికి మించిన సత్కార్యం ఏదయినా ఉంటే అది, మనిషి దైవ మార్గంలో నిరంతర కృషి సలుపుతూ చివరికి ప్రాణాలు కోల్పోయి అమరగతిని పొందడం ఒక్కటే.

٢٠٤ عَنْ مُعَاذٍ قَالَ: غَزَوْنَا مَعَ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَضَيَّقَ النَّاسُ الْمَنَازِلَ وَقَطَعُوا الطَّرِيقَ فَبَعَثَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مُنَادِيًا يُنَادِي فِي النَّاسِ "أَنَّ مَنْ ضَيَّقَ مَنْزِلًا أَوْ قَطَعَ الطَّرِيقَ فَلَا جِهَادَ لَهُ." (ابوداؤد)

204. హజ్రత్ ముఆజ్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: 'మేము ఒకసారి మహాప్రవక్త (సఅసం) తో పాటు ఒక పోరాటంలో పాల్గొన్నాము. శిబిరాలు వేసుకున్న వారు ఆ ప్రదేశాన్ని చాలా ఇరుకుచేసి వేశారు. రాను పోను త్రోవే లేకుండా చేశారు. మహాప్రవక్త (సఅసం) ఒక వ్యక్తిని పంపి, "ఎవరయితే శిబిరాల స్థలాన్ని ఇరుకు చేస్తారో వారికి జిహాద్ (దైవ మార్గంలో నిరంతరకృషి) చేసే పుణ్యఫలం లభించదు." అని చాటింపు వేయించారు.' (అబూదావూద్)

---

202 ఆగంతకుడు కుడి ఎడమలనుచూడటాన్ని బట్టి అతడు అగత్యపరుడని, అవసరమున్నవాడని, ఎవరయినా తనకు సహాయం అందజేస్తారేమో అని ఎదురు చూసాడని తెలుస్తోంది. ఆ పైన మహాప్రవక్త (సఅసం) అక్కడున్న వారిని ఉద్దేశించి తమ అవసరానికి మించిన దాన్ని అవసరమున్న వారికి ప్రదానం చెయ్యడం పట్ల చేసిన ఉపదేశాన్నిబట్టి తెలిసేదేమంటే, ఎంతటి వాడయినా, ఎలాంటి వాహనం ఎక్కి వచ్చినా, ధనవంతుడయినా, ఆ సమయానికి అవసరం ఏర్పడి సహాయాన్ని అర్థిస్తే ఆ సహాయం అందజెయ్యడం అవసరం.

203 ఒంటెలంటే వాహనాలన్నింటికి ఆ మాట వర్తిస్తుంది. ఎవరికీ ఉపయోగపడని ఏ వాహనమయినా మరే పదార్థమయినా షైతాన్‌కు చెందింది కాకపోతే మరేమిటి?

షైతాన్‌ల గృహాలంటే, ప్రజలు కేవలం ప్రదర్శనా బుద్ధితో, తమ ఐశ్వర్యాన్ని చాటుకోడానికి, అనవసరంగా ఆర్భాటంగా కట్టించిన ఇళ్ళు. వారు స్వయంగానూ వాటిని వినియోగించుకోలేరు లేదా అవసరమున్న వారినీ నివసించనివ్వరు. ఇస్లాం ఇలాంటి ఐశ్వర్య ప్రదర్శనను సుతరామూ అంగీకరించదు. మహాప్రవక్త (సఅసం) ఇలాంటి ఇండ్లు ఆ కాలంలో చూడలేదంటే అప్పుడు ఇలాంటి బాహ్య ప్రదర్శనా బుద్ధి కలవారు అరుదు. ఆ తరువాత మన పూర్వీకులు, ఇప్పుడు మనం, అలాంటి షైతాన్ గృహాలు, శ్రీమంతులు కట్టించిన వైభవోపేత భవంతులు అనేకం చూస్తూనే ఉన్నాము.

204 శిబిరాలు వేసుకున్న వారు బాగా విశాలంగా వేసుకున్నట్లు తెలుస్తోంది. దానివల్ల వచ్చిపొయ్యేవారికి కష్టంకలిగే అవకాశం ఎంతయినా ఉంది. అందుచేత

# వ్యాధిగ్రస్తుని పరామర్శ

٢٠٥ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : إِنَّ عَزَّ وَجَلَّ يَقُوْلُ يَوْمَ الْقِيٰمَةِ : "يَا ابْنَ آدَمَ ، مَرِضْتُ فَلَمْ تَعُدْنِيْ ." قَالَ : يَا رَبِّ ، كَيْفَ أَعُوْدُكَ وَأَنْتَ رَبُّ الْعٰلَمِيْنَ ؟ قَالَ : "أَمَا عَلِمْتَ أَنَّ عَبْدِيْ فُلَانًا مَرِضَ فَلَمْ تَعُدْهُ ؟ أَمَا عَلِمْتَ أَنَّكَ لَوْ عُدْتَّهُ لَوَجَدْتَّنِيْ عِنْدَهُ ."

(مُسلم - ابوهريرةؓ)

205. మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం) ఇలా ప్రవచించారు : "సర్వోన్నత ప్రభువు ప్రళయ దినాన ప్రశ్నిస్తాడు, ఆదం పుత్రుడా, నేను వ్యాధిగ్రస్తుణ్ణయి ఉన్నప్పుడు నీవు నన్ను పరామర్శించలేదే?" అని. దానికి మనిషి, 'నా స్వామీ! నిన్ను నేను పరామర్శించడమేమిటి? నీవు సర్వలోకాల ప్రభువు కదా !', అని విన్నవించుకుంటాడు. అల్లాహ్ ఇలా అంటాడు, 'నీకు గుర్తుందా? నా ఫలానా దాసుడు అనారోగ్యంతో పడి ఉన్నప్పుడు నీవు పరామర్శకు వెళ్ళలేదు. నీవు అతన్ని పరామర్శించి ఉంటే, నన్ను అక్కడ దర్శించేవాడివని నీకు తెలీదా?"

(ముస్లిమ్-అబూహురైరా)

---

మహాప్రవక్త ఆ ప్రకటన చేయించారు. ప్రయాణం చేసేవారు, అందునా సత్కార్య సంకల్పకులు, విస్తారంగా విశాలస్థలాన్ని ఆక్రమించుకోవడం కేవలం తమ సౌకర్యాన్ని చూసుకోవడం, ఇతరుల అవసరాన్ని గమనించకపోవడం భావ్యం కాదు. అవసరం మేరకు చోటును వాడుకోవటం ఇతరుల సౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకుని మెలగడం అవసరం.

205 ఆపదలో ఉన్నవారివద్ద దైవం ఉంటాడని మనం వింటూ ఉంటాం, ఈ హదీసు కూడా దాన్ని ధృవీకరిస్తోంది, మరి ఆ ప్రభువు ఆపద్బాంధవుడు (ముష్కిల్‌కుషా) కదా?

పరామర్శ అంటే కేవలం రోగి వద్దకు వెళ్ళి రోగం, చికిత్సలను గురించి విచారించడం కాదు. వాస్తవానికి పరామర్శ అంటే రోగి బీదవాడయితే అతని మందు మాకు ఏర్పాట్లు చెయ్యడం. లేదా అతనికి అవసరమైనవి తెచ్చిపెట్టేవారు లేకపోతే వాటిని సర్దే

٢٠٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "عُوْدُوْا الْمَرِيْضَ وَاَطْعِمُوا الْجَائِعَ وَفُكُّوا الْعَانِيَ." (بخاری - ابوموسیٰؓ)

206. దైవ సందేశహరులు ఇలా ఉపదేశించారు: "రోగిని పరామర్శించండి; ఆకలిగొన్న వానికి అన్నం పెట్టండి; బందీగా ఉన్న వానిని విడిపించే ప్రయత్నం చెయ్యండి.' (బుఖారి–అబూమూసా)

٢٠٧ كَانَ غُلَامٌ يَهُوْدِيٌّ يَخْدِمُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَمَرِضَ فَأَتَاهُ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَعُوْدُهٗ، فَقَعَدَ عِنْدَ رَأْسِهٖ فَقَالَ لَهٗ اَسْلِمْ، فَنَظَرَ إِلٰى اَبِيْهِ وَهُوَ عِنْدَهٗ فَقَالَ: اَطِعْ اَبَا الْقَاسِمِ فَاَسْلَمَ، فَخَرَجَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَهُوَ يَقُوْلُ: اَلْحَمْدُ لِلّٰهِ الَّذِيْ اَنْقَذَهٗ مِنَ النَّارِ." (بخاری - انسؓ)

207. ఒక యూదు బాలుడు దైవప్రవక్త (సఅసం) సేవకు నియుక్తుడయి ఉండేవాడు. ఒకసారి అతనికి అస్వస్థత కలిగితే మహాప్రవక్త (సఅసం) అతన్ని పరామర్శించడానికి వెళ్ళారు. అతని తలవైపు కూర్చున్నారు. అతనితో, "ఇస్లాం స్వీకరించు" అని ఉపదేశించారు. అతడు అక్కడే తన వద్ద కూర్చుని ఉన్న తన తండ్రివైపు చూసాడు, అతని తండ్రి, "అబుల్ కాసిం (మహనీయ ముహమ్మద్ (సఅసం)] చెప్పినట్లే చెయ్యి." అని చెప్పగా అతడు ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించాడు. ఆ తరువాత అక్కడినుంచి బయల్దేరుతూ దైవసందేశహరులు (సఅసం) ఇలా అన్నారు. "అల్‌హమ్దు లిల్లాహ్ (అల్లాహ్‌కు అభివందనాలు) దైవం ఇతన్ని నరకాగ్ని నుండి రక్షించాడు." (బుఖారి–అనస్)

---

ప్రయత్నం చెయ్యడం అనే భావం కూడా ఇందులో ఇమిడి ఉంది.

206 మహాప్రవక్త (సఅసం) తన సహచరులకు శిక్షణ గరిపేటప్పుడు ఒక్కోసారి ఒక్కో విధంగా ఉపదేశించేవారు. అంతర్యంలో ఆర్ద్రత, కనికరం, కోమలతను సృజించేందుకు ఈ హదీసులో దైవ ప్రవక్త మార్గాలు సూచించారు. హదీసులో

٢٠٨ قَالَ ابْنُ عَبَّاسٍ : مِنَ السُّنَّةِ تَخْفِيفُ الْجُلُوسِ وَقِلَّةُ الصَّخَبِ فِي الْعِيَادَةِ عِنْدَ الْمَرِيضِ ـ (مشكوٰة)

208. హ(జత్ అబ్దుల్లా ఇబ్ను అబ్బాస్ ఇలా తెలియపరిచారు : "సున్నత్ (మహాప్రవక్త సంప్రదాయం ప్రకారం రోగిని పరామర్శించేటప్పుడు అతని వద్ద సద్దు చేయకుండా కూర్చోవాలి." (మిష్కాత్)

## ముస్లిమ్‌లపై ముస్లిమ్‌ల హక్కులు

٢٠٩ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : فِي حَجَّةِ الْوَدَاعِ : " أَلَا إِنَّ اللّٰهَ حَرَّمَ عَلَيْكُمْ دِمَاءَكُمْ وَأَمْوَالَكُمْ وَأَعْرَاضَكُمْ كَحُرْمَةِ يَوْمِكُمْ هٰذَا فِي بَلَدِكُمْ هٰذَا فِي شَهْرِكُمْ هٰذَا ، أَلَا هَلْ بَلَّغْتُ ؟ قَالُوا : نَعَمْ ، قَالَ : " اَللّٰهُمَّ اشْهَدْ " ثَلَاثًا ، وَيْلَكُمْ اَوْ وَيْحَكُمْ ، اُنْظُرُوا لَا تَرْجِعُوا بَعْدِي كُفَّارًا يَضْرِبُ بَعْضُكُمْ رِقَابَ بَعْضٍ ـ " (بخاری-ابن عمرؓ)

209. మహాప్రవక్త (సఅసం) 'వీడ్కోలు హజ్' సమయాన ముస్లిమ్‌లను సంబోధిస్తూ ఇలా ఉపన్యసించారు : "బాగా వినండి, అల్లాహ్ ఈ దినాన్ని, ఈ నెలను, ఈ నగరాన్ని ఏ విధంగా పవిత్రమయినవిగా నిర్ణయించాడో అదేవిధంగా మీ రక్తాన్ని, మీ ధనాన్ని, మీ మానాన్నికూడా పవిత్రమైనవిగా నిర్ణయించాడు. శ్రద్ధగా వినండి, నేను అన్నీ వివరంగా బోధపరిచానా?"

---

పేర్కొనబడిన మూడు సత్కార్యాలు కూడా సమాజంలోని విభిన్న వ్యక్తులకు ఏదో విధంగా మేలు చేకూర్చేవే అనడంలో సందేహంలేదు. దానికి తోడుగా వీటి ద్వారా, వీటిని ఆచరించే వ్యక్తి హృదయంలో కూడా కొన్ని శాశ్వత సద్గుణాలు చోటు చేసుకునే అవకాశం ఉంది.

207 దేవుని అంతిమ సందేశహరులయిన ముహమ్మద్ (సఅసం) పరిశుద్ధ గుణగణాలను గురించి మిత్రులు, శత్రువులకు సమానంగా తెలుసు. యూదులంతా ఆయన శత్రువులు కారు. వారిలో ఎందరో ప్రవక్త శ్రేయోభిలాషులు, ఆయన్నిగౌరవించే వారు ఉండేవారు. ఈ హదీసులో ప్రస్తావించబడిన యూదునికి మహాప్రవక్త (సఅసం) ఎడల

అక్కడున్న సహచరులు "అవును, మీరు అంతా బాగానే వివరించారు." అని పలికారు. దాని మీదట ఆయన "అల్లాహ్, నేను సందేశాన్ని ఉమ్మత్‌కు అందజేసిన దానికి నీవే సాక్షివి." అని మూడు పర్యాయాలు పలికారు, తరువాత ఈ విధంగా ప్రబోధించారు: "చూడండి, మీరు ముస్లిములయి కూడా, నా తరువాత, పరస్పరం మెడలు నరుక్కునే అవిశ్వాసులుగా మారకండి." (బుఖారి- ఇబ్నె ఉమర్)

٢١٠ عَنْ جَرِيْرِ بْنِ عَبْدِ اللهِ قَالَ : بَايَعْتُ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ عَلٰى إِقَامَةِ الصَّلٰوةِ وَإِيْتَاءِ الزَّكٰوةِ وَالنُّصْحِ لِكُلِّ مُسْلِمٍ۔"

(بخاری - مُسلم)

210. జరీర్ బిన్ అబ్దుల్లాహ్ ఇలా ఉల్లేఖించారు : "నేను దైవ సందేశహరుల (సఅసం) చేతి మీదుగా - నమాజ్ చేస్తానని, జకాత్ చెల్లిస్తానని, ప్రతి ముస్లిమ్ ఎడల సదభిలాష కలిగి ఉంటానని బయ్‌త్ (ప్రమాణం) చేశాను." (బుఖారి, ముస్లిమ్)

---

ఆత్మీయత ఉండేది. అందువల్ల అతడు తన కొడుకును దైవప్రవక్త సేవ చేయడానికి నియమించాడు. వ్యాధిగ్రస్తులయినప్పుడు మనిషి హృదయం ఆర్ద్రమయి వుంటుంది. దైవచింతన, ధర్మాచరణ పట్ల ఆసక్తి జనిస్తుంది, మహాప్రవక్త అలాంటి అదనుచూచి, పరామర్శలయ్యాక ఎంతో వివేకవంతంగా ఇస్లాం ధర్మ సందేశాన్ని వినిపించిన తరువాతే దాన్ని స్వీకరించమని ఆహ్వానించి ఉంటారు. రేయింబవళ్ళు మహాప్రవక్త సద్ప్రవర్తన, ఆయన బోధనలు వింటూ ఉన్న ఆ యువకుడు, తనకు ఇష్టమయినా తండ్రి ఏమంటాడో అన్న జంకుతో ఆ తండ్రివైపు చూసాడు. తండ్రి తనకు అభ్యంతరం లేదని తెలుపగానే ఋజుమార్గాన్ని స్వీకరించాడు.

208 ఇది సాధారణంగా అందరికీ వర్తించే ఆదేశం. కానీ ఆత్మీయులు, మొహమాటం పాటించని మిత్రులు వ్యాధిగ్రస్తులయితే, వారి వద్ద కూర్చోవడం వారికి ఇష్టమే అయితే, కాస్త అధికంగానే కూర్చోవడం, కాలక్షేపం చెయ్యడంలో తప్పులేదు.

209 'వీడ్కోలు హజ్' అంటే ఆ హజ్ తరువాత మహాప్రవక్త కొన్ని దినాలకే ఇహలోకాన్ని వదలి వెళ్ళిపొయ్యారు. 'రక్తాన్ని పవిత్రం'గా నిర్ణయించడమంటే అధర్మంగా ప్రాణంతీయడం. రక్తం చిందించడం నిషిద్ధం అని భావం. ధనమాన ప్రాణాల రక్షణ విధిగా నిర్ణయించినట్లు కూడా ఈ హదీసు ద్వారా తెలుస్తోంది.

٢١١ قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "تَرَى الْمُؤْمِنِينَ فِي تَرَاحُمِهِمْ وَتَوَادِّهِمْ وَتَعَاطُفِهِمْ كَمَثَلِ الْجَسَدِ، إِذَا اشْتَكَى عُضْوٌ تَدَاعَى لَهُ سَائِرُ الْجَسَدِ بِالسَّهَرِ وَالْحُمَّى" (بخاری۔مُسلم۔نعمان بن بشیرؓ)

211. దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు : "నీవు ముస్లిమ్‌లను పరిశీలించావంటే, వారు పరస్పర దయాశీలురనీ, ప్రేమమయులనీ, అన్యోన్య అనురాగ భరితులనీ కనుగొంటావు. వారి పరిస్థితి ఒక దేహం లాంటిది, దేహంలో ఒక అవయవానికి ఏదయినా జబ్బు చేస్తే దేహంలోని ఇతర అవయవాలు కూడా విశ్రమాన్ని వదలి జ్వరంలో పాలు పంచుకుని దానికి తోడవుతాయి." (బుఖారి - ముస్లిమ్- నోమాన్ బిన్ బషీర్)

---

అసలు ఈ హదీసు ఒక పెద్ద ప్రసంగంలోని భాగం. ప్రసంగం చివరలో దైవ సందేశహరులు (సఅసం) అక్కడ సమావేశమయిన ముస్లింలను ఉద్దేశిస్తూ నేను వివరంగా బోధపరిచానా అని అడగడంలో ఉద్దేశ్యం, ఏదయినా అడగదలుచుకుంటే అడగండి అన్నదే. తాను దైవ సందేశాన్ని సక్రమంగా ప్రజలకు అందజేశానన్న విషయానికి దైవాన్ని సాక్షిగా పేర్కొనడం మహాప్రవక్త పరలోక చింతనను, దైవ భీతిని ఎత్తి చూపుతోంది.

210. 'బయ్‌త్' అంటే అమ్మకం అని అర్థం. దాన్ని ప్రమాణం అన్న అర్థంలో వాడతారు. ఇక్కడ భావమేమంటే, మనిషి ఎవరి చేతి మీదుగా బయ్‌త్ చేస్తాడో వాస్తవానికి అతడు తన జీవితాంతం ఆ శపథాన్ని కాపాడతానని ప్రమాణం చేస్తాడన్నమాట. హజ్రత్ జరీర్ (ర.అ.)తో మహాప్రవక్త (సఅసం) మూడు విషయాల ప్రమాణం తీసుకున్నారు. నమాజ్‌ను దాని నిబంధనలన్నింటినీ పాటిస్తూ ఆచరించడం, జకాత్‌ను సమయానికి చెల్లించడం, తోటి ముస్లిం సోదరులతో ఏ విధమయిన అక్రమవ్యవహారం చెయ్యకుండా వుండటం, వారి ఎడల ప్రేమాభిమానాలతో శ్రేయోభిలాషతో వ్యవహరించడం. ఈ హదీసు ద్వారా ముస్లిం సమాజంలోని వ్యక్తులు పరస్పరం ఏ విధంగా మసలుకోవాలో వెల్లడవుతోంది.

211 గమనార్హమయిన విషయం ఏమిటంటే, దైవప్రవక్త(సఅసం), శరీర ఉపమానాన్ని ఉదాహరిస్తూ ముస్లింలందరూ ఒకే శరీరంలా ఉండాలని ఉపదేశించలేదు. శరీరంలా ఉండటం ముస్లింల సహజమయిన, స్థిరమయిన గుణంగా పేర్కొన్నారు. ముస్లింలను ఎవరు, ఎప్పుడు చూసినా వారంతా పరస్పరం అన్యోన్య ప్రేమానురాగాలతో ప్రవర్తించుకునే వారుగానే గమనిస్తారు అని పలికారు.

۲۱۲ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "اَلْمُؤْمِنُ لِلْمُؤْمِنِ كَالْبُنْيَانِ يَشُدُّ بَعْضُهُ بَعْضًا، ثُمَّ شَبَّكَ بَيْنَ أَصَابِعِهِ"۔

(بخاری، مُسلم۔ابوموسیٰؓ)

212. దైవ సందేశహరులు (సఅసం) ప్రబోధించారు : "విశ్వాసి మరొక విశ్వాసితో కలసి ఒక కట్టడంలా రూపొందుతాడు. దాని ఒక భాగం మరొక భాగానికి బలం చేకూర్చుతుంది." అంటూ ఆయన తన ఒక చేతి వ్రేళ్ళను రెండవ చేతి వ్రేళ్ళలో దూర్చి చూపారు.

(బుఖారి, ముస్లిమ్- అబూమూసా)

۲۱۳ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "اَلْمُؤْمِنُ مِرْاٰةُ الْمُؤْمِنِ، وَالْمُؤْمِنُ أَخُو الْمُؤْمِنِ يَكُفُّ عَنْهُ ضَيْعَتَهُ وَيَحُوْطُهُ مِنْ وَّرَائِهِ"۔ (مِشکوٰۃ۔ابوھُریرہؓ)

213. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "విశ్వాసి మరొక విశ్వాసికి దర్పణం లాంటివాడు. ఒక విశ్వాసి మరొక విశ్వాసికి సోదరునితో సమానం. అతన్ని ఇతడు నాశనం కాకుండా కాపాడుతాడు. అతన్ని పరోక్షంగా కూడా రక్షిస్తాడు". (మిష్కాత్-అబూహురైరా)

---

212. ఈ హదీసులో ముస్లిం సమాజాన్ని ఒక పటిష్ఠమయిన కట్టడంతో పోల్చడం జరిగింది. కట్టడంలోని ఇటుకలు ఏ విధంగానయితే ఒకదానితో ఒకటి పటిష్ఠమయి ఉంటాయో ఒక్కొ ఇటుక మరో ఇటుకకు ఏ విధంగానయితే బలాన్నీ, ఆధారాన్ని అందిస్తుందో అదే విధంగా ముస్లింలందరూ పరస్పరం సంగఠితంగా, పటిష్ఠంగా ఉండాలనీ, వీరు కూడా ఒకరినొకరు ఆదుకోవాలనీ, ఆధారమివ్వాలనీ, తన్మూలంగా సమాజానికి పటిష్ఠత చేకూర్చాలనీ భావం. ఇంకా, ముందు దూరదూరంగా ఉన్న ఇటుకలు పరస్పరం దగ్గరై కట్టడమనే లక్ష్యం కొరకు పటిష్ఠమయి ఓ కట్టడం రూపాన్ని సంతరించుకున్న విధంగానే ముస్లింలు కూడా సంగఠితంగా, సంఘీభావంతో ఉండడంలోనే వారి శక్తి ఇమిడి ఉందని, వారు విచ్ఛిన్నమయి పరస్పరం దూరాలు ఏర్పరచుకుంటే వారిని ఒక్క గాలి దుమారమే ఎగుర వేసుకుపోతుందని, ఒక్క నీటి వరదలోనే కొట్టుకుపోతారని మహాప్రవక్త(సఅసం) కట్టడపు దృష్టాంతాన్ని ఇచ్చారు. ఈ విషయాన్నే భావయుక్తంగా బోధపరచడానికి తన చేతి వ్రేళ్ళను కలిపి కళ్ళకు కట్టినట్టు చూపారు.

۲۱۴ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "أُنْصُرْ أَخَاكَ ظَالِمًا أَوْ مَظْلُوْمًا"، فَقَالَ رَجُلٌ: يَا رَسُوْلَ اللّٰهِ، أَنْصُرُهُ مَظْلُوْمًا فَكَيْفَ أَنْصُرُهُ ظَالِمًا؛ قَالَ تَمْنَعُهُ مِنَ الظُّلْمِ فَذٰلِكَ نَصْرُكَ إِيَّاهُ۔"

(بخاری۔مسلم۔انسؓ)

214. "నీవు నీ సోదరునికి తోడ్పడు - అతడు దౌర్జన్యం చేసే వాడయినా, దౌర్జన్యానికి గురయిన వాడయినా" అన్నారు ఒకసారి దైవ సందేశహరులు (సఅసం). ఒక వ్యక్తి, "దైవ ప్రవక్తా! దౌర్జన్యానికిగురయిన వాడయితే నేనతన్ని ఆదుకుని తోడ్పడగలను, కాని దౌర్జన్యం చేసేవాడయితే అతనికి సహాయపడేదెలా?" అని అడిగాడు. అప్పుడు ఆయన ఉపదేశించారు; "అతన్ని దౌర్జన్యం చెయ్యకుండా వారించు, ఇదే నీవు చేసే సహాయం !" (బుఖారి, ముస్లిమ్ - అనస్)

---

213. అంటే, అతనిలో ఏవయినా బలహీనతలు కానవస్తే నేరుగా అతనితోనే చెప్పి వాటిని దూరం చెయ్యడానికి ప్రయత్నించాలి. కాని వాటిని ఇతరులతో చెప్పి అతన్ని అవమాన పరచరాదని భావం. ఇంకా అతని కష్టాలను తన కష్టాలుగా భావించి అతడు బాధపడినట్లే తానూ బాధపడుతూ ఆ కష్టాలను తొలగించడానికి కృషికై పూనుకోవాలని అర్థం. మరో హదీసులో ఇలా ఉంది:

إِنَّ أَحَدَكُمْ مِرْاٰةُ أَخِيْهِ، فَإِنْ رَأٰى بِهٖ أَذًى فَلْيُمِطْهُ عَنْهُ۔

"మీలో ప్రతి ఒక్కడూ తన సోదరునికి అద్దం లాంటివాడు. అతన్ని ఏదయినా బాధలో చూస్తే దాన్ని దూరం చెయ్యడానికి ముందుకు రావాలి." అదే విధంగా అతనిలో ఏదయినా బలహీనత గోచరిస్తే దాన్ని దూరం చెయ్యడానికి కృషి చెయ్యాలి.

214. జాతి దురభిమానానికి, ఆశ్రిత పక్షపాతానికి ప్రతీక అయిన ఆ అరబ్బుల అజ్ఞాన కాలపు నానుడిని మానవ మహోపకారి ఎంతో చక్కగా నిర్మాణాత్మకంగా మలచారు.

నేటికీ **Right or wrong my Nation** (ఒప్పయినా తప్పయినా - నా దేశం) అనే జాతి దురభిమానులు, ఆ జాతి దురభిమానాన్ని బోధించేవారు ఎంతో మంది ఉన్నారు. వారికి కనువిప్పు కాగలగాలి మహాప్రవక్త ఉపదేశం.

٢١٥ إِنَّ رَسُولَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: الْمُسْلِمُ أَخُو الْمُسْلِمِ لَا يَظْلِمُهُ وَلَا يُسْلِمُهُ، وَمَنْ كَانَ فِي حَاجَةِ أَخِيهِ كَانَ اللهُ فِي حَاجَتِهِ، وَمَنْ فَرَّجَ عَنْ مُسْلِمٍ كُرْبَةً فَرَّجَ اللهُ عَنْهُ كُرْبَةً مِّنْ كُرُبَاتِ يَوْمِ الْقِيٰمَةِ، وَمَنْ سَتَرَ مُسْلِمًا سَتَرَهُ اللهُ يَوْمَ الْقِيٰمَةِ" (بخاری، مُسلم - ابن عمرؓ)

215. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "ఒక ముస్లిమ్ మరొక ముస్లిమ్‌కు సోదరుడు. అతనికి ఎలాంటి అన్యాయమూ చెయ్యడు, అతన్ని అసహాయ స్థితిలోనూ వదలివెయ్యడు. ఎవరయితే తన సోదరుని అవసరాన్ని తీరుస్తాడో, అతని అవసరాన్ని అల్లాహ్ తీరుస్తాడు. ఎవరయితే ఒక ముస్లిమ్‌పై ఆసన్నమయిన కష్టాన్ని దూరం చేస్తాడో, అతనికి ప్రళయదినాన ఎదురయ్యే కష్టాన్ని అల్లాహ్ దూరం చేస్తాడు, ఎవరయితే ఒక ముస్లిమ్‌లోని లోటుపాట్లను మరుగు పరుస్తాడో అల్లాహ్ ప్రళయ దినాన అతని తప్పిదాలను కప్పిపుచ్చుతాడు."

(బుఖారి, ముస్లిమ్-ఇబ్నె ఉమర్)

---

నీ సోదరుడు జులుం చేసేవాడయినా, జులుంకు లోనయిన వాడయినా నీవు మాత్రం నీ సోదరుని పక్షం వహించాలన్నది మూఢత్వపు సూక్తి. అది తప్పు అని, జులుంకు లోనయిన వ్యక్తిని జులుం నుండి కాపాడటం ఏ విధంగా నీ బాధ్యతో జులుం చేసేవాడు నీ సోదరుడయితే అతన్ని జులుంనుండి వారించటం, అవసరమయితే అతనిని ఎదిరించటం కూడా నీ విధియే. కేవలం నీ వాడయినంత మాత్రాన అతన్ని వెనుక వేసుకురావడం సరయిన విధానం కాదు అనిచెబుతోంది ఈ ప్రవచనం.

215. తోటి సోదరునిపట్ల అత్యాచారం చెయ్యకుండా ఉండటం, అవసరమున్నప్పుడు ఆదుకోవడం విశ్వాసి ధర్మం అని ఈ హదీసు చాటుతోంది.

హదీసులోని ఆఖరు మాటకు అర్థమేమిటంటే ఒక మంచి వ్యక్తి వల్ల ఏదయినా పొరపాటుజరిగితే, అతన్ని ప్రజల దృష్టిలో కించపరచడానికి దాన్ని ప్రచారం చెయ్యరాదు. దాన్ని కప్పిపుచ్చడానికే ప్రయత్నం చెయ్యాలి. అయితే దానికి భిన్నమయిన సందర్భంలో, అంటే దైవాదేశాలను బహిరంగంగా అతిక్రమించే వాని తప్పుల్ని కప్పి పుచ్చకుండా అతన్ని నలుగురిలో నిలబెట్టడమే కర్తవ్యమని కూడా మహాప్రవక్త (సఅసం) బోధించారు.

٢١٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : وَالَّذِىْ نَفْسِىْ بِيَدِهٖ،
لَا يُؤْمِنُ عَبْدٌ حَتّٰى يُحِبَّ لِأَخِيْهِ مَا يُحِبُّ لِنَفْسِهٖ - (بُخاری۔ مُسلم۔ انسؓ)

**216.** మహాప్రవక్త (సఅసం) ఇలా వక్కాణించారు: "నా ప్రాణాన్ని గుప్పెట్లో ఉంచుకున్న శక్తి సాక్షిగా - తన కొరకు ఇష్టపడిన దాన్ని తన సోదరుని కొరకు కూడా ఇష్టపడనంత వరకు ఏ వ్యక్తి అయినా నిజమయిన విశ్వాసి కాజాలడు." (బుఖారి, ముస్లిమ్- అనస్)

٢١٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : إِنَّ مِنْ عِبَادِ اللّٰهِ
لَأُنَاسًا مَّا هُمْ بِأَنْبِيَاءَ وَلَا شُهَدَاءَ ، يَغْبِطُهُمُ الْأَنْبِيَاءُ وَالشُّهَدَاءُ
يَوْمَ الْقِيٰمَةِ بِمَكَانِهِمْ مِّنَ اللّٰهِ ، قَالُوْا : يَا رَسُوْلَ اللّٰهِ ، تُخْبِرُنَا
مَنْ هُمْ ؟ قَالَ : هُمْ قَوْمٌ تَحَابُّوْا بِرُوْحِ اللّٰهِ عَلٰى غَيْرِ اَرْحَامٍ بَيْنَهُمْ
وَلَا اَمْوَالٍ يَّتَعَاطَوْنَهَا ، فَوَاللّٰهِ ، إِنَّ وُجُوْهَهُمْ لَنُوْرٌ ، وَإِنَّهُمْ لَعَلٰى نُوْرٍ ،
لَا يَخَافُوْنَ إِذَا خَافَ النَّاسُ ، وَلَا يَحْزَنُوْنَ إِذَا حَزِنَ النَّاسُ وَقَرَأَ
هٰذِهِ الْاٰيَةَ : اَلَآ إِنَّ اَوْلِيَاءَ اللّٰهِ لَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُوْنَ ۔

**217.** ఒకసారి మహాప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు : "దైవ దాసుల్లో కొందరు, ప్రవక్తలు కాకపోయినా, అమరగతులు కాకపోయినా ప్రళయ దినాన వారికి అల్లాహ్ ప్రసాదించిన ఉన్నత స్థానాన్ని చూసి ప్రవక్తలు, అమరగతులు సయితం ఈర్ష్యతో కూడిన ఆనందం అనుభవిస్తారు."

---

216. ఈ హదీసువల్ల తెలిసేదేమంటే విశ్వాసి తాను ఆచరించిన సత్కార్యాన్ని తన సోదరునికి కూడా చెప్పాలి, అయితే తాను చెయ్యలేని దాన్ని ఇతరుల ద్వారా ఆశించటం తప్పు. అలాగే తాను రెండు వస్తువుల్లో ఒకదాన్ని ఎన్నుకోవలసి వచ్చినప్పుడు నిత్యం తనతోటి మిత్రునికై మంచి దాన్ని వదలి మరీ ఎన్నుకోవాలి. ఇంకా తాను ఒక మంచి వస్తువును తనకై తీసుకుంటే, వీలయితే అలాంటి మంచి వస్తువు తన సోదరులు, మిత్రులు, ఆప్తులయిన వారికై కూడా తీసుకోవాలి. ఇలాంటి వాతావరణం వల్ల సమాజం ఎంత ప్రేమపూరితంగా ఆనందమయంగా తయారవుతుందో గమనించండి.

"వారెవరు దైవ ప్రవక్తా?" అని అక్కడున్న వారు అడిగారు. దానికి మహాప్రవక్త (సఅసం), "వారు బంధువులు కాకపోయినా, తమ మధ్య ధనం లావాదేవీలు లేకపోయినా, అల్లాహ్‌ధర్మం ప్రాతిపదికపైన అన్యోన్యంగా ప్రేమించుకున్న వారు. దైవం సాక్షిగా వారి వదనాలు జ్యోతిర్మయమయి ఉంటాయి. వారి ముఖం చుట్టూ వెలుగు భాసిల్లుతూ ఉంటుంది. జనులు భయాందోళనలు చెందే ఆ సమయంలో వారికి ఎలాంటి భయమూ ఉండదు, జనులు ఖేదావృతులయి ఉండే ఆ వేళ వారికి ఎలాంటి దుఃఖమూ ఉండదు' అని ప్రవచించి ఈ ఆయత్ పఠించారు :

"తెలుసుకోండి, దేవుని మిత్రులయిన వారికి నిస్సందేహంగా ఎలాంటి భయమూ ఉండదు, వారికి ఎలాంటి దుఃఖమూ కలుగదు."

*(యూనుస్ : 62)*

---

217. అసలు హదీసులో 'గబిత్' అనే పదం ఉంది. దీనికి మహదానందం పొందడం అని అర్థం. ఇదే పదం ఈర్ష్య అనే భావంలో కూడా ప్రయోగించబడుతుంది. ప్రస్తుత హదీసులో దీనికి మొదటి భావమే వర్తిస్తుంది. అంటే ఒక గురువు, తన శిష్యుడు ఉన్నత స్థానాన్ని ఆక్రమించడం చూసి ఆనందంతో, గర్వంతో పొంగిపోయినట్లే, అత్యున్నత స్థానాల్లో ఉండే దైవ ప్రవక్తలు, అమరగతులయినవారు ఈ వ్యక్తుల ఉన్నత స్థాయిని, భాగ్యాన్ని గమనించి సంతోషపడతారు. హదీస్‌లో ప్రస్తావించబడ్డ ఈ మహనీయుల పరస్పర ప్రేమ మైత్రికి కారణం, పునాది కేవలం 'ధర్మం' మాత్రమే. వారిని ఒకచోట చేర్చింది ఏ విధమయిన ఆర్థిక లావాదేవీలు, రక్త సంబంధాలు మాత్రం కావు. కేవలం ఇస్లాం మరియు ఇస్లామీయ జీవన విధానానికి సమాజ రూపకల్పనలో ఆచరణాత్మక స్థానాన్ని ఇవ్వాలన్న లక్ష్యమే వారిని ఏకం చేసింది. హదీసులో ఇలాంటి వారికై ఈ లోకంలో విజయం, దైవ సహాయం ప్రాప్తిస్తాయనీ, పరలోకంలో శాశ్వత సాఫల్యం లభిస్తుందనీ శుభవార్త ఇవ్వడం జరిగింది.

హదీసు చివరన దైవప్రవక్త (సఅసం) పఠించిన యూనుస్ సూరాలోని ఆయత్‌లో, విశ్వాసం గైకొని, ధర్మపథాన పీడింపబడే వారిని, విశ్వాసం ఆధారంగా జీవితం గడపడం కోసం నిరంతర కృషి జరిపే వారిని, అజ్ఞానపు వ్యవస్థతో నిరంతరం పోరాడే వారిని ప్రస్తావించడం జరిగింది. అల్లాహ్ వారిని గురించి - "వీరికై యీ జీవితం లోనూ రాబోయే జీవితంలోనూ సాఫల్యం లభిస్తుందన్న శుభవార్తనిస్తున్నాము" అని పలికాడు.

۲۱۸ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "لَا يَحِلُّ لِلرَّجُلِ أَنْ يَّهْجُرَ أَخَاهُ فَوْقَ ثَلَاثِ لَيَالٍ يَّلْتَقِيَانِ فَيُعْرِضُ هٰذَا وَيُعْرِضُ هٰذَا۔ وَخَيْرُهُمَا الَّذِيْ يَبْدَأُ بِالسَّلَامِ" (بخاری۔مُسلم۔ ابوایّوب انصاریؓ)

**218.** దైవసందేశహరులు (సఅసం) ఇలా ప్రబోధించారు: "మనిషి మూడు రాత్రులకు మించి తోటి సోదరునితో సంబంధాలు త్రెంచుకుని ఉండటం, ఇద్దరూ దారిలో కలిసినప్పుడు ఎడముఖంపెడముఖంగా తప్పుకోవటం ధర్మ సమ్మతం కాదు. వారిద్దరిలో సలాం చేసేందుకు ఎవరు ముందుకు వస్తారో వారు ఉత్తములు."

(బుఖారి, ముస్లిమ్- అబూ అయ్యూబ్ అన్సారి)

۲۱۹ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "إِيَّاكُمْ وَالظَّنَّ فَإِنَّ الظَّنَّ أَكْذَبُ الْحَدِيْثِ، وَلَا تَحَسَّسُوْا، وَلَا تَجَسَّسُوْا، وَلَا تَنَاجَشُوْا، وَلَا تَبَاغَضُوْا، وَلَا تَدَابَرُوْا، وَكُوْنُوْا عِبَادَ اللّٰهِ إِخْوَانًا۔" (بخاری۔مُسلم۔ابوھریرہؓ)

**219.** మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు: "మీరు మిమ్మల్ని అనుమానాల నుండి రక్షించుకోండి. ఎందుకంటే అనుమానం అన్నది అతి నీచమయిన అబద్ధం. ఇతరులను గురించి వివరాలు సేకరిస్తూ తిరక్కండి. అపరాధాలు వెతకటానికి ఇతరుల వెంటపడకండి; పరస్పరం పగ, ప్రకోపాలకు తావివ్వకండి. అల్లాహ్ దాసులుగా, పరస్పరం సోదరులుగా మెలగండి."

(బుఖారి, ముస్లిమ్- అబూహురైరా)

---

218. ఇద్దరు ముస్లింలు ఏదయినా విషయంలో తగాదాపడి ఇద్దరిమధ్య మనస్పర్థలు ఏర్పడి మాట లేకుండా పోవడం అన్నది జరిగినా వారు అలా మూడు దినాలకు మించి ఉండరాదని ఈ హదీసు మనల్ని బోధిస్తోంది. సాధారణంగా ఆ ఇరువురు, ఏ మాత్రమయినా దైవభీతిగల వారయితే రెండు మూడు రోజుల అనంతరం వారిలో పరస్పరం కలుసుకునే ప్రబల వాంఛ జనించడం సహజం. చివరికి వారిలో ఒకరు 'సలాం' చెయ్యడంలో ముందంజవేసి ఆ పైశాచిక వైషమ్యాన్ని రూపుమాపుతారు.

٢٢٠ صَعِدَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ الْمِنْبَرَ فَنَادٰى بِصَوْتٍ رَفِيْعٍ فَقَالَ : يَا مَعْشَرَ مَنْ أَسْلَمَ بِلِسَانِهٖ وَلَمْ يُفْضِ الْإِيْمَانُ إِلٰى قَلْبِهٖ ، لَا تُؤْذُوا الْمُسْلِمِيْنَ وَلَا تُعَيِّرُوْهُمْ وَلَا تَتَّبِعُوْا عَوْرَاتِهِمْ فَإِنَّهٗ مَنْ يَتَّبِعْ عَوْرَةَ أَخِيْهِ الْمُسْلِمِ يَتَّبِعِ اللّٰهُ عَوْرَتَهٗ وَمَنْ يَتَّبِعِ اللّٰهُ عَوْرَتَهٗ يَفْضَحْهُ وَلَوْ فِيْ جَوْفِ رَحْلِهٖ ـ (ترمذی - ابن عمرؓ)

**220.** ఒకసారి దైవప్రవక్త (సఅసం) వేదికపైకి వచ్చి నిల్చొని చాలా హెచ్చు స్వరంలో ఇలా ప్రసంగించారు : "కేవలం నోటితోనే ఇస్లామ్ స్వీకరించిన జనులారా ! విశ్వాసం మీ అంతర్యాల్లో స్థిరపడలేదు, మీరు ముస్లిమ్‌లకు బాధ కలిగించకండి; వారిని రెచ్చగొట్టకండి; వారిలోని లోపాలను వెంటాడకండి; తమ సోదరుని లోపాలను వెదికే వ్యక్తిలోని లోపాలను అల్లాహ్ బట్టబయలు చేస్తాడు, అతన్ని నగుబాటు పాల్జేస్తాడు- అతడు తన ఇంటిలో తలదాచుకున్నా సరే !"

(తిర్మిజి - ఇబ్ను ఉమర్)

---

అందుకే ఈ హదీసులోనూ మరో హదీసులోనూ సలాం చెయ్యడానికి ముందుకు వచ్చే వారి ఘనతను కొనియాడటం జరిగింది.

219. ఈ హదీసు మూలంలో వచ్చిన కొన్ని పదాలను విశదీకరించడం అవసరం. దానివల్ల అసలు భావమేమిటో సునాయాసంగా అవగతమవుతుంది.

1. తహస్సుస్- శ్రద్ధతో వినడం, చూడటం - ఒకరిమాటల్ని వినడానికి లేదా ఒకరి చేష్టల్ని చూడటానికి పొంచి ఉండి, ఆ తరువాత ఆ విషయాన్ని ఆ వ్యక్తికి ప్రతికూలంగా ఉపయోగించడం ఇస్లాంకు విరుద్ధం అని దైవప్రవక్త ఇక్కడ బోధించారు.

2. తజస్సుస్-రంధ్రాన్వేషణ అంటే, ఒకరి తప్పిదాలను పట్టుకునేందుకు, పనికట్టుకుని నక్కి ఉండి, అతని ఆ బలహీనతలను ప్రచారంచేసి అతన్ని అవమానపరచటం. ఇదీ ఇస్లాంకు బద్ధవిరుద్ధమని హదీసు తెలుపుతోంది.

3. తనాజుష్ - ఇది వాణిజ్య సంబంధమయిన పారిభాషిక పదం. దీనికి మన భాషలో "దళారితనం" అనవచ్చు. దళారి విక్రయదారునితో ముందే సంప్రదించుకుని కొనేవారిని బోల్తా కొట్టించటానికి ఆ అమ్మే పదార్థం మూల్యాన్ని ఇతోధికంగా పెంచి

۲۲۱ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "لَمَّا عَرَجَ بِيْ رَبِّيْ
مَرَرْتُ بِقَوْمٍ لَّهُمْ أَظْفَارٌ مِّنْ نُّحَاسٍ يَّخْمِشُوْنَ وُجُوْهَهُمْ وَصُدُوْرَهُمْ،
فَقُلْتُ: مَنْ هٰؤُلَاءِ يَا جِبْرِيْلُ؟ قَالَ: هٰؤُلَاءِ الَّذِيْنَ يَأْكُلُوْنَ لُحُوْمَ
النَّاسِ وَيَقَعُوْنَ فِيْ أَعْرَاضِهِمْ." (ابوداؤد - انس)

**221.** మహాప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు: "నా ప్రభువు నన్ను ఆకాశాలమీదికి తీసుకు వెళ్ళినప్పుడు అక్కడ నాకు కొందరు వ్యక్తులు తటస్థపడ్డారు. వారి చేతిగోళ్ళు ఇత్తడివి. వాటితో వారు తమ ముఖాన్ని, రొమ్మును పొడుచుకుంటున్నారు. నేను జిబ్రీల్‌ని వారిని గురించి అడగ్గా, 'వీరు ప్రపంచంలో ఇతరుల మాంసం తినేవారు, ఇతరుల గౌరవాన్ని భంగపరచేవారు.' అని బదులు పలికారు".

(అబూదావూద్ - అనస్)

---

పలుకుతాడు. ఆ విధంగా పరస్పరం మోసంచెయ్యడాన్ని ఇక్కడ వారించడం జరిగింది.

4. తబాగుజ్ - అంటే పరస్పరం ద్వేషం కలిగి ఉండటం, ఆగ్రహావేశాలకు లోనవడం అని భావం.

5. తదాబుర్ - అంటే పరస్పర వైషమ్యం అనీ, సంబంధాలు త్రెంచుకోవడమని అర్థం వస్తుంది. వీటన్నిటికీ దూరంగా ఉండాలని ఇక్కడ బోధించబడింది.

220. మునాఫిక్‌లు (కపటాచారులు) నిజమయిన ముస్లింలను బహువిధాలుగా పీడించే వారు. అజ్ఞాన కాలంలో (ఇస్లాంకు పూర్వకాలంలో) వారి వంశంలో జరిగిన లజ్జాకరమయిన సంఘటనల్ని, బలహీనతల్ని ఎత్తిపొడుస్తూ జనుల ముందు ప్రస్తావించే వారు. అలా చేసే వారినే ఈ హదీసులో చీవాట్లు పెట్టడం జరిగింది. ఇంకా కొన్ని హదీసుల్లో, ఈ ప్రసంగం జరిగేటప్పుడు మహాప్రవక్త (సఅసం) కంఠం చాలా హెచ్చు స్థాయికి పోయిందని, అప్పుడు ఆ చుట్టుప్రక్కల ఇండ్లల్లో ఉన్న మహిళలూ దాన్ని విన్నారని ఉంది.

221. ఈ సంఘటన మహాప్రవక్త (సఅసం) మేరాజ్‌కు వెళ్ళినప్పుడు జరిగింది. ప్రజల మాంసం తినడమంటే ప్రజల వెనక వారి తప్పులను, వారికి అవమానం కలిగించే దృష్టితో ఇతరులముందు చర్చించడం అన్నమాట. ఈ చెడుగును దివ్యఖుర్‌ఆన్‌లో కూడా హేయమయినదిగా ప్రస్తావించడం జరిగింది.

٢٢٢ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "حَقُّ الْمُسْلِمِ عَلَى الْمُسْلِمِ سِتٌّ، قِيْلَ: مَا هُنَّ يَا رَسُوْلَ اللّٰهِ؟ قَالَ: إِذَا لَقِيْتَهُ فَسَلِّمْ عَلَيْهِ، وَإِذَا دَعَاكَ فَأَجِبْهُ، وَإِذَا اسْتَنْصَحَكَ فَانْصَحْ لَهُ، وَإِذَا عَطَسَ فَحَمِدَ اللّٰهَ فَشَمِّتْهُ، وَإِذَا مَرِضَ فَعُدْهُ، وَإِذَا مَاتَ فَاتَّبِعْهُ".

(مسلم-ابوهريرةؓ)

**222.** మహాప్రవక్త (సఅసం) ఒకసారి, 'ఒక ముస్లిమ్‌పట్ల మరొకనికి ఆరు బాధ్యతలున్నాయి ' అని ప్రవచించారు. అప్పుడు అక్కడున్న వారు, అవి ఏవి అని అడగ్గా ఆయన ఈ విధంగా బోధించారు: 1."నీవు ముస్లిమ్ సోదరుడిని కలిస్తే అతనికి సలాంచెయ్యి. 2. అతను (భోజనానికి) ఆహ్వానిస్తే ఆహ్వానాన్ని స్వీకరించు. 3. అతను నీ ద్వారా ఏదయినా మేలును కాంక్షిస్తే దాన్ని అందజెయ్యి. 4. అతను తుమ్మి "అల్ హ మ్దులిల్లాహ్" అనంటే నీవు దానికి 'ఎర్ హముకల్లాహ్' అని బదులు పలుకు. 5. అతను వ్యాధిగ్రస్తుడయితే వెళ్ళి పరామర్శించు. 6. అతను దివంగతు డయితే అతని జనాజాకు తోడుగా వెళ్ళు"

(ముస్లిమ్- అబూహురైరా)

---

222. ప్రతి ముస్లిం తోటి ముస్లిం సోదరుని ద్వారా పొందగల కనీసపు హక్కులు ఈ హదీసులో ప్రవచించబడ్డాయి. సలామ్ చెయ్యడమంటే, కేవలం నోటితో 'అస్సలాము అలైకుం' అనడం మాత్రమే కాదు. ఒక వ్యక్తికి సలాం చేయడం అన్నది నిజానికి ఆ వ్యక్తికై ఒక స్వచ్ఛంద ప్రకటన, ఒప్పుకోలు. అంటే నా పక్షంగా నీ ధన మాన ప్రాణాలు సురక్షితంగా ఉంటాయనీ, నేను నిన్ను ఏ విధంగానూ హాని కలుగజెయ్యననీ హామీ ఇవ్వడం అన్నమాట. అలాగే అల్లాహ్ నీ ధర్మాన్నీ, నీ విశ్వాసాన్నీ భద్రంగా కాపాడాలనీ, నీపై ఆయన కటాక్షం కలగాలని ప్రార్థన కూడా. భోజనానికయినా మరే సందర్భంలోనయినా ఆహ్వానించినప్పుడు అనివార్యమయిన కారణం ఉంటే తప్ప ఆ ఆహ్వానాన్ని తిరస్కరించరాదు. మన వల్ల ఎవరికయినా ఏదయినా సహాయం ఒనగూడే అవకాశం ఉంటే అలాంటి సహాయం చెయ్యడంలో వెనుదీయరాదు. తుమ్మినప్పుడు "ఎర్‌హముకల్లాహ్" అన్నదానికి అల్లాహ్ నీపై కారుణ్యం చూపుగాక అని అర్థం. దైవకారుణ్యం వల్ల నీవు సతతం దైవ విధేయతా మార్గంపై నిలకడగా నడవగలగాలి అని, నీచే హాస్యాస్పదమైన అవమానకరమైన ఎలాంటి పని జరగకూడదనే ఆకాంక్ష కూడా ఇందులో ఉంది. తోటి సోదరుడు వ్యాధిగ్రస్తుడయితే పరామర్శించడం,

۲۲۳ عَنْ عُقْبَةَ بْنِ عَامِرٍ قَالَ : سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَ سَلَّمَ يَقُوْلُ : "اَلْمُسْلِمُ أَخُو الْمُسْلِمِ ، لَا يَحِلُّ لِمُسْلِمٍ بَاعَ مِنْ أَخِيْهِ بَيْعًا وَفِيْهِ عَيْبٌ إِلَّا بَيَّنَهُ لَهُ ـ" (ابن ماجه)

223. నేను మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించగా విన్నాను, అని అకబాబిన్ ఆమిర్ ఉల్లేఖించారు: "ఒక ముస్లిమ్ మరొక ముస్లిమ్‌కు సోదరుడు. సోదరునికి ఒక వస్తువు అమ్మినప్పుడు అందులో ఏదయినా లోపం ఉంటే దాన్ని అతనికి స్పష్టంగా తెలుపాలి. విక్రయించే వస్తువులోని లోపాన్ని దాచడం ఒక ముస్లిమ్ వర్తకునికి ధర్మం (హలాల్) కాదు."

(ఇబ్నుమాజ)

۲۲۴ إِنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ : "اَقِيْلُوْا ذَوِى الْهَيْئَاتِ عَثَرَاتِهِمْ إِلَّا الْحُدُوْدَ ـ" (ابوداؤد ـ عائشةؓ)

224. దైవసందేశహరులు (సఅసం) ఇలా ప్రబోధించారు: "మంచి గుణగణాలు గల ముస్లిమ్ వ్యక్తివల్ల ఏదైనా అపరాధం జరిగిన పక్షంలో అది "హద్దులు" తప్ప మరేదయినా దాన్ని క్షమించి వేయండి.'

(అబూదావూద్ - ఆయిషా)

---

అతడు మరణిస్తే జనాజా (శవపేటిక) తో పాటు పోయి అంత్యక్రియల్లో పాల్గొనడం కూడా గొప్ప బాధ్యత అని ఈ హదీసు వల్ల మనకు తెలుస్తోంది.

223. ఈ హదీసు ద్వారా వర్తకుల స్వభావంలోని ఓ గొప్ప లోటును ఎత్తి చూపటంతో పాటు అది ఎంత ప్రమాదకరమయిందో తెలుపడం జరిగింది. ముఖ్యంగా ముస్లిం వర్తకులు తాము అమ్మే వస్తువులో తమకు తెలిసిన లోటును కొనేవారికి తెలుపకపోతే తాము ఆ వ్యాపారం ద్వారా 'హలాల్ కాని' (హరాం) సంపదను తింటున్నారని తెలుసుకోవాలి.

224. అంటే ఒకవ్యక్తి స్వతహాగా సజ్జనుడయి, సదాచార సంపన్నుడయి, భయ భక్తులు కలవాడయి, దైవ విధేయతా విధానాన్నీ అవలంబించేవాడయి, ఎప్పుడయినా కాలుజారి పాపపు రొంపిలో పడితే కేవలం దాని కారణంగా అతన్ని నలుగురిలో అవమానపరచకూడదు; అతని పరువును భంగపరచకూడదు. అతని పొరపాటు నలుగురిలో వ్యాపించనివ్వరాదు. అతన్ని మన్నించివెయ్యాలి.

## ముస్లిమేతర పౌరుల హక్కులు

٢٢٥ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: أَلَا مَنْ ظَلَمَ مُعَاهِدًا أَوِ انْتَقَصَهُ أَوْ كَلَّفَهُ فَوْقَ طَاقَتِهِ أَوْ أَخَذَ مِنْهُ شَيْئًا بِغَيْرِ طِيبِ نَفْسٍ فَأَنَا حَجِيجُهُ يَوْمَ الْقِيَامَةِ ـ" (ابوداؤد)

225. "ముస్లిమ్ ఒడంబడికదారు (ముస్లిమేతర పౌరు) నిపై అత్యాచారం చేసినా లేదా అతని హక్కునుకాజేసినా లేదా అతని శక్తికిమించిన (రక్షణా రుసుం) భారం వేసినా లేదా అతని వస్తువు ఏదయినా బలాత్కారంగా దోచుకున్నా ప్రళయదినాన, దైవ న్యాయస్థానంలో, ఆ ముస్లిమ్ మీద జరిగే విచారణలో నేను ఆ ముస్లిమేతరుని వకీలయి నిలబడతాను" అని మహాప్రవక్త (సఅసం) పలికారు. (అబూదావూద్)

## భూతదయ

٢٢٦ مَرَّ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بِبَعِيرٍ قَدْ لَحِقَ ظَهْرُهُ بِبَطْنِهِ فَقَالَ: "اتَّقُوا اللّٰهَ فِي هٰذِهِ الْبَهَائِمِ الْمُعْجَمَةِ فَارْكَبُوهَا صَالِحَةً وَاتْرُكُوهَا صَالِحَةً ـ" (ابوداؤد ـ سهيل ابن الحنظليةؓ)

226. ఒకసారి మహాప్రవక్త (సఅసం) వెళ్ళే దారిలో ఒక ఒంటె కనిపించింది. దాని కడుపు పీక్కుపోయి వెన్నుతో కలిసినట్లుంది దాని పరిస్థితి. అప్పుడు ఆయన (అనుచరులకు) ప్రబోధించారు. "నోరులేని ఈ ప్రాణుల గురించి దైవానికి భయపడండి, వీటిని మంచి స్థితిలోవుంచి (పోషించి) స్వారీ చేయండి, మంచి స్థితిలోనే వదలండి."

(అబూదావూద్ - సుహైల్ ఇబ్నుల్ హన్జలియ)

---

225. ముస్లిములు తమ ముస్లిమేతర సోదరుల విషయంలో ఎంత జాగ్రత్తగా మసలుకోవలసి ఉందో కాస్త జాగ్రత్తగా గమనించాలి. రేపు ప్రళయ దినాన ప్రవక్త మహనీయులు తమకు ఎదురుగా, ముస్లిమేతర సోదరుని వకాల్తా పుచ్చుకుని నిలబడే పరిస్థితి ఏర్పడకుండా జాగ్రత్త పడాలి. ఇక్కడ మరో విషయం కూడా మరువ కూడదు.

٢٢٧ عَنْ عَبْدِ اللهِ بْنِ جَعْفَرَ ...... فَدَخَلَ حَائِطًا لِرَجُلٍ مِّنَ الْأَنْصَارِ فَإِذَا فِيهِ جَمَلٌ - فَلَمَّا رَأَى الْجَمَلُ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ جَرْجَرَ وَذَرَفَتْ عَيْنَاهُ ، فَأَتَاهُ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَمَسَحَ سَرَاتَهُ أَيْ سَنَامَهُ وَذِفْرَاهُ فَسَكَنَ ، فَقَالَ: مَنْ رَبُّ هٰذَا الْجَمَلِ ؟ لِمَنْ هٰذَا الْجَمَلُ ؟ فَجَاءَ فَتًى مِّنَ الْأَنْصَارِ فَقَالَ: هٰذَا لِي يَا رَسُولَ اللهِ ، فَقَالَ : أَفَلَا تَتَّقِي اللهَ فِي هٰذِهِ الْبَهِيمَةِ الَّتِي مَلَّكَكَ اللهُ إِيَّاهَا ، فَإِنَّهُ يَشْكُو إِلَيَّ أَنَّكَ تُجِيعُهُ وَتُدْئِبُهُ ۔

(رياض الصالحين)

227. అబ్దుల్లా బిన్ జాఫర్ ఉల్లేఖనం: 'ఒకసారి మహాప్రవక్త (సఅసం) ఒక అన్సారీ సహచరుని తోటలో ప్రవేశించారు. అక్కడ ఎవరో ఒక ఒంటెను కట్టిపెట్టారు. అది మహాప్రవక్త (సఅసం)ను చూసి బాధగా అరచింది. దాని కళ్ళ వెంట అశ్రువులు రాలసాగాయి. మహాప్రవక్త దాని సమీపానికి వెళ్ళి దాని మూపురాన్నీ, కణతల్నీ లాలనగా తట్టారు. అది శాంతించింది. 'ఈ ఒంటె ఎవరిది?' అని అడిగారు మహాప్రవక్త (సఅసం). ఒక అన్సారీ యువకుడు వచ్చి, "దైవప్రవక్తా! ఈ ఒంటె నాదే" అని బదులిచ్చాడు. దానికి ఆయన (సఅసం) "నీకు దైవభీతి లేదా? అల్లాహ్ నీ స్వాధీనం చేసిన ఈ మూగప్రాణిని గురించి నీవు అల్లాహ్‌కు భయపడవా? ఇది (ఏడ్చి) నాతో ఫిర్యాదు చేస్తోంది - నీవు దీన్ని సరిగ్గా మేపకుండా ఎల్లప్పుడూ పనిచేయించుకుంటూనే వున్నావని!" అని మందలించారు.' (రియాజుస్సాలిహీన్)

---

ఇంతకు ముందు సామాజికమయిన హక్కులు పొరుగువాడు, వ్యాధిగ్రస్తుడు, తోటి ప్రయాణికుడు గురించి తెలిపిన హక్కులు ముస్లిములు, ముస్లిమేతరులు అందరికీ వర్తిస్తాయి. వాటిలో ఎలాంటి తారతమ్యాన్ని పాటించడానికి వీల్లేదు.

226. దీని భావమేమంటే పశువుల ఆకలిదప్పుల్ని తీర్చక పోవడంవల్ల మనిషి దైవాగ్రహానికి గురిఅవుతాడు. వాటి ద్వారా పని నెరవేర్చుకోవాలంటే బాగా మేపాలి.

۲۲۸ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "إِذَا سَافَرْتُمْ فِي الْخِصْبِ فَأَعْطُوا الْإِبِلَ حَقَّهَا مِنَ الْأَرْضِ، وَإِذَا سَافَرْتُمْ فِي السَّنَةِ فَأَسْرِعُوا عَلَيْهَا السَّيْرَ." (مسلم۔ ابوهريرةؓ)

**228.** మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు, "మీరు సస్య కాలంలో ప్రయాణం చేస్తే ఒంటెలు భూమి నుండి తమ హక్కును పొందడానికి అవకాశంఇవ్వండి, క్షామకాలంలో ప్రయాణంచేస్తే వాటిని వేగంగాతోలండి."

(ముస్లిమ్, అబూహురైరా)

۲۲۹ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ اللّٰهَ تَبَارَكَ وَتَعَالٰى كَتَبَ الْإِحْسَانَ عَلٰى كُلِّ شَيْءٍ، فَإِذَا قَتَلْتُمْ فَأَحْسِنُوا الْقِتْلَةَ، وَإِذَا ذَبَحْتُمْ فَأَحْسِنُوا الذِّبْحَ وَلْيُحِدَّ أَحَدُكُمْ شَفْرَتَهُ وَلْيُرِحْ ذَبِيْحَتَهُ۔

(مسلم۔ شداد بن اوسؓ)

**229.** దైవప్రవక్త (సఅసం) ఉపదేశం : "అల్లాహ్ ప్రతి కార్యాన్నీ ఎంతో చక్కగా సంస్కారవంతంగా చెయ్యాలని, అలా చెయ్యడం మనిషి విద్యుక్త ధర్మమని ఆదేశించాడు. ఎవరినయినా (రణభూమిలో) సంహరించ దలచినా సంస్కారంతో చాకచక్యంతోచేయాలి. భోజనార్థం జిబహ్ చేసే టప్పుడు కూడా ఎంతో నైపుణ్యంతో అలవోకగా చెయ్యాలి. కత్తిని బాగా సాన పట్టాలి. జిబహ్ చేయబడే జంతువుకు నెమ్మది కలగనివ్వాలి."

(ముస్లిమ్ - షద్దాద్ బిన్ ఔస్)

---

అవి పనిచేస్తూ సడలి సగం చచ్చినట్లు అయ్యే వరకు వాటిపై పని భారం మోపరాదు.

**227**. భూతదయ ఎవరి ఎదల్లో ఉంటుందో వారిని నోరు లేని జీవాలు కూడా గుర్తిస్తాయన్న దానికి ఈ హదీసు తార్కాణం! మహాప్రవక్త (సఅసం) ప్రేమతో ఒంటె వీపు నిమరగానే అది నెమ్మదించింది. పశువుల బాగోగులు తగిన విధంగా చూసుకోకుండా వాటిని కష్టబెట్టడం దైవ శిక్షకు కారణమవుతుందని, మహాప్రవక్త (సఅసం) హెచ్చరిక- "నీకు దైవభీతి లేదా" లో అంతర్లీనమయి ఉంది.

**228**. అంటే నలువైపులా పచ్చిక పెరిగి అంతా సస్యశ్యామలంగా ఉంటే, పశువుల్ని

٢٣٠ عَنِ ابْنِ عُمَرَ قَالَ : سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَنْهٰى أَنْ تُصْبَرَ بَهِيْمَةٌ أَوْ غَيْرُهَا لِلْقَتْلِ ۔ (بُخاری، مُسلم)

230. హ|జత్ అబ్దుల్లా బిన్ ఉమర్ ఉల్లేఖనం : "ఏ పశువు నయినా మరే ఇతర జీవిని అయినా కట్టి పడేసి దాన్ని (ఎలాంటి ఆయుధం తోనయినాసరే) చిత్రవధ చేయడాన్ని మహాప్రవక్త (సఅసం) నిషేధించడం నేను చెవులారా విన్నాను." (బుఖారి, ముస్లిమ్)

٢٣١ نَهٰى رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنِ الضَّرْبِ فِى الْوَجْهِ وَعَنِ الْوَسْمِ فِى الْوَجْهِ ۔ (مُسلم ۔ جابرؓ)

231. పశువు ముఖంపై (తలపై) కొట్టడాన్ని లేదా దాని ముఖాన కాల్చి వాతలు వేయడాన్ని దైవప్రవక్త (సఅసం) నిషేధించారు."
(ముస్లిమ్ , జాబిర్)

٢٣٢ إِنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ : "مَنْ قَتَلَ عُصْفُوْرًا فَمَا فَوْقَهَا بِغَيْرِ حَقِّهَا سَأَلَهُ اللّٰهُ عَنْ قَتْلِهِ ۔ قِيْلَ : يَا رَسُوْلَ اللّٰهِ، وَمَا حَقُّهَا ؟ قَالَ : أَنْ يَذْبَحَهَا فَيَأْكُلَهَا وَلَا يَقْطَعَ رَأْسَهَا فَيَرْمِيَ بِهَا ۔"
(مشکوٰۃ ۔ عبداللہ بن عمرو بن العاص)

232. మహాప్రవక్త ఇలా ఉపదేశించారు, "ఎవరయినా ఊరపిచ్చుక నో ఇంకా చిన్న పిచ్చుకనో నిష్కారణంగా చంపినట్లయితే దాన్ని గురించి అతను అల్లాహ్‌కు జవాబు చెప్పుకోవలసి ఉంటుంది." అక్కడున్న వారు,

బాగా మేపాలని, కరువుకాలంలో, మార్గం మధ్యన ఎక్కడా పచ్చిక లభ్యం కాదు గనుక త్వరగా మజిలీ చేరేలా వేగంగా తోలాలని, నీరు, పచ్చిక దొరకని చోట ఆలస్యం చేస్తూ నిలుపరాదని, పశువులకు ఆకలి బాధ కలగకుండా జాగ్రత్తపడాలని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది.

229. శత్రువును సంహరించవలసి వచ్చినా సరే చిత్రహింసలు పెట్టి చంపకూడదని ఈ

"దైవప్రవక్తా! పిట్టల పట్ల మన బాధ్యత ఏమిటి ?" అని అడిగారు. దానికి, "మన బాధ్యత ఏమంటే వాటిని శాస్త్రయుక్తంగా జిబహ్ చేసి భుజించాలి; తలనరికిన తరువాత వాటిని వృధాగా పారవేయకూడదు." అని ఆయన బదులిచ్చారు. (మిష్కాత్-అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్)

٢٣٣ عَنْ عَبْدِ الرَّحْمٰنِ بْنِ عَبْدِ اللّٰهِ عَنْ أَبِيْهِ قَالَ: كُنَّا مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فِيْ سَفَرٍ فَانْطَلَقَ لِحَاجَتِهِ فَرَأَيْنَا حُمَّرَةً مَّعَهَا فَرْخَانِ، فَأَخَذْنَا فَرْخَيْهَا، فَجَاءَتِ الْحُمَّرَةُ فَجَعَلَتْ تُفَرِّشُ، فَجَاءَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ: مَنْ فَجَّعَ هٰذِهٖ بِوَلَدِهَا؟ رُدُّوْا وَلَدَهَا إِلَيْهَا" وَرَأٰى قَرْيَةَ نَمْلٍ قَدْ حَرَقْنَاهَا قَالَ: مَنْ حَرَقَ هٰذِهٖ؟ فَقُلْنَا: نَحْنُ، قَالَ: إِنَّهٗ لَا يَنْبَغِيْ أَنْ يُّعَذِّبَ بِالنَّارِ إِلَّا رَبُّ النَّارِ۔" (ابوداؤد)

233. అబ్దుర్రహ్మాన్ తన తండ్రి అబ్దుల్లాహ్ ద్వారా గ్రహించిన దానిని ఇలా ఉల్లేఖించారు: "మేము (అబ్దుల్లాహ్) ఒకసారి మహాప్రవక్తతో కలిసి ప్రయాణం చేస్తుండగా దారిలో ఆయన ఏదో తన అవసరంగా ప్రక్కకు వెళ్ళారు. అప్పుడు మేమొక పిట్టను చూసాము. దానికి రెండు పిల్లలు న్నాయి. మేము ఆ రెండు పిల్లల్ని పట్టుకున్నాము. ఆ పిట్ట రెక్కలు విప్పి ఆ పిల్లల పైనే యెగరడం మొదలెట్టింది. ఇంతలో ప్రవక్త విచ్చేశారు. ఆయన "దీన్ని, పిల్లల కారణంగా బాధ పెట్టిందెవరు? దీని పిల్లల్ని వదలి వేయండి" అన్నారు. తరువాత, మేము కాల్చివేసిన చీమల పుట్టల్ని చూసి ఆయన, "వీటిని కాల్చి వేసిందెవరు?" అని అడిగారు. "మేమే" అని మేము బదులిచ్చాము "అగ్నిశిక్ష ఇచ్చే హక్కు అగ్నికి ప్రభువయిన దైవానికే ఉంది." అన్నారాయన.

(అబూదావూద్)

---

హదీసు బోధిస్తోంది. అలాగే జిబహ్ చేయవలసిన ప్రాణుల్ని కూడా. (చాలా సేపటివరకు అది బాధ పడకుండా ప్రాణం త్వరగా పోయేలా జిబహ్ చేయాలి).

۲۳۴ نَهٰى رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنِ التَّحْرِيْشِ بَيْنَ الْبَهَائِمِ - (ترمذی، ابن عباسؓ)

234. మహాప్రవక్త జంతువుల్ని, పక్షుల్ని పందెం కోసం గోదాలో దింపడాన్ని నిషేధించారు. (తిర్మిజి - ఇబ్నె అబ్బాస్)

۲۳۵ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: بَيْنَمَا رَجُلٌ يَّمْشِىْ بِطَرِيْقٍ اشْتَدَّ عَلَيْهِ الْعَطَشُ، فَوَجَدَ بِئْرًا فَنَزَلَ فِيْهَا فَشَرِبَ، ثُمَّ خَرَجَ فَإِذَا كَلْبٌ يَّلْهَثُ يَأْكُلُ الثَّرٰى مِنَ الْعَطَشِ، فَقَالَ الرَّجُلُ: لَقَدْ بَلَغَ هٰذَا الْكَلْبُ مِنَ الْعَطَشِ مِثْلُ الَّذِىْ كَانَ بَلَغَ بِىْ فَنَزَلَ الْبِئْرَ فَمَلَأَ خُفَّهٗ ثُمَّ اَمْسَكَهٗ بِفِيْهِ فَسَقَى الْكَلْبَ فَشَكَرَ اللّٰهُ لَهٗ فَغَفَرَ لَهٗ" فَقَالُوْا: يَا رَسُوْلَ اللّٰهِ، وَإِنَّ لَنَا فِى الْبَهَائِمِ اَجْرًا؟ فَقَالَ: نَعَمْ، فِىْ كُلِّ ذَاتِ كَبِدٍ رَطْبَةٍ اَجْرٌ" (بخاری، مسلم-ابوھریرۃؓ)

235. మహాప్రవక్త ఇలా తెలిపారు: "దారిన పోయే ఒక వ్యక్తికి బాగా దాహం వేసింది. అటూ ఇటూ వెదికాడు. ఒక బావి కనిపించింది. అందులో దిగి నీళ్ళు త్రాగాడు. వెలుపలికి వచ్చి ఒక కుక్క దప్పిక వల్ల నాలుక చాచి తడి మన్నును తినడం గమనించాడు. 'నాకు కలిగినంత

---

230. పశుపక్షాదుల్ని ఆహారం కొరకు అవసరం మేరకు వధించడం తప్ప కేవలం కాలక్షేపానికి చంపడాన్ని ఇస్లాం నిషేధిస్తుంది.

231. ఇందులోనూ పశువులకు అనవసరంగా బాధపెట్టడాన్నే సూచించడం జరిగింది. మనిషి తన అభిరుచులు, ఉత్సాహాలు తీరడానికి ఇలాంటి వెన్నో చేస్తుంటాడు. అలా చెయ్యరాదని బోధించడం జరిగింది.

232. ఇస్లాంలో పశువుల్నీ పక్షుల్నీ, కేవలం వాటిమాంసం భుజించడం కోసమయితే అవసరం మేరకు వధించడం ధర్మమే కాని, సరదాకోసం వేటాడటం నిషిద్ధం అని ఈ హదీసుల ద్వారా విదితమవుతోంది. సరదా వేట అంటే వేట చేసి జంతువుల్ని చంపి పిదప వాటిని వినియోగించుకోకుండా పారవేయడమన్నమాట. చాలా మంది

తీవ్రమయిన దాహం ఈ కుక్కకూ కలిగి ఉంటుంది' అని తలపోశాడు ఆ వ్యక్తి. తక్షణం బావిలో దిగి తన చర్మపు మేజోడులో నీళ్ళు నింపుకొని నోటితో పట్టుకొని వెలుపలికి వచ్చాడు. కుక్కకు ఆ నీరు త్రాగించాడు. అల్లాహ్ ఆ వ్యక్తి చేసిన ఈ పనిని ఎంతో మెచ్చుకున్నాడు. అతన్ని మన్నించి మోక్షం అనుగ్రహించాడు". ఇది విన్న ప్రజలు "అయితే, జంతువులపై కనికరం చూపినా పుణ్యం కలుగుతుందా" అని అడిగారు. "అవును, ఏ ప్రాణి ఎడల దయ చూపినా పుణ్యం లభిస్తుంది." అన్నారు మహాప్రవక్త (సఅసం).

(బుఖారి, ముస్లిమ్ - అబూహురైరా)

---

శాఖాహారులయిన 'అహింసా వాదులు' మాంసం భుజించడం తప్పని, వేట అయితే ఫరవాలేదని భావిస్తారు, వారికి ఇది ఉత్తమ బోధ.

233. మహాప్రవక్త (సఅసం) పిట్ట తన పిల్లలకోసం పడే ఆరాటాన్ని చూసి సహించలేకపొయ్యారు. దాన్ని వెంటనే అర్థం చేసుకుని, ఆ విధంగా మూగ జీవుల్ని బాధపెట్టడం తప్పని సహచరులకు బోధించారు.

మనకు ఏ ఆటంకమూ కలిగించని చీమ పుట్టల్ని ఉట్టిగనే కాల్చేయ్యడం కూడా సబబుకాదని ఈ హదీసు వల్ల బోధ పడుతోంది. అగ్నికి ప్రభువు అంటే నరకాగ్ని ప్రభువయిన అల్లాహ్ అని అర్థం. ఏ ప్రాణినయినా కాల్చి చంపి శిక్ష విధించడం, లేక పగతో కాల్చడం అన్నది ధర్మ విరుద్ధం అని దీని ద్వారా తెలుస్తోంది.

234. అంటే ఎడ్లను, కోడి పుంజుల్ని ఇంకా ఇతర జంతువుల్ని, పశువుల్ని పందేలు కాసి పోరాడ చెయ్యడం అధర్మమని ఈ హదీసు ద్వారా ద్యోతక మవుతోంది.

235. విధి అయిన ఆరాధనలు తప్ప అదనపు ప్రార్థనలు, అదనపు ఉపవాసాలు, దానధర్మాలు ఏవీ చెయ్యకపోయినా, దయార్ద్ర హృదయం కల వ్యక్తి జీవ కారుణ్యంతో ఏ ప్రాణిని ఆపదలో ఆదుకున్నా, దాని ప్రకృతి సిద్ధమయిన అవసరాన్ని తీర్చినా దైవం అతనిపై దయతలచి అతని జీవితంలోని చిన్న చిన్న పొరపొచ్చుల్ని మన్నించి మోక్షం ప్రసాదించవచ్చు అని మహాప్రవక్త ప్రబోధానికి భావం.

13)

# దుర్గుణాలు

## అహంకారం

٢٣٦ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : "لَا يَدْخُلُ الْجَنَّةَ مَنْ كَانَ فِيْ قَلْبِهِ مِثْقَالُ ذَرَّةٍ مِنْ كِبْرٍ"، فَقَالَ رَجُلٌ : إِنَّ الرَّجُلَ يُحِبُّ أَنْ يَكُوْنَ ثَوْبُهُ حَسَنًا وَنَعْلُهُ حَسَنًا" قَالَ : "إِنَّ اللهَ جَمِيْلٌ وَيُحِبُّ الْجَمَالَ ، اَلْكِبْرُ بَطَرُ الْحَقِّ وَغَمْطُ النَّاسِ" (مُسلم۔ابن مسعودؓ)

236. మహాప్రవక్త (సఅసం) ప్రబోధించారు, "ఏ వ్యక్తి ఆంతర్యంలో రవ్వంతయినా అహంకారం ఉంటుందో అతను స్వర్గంలో ప్రవేశించ లేడు". దానికి ఒక వ్యక్తి, 'మనిషి మంచి బట్టలు, మంచి జోళ్ళు వేసుకో వాలని వాంఛిస్తాడు కదా' అని వివరణ కోరాడు. "అల్లాహ్ ఎంతో సుందర మయినవాడు, సౌందర్యాన్ని ఎంతో ఇష్టపడతాడు. అహంకారం అంటే అల్లాహ్ పట్ల విధేయతను పాటించకపోవడమనీ, తోటి మానవుల్ని హీనంగా చూడటమని భావం" అని బదులు పలికారు మహాప్రవక్త (సఅసం).

(ముస్లిమ్- ఇబ్ను మస్ఊద్)

٢٣٧ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : "لَا يَدْخُلُ الْجَنَّةَ الْجَوَّاظُ وَلَا الْجَعْظَرِيُّ" (ابوداؤد۔حارثہ بن وهب)

237. "పొగరుబోతు మనిషి , బూటకపు బడాయి చెప్పుకునే వ్యక్తి స్వర్గంలో ప్రవేశించలేరు." అని దైవ సందేశహరులు నుడివారు.

(అబూదావూద్ - హారిసా బిన్ వహబ్)

---

236. మహాప్రవక్త (సఅసం) ఉపదేశాన్ని విన్న ఒక సహచరునికి వచ్చిన సందేహమే ఎవరికైనా కలగవచ్చు. మంచి బట్టలు, మంచి జోళ్ళు ధరించడం కూడా పొగరు మోతు తనం కింద వస్తుందా? అలాంటి వానికి స్వర్గ ప్రవేశం ప్రాప్తం కాదా అని.

٢٣٨ عَنْ أَبِي سَعِيدٍ الْخُدْرِيِّ قَالَ : سَمِعْتُ رَسُولَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُولُ : أَزْرَةُ الْمُؤْمِنِ إِلَى أَنْصَافِ سَاقَيْهِ، لَا جُنَاحَ عَلَيْهِ فِيمَا بَيْنَهُ وَبَيْنَ الْكَعْبَيْنِ ، وَمَا أَسْفَلَ مِنْ ذَالِكَ فَفِي النَّارِ" قَالَ ذَالِكَ ثَلَاثَ مَرَّاتٍ ." وَلَا يَنْظُرُ اللّٰهُ يَوْمَ الْقِيَامَةِ مَنْ جَرَّ إِزَارَهُ بَطَرًا ." (ابوداؤد)

238. దైవ సందేశహరులు (సఅసం) ఇలా చెప్పగా విన్నానని అబూ సయీద్ ఖుద్రీ ఉల్లేఖించారు: "ముస్లిమ్ (విశ్వాసి) తొడిగే ఇజారు అతని సగం కాలు వరకే ఉంటుంది.తప్పనిసరైతే చీలమండకు పై వరకు ఉండటంలో తప్పులేదు. చీలమండకు క్రిందుగా ఉంటే అది నరకాగ్నికి ఆహుతి అవుతుంది." ఈ మాట ఆయన మూడు సార్లు పలికారు. తరువాత ఇలా అన్నారు : "పొగరుమోతుతనంతో అహంకారంతో తన ఇజారును నేలమీద ఈడ్చుకుంటూ పోయే వ్యక్తి వైపు ప్రళయ దినాన అల్లాహ్ కన్నెత్తి కూడా చూడడు". (అబూదావూద్)

---

అందుకే ప్రవక్త మహనీయులు ఆ సందేహాన్ని నివృత్తి చేస్తూ అది అహంకారం ఏమాత్రం కాదు. ఇంకా, అది దైవం మెచ్చుకునే విధానం అని పరిశుభ్రంగా, సంస్కారవంతంగా ఉండటాన్ని అల్లాహ్ ఇష్టపడతాడని, వాస్తవమైన అహంకారమంటే దైవాజ్ఞల్ని ధిక్కరించడం, తోటి మానవుల్ని హీనంగా చూడటం అని తెలిపారు.

237. అసలు హదీసులో "జవ్వాజ్" మరియు "జాజరి" అనే పదాలు వచ్చాయి. "జవ్వాజ్" అంటే పొగరుబోతు అనీ, తలబిరుసుగా నడిచేవాడనీ, దుష్టుడు, దుర్మార్గుడనీ, ధనం కూడబెట్టే వాడు, లోభి అనీ భావం. "జాజరి" అంటే, తనవద్ద ఏమీ లేక పోయినా మహాగొప్ప ఉన్న వానిగా ఎచ్చులు చెప్పుకునే వాడనీ భావం. ఒక్క ధనం విషయం లోనే ఇది వర్తించదు భక్తి, భీతి, బుద్ధీ జ్ఞానాల విషయంలోనూ పొగరు బోతులు, బడాయికోరులు ఉంటారు. వారందరికి ఇది వర్తిస్తుంది.

238. హదీసులో 'ఇజారు' అన్నదానికి లాగు, పంచె, లుంగి, ప్యాంటు మొదలయినవన్నీ వర్తిస్తాయి, లాగు నరకాగ్నికి ఆహుతి అవుతుంది అనంటే, ఆ విధంగా లాగుతొడిగిన వ్యక్తి నరకాగ్నికి పాత్రుడవుతాడని, అహంకారం మూలంగా అలా తొడగటం పాపకారణమని భావం. అందువల్లనే దాని ప్రాముఖ్యత అందరికీ క్షుణ్ణంగా తెలిసివచ్చేలా మహాప్రవక్త

٢٣٩ عَنِ ابْنِ عُمَرَ أَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: مَنْ جَرَّ ثَوْبَهُ خُيَلَاءَ لَمْ يَنْظُرِ اللّٰهُ إِلَيْهِ يَوْمَ الْقِيٰمَةِ ، فَقَالَ أَبُوْبَكْرٍ: إِزَارِيْ يَسْتَرْخِيْ إِلَّا أَنْ أَتَعَاهَدَهُ ، فَقَالَ لَهُ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّكَ لَسْتَ مِمَّنْ يَّفْعَلُهُ خُيَلَاءَ.

(بخاری، ابن عمرؓ)

**239.** మహాప్రవక్త (సఅసం) ఈ విధంగా ప్రబోధించారని ఇబ్ను ఉమర్ ఉల్లేఖించారు : "ఎవరయితే తన వస్త్రాన్ని పొగరుగా నేలపైన ఈడ్చు కుంటూ పోతాడో అతని వైపు అల్లాహ్ ప్రళయ దినాన కన్నెత్తి చూడడు" ఇది విన్న హజ్రత్ అబూబక్ర్ (రఅ) "నా లాగు వదులయి నప్పుడు నేను సరిచేసుకోకపోతే నా చీలమండలవరకు జారుతుంది" అని విన్నవించు కున్నారు. మహాప్రవక్త " నీవు పొగరుగా లాగును నేల రాసే వాడివి కాదు కదా" అని బదులిచ్చారు. (బుఖారి)

٢٤٠ عَنِ ابْنِ عَبَّاسٍ قَالَ: كُلْ مَا شِئْتَ وَالْبَسْ مَا شِئْتَ مَا أَخْطَأَتْكَ اثْنَتَانِ - سَرَفٌ وَّمَخِيْلَةٌ. (بخاری)

**240.** హజ్రత్ ఇబ్ను అబ్బాస్ సెలవిచ్చారు: "ఇష్టమయింది తినండి, నచ్చినదుస్తులు ధరించండి అయితే మీలో పొగరుగానీ అనవసరపు వ్యయం చేసే బుద్ధిగాని దారి చేసుకోకూడదు." (బుఖారి)

---

(సఅసం) మూడు సార్లు ఆ మాటను నొక్కి చెప్పారు. అల్లాహ ప్రళయ దినాన కన్నెత్తి చూడడంటే, అది సామాన్య విషయం కాదు. అల్లాహ ఆగ్రహానికి అది నిదర్శనం. ప్రళయ దినాన అల్లాహ ఆగ్రహించడమంటే మనిషి సర్వనాశనానికి నాంది అన్నమాట.

ఇక్కడ ప్రస్తావించబడింది అహంకారం, పొగరుబోతుతనంతో రోడ్డును తుడిచ పొడుగు లాగులు ధరించడాన్నే. అయితే లాగు వదులయిన కారణంగా లేదా మరే ఇతర కారణంగానయినా అలా జరిగితే అది తప్పుగా పరిగణించడం జరగదు.

239. హజ్రత్ అబూబక్ర్‌ది చాలా బక్కచిక్కిన దేహం. అందువల్ల ఆయన ఇజారు (పైజామా) వదులై జారిపోతూ ఉండేది. పొగరు వల్ల ఇజారు ఈడ్చే వారిని గురించి

# అత్యాచారం

۲۴۱ إِنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: الظُّلْمُ ظُلُمٰتٌ يَوْمَ الْقِيٰمَةِ." (متفق عليه- ابن عمرؓ)

241. మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు : "అత్యాచారం ప్రళయదినాన ఆ అత్యాచారి పట్ల అంధకారంగా పరిణమిస్తుంది."

(ముత్తఫకున్ అలైహి - ఇబ్నె ఉమర్)

۲۴۲ عَنْ اَوْسِ بْنِ شُرَحْبِيْلٍ أَنَّهُ سَمِعَ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ مَّشٰى مَعَ ظَالِمٍ لِّيُقَوِّيَهُ، وَهُوَ يَعْلَمُ أَنَّهُ ظَالِمٌ فَقَدْ خَرَجَ مِنَ الْإِسْلَامِ." (مشكوٰة)

242. ఔస్‌బిన్ షురహ్‌బీల్ మహాప్రవక్త (సఅసం) ఇలా సెల వియ్యగా విన్నట్లు తెలిపారు: "ఎవరైతే అత్యాచారం చేసేవానికి బలం చేకూర్చే నిమిత్తం, అతను అత్యాచారి అని తెలిసీ సహకరిస్తారో వారు ఇస్లామ్‌కు దూరమవుతారు". (మిష్కాత్)

---

మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చిన విషయం ఆయన పూర్తిగానే విన్నారు. తాను పొగరువల్ల చేయడం లేదని తెలిసినా, ఆంతర్యం పరలోక భీతితో నిండి ఉండటం మూలాన పాపమే కాదు పాపపు ఛాయల నుండి సహితం దూరంగా పరుగెత్తుతుంది హృదయం. అందుకే హజ్రత్ అబూబక్ర్ దైవకారుణ్యానికి ఎక్కడ దూరమవుతానో అన్న భయం వల్ల ఆ ప్రశ్న అడిగారు.

240. మంచి ఆహారం తినటం, కలిగిన మేరకు ఖరీదయిన బట్టలు కట్టుకోవటంలో తప్పులేదు. అయితే అది అహంకారానికి, దుబారా ఖర్చుకు మార్గంకారాదు. అవసరం కొద్దీ శక్తి పరిధిలో భోజనం వస్త్రాలు, నివాస గృహాల విషయంలో ఉత్తమ శ్రేణికి చెందిన వాటిని మనిషి వినియోగించటంలో తప్పులేదు అన్నది హదీసు భావం.

241. ప్రళయ దినాన ప్రతి వ్యక్తి తన మోక్షం కొరకు పరితపిస్తూ నలువైపులా సహాయానికై పరిగెడుతూ ఉంటాడు. ఎక్కడ ఏ ఆధారం, సహకారం అందుతుందో అని పరిపరి విధాలా నిరీక్షిస్తూ, అన్వేషిస్తూ ఉంటాడు. అలాంటి తరుణంలో అతను చేసిన ఏ చిన్న కర్మ అయినా అతని మార్గానికి ఆటంకంగా పరిణమిస్తే అతని గతేమి

٢٤٣ إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: أَتَدْرُوْنَ مَنِ
الْمُفْلِسُ؟ قَالُوْا: الْمُفْلِسُ فِيْنَا مَنْ لَّا دِرْهَمَ لَهُ وَلَا مَتَاعَ، فَقَالَ: إِنَّ الْمُفْلِسَ مِنْ
أُمَّتِيْ مَنْ يَّأْتِيْ يَوْمَ الْقِيٰمَةِ بِصَلٰوةٍ وَّصِيَامٍ وَّزَكٰوةٍ، وَيَأْتِيْ قَدْ شَتَمَ
هٰذَا- وَقَذَفَ هٰذَا- وَأَكَلَ مَالَ هٰذَا- وَسَفَكَ دَمَ هٰذَا- وَضَرَبَ
هٰذَا- فَيُعْطٰى هٰذَا مِنْ حَسَنَاتِهِ، فَإِنْ فَنِيَتْ حَسَنَاتُهُ قَبْلَ أَنْ
يُّقْضٰى مَا عَلَيْهِ، أُخِذَ مِنْ خَطَايَاهُمْ فَطُرِحَتْ عَلَيْهِ ثُمَّ طُرِحَ فِي
النَّارِ۔ (مسلم- ابوهريرةؓ)

243. "దివాలాకోరు అని, దరిద్రుడు అని ఎవరిని అంటారో మీకేమయినా తెలుసా?" అని ప్రశ్నించారు ఒకసారి మహాప్రవక్త (సఅసం). "ఎవరి వద్దయితే డబ్బూ దస్కం ఉండదో, ఎవరి వద్దనయితే అనుదినం ఉపయోగించుకునే సామాను కూడా ఉండదో అతన్ని సాధారణంగా దరిద్రుడని అంటాము." అని బదులిచ్చారు అక్కడున్న వారు. అప్పుడు ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు : "నా అనుచర సమాజంలో పరమ దరిద్రుడు ఇలా వుంటాడు-అతను ప్రళయ దినాన తన నమాజ్, రోజా, జకాత్ లతో అల్లాహ్ ఎదుట హాజరవుతాడు. అతను ప్రపంచంలో ఒకరిని దుర్భాషలాడి ఉంటాడు, ఇంకొకరిసొమ్మును కాజేసి ఉంటాడు. ఒకర్ని హత్యచేసి వుంటాడు. ఎవరినో నిష్కారణంగా కొట్టి ఉంటాడు. ఈ పీడితులందరికి ఇతని సత్కార్యాలు పంచి పెట్టడం జరుగుతుంది. అప్పటికీ అతని సత్కార్యాలు అయిపోయి ఆ పీడితుల హక్కులు ఇంకా మిగిలివుంటే వారందరు చేసిన అపరాధాల దుష్ఫలితాన్ని అతని లెక్కలో జమ చేస్తారు. తరువాత అతన్ని నరకంలో పడవేస్తారు."

(ముస్లిమ్ - అబూహురైరా)

---

కాను? అతడు చేసిన అత్యాచారం అతనిపై అంధకారంగా ఆవహిస్తే మార్గం కానరాక వెలుగు కోసం పరితపించే అతని అవస్థ ఎంత దయనీయమయినదో ఎంత భయంకరమయినదో తలుచుకుంటేనే గుండె జలదరిస్తుంది.

۲۴۴ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "إِيَّاكَ وَدَعْوَةَ الْمَظْلُوْمِ، فَإِنَّمَا يَسْأَلُ اللّٰهَ تَعَالٰى حَقَّهُ وَإِنَّ اللّٰهَ لَا يَمْنَعُ ذَا حَقٍّ حَقَّهُ" ۔(مشکوٰۃ۔علیؓ)

244. మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "పీడితుని ఆర్తనాదానికి భయపడండి. ఎందుకంటే పీడితుడు తన హక్కుకై అల్లాహ్‌ను అర్థిస్తాడు; అల్లాహ్ హక్కుగల వారెవరికీ అతని హక్కు లభించకుండా చెయ్యడు."

(మిష్కాత్ -అలీ)

## కోపం

۲۴۵ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "لَيْسَ الشَّدِيْدُ بِالصُّرَعَةِ، إِنَّمَا الشَّدِيْدُ الَّذِىْ يَمْلِكُ نَفْسَهٗ عِنْدَ الْغَضَبِ"

(بخاری۔ابوھریرۃؓ)

245. దైవ సందేశహరుల (సఅసం) ప్రవచనం: "కుస్తీ పట్టి ఇతరుల్ని చిత్తు చేసేవాడు అసలయిన శూరుడు కాడు. తనకు ఆగ్రహం కలిగి నప్పుడు నిగ్రహం చూపే వాడే వాస్తవానికి పరాక్రమశాలి."

(బుఖారి - అబూహురైరా)

---

242. ఒక వ్యక్తి ఇస్లాం పట్ల విశ్వాసముండీ అతడు అత్యాచారాన్ని ప్రతిఘటించడం వదలి అత్యాచారం చేసేవానితో సహకరించడమంటే అతని విశ్వాసం పరిపూర్ణమయింది కాదని అర్థం. అతనిలో ఇస్లాం ఏ కొద్దిగానయినా ఉన్నా ఇప్పుడు ఆ కాస్తా అదృశ్య మయిందన్న మాట !

243. ఒకరికి చెందిన హక్కును వారికి అందకుండా చెయ్యడం, దాన్ని కాజెయ్యటం లేదా ఒకరికి అన్యాయంగా నష్టం కలిగించటం - ఇవన్నీ దౌర్జన్యాలే, అత్యాచారాలే. ఇవి ఎంత స్వల్పమయినవయినా, అల్పమయినవయినా ! ఈ హదీసు ద్వారా మనిషిపై వాటిల్లే తోటి మానవ సోదరుల హక్కుల ప్రాముఖ్యతను వెల్లడించారు మహాప్రవక్త (సఅసం). హదీసులో ప్రస్తావించబడిన వ్యక్తి దైవికమయిన విధుల్ని సరిగ్గా నిర్వహించాడు కాని తోటి మానవ సోదరులపట్ల పలువిధాలుగా అన్యాయం చేశాడు. అందువల్ల కేవలం దైవం హక్కుల్ని మాత్రం చెల్లించేవారు జాగ్రత్తపడాలి. వారు తోటిమనుషుల హక్కుల్ని కాజేయకుండా నడచుకోవాలి. లేకపోతే ప్రార్థనలు, ఉపవాసవ్రతాలు తదితర సత్కార్యాలన్నీ ప్రమాదానికి గురవుతాయి.

٢٤٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ الْغَضَبَ مِنَ الشَّيْطٰنِ وَإِنَّ الشَّيْطٰنَ خُلِقَ مِنَ النَّارِ، وَإِنَّمَا تُطْفَأُ النَّارُ بِالْمَاءِ. فَإِذَا غَضِبَ أَحَدُكُمْ فَلْيَتَوَضَّأْ. (ابوداؤد۔ عطیہ سعدیؓ)

246. దైవప్రవక్త ఇలా ఉపదేశించారు: "కోపం షైతాన్ ప్రభావం వల్ల వస్తుంది. షైతాన్ అగ్ని నుంచి సృజించబడ్డాడు. నిప్పు నీటితోనే చల్లారుతుంది. అందుచేత మీరు కోపం వచ్చినప్పుడు వెంటనే వుజూ చెయ్యాలి." (అబూదావూద్ - అతియా సఅది)

٢٤٧ إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: إِذَا غَضِبَ أَحَدُكُمْ وَهُوَ قَائِمٌ فَلْيَجْلِسْ، فَإِنْ ذَهَبَ عَنْهُ الْغَضَبُ وَإِلَّا فَلْيَضْطَجِعْ. (مشکوٰۃ۔ ابوذرؓ)

247. ప్రవక్త ఇలా బోధించారు : నిలబడి వుండగా కోపం వస్తే తక్షణం కూర్చోవాలి. ఈ ఉపాయం వల్ల కోపం పోతే సరే సరి, లేకపోతే వెంటనే పరుండాలి." (మిష్కాత్ - అబూజర్)

---

ఆ సత్కార్యాలు చేసినది ఆ వ్యక్తే అయినా మానవ హక్కుల్ని అతడు కాలరాచిన దానికి శిక్షగా అవన్నీ అతని దౌర్జన్యానికి గురయినవారికి చెల్లించబడతాయి. అవి వారికి నష్టపరిహారమన్నమాట! అతను చేసిన సత్కార్యాలన్నీ పంచి పెట్టినా వారికి నష్ట పరిహారం పూర్తికాకపోతే ఆ పీడిత ప్రజల పాపఫలం ఆ వ్యక్తి కర్మపత్రంలో పడుతుంది. ఈ విధంగా పాపభారంతో ఆ వ్యక్తి నరకకూపానికి ఆహుతి అవుతాడు.

244. ఈ హదీసు ద్వారా తెలిసిందేమంటే పీడిత మనస్సు తనపై కలిగిన అత్యాచారగాథను, తన బాధను అల్లాహ్ సన్నిధిలో విన్నవించుకుంటుంది. అల్లాహ్ పరమ న్యాయశీలుడు, అత్యుత్తమ న్యాయాధికారి కూడా. ఆయన, హక్కుగల వారి హక్కుల్ని న్యాయవంతంగా అందజేస్తాడు. అందువల్ల బాధితుని మొరవింటాడు. అత్యాచారం చేసిన వ్యక్తిని శిక్షిస్తాడు. అల్లాహ్ న్యాయశీలుడు గనక ఎవరి హక్కును వారికి ఇప్పిస్తాడు.

245. అంటే కోపం ఆవహిస్తే మనిషి దైవ విధేయతకు, దైవాజ్ఞోల్లంఘనకు పాల్పడే అవకాశం ఉంది. అందువల్ల కోపాగ్నిని దిగమ్రింగుకోగలిగిన వ్యక్తి వాస్తవానికి దైవ మార్గాన్ని విడనాడని వ్యక్తి అన్నమాట. అతడే అసలు సిసలయిన వీరుడు అనటంలో సందేహమేముంది ?

۲۴۸ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ : قَالَ مُوْسٰی بْنُ عِمْرَانَ عَلَیْہِ السَّلَامُ : "یَا رَبِّ مَنْ أَعَزُّ عِبَادِكَ عِنْدَكَ ؟ قَالَ مَنْ إِذَا قَدَرَ غَفَرَ ." (مشکوٰۃ - ابوھریرۃؓ)

248. మహాప్రవక్త (సఅసం) ఒకసారి ఇలా అన్నారు : "హజ్రత్ మూసా (అలైస) అల్లాహ్‌ను అడిగారు: 'నా ప్రభూ! నీ సేవకుల్లో అందరి కంటే అధికంగా నీకు ప్రేమపాత్రుడు ఎవడు?' అని. దానికి, "ప్రతీకారం తీసుకునే శక్తి ఉన్నప్పటికీ మన్నించే గుణం కలవాడు' అని బదులిచ్చాడు అల్లాహ్.' (మిష్కాత్ - అబూహురైరా)

۲۴۹ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ : "مَنْ خَزَنَ لِسَانَهٗ سَتَرَ اللّٰہُ عَوْرَتَهٗ وَمَنْ كَفَّ غَضَبَهٗ كَفَّ اللّٰہُ عَنْهُ عَذَابَهٗ يَوْمَ الْقِيَامَةِ ، وَمَنِ اعْتَذَرَ إِلَى اللّٰہِ قَبِلَ اللّٰہُ عُذْرَهٗ ." (مشکوٰۃ - انسؓ)

249. దైవ సందేశహరుడు ఇలా ప్రవచించారు : "ఎవరు తననోటిని రక్షించుకుంటాడో అల్లాహ్ అతని లోటుపాట్లను కప్పిపుచ్చుతాడు ; ఎవరు తనకోపాన్ని నిగ్రహించుకుంటాడో అల్లాహ్ ప్రళయ దినాన అతని బాధను తొలగిస్తాడు ; అల్లాహ్ సన్నిధిలో క్షమార్పణ చేసుకునే వానిని అల్లాహ్ మన్నిస్తాడు." (మిష్కాత్ - అనస్)

---

246. వుజూ చెయ్యడం వల్ల మనిషి దేహ పరిశుద్ధతతోబాటు ఆత్మ పారిశుద్ధ్యాన్నీ, దైవిక చింతనను పొందగలుగుతాడు. అందువల్ల వుజూ చెయ్యడం ద్వారా కోపం చల్లారుతుందంటే అందులో ఆశ్చర్యపడనవసరముండదు.

ఈ హదీసులోను ఇంకా ఇతర హదీసుల్లోనూ కోపాన్ని షైతాన్ ప్రభావం అని తెలుపడం జరిగింది. ఆ కోపం మనిషికి స్వయంగా నష్టం కలిగినప్పుడు వచ్చే కోపం. ఇకపోతే ఒక విశ్వాసికి ధార్మిక విషయాల్లో, ధర్మవైరులపై కలిగే ఆగ్రహం ఒక మంచి గుణమే. ధర్మరక్షణార్థం జరిగే కృషిలో ధర్మం కించపరచబడుతున్నప్పుడు కోపం, రోషం రాకపోతే అది విశ్వాసంలో లోటును సూచిస్తుంది!

247. ఈ హదీసులోను ఇంతకుముందు హదీసులోను పేర్కొన్న కోపాన్ని శమింపజేసే యుక్తులు ఎంతో నిజమయినవని అనుభవపూర్వకంగా బుజువయినది.

٢٥٠ إِنَّ رَسُولَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: ثَلَاثٌ مِّنْ أَخْلَاقِ
الْإِيمَانِ: مَنْ إِذَا غَضِبَ لَمْ يُدْخِلْهُ غَضَبُهُ فِي بَاطِلٍ. وَمَنْ إِذَا
رَضِيَ لَمْ يُخْرِجْهُ رِضَاهُ مِنْ حَقٍّ. وَمَنْ إِذَا قَدَرَ لَمْ يَتَعَاطَ مَا لَيْسَ لَهُ"

(مشكوة - انسؓ)

250. దైవప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు : "విశ్వాసానికి అంతర్గత మయిన మూడు గుణాలున్నాయి. ఒకటి, మనిషికి కోపం వచ్చినా అతన్ని ఎట్టి అధర్మ కార్యానికీ పురికొల్పదు. రెండవది, అతనికి సంతోషం కలిగినప్పుడు ఆ సంతోషం అతన్ని సత్యానికి దూరం చెయ్యదు. మూడవది శక్తి వున్నప్పటికీ తనకు చెందని, తనవికాని వస్తువుల్ని అతను దోచుకోడు." (మిష్కాత్ - అనస్)

٢٥١ إِنَّ رَجُلًا قَالَ لِلنَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: أَوْصِنِي. قَالَ:
"لَا تَغْضَبْ". فَرَدَّدَ ذَالِكَ مِرَارًا. قَالَ: "لَا تَغْضَبْ". (بخاری - ابوهریرةؓ)

251. ఒక వ్యక్తి మహాప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి "నాకు ఏదైనా ఉపదేశించండి" అని అర్థించాడు. ఆయన, "కోపగించుకోకు" అని బోధించారు. ఆ వ్యక్తి దాని తరువాత కూడా మాటి మాటికి 'ఉప దేశించండి' అని అర్థించసాగాడు. ప్రవక్త ప్రతిసారీ "కోపగించుకోకు" అని మాత్రమే బోధించారు. (బుఖారి - అబూహురైరా)

---

248. చేతకానప్పుడు ఎవరికీ ఏ హాని చెయ్యక పోవడం, కనీసం తనకు కలిగిన హానికి ప్రతీకారం తీర్చుకోకపోవడం గొప్ప విశేషం కాదు. అవకాశం, శక్తి పలుకుబడి ఉన్నా తన ప్రత్యర్థిపై ప్రతీకార వాంఛలేని మనిషే అసలయిన మానవుడు. అందుకే అతడు అల్లాహ్ ప్రేమకు పాత్రుడయ్యాడు.

249. నోటిని రక్షించుకోవడమంటే నోటి నుండి సత్యానికి విరుద్ధమయిన, అధర్మమయిన మాటలు పలుకకుండా కాపాడటమన్నమాట. హదీసులో ప్రవచించబడిన మూడు సద్గుణాల్లో మొదటి రెండు గుణాలు, ఆత్మనిగ్రహం ద్వారా తన నోటిపై, మనసుపై అదుపుచెయ్యగల వ్యక్తిని సూచిస్తున్నాయి. అలాంటి వ్యక్తికి చివరి గుణం అబ్బడం, అతడు తన పొరపాట్లకు మన్నింపును అర్థించి దాన్ని పొందడంలో ఆశ్చర్యమేముంది?

## ఇతరుల్ని వెక్కిరించడం

۲۵۲ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَا أُحِبُّ أَنِّي حَكَيْتُ أَحَدًا وَّأَنَّ لِي كَذَا وَكَذَا۔" (ترمذی۔ عائشہؓ)

252. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "ఇతరుల్ని హేళనగా అనుకరించ నేను ఏ మాత్రం ఇష్టపడను. దానికి బదులుగా నాకు ఎన్నెన్ని ఐశ్వర్యాలు లభిస్తాయన్నా సరే." (తిర్మిజీ - ఆయిషా)

## ఇతరుల కష్టాలు చూసి ఆనందించడం

۲۵۳ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "لَا تُظْهِرِ الشَّمَاتَةَ لِأَخِيْكَ فَيَرْحَمَهُ اللّٰهُ وَيَبْتَلِيْكَ۔" (ترمذی۔ واثلہؓ)

253. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు : "నీవు నీ సోదరుడిని కష్టాల్లో చూసి సంతోషించకు. అల్లాహ్ అతనిపై కనికరించి నిన్ను కష్టాలపాలు చేస్తాడు." (తిర్మిజీ - వాసిలా)

---

250. దైవంపై, ప్రళయదినంపై విశ్వాసం ఉన్న వ్యక్తి అనునిత్యం అల్లాహ్‌కు చేరువగా ఉంటాడు. తనను అల్లాహ్ ప్రతిక్షణం వీక్షిస్తూనే ఉన్నాడని అతడు భావిస్తాడు. కనుక, ఆగ్రహంలో నిగ్రహం, ఆనందంలో అదుపు, అవకాశంలో ధర్మం అతన్ని వీడవు.

251. మహాప్రవక్త బోధనా విధానంలో ముఖ్యమయిన విషయమేమంటే వ్యక్తిగతంగాచేసే బోధనలు సామాన్యంగా ఎదుటి మనిషి మనస్తత్వాన్నీ అతని ప్రవర్తననూ దృష్టిలో ఉంచుకుని అతన్ని సంస్కరించవలసిన అంశాన్ని నొక్కి చెబుతారు. ఈ హదీసులో ప్రస్తావించబడ్డ వ్యక్తి బహుశః చాలా కోపిష్టి అయి ఉంటాడు. అందువల్లనే "ముందు ఆ దుర్గుణాన్ని దూరంచేసుకో" అని మరీ మరీ బోధించారు.

252. ఒకరిని అవమానపరచడానికి, నలుగురిలో కించపరచడానికి వారి మాదిరిగా అనుకరించడం, అవహేళన ఉద్దేశ్యంతో ఒకరిని వెక్కిరించడం, వారిలా నటించి చూపడం ఎంత హేయమయిన కార్యమో ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. ఒకరి

## అబద్ధం

٢٥٤ إِنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "أَرْبَعٌ مَّنْ كُنَّ فِيْهِ
كَانَ مُنَافِقًا خَالِصًا، وَمَنْ كَانَتْ فِيْهِ خَصْلَةٌ مِّنْهُنَّ كَانَتْ فِيْهِ
خَصْلَةٌ مِّنَ النِّفَاقِ حَتّٰى يَدَعَهَا: إِذَا اؤْتُمِنَ خَانَ، وَإِذَا حَدَّثَ
كَذَبَ وَإِذَا وَعَدَ اَخْلَفَ، وَإِذَا خَاصَمَ فَجَرَ" (بخاری۔ مسلم۔ عبد الله بن عمرو)

254. మహాప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు : “ఏ వ్యక్తిలో ఈ నాలుగు గుణాలు ఉంటాయో అతను అసలైన మునాఫిక్. ఒకవేళ అతనిలో వీటిలోని ఒక్క గుణం వున్నా అతను దాన్ని విసర్జించనంతవరకు అతనిలో మునాఫకత్‌కు సంబంధించిన ఒక గుణం ఉన్నట్టే. ఆ నాలుగు గుణాలు ఇవి: అతన్ని నమ్మి ఏదయినా అమానతు అప్ప గించినపుడు అతను దాన్ని కాజేస్తాడు. నోరు విప్పితే అబద్ధమే పలుకు తాడు. మాటిస్తే దాన్ని నిలబెట్టుకోడు. ఎవరితోనయినా వాదులాట జరిగితే తిట్లకు దిగుతాడు. (బుఖారి, ముస్లిమ్ – అబ్దుల్లా బిన్ అమ్ర్)

---

మెప్పుకోసమో లేక ధనార్జన కోసమో మరొకరిని కించపరచడం నీచమయిన కార్యం అని కూడా బోధపడుతోంది.

253. ఇద్దరు వ్యక్తుల మధ్య మనస్పర్థలు ఏర్పడినప్పుడు, వారిలో ఒకరికి ఆపదవస్తే రెండవ వ్యక్తి సంబరపడతాడు. ఈ వైఖరి ఇస్లామీయ విధానానికి కడు విరుద్ధమయినది. విశ్వాసి తోటి మానవ సోదరుని కష్టాన్ని చూచి, అతడు తన విరోధి అయినా సరే సంతోషం వెలిబుచ్చడు. సాధ్యమయితే ఆ కష్టాన్నుండి అతన్ని గట్టెక్కించడానికి అతనికి సాయపడాలి. తోటి మానవుని కష్టాన్ని చూచి సంతోషపడటం దైవాగ్రహానికి కారణమవుతుంది. అందువల్ల ఈ నీచమయిన స్వభావం కలవారినే అలాంటి కష్టాలకు గురిచేసి ఆ ఆపదలకు లోనయిన వ్యక్తిని వాటి నుంచి విముక్తి ప్రసాదించవచ్చు దైవం.

254. మునాఫిక్ అంటే కపటి అని, ద్వంద్వస్వభావి అని అర్థం. పైకి ముస్లింలుగా కనిపించి లోలోన ఇస్లామీయ ఉద్యమానికి నష్టం చేకూర్చే పన్నాగాలు పన్నేవారిని లేదా విశ్వాసం ఇంకా ఆంతర్యంలో ప్రవేశ్యనకపోవడం చేత ఆచరణలో సవ్యత, సన్మార్గం లోపించిన వారికి మునాఫిక్ అన్న పేరు సరిపోయింది. వారి ఈ లక్షణమే మునాఫకత్.

۲۵۵ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "أَفْرَى الْفِرٰى أَنْ يُرِيَ الرَّجُلُ عَيْنَيْهِ مَا لَمْ تَرَيَا۔" (بخاری۔ ابن عمرؓ)

255. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రవచించారు: "అబద్ధాలలో కెల్లా గొప్ప అబద్ధం ఏమంటే మనిషి తన రెండు కళ్ళు చూడని దాన్ని వాటికి చూపించడం." (బుఖారి - ఇబ్నె ఉమర్)

۲۵۶ عَنْ اَسْمَاءَ بِنْتِ عُمَيْسٍ قَالَتْ: زَفَفْنَا إِلٰى رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بَعْضَ نِسَائِهِ، فَلَمَّا دَخَلْنَا عَلَيْهِ اَخْرَجَ عُسًّا مِّنْ لَّبَنٍ فَشَرِبَ مِنْهُ ثُمَّ نَاوَلَهُ امْرَأَتَهُ، فَقَالَتْ لَا اَشْتَهِيهِ، فَقَالَ: لَا تَجْمَعِيْ جُوْعًا وَّكَذِبًا۔" (معجم صغیر طبرانی)

256. అస్మా బిన్తు ఉమైస్ ఇలా ఉల్లేఖించారు: "మేము ఒకసారి మహాప్రవక్త (సఅసం) వధువు వెంట ఆయన ఇంటికి వెళ్ళాము. ఇంటిలో ప్రవేశించిన తరువాత ఆయన ఒక పెద్ద పాలగిన్నె తీసుకువచ్చారు. అందులోనుంచి చాలినంత త్రాగి మిగతా పాలు తన సతీమణికి ఇచ్చారు. ఆమె, 'నాకు ఆకలిగాలేదు' అని పలికింది. దానికి "ఇదో, ఆకలినీ అబద్ధాన్నీ జత పర్చకు." అని చెప్పారు మహాప్రవక్త (సఅసం). (మోజమ్ సగీర్ - త్రిబాని)

۲۵۷ عَنْ سُفْيَانَ بْنِ اُسَيْدِ الْحَضْرَمِيِّ قَالَ: سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ: "كَبُرَتْ خِيَانَةً أَنْ تُحَدِّثَ أَخَاكَ حَدِيْثًا وَّهُوَ لَكَ بِهٖ مُصَدِّقٌ وَّأَنْتَ بِهٖ كَاذِبٌ۔" (ابوداؤد)

257. 'మహా ప్రవక్త (సఅసం) ప్రబోధిస్తుండగా నేను విన్నాను' అని సుఫ్యాన్ బిన్ అసీద్ హజ్రమి ఇలా ఉల్లేఖించారు: "నీవు అసత్యమయిన ఒక విషయాన్ని నీ సోదరుడు నిజమని నమ్మేటట్లు చెప్పటం గొప్ప విశ్వాసఘాతుకం." (అబూదావూద్)

٢٥٨ عَنْ عَبْدِ اللهِ بْنِ عَامِرٍ قَالَ دَعَتْنِيْ أُمِّيْ يَوْمًا وَّرَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَاعِدٌ فِيْ بَيْتِنَا ، فَقَالَتْ : هَا ، تَعَالَ ، أُعْطِيْكَ ـ فَقَالَ لَهَا رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : مَا أَرَدْتِ أَنْ تُعْطِيْهِ؟ قَالَتْ أَرَدْتُّ أَنْ أُعْطِيَهُ تَمْرًا ، فَقَالَ لَهَا رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : "أَمَا إِنَّكِ لَوْ لَمْ تُعْطِيْهِ شَيْئًا كُتِبَتْ عَلَيْكِ كَذْبَةٌ"

(ابوداؤد)

258. హజ్రత్ అబ్దుల్లా బిన్ ఆమిర్ ఇలా ఉల్లేఖించారు: ఒకరోజు మహాప్రవక్త (సఅసం)మా ఇంటికి విచ్చేశారు. ఆయన కూర్చొని ఉండగా మా అమ్మ నన్ను, 'ఇలారా మంచి వస్తువు ఒకటి ఇస్తాను' అని పిలిచింది. మహాప్రవక్త ఆమెను, "అతనికి ఏమి ఇవ్వదలుచుకున్నావు?" అని అడిగారు. ఒక ఖర్జూరపు పండు ఇవ్వాలనుకున్నాను అని బదులిచ్చింది మా అమ్మ. అప్పుడు మహాప్రవక్త మా అమ్మను ఉద్దేశించి బోధించారు : "నీవు ఏదయినా ఇస్తానని పిలిచి ఏమీ యివ్వకపోతే నీ కర్మపత్రంలో ఇదొక అబద్ధంగా నమోదయేది." (అబూదావూద్)

---

255. ఇది స్వప్నానికి సంబంధించిన విషయం. కొందరు కలలు కనక పోయినా నిద్ర లేచి నేను కలలో ఏమేమో చూశానని అత్యంత విచిత్రమయిన అపురూపమయిన కథలల్లుతారు. ఇలా చేయడం తమకండ్లతో అబద్ధం పలికించడమే కదా? అందుకే కళ్ళు చూడని వాటిని బలవంతంగా కళ్ళకు చూపెట్టడం అని పేర్కొన్నారు మహాప్రవక్త (సఅసం).

256. ఆమెకు ఆకలిగా ఉన్నా కేవలం మొహమాటంగా అలా అంటుందని మహా ప్రవక్త (సఅసం) గ్రహించారు. అందుకే అబద్ధపు మొహమాటాన్ని కూడదన్నారు.

257. మిత్రుడు నిత్యం సత్యమే పలుకుతాడని ఎవరైనా నమ్ముతారు. అయితే ఈ నమ్మకాన్ని వమ్ము చేసేలా ఎవరయినా ఎంతటి చిన్న అబద్ధాన్నయినా నిజంగా చిత్రించి చెప్పారంటే అంతకన్నా గొప్ప నమ్మకద్రోహమేది కాగలదు? అబద్ధం కేవలం ఒక రకమయిన పాపమే కాదు, నమ్మకద్రోహం కూడా.

258. సాధారణంగా పెద్దలు తమ పిల్లల్ని దగ్గర పిలవడానికి వారు ఏడుస్తుంటే, మారాము చేస్తుంటే ఓదార్చడానికి ఏదయినా ఇస్తామని ఆశ చూపిస్తారు. వాస్తవానికి

۲۵۹ عَنْ عَبْدِاللّٰهِ قَالَ: لَايَصْلُحُ الْكَذِبُ فِيْ جِدٍّ وَّلَاهَزْلٍ وَّلَا
أَنْ يَّعِدَ أَحَدُكُمْ وَلَدَهٗ شَيْئًا ثُمَّ لَايُنْجِزَ لَهٗ۔" (الادب المفرد صفحہ ۵۸)

259. అబ్దుల్లా బిన్ మస్ఊద్ బోధించారు: "అబద్ధం పలకడం ఏ పరిస్థితిలోనూ ధర్మం కాదు. గంభీరంగాగాని, పరిహాసంగా గాని అబద్ధం చెప్పకూడదు. మీ పిల్లలకు ఏదయినా ఇస్తామని చెప్పి తరువాత ఇవ్వకపోతే అది కూడా ధర్మం కాదు." (అల్ అదబుల్ ముఫ్రద్)

۲۶۰ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "وَيْلٌ لِّمَنْ يُّحَدِّثُ
فَيَكْذِبُ لِيُضْحِكَ بِهِ الْقَوْمَ - وَيْلٌ لَّهٗ وَيْلٌ لَّهٗ -" (ترمذی - بهزبن حکیم)

260. మహాప్రవక్త (సఅసం) సావధాన పరిచారు: "వినాశం తప్పదు- ఇతరుల్ని నవ్వించడానికని అబద్ధాలు సృష్టించే వ్యక్తికి - వినాశం తప్పదంటే తప్పదు!" (తిర్మిజి - బహజ్ బిన్ హకీమ్)

۲۶۱ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: أَنَا زَعِيْمٌ بِبَيْتٍ
فِيْ رَبَضِ الْجَنَّةِ لِمَنْ تَرَكَ الْمِرَاءَ وَإِنْ كَانَ مُحِقًّا، وَبِبَيْتٍ فِيْ وَسْطِ
الْجَنَّةِ لِمَنْ تَرَكَ الْكَذِبَ وَإِنْ كَانَ مَازِحًا. وَبِبَيْتٍ فِيْ أَعْلَى الْجَنَّةِ
لِمَنْ حَسَّنَ خُلُقَهٗ. (ابوداؤد - ابوامامہؓ)

261. దైవ సందేశహరులు (సఅసం) ఈ శుభవార్త నిచ్చారు: "తాను సత్యంపక్షాన ఉన్నా, ఇతరులతో వాగ్వివాదానికి దిగకుండా ఉంటే అలాంటి వ్యక్తికి స్వర్గంలో నివాస స్థలం లభిస్తుందని హామీ నిస్తున్నాను;

---

వాళ్ళకు ఇచ్చే ఉద్దేశమే ఉండదు. దయ్యం వచ్చి పట్టుకెళ్ళుతుందని భయపెడతారు. ఇదంతా దైవదృష్టిలో అబద్ధంగా పరిగణించబడుతుందని ఈ హదీసుద్వారా తెలుస్తోంది.

259. పై హదీసులో మాదిరిగా హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్ బోధన ద్వారానూ పరాచికాలకు చెప్పుకునే అబద్ధం, పిల్లలకు సముదాయించడానికి చెప్పుకునే అబద్ధాలు

పరిహాసానికయినా అసత్యం చెప్పని వ్యక్తి కోసం స్వర్గం మధ్య భాగంలో నివాసం లభిస్తుందని హామీనిస్తున్నాను; సదా తన గుణగణాల సంస్కరణ పట్ల శ్రద్ధచూపే వ్యక్తికి స్వర్గపు అత్యున్నత భాగంలో నివాసం ప్రాప్తిస్తుందని హామీ నేనిస్తున్నాను." (అబూదావూద్ - అబూ ఉమామ)

## దుర్భాషలాడటం

٢٦٢ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ : إِنَّ أَثْقَلَ شَيْءٍ يُّوْضَعُ فِيْ مِيْزَانِ الْمُؤْمِنِ يَوْمَ الْقِيَامَةِ خُلُقٌ حَسَنٌ وَإِنَّ اللّٰهَ يُبْغِضُ الْفَاحِشَ الْبَذِيَّ -

(ترمذی - ابوالدرداءؓ)

262. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "ప్రళయ దినాన విశ్వాసి తరాజులో ఉంచబడే అత్యంత భారమయిన వస్తువు అతని 'సత్ప్రవర్తన'. నోటితో అశ్లీల పదాలు పలికే వాడినీ దుర్భాషలాడే వాడినీ అల్లాహ్ అమితంగా అసహ్యించుకుంటాడు." (తిర్మిజి - అబుద్దర్దా)

---

కూడా అపరాధాలని తెలుస్తోంది. అబద్ధాన్ని జీవితంలో నుండి నామరూపాల్లేకుండా తుడిచివెయ్యడమే ముఖ్య ఉద్దేశ్యం.

260. బాతాఖానీ కొడుతూ నలుగురినీ నవ్వించడానికి నలుగురి మెప్పును పొందడానికి అబద్ధాలు సృష్టించి కాలక్షేపంచేసే భట్రాజులవంటివారిని ఇందులో సావధానపరచడం జరిగింది.

261. తాను సత్యం పలుకుతున్నాడని, తన అభిప్రాయమే సరయినదని, ఎదుటి వ్యక్తి అపసవ్యమయిన భావాలు కలవాడని తెలిసినా ఎదుటి వ్యక్తితో ఘర్షణ పడకుండా అతని విభేదాన్ని ఓరిమితో భరించే వ్యక్తి స్వర్గానికి అర్హుడనడంలో సందేహమే లేదు. అలాగే పరిహాసానికయినా అబద్ధం చెప్పకుండా ఉండటం కూడా ఎంతో నిష్ఠాపరత్వాన్ని సూచిస్తుంది. మహాప్రవక్త తన సహచరులతో అప్పుడప్పుడు హాస్యమాడేవారు. కాని ఒక్కసారయినా ఆయన అసత్యపు పలుకు పలకలేదని చరిత్ర పుటలే సాక్ష్యమిస్తున్నాయి.

262. "సత్ప్రవర్తన"ను అబ్దుల్లా బిన్ ముబారక్ ఇలా విశదీకరించారు. "ఒకరితో కలిసినప్పుడు చిరునగవు తొణికిసలాడే మోముతో పలకరించడం, లేమితో బాధపడే తోటి మానవ సోదరులకోసం ధారాళంగా ధనం ఖర్చుచెయ్యడం, ఎవ్వరికీ ఏ విధ మయిన కష్టాన్ని కలిగించక పోవడం"

۲۶۳ عَنْ عَلِيِّ بْنِ اَبِيْ طَالِبٍ قَالَ: "اَلْقَائِلُ الْفَاحِشَةَ وَالَّذِيْ يُشِيْعُ
بِهَا فِي الْاِثْمِ سَوَاءٌ" (مشكوٰة)

263. హజ్రత్ అలి ఇలా నుడివారు: "అశ్లీల విషయాలు మాట్లాడే వాడు, వాటి ప్రచారం చేసేవాడు – వీరిద్దరూఅపరాధంలో సమానులే." (మిష్కాత్)

# ద్వంద్వ స్వభావం

۲۶۴ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: تَجِدُوْنَ شَرَّ النَّاسِ
يَوْمَ الْقِيٰمَةِ ذَا الْوَجْهَيْنِ الَّذِيْ يَأْتِيْ هٰؤُلَاءِ بِوَجْهٍ وَهٰؤُلَاءِ بِوَجْهٍ-"
(متفق عليه - ابوهريرةؓ)

264. దైవ సందేశహరులు (సఅసం) ఇలా తెలిపారు: "మీరు ప్రళయదినాన ఒక మహాదుర్జనుడిని చూస్తారు. అతను ప్రపంచంలో రెండు రూపా లున్నవాడు. కొందరితో ఒక రూపంతోనూ మరి కొందరితో మరో రూపంతోను కలిసేవాడు." (ముత్తఫకున్ అలైహి – అబూహురైరా)

۲۶۵ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ كَانَ ذَا وَجْهَيْنِ
فِي الدُّنْيَا كَانَ لَهٗ يَوْمَ الْقِيَامَةِ لِسَانَانِ مِنْ نَارٍ-" (ابوداؤد - عمارؓ)

265. దైవప్రవక్త (సఅసం) ఇలా సావధానపరిచారు : "ఏ వ్యక్తి ప్రపంచంలో ద్వంద్వ స్వభావం ప్రదర్శిస్తాడో ప్రళయ దినాన అతని నోట్లో రెండు నిప్పు నాలుకలు వెలుస్తాయి." (అబూదావూద్ – అమ్మార్)

---

263. పలికేవాడు, ప్రచారంచేసేవాడు సమానమవడంలో సందేహంలేదు. అయితే ప్రచారమంటే ఏమిటి? చాలామంది అమాయకత్వంతో "ఫలానా వారు ఫలానా విధంగా దుర్భాషలాడతారు, ఫలాన తిట్లు తిడతారు", అనీ "అసహ్యం"గానే చెప్పుకుంటారు, అలా వారు తమ ఏహ్యభావాన్ని వెలిబుచ్చుకుంటారు. కాని వాస్తవానికి వారున్నూ

# పరోక్ష నింద

٢٦٦ إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ : أَتَدْرُوْنَ مَا الْغِيْبَةُ ؟ قَالُوْا : "اَللّٰهُ وَرَسُوْلُهُ اَعْلَمُ" قَالَ : ذِكْرُكَ اَخَاكَ بِمَا يَكْرَهُ. قِيْلَ : اَفَرَأَيْتَ إِنْ كَانَ فِىْ أَخِىْ مَا اَقُوْلُ ؟ قَالَ : "إِنْ كَانَ فِيْهِ مَا تَقُوْلُ فَقَدِ اغْتَبْتَهُ ، وَإِنْ لَّمْ يَكُنْ فِيْهِ مَا تَقُوْلُ فَقَدْ بَهَتَّهُ -"

(مشکوٰۃ - ابوهريرةؓ)

266. దైవప్రవక్త (సఅసం) ఒకసారి అడిగారు, "పరోక్ష నింద అంటే ఏమిటో మీకు తెలుసా?" అని. "అల్లాహ్, ఆయన ప్రవక్తకే బాగా తెలుసు"అన్నారు అక్కడ ఉన్నవారు. "పరోక్ష నింద అంటే మీరు మీ సోదరుని ప్రస్తావన, అతనికి నచ్చని విధంగా చేయడం అన్నమాట" అని మహాప్రవక్త తెలుపగా వారు "అయితే నేను చెప్పే విషయం నా సోదరుని విషయంలో వాస్తవమైనప్పటికీ అది పరోక్ష నిందే అవుతుందా?" అని అడిగారు. దానికి మహాప్రవక్త "నీవు చెప్పే విషయం అతనిలో ఉన్నదయితేనే అది పరోక్ష నింద అవుతుంది. అతనిలో లేని విషయాన్ని నీవు చెప్పినట్లయితే అది అపనింద అవుతుంది." (మిష్కాత్ - అబూహురైరా)

---

పరోక్షంగా ఆ దుర్భాషల్ని, తిట్లను నలుగురిలో ప్రచారంచేస్తున్నారన్న నిజం వారికి అర్థంకాదు. ఆ విధంగా వారున్నూ పాపభారాన్ని దుర్భాషలాడే వ్యక్తికి సమానంగా మోస్తున్నారని వారికి బోధపడదు.

264. ఇద్దరు వ్యక్తుల్లో లేక రెండు సమాజాల్లో మనస్పర్థలు ఏర్పడినప్పుడు ప్రతిచోటా, కొందరు ద్వంద్వరూపాలున్న వ్యక్తులు ఉద్భవిస్తారు. వీరు ఉభయులతోనూ కలిసి ఉంటారు. వారివారి మాటలకు వంతపాడి అగ్నిలో ఆజ్యంలా పనిచేస్తారు. గుండెల్లో మంటలు రేపి శత్రుత్వాన్ని పెంచుతారు.

ఇలాగే కొందరు ఎదుటి వ్యక్తి ముందయితే ఎంతో సన్నిహితులుగా ఆత్మీయులుగా వ్యవహరిస్తారు. అతను అటుపోగానే అతని గురించి ఉన్నవీ లేనివీ అన్నీ కల్పించి వల్లించడం మొదలెడతారు. ఈ ద్వంద్వ స్వభావాన్నే ఇక్కడ నిరసించటం జరిగింది.

265. ప్రపంచంలో అతని నోటి నుండి వెలువడినమాటలు ఇద్దరు వ్యక్తుల పరస్పర సంబంధాల్లో వైషమ్యాలు సృష్టించి వాటిని మంటపాలు చేయడంచేత అతని నోట మండే నాలుకలు రెండు ఉద్భవిస్తాయి.

۲٦٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: اَلْغِيْبَةُ اَشَدُّ مِنَ
الزِّنَا، قَالُوْا: يَا رَسُوْلَ اللّٰهِ، وَكَيْفَ الْغِيْبَةُ اَشَدُّ مِنَ الزِّنَا؟
قَالَ: إِنَّ الرَّجُلَ لَيَزْنِيْ فَيَتُوْبُ اللّٰهُ عَلَيْهِ، وَإِنَّ صَاحِبَ الْغِيْبَةِ
لَا يُغْفَرُ لَهٗ حَتّٰى يَغْفِرَهَا لَهٗ صَاحِبُهٗ -" (مشكوٰة-ابوسعيد وجابرؓ)

267. మహాప్రవక్త (సఅసం) ఒకసారి పరోక్ష నింద, వ్యభిచారంకంటే నీచమయిన పాపం అని పలుకగా అక్కడున్నవారు 'దైవ ప్రవక్తా పరోక్ష నింద వ్యభిచారం కంటే నీచమయిన పాపం ఎలా కాగలదు?' అని సందేహం వెలిబుచ్చారు. అప్పుడు దైవప్రవక్త (సఅసం) ఇలా బోధించారు: "మనిషి వ్యభిచారం చేసి తౌబా చేస్తే అల్లాహ్ అతని తౌబాను స్వీకరిస్తాడు. కాని పరోక్ష నింద చేసినవాణ్ణి నిందకు గురయిన వ్యక్తి క్షమించనంత వరకు అల్లాహ్ ఎంత మాత్రం క్షమించడు."

(మిష్కాత్ - అబూ సయీద్, జాబిర్)

---

266. ఒక మంచి మనిషిలో ఏదయినా లోపం అగుపడితే దాన్ని సంస్కరించే సదుద్దేశ్యంతో అతనికి తెలిపినట్లయితే అతను నొచ్చుకుంటాడా? కాదు. తన్ను సంస్కరించుకోవడానికి ప్రయత్నిస్తాడు. అలాగే అతని దోషాన్ని అతని పెద్దలకు లేదా అతనికి సంబంధించిన వారికి తెలియపరచినా అతను మరో విధంగా భావించడు. ఎందుకంటే ఇలా చేయడంలో కూడా ఉద్దేశ్యం అతని సంస్కరణే కనుక. కాని మీరు సంఘంలో కించపరచడానికి, అవమానం పాలు చెయ్యడానికి అతను లేనప్పుడు అతనిలోని తప్పుల్ని చర్చిస్తూ, వివరిస్తూ ఉంటే అతను, నొచ్చుకోవడంలో అసహజత కానీ అసమంజసత కాని ఏమాత్రం లేదు. ఇకపోతే బాహాటంగా దైవధిక్కారం చేసేవాని విషయం, సంఘానికి హానికరమైన భావాలకు, పనులకు లోనై ఎన్ని చెప్పినా వినిపించుకోనివాని సంగతివేరు. అతని గురించి అందరికీ తెలుపడం, అందరినీ హెచ్చరించడం తప్పుకాకపోవడమే కాదు, ఒక విధంగా అది సత్కార్యం కూడా. మహాప్రవక్త మరొకచోట దుష్టుని దురాగతాలు బహిర్గతం చేయమని ఆదేశించారు.

అయితే ఒక వ్యక్తిలో లేని దాన్ని ప్రచారంచేసి అపనిందకు పాల్పడటమయితే తీవ్రమయిన అపరాధం అని తెలుసుకోవడం ఉత్తమం.

267. "తౌబా" అంటే తప్పుచేసిన వ్యక్తి పశ్చాత్తాపంతో కుమిలిపోతూ దైవానికి క్షమాపణ వేడుకోవడం, ఇక మీదట చేయనని సంకల్పించుకోవడం అని అర్థం.

మనిషిపై ఉన్న తోటి మానవ హక్కులన్నింటి విషయంలోనూ, వాటిని ఎవరయినా

٢٦٨ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "إِنَّ مِنْ كَفَّارَةِ الْغِيْبَةِ أَنْ تَسْتَغْفِرَ لِمَنِ اغْتَبْتَهُ تَقُوْلُ: اَللّٰهُمَّ اغْفِرْ لَنَا وَلَهُ"

(مشکوٰۃ - انس)

268. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు : పరోక్ష నిందకు ఒక ప్రాయశ్చిత్త మేమంటే నీవు ఎవరిపై నిందమోపావో అతనికి అల్లాహ్ క్షమాభిక్ష ప్రసాదించాలని వేడుకోవాలి. ఆ ప్రార్థనలో, 'అల్లాహ్, నాకు మరియు అతనికీ క్షమాభిక్ష ప్రసాదించు' అని ప్రార్థించాలి."

(మిష్కాత్ - అనస్)

٢٦٩ عَنْ عَائِشَةَ قَالَتْ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "لَا تَسُبُّوا الْأَمْوَاتَ فَإِنَّهُمْ قَدْ أَفْضَوْا إِلَى مَا قَدَّمُوْا". (بخاری)

269. మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారని హజ్రత్ ఆయిషా (రజి) ఉల్లేఖించారు : "మృతులను దూషించకండి. ఎందు వల్లనంటే తమ కర్మలపరిణామ ఫలానికి వరకు వారు చేరుకున్నారు."

(బుఖారి)

---

కబళిస్తే, ఒకే సూత్రం వర్తిస్తుంది. హాని కలిగిన వ్యక్తి, హాని కలిగించిన వ్యక్తిని క్షమించనంతవరకు ఆ వ్యక్తికి పరలోకంలో దైవ సన్నిధిలో క్షమాభిక్ష దొరకదు. అదే విషయం పరోక్ష నింద విషయంలోనూ వర్తిస్తుంది.

268. నిందకు గురయిన వ్యక్తి దగ్గరలో ఉండి తన తప్పుకు అతనివద్ద మన్నింపును అర్థించే అవకాశం ఉంటే మన్నింపు పొందాలి. కాని అతను మరణించడమో మరే విధంగానైనా అతని మన్నింపు పొందే అవకాశం లేకపోతే, దైవ క్షమాభిక్షను వేడుకోవడం తప్ప గత్యంతరం లేదు. అందువల్ల వీలయినంతవరకు ఎవరిపట్ల అన్యాయం జరుగుతుందో వారిని క్షమాపణ వేడుకోవడం ఉత్తమం. తప్పు తెలుసుకున్న మరుక్షణం చెయ్యవలసిన విధి ఇది.

269. మనిషి మరణించి తాను ప్రపంచంలో చేసిన సత్కర్మల సత్ఫలితాన్నీ దుష్కర్మల పర్యవసానాన్ని అనుభవిస్తుంటాడు. అలాంటప్పుడు చేసినదాన్ని అనుభవిస్తున్న వారి తప్పొప్పులు చర్చించుకొని లాభం ఏమిటి? వారి సద్గుణాల్లో అనుసరణీయమయిన వాటిని ప్రస్తావించుకోవడం మాత్రం వేరే విషయం.

# పక్షపాతం

۲۷۰ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ: "مِنْ شَرِّ النَّاسِ مَنْزِلَۃً یَوْمَ الْقِیَامَۃِ عَبْدٌ اَذْھَبَ اٰخِرَتَہٗ بِدُنْیَا غَیْرِہٖ۔"

(مشکوٰۃ - ابوامامہؓ)

270. మహాప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు : "ప్రళయ దినాన అత్యంత దురవస్థపాలయ్యే వ్యక్తి, ప్రపంచంలో ఇతరుల ఐహిక జీవితాన్ని చక్కదిద్దడానికి తన పరలోక జీవితాన్ని నాశనం చేసుకున్నవాడు."

(మిష్కాత్ - అబూ ఉమామ)

۲۷۱ سَأَلْتُ رَسُوْلَ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ فَقُلْتُ: یَا رَسُوْلَ اللّٰہِ، أَمِنَ الْعَصَبِیَّۃِ أَنْ یُّحِبَّ الرَّجُلُ قَوْمَہٗ؟ قَالَ: "لَا، وَلٰکِنْ مِّنَ الْعَصَبِیَّۃِ أَنْ یَّنْصُرَ الرَّجُلُ قَوْمَہٗ عَلَی الظُّلْمِ۔"

(مشکوٰۃ - ابوفیلہؓ)

271. అబూ ఫీల ఉల్లేఖనం : "నేను మహా ప్రవక్త (సఅసం)ను ఇలా అడిగాను, 'దైవప్రవక్తా! తమ ప్రజలను (వంశీయులను, కుటుంబీకులను) ప్రేమించటం కూడా పక్షపాతమేనా" అని. దానికి ఆయన ఇలా తెలిపారు, "కాదు, పక్షపాతం అంటే దుర్మార్గంలో తన జాతి వారికి తోడుగానిలువడం." అని ఆయన వివరించారు. (మిష్కాత్)

270. ఇతరుల ఐహిక జీవితాన్ని చక్కదిద్దడానికి తన పరలోకాన్ని నాశనం చేసుకోవడమంటే, తన భార్యాపిల్లల సుఖ సౌఖ్యాల కొరకు అధర్మ సంపాదనను ప్రోగుచేసి పోషించడం లాంటిదన్నమాట. చాలా మంది, తాము ఎదుటి వారికి ఏదో ఉపకారం చేస్తున్నామని "ఎలాగైనా సరే" వారి పని నెరవేర్చాలని అధర్మ కార్యాలకు ఒడికడతారు. అది పరోపకారం ఏమోకాని, ఆత్మాపకారం అవడంలో ఏ మాత్రం సందేహం లేదని ఈ హదీసు తెలుపుతుంది.

271. ఒకరిని ప్రేమించడం, అభిమానించటం వారి కొరకు ధర్మ సమ్మతంగా పోరాడటం అంతా సముచితమయినవే కాని అభిమానంలో గుడ్డిగా వ్యవహరించడమే

٢٧٢ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ نَصَرَ قَوْمَهُ عَلٰى غَيْرِ الْحَقِّ فَهُوَ كَالْبَعِيْرِ الَّذِيْ رَدَىٰ فَهُوَ يُنْزَعُ بِذَنَبِهٖ۔"

(ابوداؤد۔ابن مسعودؓ)

272. దైవప్రవక్త ఇలా ప్రవచించారు: "ఎవరు, అధర్మ వ్యవహారంలో తన జాతికి తోడుగా నిలుస్తాడో అతనిస్థితి ఒంటె నూతిలో పడి పోతుంటే దాని తోకపట్టుకు వ్రేలాడి దానితోపాటు నూతిలో పడేవానిని పోలి ఉంటుంది." (అబూదావూద్ - ఇబ్నె మస్ ఊద్)

٢٧٣ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "لَيْسَ مِنَّا مَنْ دَعَا إِلٰى عَصَبِيَّةٍ، وَلَيْسَ مِنَّا مَنْ قَاتَلَ عَصَبِيَّةً، وَلَيْسَ مِنَّا مَنْ مَاتَ عَلٰى عَصَبِيَّةٍ۔" (ابوداؤد۔جبیر بن معطمؓ)

273. మహాప్రవక్త ఇలా సెలవిచ్చారు: "ఎవరు దురభిమానం వైపునకు ఆహ్వానిస్తాడో, అతను మాలోని వాడుకాడు. పక్షపాతం ఆధారంగా పోరాడతాడో ఎవరు పక్షపాత బుద్ధితో అంతమవుతాడో అతను కూడా మాలో ఒకడు కాలేడు." (అబూదావూద్ - జుబైర్ బిన్ మోతమ్)

---

దురభిమానంగా పరిగణించబడుతుంది. అలాంటి దురభిమానానికి దూరంగా ఉండమని ఈ హదీసు బోధిస్తుంది.

272. అన్యాయానికి అధర్మానికి తోడ్పడటమంటే, ఆత్మహత్యా సదృశమని ఈ హదీసు చాటుతుంది. ప్రపంచంలో ఆ 'ఆత్మహత్య' లేక నష్టం గోచరించకపోయినా పరలోకంలో మాత్రం అది తప్పనిసరిగా ఎదురవుతుంది.

273. మాలోని వ్యక్తి అంటే ముస్లిం అని అర్థం.

పక్షపాతం అంటే 'ధర్మంపై ఉన్నా అధర్మంపై ఉన్నా నా వారు నావారే' అనే దురభిమానం అన్నమాట. అందుచేత ఇలాంటి దృక్పథం వైపుకు పిలుపు నివ్వటం, దాని ఆధారంగా పోరాడటం ఇదే బుద్ధితో మరణమొందడం ముస్లిములకు ఎంతమాత్రం తగదు. జాతి, మతం, వంశం, వర్ణం, వర్గం ఇత్యాది విషయాల ప్రాతిపదికగా ఏర్పడే దురభిమానానికి, మరే విధమయిన దురభిమానానికయినా సరే, ఇస్లాంలో చోటు లేదు. ఒకవేళ ఎవరయినా ఇలాంటి దురభిమానానికి తావిస్తే అతడు ముస్లిం కాజాలడు.

# ముఖస్తుతి

۲۷۴ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْـهِ وَسَـلَّمَ: "إِذَا رَأَيْـتُمُ الْمَدَّاحِيْنَ فَاحْثُوْا فِيْ وُجُوْهِهِـمُ التُّرَابَ." (مسلم۔ مقدادؓ)

274. దైవ సందేశహరుడు (సఅసం) ఇలా బోధించారు : "ముఖ స్తుతులు చేసేవారిని చూస్తే వారి ముఖాన ఇంత మన్ను వేయండి."

(ముస్లిమ్ - మిక్ దాద్)

۲۷۵ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْـهِ وَسَـلَّمَ: "إِذَا مُدِحَ الْفَاسِقُ غَضِبَ الرَّبُّ تَعَالٰى وَاهْتَزَّ لَـهُ الْعَرْشُ." (مشکوٰۃ۔ انسؓ)

275. మహాప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు : 'ఫాసిక్'ని పొగడినప్పుడు అల్లాహ్‌కు ఆగ్రహం కలుగుతుంది. 'అర్ష్' కంపిస్తుంది."

(మిష్కాత్ - అనస్)

۲۷۶ عَنْ أَبِيْ بَكْرَةَ قَالَ أَثْنٰى رَجُلٌ عَلٰى رَجُلٍ عِنْدَ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْـهِ وَسَـلَّمَ فَقَالَ: "وَيْلَكَ، قَطَعْتَ عُنُقَ أَخِيْكَ." ثَلَاثًا، مَنْ كَانَ مِنْكُمْ مَادِحًا لَامَحَالَـةَ، فَلْيَقُلْ: أَحْسَبُ فُلَانًا وَاللّٰهُ حَسِيْبُهُ إِنْ كَانَ يَرٰى أَنَّـهُ كَذَالِكَ وَلَا يُزَكِّيْ عَلَى اللّٰهِ أَحَدًا." (بخاری۔ مسلم)

276. అబూబక్ర్ ఇలా ఉల్లేఖించారు, 'మహాప్రవక్త సమక్షంలో ఒక వ్యక్తి మరో వ్యక్తిని ప్రశంసించాడు, ఆయన "అయ్యో, నీవు నీ సోదరుని మెడ

---

274. ముఖస్తుతులు చేసేవారంటే ముఖస్తుతులు చేయడమే తమ వృత్తిగాగలవారని అర్థం. మన సమాజంలో భట్రాజులవంటి వారన్నమాట. ఒక వ్యక్తిని అతిశయ వాక్కులతో పొగడి ఏదయినా రాబట్టడమో లేక తమ కార్యసిద్ధికై ప్రయత్నించడమో వారి ఉద్దేశ్యమయి ఉంటుంది. ఇలాంటి వారిపట్ల జాగ్రత్తగా మెలిగి పొగడ్తల మాయకు లోనుకాకుండా ఉండాలి. వారి ముఖాన మన్ను పోయడమంటే వారిని వారి ఉద్దేశ్యంలో విఫలం చేయడమన్నమాట.

నరికావు" అని మూడు పర్యాయాలు పలికారు. తరువాత "మీలో ఎవరయినా మరొకరిని ప్రశంసించటం తప్పనిసరి అయితే, 'ఫలానా వ్యక్తి నా దృష్టిలో ఇలాంటివాడు, అల్లాహ్‌కే అన్నీ తెలుసు' అని పలకాలి. ఆ పొగడబడే వ్యక్తిని గురించి అతను వాస్తవంగా ఆ విధంగా భావిస్తేనే అలా అనాలి. కానీ, దైవస్తోత్రానికి సదృశంగా ఎవరినీ పొగడరాదు."

(బుఖారి - ముస్లిమ్)

## తప్పుడు సాక్ష్యం

۲۷۷ عَنْ خُرَيْمِ بْنِ فَاتِكٍ قَالَ: صَلَّىٰ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ صَلٰوةَ الصُّبْحِ، فَلَمَّا انْصَرَفَ قَامَ قَائِمًا، فَقَالَ: عُدِلَتْ شَهَادَةُ الزُّوْرِ بِالْإِشْرَاكِ بِاللّٰهِ ثَلَاثَ مَرَّاتٍ، ثُمَّ قَرَأَ: "فَاجْتَنِبُوا الرِّجْسَ مِنَ الْأَوْثَانِ وَاجْتَنِبُوْا قَوْلَ الزُّوْرِ - حُنَفَاءَ لِلّٰهِ غَيْرَ مُشْرِكِيْنَ بِهٖ -" (ابوداؤد)

277. ఖురైమ్ బిన్ ఫాతిక్ ఇలా ఉల్లేఖించారు: 'ఒక రోజు మహాప్రవక్త ఫజ్ర్ (ప్రాతఃకాలపు) ప్రార్థన చేశాక, వెనక్కి మరలి కూర్చోకుండా లేచి నిలబడ్డారు. "అబద్ధపు సాక్ష్యం పలకడమూ, ఇతరుల్ని అల్లాహ్ సహవర్తులుగా భావించడమూ రెండూ సమానమయిన అపరాధాలే" అని

---

275. "అర్షె" అంటే దైవాసనానికి సంకేత పదం. కంపించడమంటే ఆగ్రహిస్తుందని భావం. ఈ వాక్యానికి దైవాగ్రహం కలుగుతుందని అర్థం.

దైవాదేశాలను బాహాటంగా ధిక్కరించేవాడు 'ఫాసిక్'. అతడు ఎలాంటి గౌరవ మర్యాదలకు అర్హుడు కాడు. అతన్ని హీనంగా చూసి అతనికి తగిన బుద్ధి చెప్పడమే సమంజసం. అలాంటి వ్యక్తులకు సమాజంలో గౌరవం లభిస్తుందంటే మనుషుల్లో దైవం, ధర్మం పట్ల ప్రేమాభిమానాలు గౌరవాదరణలు అంతరించాయన్న మాట. ఇలాంటి సమాజంపై దైవాగ్రహం కాక అనుగ్రహం వర్షిస్తుందా?

276. మహాప్రవక్త సమక్షంలో ఆ వ్యక్తిలోని దైవభక్తి, దైవభీతులను పొగడి ఉంటారు. ఇలాంటి పరిస్థితిలో మనిషిలో నలుగురి మెప్పు పొందే వాంఛ బలపడే ప్రమాదం ఉంది. ఈ ప్రదర్శనాబుద్ధి ఏర్పడితే ఇక మనిషిచేసే కార్యాల్లో చిత్తశుద్ధి లోపిస్తుంది. ఇది ఆధ్యాత్మికంగా అతని సర్వనాశనానికి దారితీస్తుంది. అదేమాట అన్నారు

మూడుసార్లు చెప్పారు. తరువాత ఇలా పఠించారు: "విగ్రహాల అశుద్ధత నుండి దూరంగా మెలగండి, అబద్ధపు పలుకులను ఏ మాత్రం సమీపించకండి. అల్లాహ్ వైపు ఏకదీక్షతో మరలి, బహుదైవారాధనను త్యజించి ఏకేశ్వరోపాసనను అవలంబించండి." (అబూదావూద్)

## అపహాస్యం

۲۷۸ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : "لَا تُمَارِ أَخَاكَ وَلَا تُمَازِحْهُ وَلَا تَعِدْهُ مَوْعِدًا فَتُخْلِفَهُ -" (ترمذی - ابن عباسؓ)

278. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు: "నీ సోదరునితో వివాదానికి దిగకు, అతనితో పరాచికాలాడకు, అతనికి మాట ఇచ్చి తప్పుకోకు." (తిర్మిజి - ఇబ్ను అబ్బాస్)

۲۷۹ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : إِذَا وَعَدَ الرَّجُلُ أَخَاهُ وَمِنْ نِيَّتِهٖ أَنْ يَّفِيَ لَهٗ فَلَمْ يَفِ وَلَمْ يَجِئْ لِلْمِيْعَادِ فَلَا إِثْمَ عَلَيْهِ - (ابوداؤد - زید بن ارقمؓ)

279. దైవప్రవక్త ఇలా ప్రవచించారు : "మనిషి తన సోదరునికి వాగ్దానం చేసేటప్పుడు దాన్ని నమ్మకంగా నిర్వర్తించే సంకల్పమే ఉంటే, ఆ వాగ్దానాన్ని పూర్తి చేయలేకపోయినా, సకాలంలో అతన్ని చేరుకోలేక పోయినా ఇందులో దోషం లేదు." (అబూదావూద్ - జైద్ బిన్ అర్కమ్)

---

మహాప్రవక్త (సఅసం). ఇంకా ఏ కారణం వల్లనయినా ప్రశంసించడం అనివార్యమయితే నేనతన్ని మంచివాడని భావిస్తున్నాననే భావం ద్యోతకమయ్యేలా ప్రశంసావాక్కులు పలకాలి. అతిశయ వాక్కులు, భట్రాజు పొగడ్తలు ఎట్టిపరిస్థితిలోనూ నోటికి రాకూడదు. ఇలాగే ఒకరి మంచి తనానికి మురిసిపోయి 'ఇతను స్వర్గవాసి' అని దైవ సమానుడనీ 'పూజ్యుడు' అని, దైవాంశ సంభూతుడని 'వలీ' అనీ ఇంకా ఇలాంటి మరే పదాలతోనయినాసరే జీవించి వున్న వారిని, లేక మృతులను, ఎవరినీ పొగడ కూడదు.

277. మహాప్రవక్త దివ్య ఖుర్ఆన్‌లో హజ్ సూరాలోని ఒక వాక్యం పఠించారు. "అబద్ధపు పలుకు" అనే ప్రయోగం ఉంది. అబద్ధపు పలుకు న్యాయస్థానంలో అధికారి

# తప్పులెన్నడం

٢٨٠ عَنْ عَائِشَةَ قَالَتْ ، قُلْتُ لِلنَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: حَسْبُكَ مِنْ صَفِيَّةَ كَذَا وَكَذَا ، تَعْنِيْ قَصِيْرَةً فَقَالَ : لَقَدْ قُلْتِ كَلِمَةً لَوْ مُزِجَ بِهَا الْبَحْرُ لَمَزَجَتْهُ۔ (مشکوٰۃ)

280. హజ్రత్ ఆయిషా (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : 'నేనొకసారి మహా ప్రవక్త (సఅసం)తో సఫియా (రజి)లో ఉన్న యీ లోపాలేచాలు, ఆమె పొట్టిది' అని అన్నాను. దానికి మహాప్రవక్త (సఅసం) "ఆయిషా! నీవు పలికిన మాట ఎంత మలినమైనదంటే, దాన్ని సముద్రంలో రంగరిస్తే సముద్రమంతా కలుషితమయిపోతుంది" అని బాధతో అన్నారు'.

(మిష్కాత్)

---

ముందు పలికినా మరెక్కడ పలికినా మహాపాతకమే. అది దేవుని ఏకత్వాన్ని కాదని కాల్పనిక దేవుళ్ళను ఆరాధించిన దానితో సమనమయిన అపరాధంగా అభివర్ణించడం జరిగింది. అలాంటి మహాపరాధాన్ని నేడు "నేర్పు"గా పరిగణించడం జరుగుతోంది. నేటి సమాజంలో ఈ "నేర్పు" లేని వాడు, తన విశ్వాస ప్రోద్బలంతో న్యాయస్థానం లోనయినా మరెక్కడయినా సరే నిజం పలకడానికి ధైర్యంగా ముందుకువచ్చేవాడు వట్టి బడుద్ధాయిగా ఎంచబడుతున్నాడు.

278. వాగ్వివాదంలో ఎదుటి వ్యక్తిని చిత్తు చేయడమే అసలు ధ్యేయంగా ఉంటుంది. మృదువుగా చిత్తశుద్ధితో పరస్పర అవగాహన కొరకు సామాన్యంగా వాగ్వివాదం జరగదు. హదీసులో పరాచికాలాడటం నిషేధించడం జరిగిదంటే దానికి ఎదుటి వానిని నొప్పించే ఉద్దేశ్యంతో, అతన్ని కించపరిచే ఉద్దేశ్యంతో అతడు నలుగురిలో పరాభవం పొందేలా చేసే పరాచికాలని భావం. మృదువయిన, కేవలం హాస్యరస ప్రధానమయిన పరాచికాలు నిషిద్ధం కావు. అయితే నిషిద్ధమయిన పరాచికా లకు తేలికగా హాయిగా అందరూ నవ్వుకునే హాస్యానికి తేడా బహుస్వల్పం. అందువల్ల చాలా జాగ్రత్తగా ఉండాలి.

279. ఇందులో సంకల్పానికే ప్రాధాన్యం ఇవ్వటం జరిగింది. చేసే వాగ్దానం సంకల్ప శుద్ధితో చేస్తే ఏ కారణం వల్లనయినా కార్యరూపంగా దాన్ని నిర్వర్తించలేకపోయినా, నిర్ణీత సమయానికి ఫలానాచోట వచ్చి కలుస్తానని చెప్పి కలువలేక పోయినా విశ్వప్రభువు, మానస స్థితిని ఎరిగినవాడే కనుక, అది తప్పుగా ఎంచబడదు. కాని మొదట్లోనే, వాగ్దానం చేసేటప్పుడే, అసలు దాన్ని నెరవేర్చే ఉద్దేశ్యమే లేకపోతే అది

# వదంతుల్ని వ్యాపింపజెయ్యడం

۲۸۱ عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ: إِنَّ الشَّيْطٰنَ لَيَتَمَثَّلُ فِيْ صُوْرَةِ الرَّجُلِ فَيَأْتِي الْقَوْمَ فَيُحَدِّثُهُمْ بِالْحَدِيْثِ مِنَ الْكَذِبِ فَيَتَفَرَّقُوْنَ، فَيَقُوْلُ مِنْهُمْ: سَمِعْتُ رَجُلًا أَعْرِفُ وَجْهَهٗ وَلَا أَدْرِيْ مَا اسْمُهٗ يُحَدِّثُ۔ (مسلم)

281. ఇబ్ను మస్ఊద్ ఇలా బోధించారు : "షైతాన్ మనిషి రూపంలో వ్యవహరిస్తూ ఉంటాడు. వాడు ప్రజల్లోకి వచ్చి కల్లబొల్లి కబుర్లు చెబుతాడు. తరువాత మనుషులు వేరయిపోతారు. అప్పుడు వారిలో ఒకతను (ఆ మాటను మరొక చోట వినిపించి) 'నేనీ మాటను ఒక వ్యక్తి చెప్పగా విన్నాను కాని అతని పేరు మాత్రం నాకు తెలియదు' అనంటాడు."

(ముస్లిమ్)

---

మహాపరాధం. కేవలం ఎదుటి మనిషి మాటను తీసెయ్యలేక వాగ్దానం చెయ్యటం తప్పు అని తెలుస్తోంది.

280. హజ్రత్ ఆయిషా (రజిఅన్) హజ్రత్ సఫియా గార్లు మహాప్రవక్త సతీమణులు. సాధారణంగా మహాప్రవక్త అర్ధాంగులు తాము సవతులయినా ఎంతో అన్యోన్యంగా ఉండే వారు. కాని ఎప్పుడయినా మానవ సహజమయిన బలహీనతవల్ల ఏదయినా పొరపాటు జరిగిపోయేది. అలాంటిదే ఒక తప్పు హజ్రత్ ఆయిషా (రజిఅన్) చేశారు. మహాప్రవక్త దృష్టిలో తన సవతి సఫియా (రజి) పట్ల చులకన భావం సృష్టించడానికి ఆమె పొట్టితనాన్ని ప్రస్తావించారు హజ్రత్ ఆయిషా. ఆయన వినగానే నొచ్చుకున్నారు. అది ఎంతో చెడ్డమాట అని ఆమెకు ప్రబోధించారు. అందువల్లనే హజ్రత్ ఆయిషా ఆ తరువాత మరెప్పుడూ అలాంటి తప్పు చేయలేదు.

మహాప్రవక్త అనుచరుల్లోని విశిష్టత అదే – ఒక్కసారి ఏదయినా విషయాన్ని వారిస్తే ఆ తప్పు మరే నాటికీ చేయరు.

ఈ హదీసు ద్వారా తెలిసే మరొక విషయమేమిటంటే మహాప్రవక్త తన ప్రియమయిన అర్ధాంగి కూడా తప్పు చేస్తే, సవతి ద్వేషం మానవ సహజమే అయినా, దానికి తన అయిష్టతను వ్యక్తం చెయ్యడంలో ఏ మాత్రం జాగు చేయలేదు అన్నది.

281. ఇందులో, ఏ మాటనైనా ఆరా తీయకుండా విన్నది విన్న పళంగా మరొకరితో తెలుపడంగురించి వారించటం జరిగింది. ఎందుకంటే, ఆ మాట తనతో చెప్పినవాడు

# చాడీలు

٢٨٢ عَنْ حُذَيْفَةَ قَالَ، قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ:
"لَا يَدْخُلُ الْجَنَّةَ نَمَّامٌ". (بخاری۔مسلم)

282. హజ్రత్ హుజైఫా (రజిఅన్) ఇలా తెలిపారు : 'మహాప్రవక్త (సఅసం) "చాడీలు చెప్పేవానికి స్వర్గ ప్రవేశం లభించదు" అని చెప్పారు'.
(బుఖారి, ముస్లిమ్)

٢٨٣ عَنِ ابْنِ عَبَّاسٍ أَنَّ رَسُولَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ
مَرَّ بِقَبْرَيْنِ فَقَالَ: إِنَّهُمَا يُعَذَّبَانِ - وَمَا يُعَذَّبَانِ فِي كَبِيْرٍ، بَلٰى
إِنَّهُ كَبِيْرٌ، أَمَّا أَحَدُهُمَا فَكَانَ يَمْشِي بِالنَّمِيْمَةِ، وَأَمَّا الْآخَرُ
فَكَانَ لَا يَسْتَبْرِئُ مِنْ بَوْلِهِ - (بخاری)

283. అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : 'మహాప్రవక్త (సఅసం) ఒకసారి రెండు గోరీల సమీపంగా పోతూ "వీరిద్దరినీ శిక్షించడం జరుగుతోంది. కాని ఈ శిక్ష వారు చేసిన ఏ గొప్ప నేరానికో కాదు. అయితే దాన్ని చేయడం మహాపరాధమే. వారిలో ఒకడు చాడీలు చెప్పేవాడు. రెండవ వ్యక్తి తన మూత్రం తుంపరలనుండి తప్పించుకునే వాడు కాడు" అని పలికారు. (బుఖారి)

---

అబద్ధమే చెప్పి ఉండవచ్చు, షైతాన్ కావచ్చు. సమాజంలో ఇలాంటి పుకార్లకు చోటు లభిస్తే పర్యవసానాలు ప్రమాదకరంగా తేలవచ్చు. అందువల్ల ఆ మాట చెప్పిన వ్యక్తిని గురించి, ఆ మాటను గురించి బాగా విచారించి మరీ ఇతరులకు చెప్పాలి.

282. చాడీలు చెప్పేవాడు పలికేవి కొన్ని మాటలే. అయినా అతడు కొందరి అంతర్యాల్లో విద్వేషాగ్నిని రేపుతాడు. మనసుల్లో మలినాగ్నిని నింపుతాడు. ఒక్కోసారి అతని ఈ చర్యవల్ల సమాజంలోనే అల్లకల్లోలం జనించే ప్రమాదం కూడా లేకపోలేదు. అందుకే ఈ "చిన్న" తప్పువల్ల కూడా మనిషి స్వర్గ ప్రవేశానికి అనర్హుడుగా పరిగణించ బడటంలో అన్యాయమే లేదు.

283. "గొప్ప నేరానికి కాదు" అంటే వారు ఆ చిన్న నేరాలు చెయ్యకుండా

٢٨٤ عَنِ ابْنِ عُمَرَ قَالَ: "نَهٰى رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنِ النَّمِيْمَةِ وَنَهٰى عَنِ الْغِيْبَةِ وَالْاِسْتِمَاعِ إِلَى الْغِيْبَةِ -

(رياض الصّالحين)

284. ఇబ్ను ఉమర్ (రజి) "చాడీలు చెప్పటం, పరోక్షనింద మోపడం, పరోక్ష నింద వినడం అన్నింటినీ దైవప్రవక్త (సఅసం) నిషేధించారు" అని తెలిపారు. (రియాజుస్సాలిహీన్)

## ఈర్ష్య

٢٨٥ عَنْ أَبِيْ هُرَيْرَةَ أَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: إِيَّاكُمْ وَالْحَسَدَ، فَإِنَّ الْحَسَدَ يَأْكُلُ الْحَسَنَاتِ كَمَا تَأْكُلُ النَّارُ الْحَطَبَ - (ابوداؤد)

285. మహాప్రవక్త ప్రవచనం: "మిమ్మల్ని మీరు ఈర్ష్య నుండి రక్షించుకోండి, ఎందుచేతనంటే, నిప్పు కట్టెల్ని భస్మీపటలం చేసినట్లే ఈర్ష్య సత్కార్యాల్ని స్వాహా చేస్తుంది." (అబూదావూద్ - అబూహురైరా)

---

తప్పించుకోవడం అంతకష్టమైన పని కాదు అని భావం. చాడీలు చెప్పడం ద్వారా వాస్తవానికి మనిషి సాధించేది ఏమీ లేదు. కేవలం క్షణికమైన భౌతికప్రయోజనం తప్ప. రెండవ తప్పు కేవలం అజాగ్రత్త నిర్లక్ష్య భావంవల్ల జరుగుతుంది. మనిషి శుచి శుభ్రతల పట్ల జాగరూకుడయి మెలిగితే వంటిపైనా బట్టలపైనా తన మూత్రం తుంపర పడకుండా జాగ్రత్తపడగలడు. ఆ తప్పు జరిగే ఆస్కారముండదు. శుచికి ఇస్లాంలో ఎంత ప్రాముఖ్యత ఉందో దాన్ని పాటించకపోవడం ఎలాంటి పరిణామానికి దారితీస్తుందో ఈ హదీసు బోధిస్తుంది.

284. కేవలం పరోక్ష నింద మోపడమే కాదు దాన్ని వినడం కూడా పాతకమే అని తెలుస్తోంది. అలాంటి సంభాషణ జరుగుతున్నప్పుడు దాన్ని వారించటం అవసరం. అది సాధ్యం కాదని భావిస్తే అక్కణ్ణుంచి లేచి వెళ్ళిపోవడం సమంజసం.

285. ఈర్ష్యవల్ల మనిషి దహించుకుపోవడమే కాక అతని శక్తులన్ని ఆ అగ్నికి ఆహుతి అవుతాయి. ఆ పరిస్థితిలో మనిషి సత్కార్యాలే కాదు, మరే కార్యాలూ కూడా

# చెడు చూపు

٢٨٦ عَنْ جَرِيرِ بْنِ عَبْدِ اللّٰهِ قَالَ : سَأَلْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَنْ نَظَرِ الْفُجَاءَةِ فَقَالَ : "اصْرِفْ بَصَرَكَ." (مُسْلِم)

286. జరీర్ బిన్ అబ్దుల్లా ఇలా ఉల్లేఖించారు : 'నేను మహాప్రవక్త (సఅసం)ను, పరస్త్రీపైన అకస్మాత్తుగా దృష్టి పడడాన్ని గురించి అడిగాను. అప్పుడు "పరస్త్రీ మీద నీ చూపు ఆనక పూర్వమే నీవు దృష్టిని మరల్చుకో" అని మహాప్రవక్త బోధించారు.' (ముస్లిమ్)

٢٨٧ عَنْ بُرَيْدَةَ قَالَ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: لِعَلِيٍّ: "يَا عَلِيُّ، لَا تُتْبِعِ النَّظْرَةَ النَّظْرَةَ، فَإِنَّمَا لَكَ الْأُوْلَى وَلَيْسَتْ لَكَ الْآخِرَةُ."

287. బురీదా (రజి) ఇలా ఉల్లేఖించారు, 'మహాప్రవక్త (సఅసం) హజ్రత్ అలీకు "అలీ! పరస్త్రీపై అకస్మాత్తుగా దృష్టిపడితే దృష్టిని మరల్చుకో, రెండవసారి దృష్టి సారించకు, మొదటి చూపు నీదే కాని రెండవది నీది కాదు (అది షైతాన్ చూపు) అని ఉపదేశించారు."

---

చెయ్యలేడు. అందువల్లనే ఈర్ష్య నుండి దూరంగా మసలు కోవాలని ప్రియ ప్రవక్త (సఅసం) బోధించారు. ఈర్ష్యను దూరం చేసుకునేందుకు తనకు ఉన్న దానిపట్ల తృప్తి చెందటం మనిషి అలవరుచుకోవాలి.

286. అంటే బజారున నడిచేటప్పుడు, ప్రయాణంలోనూ, దృష్టి పరస్త్రీలపై యాదృచ్ఛికంగా పడటం సహజమే. అయితే ఆ యాధృచ్ఛిక దృష్టిని ఐచ్ఛికంగా మార్చుకోకుండా మళ్ళించుకోవాలి అని అర్థం.

287. రెండవ చూపు షైతాన్ చూపు అంటే, అది కాకతాళీయంగా పడ్డ తొలిచూపు కాదు. పరస్త్రీని చూచేందుకు షైతాన్ పురికొల్పగా అటువైపు ఆనిన చూపు. అందువల్లనే అది షైతాన్ చూపు. రెండవసారి పరాయి స్త్రీపై చూపు ఆనించడం అంటే షైతాన్ ఆదేశాలకు తలొగ్గడమన్నమాట. షైతాన్ మార్గం నేరుగా నరకానికే పోతుంది అన్న విషయంలో సందేహం లేదు.

# ఉత్తమ గుణాలు
## సద్వర్తన

٢٨٨ إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: بُعِثْتُ لِأُتَمِّمَ حُسْنَ الْأَخْلَاقِ - (موطا امام مالك)

288. "నైతికతను దాని ఉత్తమోత్తమ ప్రమాణానికి చేర్చడానికి నన్ను ప్రభవింప జేయటం జరిగింది." అని దైవప్రవక్త ప్రవచించారు.
(ముఅత్తా ఇమామ్ మాలిక్)

٢٨٩ عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ: لَمْ يَكُنْ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَاحِشًا وَّلَا مُتَفَحِّشًا، وَكَانَ يَقُوْلُ: "إِنَّ مِنْ خِيَارِكُمْ اَحْسَنَكُمْ اَخْلَاقًا" (بخاری۔مسلم)

289. హజ్రత్ అబ్దుల్లాబిన్ అమ్ర్ బిన్ అల్ ఆస్ (రజి) ఇలా తెలిపారు: 'మహాప్రవక్త అశ్లీలమయిన మాటను పలికేవారు కాదు, అశ్లీల మయిన పని చేసేవారుకాదు, ఇతరులతో దుర్భాషలాడేవారు కాదు. "నైతికంగా ఎవరు మంచివారో వారే మీలో గొప్ప వారు!"అని బోధించే వారు.'
(బుఖారి–ముస్లిమ్)

---

288. అంటే ఆయన దైవదౌత్యానికి లక్ష్యం, జనుల గుణగణాలను, వ్యవహారాలను చక్కదిద్దడం, వారిలోని దుర్గుణాలను దూరం చెయ్యడం, వాటిస్థానే సద్గుణాలను పెంపొందింప చెయ్యడం అని అర్థం. ఈ 'శుద్ధి' కార్యక్రమమే ఆయన ఆవిర్భావానికిగల ఉద్దేశ్యం. దేవుని కడపటి సందేశహరుడు ముహమ్మద్(సఅసం) తన మాటలతో, చేత లతో ఈ సద్గుణాల జాబితాను ఆచరణా నియమావళిని పొందుపరచారు. వాటిని మానవ జీవన రంగాలన్నిటిలో జీవితకాలమంతా అమలుపరచాలనీ, ఎటువంటి పరిస్థితిలోనూ వాటిని వదలకూడదనీ ఆదేశించారు. అందువల్లనే మహాప్రవక్త (సఅసం) తన బోధల ద్వారా ఆచరణద్వారా చూపెట్టిన నైతికతకు మించిన సద్వర్తన

۲۹۰ عَنْ مُّعَاذٍ قَالَ: كَانَ اٰخِرَ مَا وَصَّانِيْ بِهٖ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ حِيْنَ وَضَعْتُ رِجْلِيْ فِي الْغَرْزِ أَنْ قَالَ: يَا مُعَاذُ، "اَحْسِنْ خُلُقَكَ لِلنَّاسِ." (موطا امام مالك)

290. హ|జత్ ముఆజ్ (రజి) ఇలా ఉల్లేఖించారు: 'నన్ను ఎమన్ (గవర్నరుగా) పంపేటప్పుడు గు|ర్రపు రికాబుపై కాళ్ళు మోపుతుండగా మహా|ప్రవక్త (సఅసం) చేసిన చివరి ఉపదేశం-"ముఆజ్! |ప్రజల ఎడల స|ద్ప్రవర్తనతో మెలుగు" అన్నది.' (ముఅత్తా ఇమామ్ మాలిక్)

## సౌమ్యం, హుందాతనం

۲۹۱ اِنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "لِأَشَجِّ عَبْدِ الْقَيْسِ اِنَّ فِيْكَ لَخَصْلَتَيْنِ يُحِبُّهُمَا اللّٰهُ: اَلْحِلْمُ وَالْأَنَاةُ." (مسلم-ابن عباسؓ)

291. మహా|ప్రవక్త (సఅసం), అబ్దుల్ కైస్ తెగ |ప్రతినిధి వర్గ నాయకుడయిన అషజ్‌ను సంబోధించి ఇలా అన్నారు, నీలో రెండు సద్గుణాలున్నాయి. అవి అల్లాహ్‌కు ఎంతో ఇష్టమయినవి. అవి సహనం, సౌమ్యం." (ముస్లిమ్ - ఇబ్ను అబ్బాస్)

---

వేరేలేదని |ప్రపంచమే సాక్ష్యం పలుకుతుంది. 'సద్గుణం' అనే దేదయినా ఉంటే అది మహా|ప్రవక్త జీవితంలో కానవచ్చినదే. దీన్ని మరో విధంగా చెప్పాలంటే మహా|ప్రవక్త జీవితం ద్వారా మనకు ఒక విషయం తెలిసిందంటే దానికి మించిన ఉత్తమ నైతిక పంథా, మంచి నడత వేరే లేదని తెలుసుకోవాలి.

సద్గుణం అంటే ఏమిటి? అనే విషయాన్ని అబ్దుల్లా ఇబ్ను ముబారక్

"هُوَ طَلَاقَةُ الْوَجْهِ وَبَذْلُ الْمَعْرُوْفِ وَكَفُّ الْأَذٰى."

"చిరునవ్వు చిందులాడే మోముతో పలకరించడం, అవసరమయిన చోట ధనం ఖర్చుచేయడం, ఎవరికీ కష్టం కలిగించకపోవడం" అని విశదీకరించారు. ఈ మూడు శీర్షికల్లో ఎన్ని విషయాలు ఇమిడి ఉన్నాయో తాపీగా ఊహించుకుంటే సరి!

289. దీని ద్వారా తెలిసేదేమంటే మహా|ప్రవక్త (సఅసం) బోధించిన ధర్మం ఇస్లాంలో నైతికతకే |ప్రాధాన్యం. ఆయన మలచిన సమాజంలో రాజ్యమేలేవి రాజకీయ

# పరిశుభ్రత, నిరాడంబరత

۲۹۲ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "اِنَّ الْبَذَاذَةَ مِنَ الْإِيْمَانِ۔" (ابوداؤد - ابوامامہؓ)

292. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారుః "నిరాడంబరంగా జీవితం గడపటం కూడా విశ్వాసంలోని ఒక భాగమే."

(అబూదావూద్ - అబూ ఉమామ)

۲۹۳ عَنْ جَابِرٍ قَالَ: أَتَانَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ زَائِرًا، فَرَأَى رَجُلًا شَعِثًا قَدْ تَفَرَّقَ شَعْرُهُ، فَقَالَ: "مَا كَانَ يَجِدُ هٰذَا مَا يُسَكِّنُ رَأْسَهُ؟ وَرَأَى رَجُلًا عَلَيْهِ ثِيَابٌ وَّسِخَةٌ، فَقَالَ: "مَا كَانَ يَجِدُ هٰذَا مَا يَغْسِلُ بِهٖ ثَوْبَهٗ۔" (مشكوٰة)

293. హజ్రత్ జాబిర్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారుః 'ఒకరోజు మహా ప్రవక్త, చూసిపోదామని మా ఇంటికి వచ్చారు. అక్కడ ఒక వ్యక్తి ధూళి నిండిన ముఖంతో, సంస్కారహీనమైన జుత్తుతో కనబడ్డాడు. ఆయన

---

ఎత్తుగడలు, ధనరాసులు, నిరుపయోగకరమయిన వైజ్ఞానిక విషవలయాలు కావు. అక్కడ నీతి, నిజాయితీకే పట్టాభిషేకం.

290. ఒక గవర్నర్ ఆనాటి దేశాధినేత, ప్రియతమ నాయకుడు ఇచ్చిన అంతిమ ఆదేశం ఏమిటో గమనార్హం. ఆ ఆదేశం ఎంత ముఖ్యమయింది కాకపోతే మహాప్రవక్త (సఅసం) హజ్రత్ ముఆజ్ (రజిఅన్) కదలబోతున్న ఘడియలో చెప్పి ఉంటారు? ఋజువర్తనమే ఇస్లాంకు పునాదిరాయి అన్న దానికి ఈ హదీసు కూడా ఒక నిదర్శనం.

291. అబ్దుల్ ఖైస్ తెగ నుండి వచ్చిన ప్రతినిధి వర్గంలోని వారంతా మదీనా చేరగానే మహాప్రవక్తను సందర్శించడానికి తొందరపడి వచ్చిన పళాన అలాగే ఆయన వద్దకు వచ్చి చేరారు. దూరం నుండి రావడంచేత ధూళి, దుమ్ము నిండి ఉన్నప్పటికీ తమ సామానునయినా సరిగ్గా సర్దుకోలేదు. స్నానాదులూ కానివ్వలేదు. కాని దీనికి భిన్నంగా వారి నాయకుడు ఇలా తొందరపాటు చూపలేదు. నెమ్మదిగా సామానంతా సరిగ్గా సర్ది వాహనాలకు మేత, నీరు పెట్టి, స్నానాదులు ముగించుకుని హుందాగా, గౌరవవంతంగా వచ్చి సందర్శించాడు.

(సఅసం), "ఈ వ్యక్తి వద్ద దువ్వెన లేదా తల దువ్వుకోడానికి?" అని అడిగారు. ఆ తరువాత అపరిశుభ్రమైన బట్టలు కట్టుకున్న మరో వ్యక్తిని చూసి "ఇతని వద్ద సబ్బు లేదా బట్టలు ఉతుక్కోడానికి?" అని ప్రశ్నించారు.' (మిష్కాత్)

۲۹۴ كَانَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فِي الْمَسْجِدِ، فَدَخَلَ رَجُلٌ ثَائِرَ الرَّأْسِ وَاللِّحْيَةِ، فَأَشَارَ إِلَيْهِ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ بِيَدِهِ كَأَنَّهُ يَأْمُرُهُ بِإِصْلَاحِ شَعْرِهِ وَلِحْيَتِهِ فَفَعَلَ ثُمَّ رَجَعَ، فَقَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "أَلَيْسَ هٰذَا خَيْرًا مِّنْ أَنْ يَّأْتِيَ أَحَدُكُمْ وَهُوَ ثَائِرُ الرَّأْسِ كَأَنَّهُ شَيْطٰنٌ" (مشكوٰة ـ عطاء بن يسارؒ)

294. మహాప్రవక్త మస్జిద్‌లో ఉపవిష్ఠులయి ఉండగా ఒక వ్యక్తి ప్రవేశించాడు. అతని తలవెంట్రుకలు, గడ్డం, అంతా చిందర వందరగా ఉన్నాయి. అప్పుడు మహాప్రవక్త, వెళ్ళి తల, గడ్డం సరిగ్గా దువ్వుకు రమ్మని తన చేత్తో సంజ్ఞ చేశారు. అతను అలాగే వెళ్ళి అంతా సంస్కరించుకుని వచ్చాడు. అప్పుడు ఆయన "ఇది బాగుండ లేదా - తల వెంట్రుకలు చిందరవందరగా ఉండి మనిషి ఓ షైతానులా కనబడటంకంటే?" అని అన్నారు. (మిష్కాత్ - అతా బిన్ యసార్)

---

సహనం అంటే అన్ని పనులు నెమ్మదిగా, లక్షణంగా, వేగిరపాటు, ఆవేశం, ఉద్రేకాలకు లోనుకాకుండా చెయ్యడమన్నమాట. సౌమ్యం అన్న దానిలో హుందాతనంతో, గౌరవంగా మెలగడం కూడా చేరి ఉన్నాయి.

292. నిరాడంబరంగా జీవితం గడపటం విశ్వాసి గుణగణాల్లో ఒకటి అన్నమాట. ఎందుచేతనంటే విశ్వాసికి తన పరలోక జీవితాన్ని చక్కదిద్దుకునే చింతే నిరంతరం ఆవహించి ఉంటుంది. అతనికి ప్రాపంచిక ఆడంబరాలు, అలంకరణల పట్ల అంతగా పట్టింపు ఉండదు.

293. నిరాడంబరంగా అంటే బైరాగుల్లా ఉండడమని భావం కాదు. పరిశుభ్రంగా, హుందాగా గౌరవవంతంగా లేని పోని ఫ్యాషన్లకు పోకుండా ఉండాలన్నదే దాని భావం.

294. మహాప్రవక్త పరిశుభ్రతను, సంస్కారవంతంగా కనిపించడాన్ని ఎంతగా

۲۹۵ عَنْ أَبِي الْأَحْوَصِ عَنْ أَبِيهِ قَالَ: أَتَيْتُ رَسُولَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ وَعَلَيَّ ثَوْبٌ دُونٌ فَقَالَ لِي: "أَلَكَ مَالٌ؟" فَقُلْتُ: نَعَمْ قَالَ: "مِنْ أَيِّ الْمَالِ؟" فَقُلْتُ: مِنْ كُلِّ الْمَالِ، قَدْ أَعْطَانِيَ اللهُ مِنَ الْإِبِلِ وَالْبَقَرِ وَالْغَنَمِ وَالْخَيْلِ وَالرَّقِيقِ - قَالَ: "فَإِذَا آتَاكَ مَالًا فَلْيُرَ أَثَرُ نِعْمَةِ اللهِ عَلَيْكَ -" (مشكوٰة)

295. అబుల్ అహ్వస్ తన తండ్రి ఇలా చెప్పినట్లు ఉల్లేఖించారు: "నేను ఒకసారి మహా ప్రవక్త వద్దకు వెళ్ళాను. అప్పుడు నా దేహంపైన ఉన్న బట్టలు ఎంతో సాధారణమయినవి. మహాప్రవక్త అడిగారు, "నీ వద్ద ధనముందా?" నేను "అవును, ఉంది" అన్నాను. "నీ వద్ద ఉన్నది, ఎలాంటి ధనం?" అనడిగారు ఆయన. "నావద్ద సమస్త ఐశ్వర్యాలున్నాయి. దేవుడు నాకు ఒంటెలు, గోవులు, మేకలు, గుర్రాలు ప్రసాదించాడు. ఇంకా సేవకులూ ఉన్నారు" అని బదులిచ్చాను. దానికి మహాప్రవక్త ఇలా సెలవిచ్చారు : "అల్లాహ్ నీకు ఐశ్వర్యం ప్రసాదించినప్పుడు ఆయన కృపానుగ్రహాల ప్రభావం నీ శరీరంపైన వ్యక్తమవ్వాలి కదా!"

(మిష్కాత్)

## సలాం

۲۹۶ إِنَّ رَجُلًا سَأَلَ رَسُولَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "أَيُّ الْإِسْلَامِ خَيْرٌ؟" قَالَ: "تُطْعِمُ الطَّعَامَ وَتَقْرَأُ السَّلَامَ عَلَى مَنْ عَرَفْتَ وَمَنْ لَّمْ تَعْرِفْ -" (بخاری ومسلم- عبداللہ بن عمر)

296. మహాప్రవక్తను ఒక వ్యక్తివచ్చి అడిగాడు, "ఇస్లామ్ బోధించే వాటిలో ఉత్తమ కార్యం ఏది?" అని. మహాప్రవక్త సమాధానంగా, "నిరుపేదలకు, లేని వారికి భోజనం పెట్టడం, అందరికి సలాం చేయడం- అతడు నీకు పరిచయమున్నా, లేకపోయినా" అని.

(బుఖారి, ముస్లిమ్ - అబ్దుల్లా బిన్ ఉమర్)

٢٩٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: لَا تَدْخُلُوْنَ الْجَنَّةَ حَتّٰى تُؤْمِنُوْا، وَلَا تُؤْمِنُوْا حَتّٰى تَحَابُّوْا، اَوَلَا اَدُلُّكُمْ عَلٰى شَيْءٍ اِذَا فَعَلْتُمُوْهُ تَحَابَبْتُمْ؟ اَفْشُوا السَّلَامَ بَيْنَكُمْ۔" (مسلم۔ابوھریرۃؓ)

297. దైవ ప్రవక్త ఇలా ప్రవచించారు : "మీరు మోమిన్ కానంతవరకు స్వర్గంలో ప్రవేశించలేరు. పరస్పరం ప్రేమాభిమానాలతో మెలగనంత వరకు మోమిన్‌లు కాలేరు. మీరు పరస్పరం ప్రేమ భావంతో మసలుకునే ఓ ఉపాయం తెలుపమంటారా? మీ మధ్య సలామ్‌ను విస్తృతం చేసుకోండి."
(ముస్లిమ్ - అబూహురైరా)

## నోటిపై నిఘా

٢٩٨ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ يَّضْمَنْ لِيْ مَا بَيْنَ لَحْيَيْهِ وَمَا بَيْنَ رِجْلَيْهِ اَضْمَنْ لَهُ الْجَنَّةَ۔"

(بخاری۔سھل بن سعدؓ)

298. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "ఎవరయితే తమ పెదాల మధ్య ఉన్నదాన్ని, ఊరువుల మధ్య ఉన్న దాన్ని కాపాడుకునే బాధ్యత తీసుకుంటారో, వారికి స్వర్గం లభింపజేసే పూచీ నాది."
(బుఖారి - సహ్ల్ బిన్ సఅద్)

---

కోరుకునేవారో, ఎంతగా ప్రోత్సహించేవారో, ఎంతగా బోధించేవారో ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. ధార్మిక జీవితం అంటే సంస్కార రహితంగా అపరిశుభ్రంగా ఉండటం కాదు అనీ, ఇస్లాం పారిశుధ్యాన్ని సంస్కారాన్నీ బోధించే ధర్మమని కూడా తెలుస్తోంది.

295. అల్లాహ్ సర్వమూ ప్రసాదించినప్పుడు స్థితికి తగ్గట్టు తిండీ బట్టా వాడాలి. ఇంట్లో ఉండటానికేమో అన్నీ ఉన్నా ఏదీ లేనట్టుగా రూపం దాల్చడం మహాచెడ్డ అలవాటు. ఇది దైవం పట్ల కృతఘ్నత, దైవ కృపానుగ్రహాల ప్రభావం మన వేషధారణ, ఆహారం ద్వారా వ్యక్తమవ్వాలన్నది, అది దైవం పట్ల కృతజ్ఞతకు చిహ్న మన్నది ఈ హదీసు బోధన.

296. సలాం చెయ్యడమన్నది సాధారణంగా గౌరవ సూచనగా భావిస్తారు చాలా మంది. వాస్తవానికి సలాం అన్నది ఒక శుభాకాంక్ష, ఒక వేడుకోలు. అస్సలాము అలైకుం అంటే నీపై దైవం శాంతిని, శ్రేయాన్ని వర్షింపజేయుగాక అని అర్థం.

۲۹۹ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ: اِنَّ الْعَبْدَ لَیَتَکَلَّمُ بِالْکَلِمَۃِ مِنْ رِّضْوَانِ اللّٰہِ لَا یُلْقِیْ لَہَا بَالًا یَّرْفَعُ اللّٰہُ بِہَا دَرَجٰتٍ وَّاِنَّ الْعَبْدَ لَیَتَکَلَّمُ بِالْکَلِمَۃِ مِنْ سَخَطِ اللّٰہِ لَا یُلْقِیْ لَہَا بَالًا یَّہْوِیْ بِہَا فِیْ جَہَنَّمَ۔" (بخاری- ابوھریرہؓ)

299. దైవ సందేశహరులు (సఅసం) ఇలా బోధించారు: "దాసుడు (మనిషి) ఒక్కోసారి పలికేమాట అల్లాహ్‌ను ప్రసన్నంచేసే మాట అయి ఉంటుంది. కాని దానికి ప్రాముఖ్యత నివ్వడు మనిషి. అయితే అల్లాహ్ ఈ మాటకు ప్రతిఫలంగా అతని (ఆధ్యాత్మిక) అంతస్తును పెంచుతాడు. ఇలాగే మనిషి అల్లాహ్‌కు అయిష్టమయిన మాటను ఎంతో నిర్లక్ష్యంగా పలుకుతాడు. ఆ మాట అతన్ని నరక కూపంలో పడవేస్తుంది.

(బుఖారి - అబూహురైరా)

---

పరిచయం లేని వ్యక్తికయినా సలాం చెయ్యడంలో "నేను నీకు మిత్రుణ్ణి, ఎలాంటి హాని కలుగచేసేవాణ్ణి కాను" అన్న భావం ద్యోతకమవుతోంది.

297. ఈ హదీస్ ద్వారా ముస్లిమ్‌లు పరస్పరం ప్రేమాభిమానాలతో మెలగాలని, వారి విశ్వాసం వారు విశ్వసించే ఇస్లామ్ వారిని ఇలా కోరుతున్నాయని తెలుస్తోంది. దానికిగాను ఒక ఉపాయం కూడా తెలుపటం జరిగింది. అందరూ ఒకరికొకరు సలామ్ చేసుకునే ఆచారం బాగా విస్తృతమవ్వాలి. అయితే సలాంలోని భావం, 'అస్సలాము అలైకుం' అన్న పదాలకు అర్థం తెలిసి మరీ చేస్తేనే దాని సత్ఫలితాలు పొందడం సాధ్యమవుతుంది.

298. మనిషి దేహంలోని ఈ రెండు స్థానాలు ఎంతో ప్రమాదభరితమయినవీ బలహీనమయినవి కూడా. షైతాన్ ఈ స్థానాల నుండి కడు సులువుగా దాడి చేయగలుగుతాడు. పాపాలు తరచుగా ఈ రెంటి ద్వారానే జరుగుతాయి. నేడు మన కాలంలో ఈ రెంటి వల్ల జరిగే అనర్థాలు, వాటి 'వరప్రసాదా'లయిన ఉపద్రవాలను మనం చవిజూస్తూనే ఉన్నాము. మనిషి షైతాను దాడుల బారి నుండి వీటిని రక్షించుకుంటే అతని శాశ్వత స్థావరం స్వర్గం కావడంలో సందేహమేముంది?

299. మహాప్రవక్త (సఅసం) బోధనకు భావమేమంటే మనిషి తన నోటిని విశృంఖలంగా వదలకూడదు, చెప్పేదేమిటో ఆలోచించి మరీ చెప్పాలి. అలక్ష్యంగా, చాలా చిన్నవిగా భావించి చెప్పే అనేక మాటలు తనను నరకానికి చేరవేస్తాయనే యదార్థాన్ని సదా దృష్టిలో ఉంచుకోవాలి. అలాగే ఒక్కొక్క చిన్న కార్యం, చిన్న మాట దైవప్రసన్నతకు కారణభూతమవుతుందనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. అందుకే ఏ చిన్న సత్కార్యానికైనా పరుగిడి పోవాలి. అది స్వర్గ ద్వారంగా మారవచ్చు.

# సందేశ ప్రచారం

## ప్రవక్త మహనీయుని (సఅసం) సందేశం

٣٠٠ قَالَ : مَاذَا يَأْمُرُكُمْ ؛ قُلْتُ : يَقُوْلُ : اعْبُدُوا اللهَ وَلَا تُشْرِكُوْا بِهٖ شَيْئًا وَّاتْرُكُوْا مَا يَقُوْلُ اٰبَاءُكُمْ ، وَيَأْمُرُنَا بِالصَّلٰوةِ وَالصِّدْقِ وَالْعَفَافِ وَالصِّلَةِ۔" (بخاری۔ ابن عباسؓ)

300. (హెర్క్యులిస్ అబూ సుఫ్యాన్‌ని ఇలా అడిగాడు) "ఈ వ్యక్తి ముహమ్మద్ (సఅసం) ఏమని బోధిస్తాడు?" అబూ సుఫ్యాన్ సమాధానంగా ఇలా అన్నాడు: "అల్లాహ్ ఆరాధన చేయాలనీ, ఆయన దైవత్వంలో, ఆయన పాలనాధికారంలో ఇతరులెవ్వరినీ సహవర్తులుగా భావించరాదనీ, పూర్వీకుల నమ్మకాలను, వారి ఆచారాలను త్యజించాలనీ అంటాడు. నమాజ్‌ను పాటించాలని, సదా సత్యం, సౌశీల్యంతో జీవితం గడపాలనీ, బంధువులు రక్తసంబంధీకుల ఎడల ఉత్తమరీతిలో ప్రవర్తించాలని బోధిస్తాడు." (బుఖారి –ఇబ్నె అబ్బాస్)

---

300. ఇది ఒక సుదీర్ఘమయిన హదీస్ నుండి సేకరించబడింది. దీని వెనుక కథ క్లుప్తంగా– రోము ప్రభువు హెర్క్యులిస్ జెరుసలేములో ఉండగా మహాప్రవక్త సందేశ పత్రం అతనికి అందింది. అప్పుడు అతను ఎవరయినా మక్కా వాసులు కనబడితే వారి ద్వారా సమాచారం సేకరించవచ్చని వాకబు చేశాడు. సందర్భవశాత్తు అబూ సుఫియాన్ అతని మిత్రులు కొందరు వాణిజ్యం రీత్యా అటు ప్రయాణం చేస్తూ కనబడ్డారు. అప్పటికి అబూ సుఫియాన్ ఇంకా ఇస్లాం స్వీకరించలేదు. ఇస్లామీయ ఉద్యమం పట్ల అతి తీవ్రమైన నిరసన భావం కలవాడు. హెర్క్యులిస్, అబూసుఫియాన్ ప్రభృతులకు అనేక ప్రశ్నలు వేశాడు. అబూ సుఫియాన్ స్వతహాగా నిజాయితీపరుడు అవటంచేత ప్రవక్త పట్ల శత్రుత్వం ఉన్నా ఆ ప్రశ్నలకు తనకు తెలిసిన విషయాలు నిక్కచ్చిగా చెప్పాడు. వాటిలో ఒకటి ఇక్కడ ప్రస్తావించటం జరిగింది. మహాప్రవక్త బోధించిన సందేశ సారాంశంగా ఇక్కడ అబూ సుఫియాన్ చెప్పిన విషయాలు ఇవి:

٣٠١ عَنْ عَمْرِو بْنِ عَبَسَةَ قَالَ، دَخَلْتُ عَلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بِمَكَّةَ، يَعْنِي فِي أَوَّلِ النُّبُوَّةِ، فَقُلْتُ: مَا أَنْتَ؟ قَالَ: نَبِيٌّ" فَقُلْتُ: "وَمَا نَبِيٌّ؟" قَالَ: أَرْسَلَنِي اللّٰهُ تَعَالَى- فَقُلْتُ: "بِأَيِّ شَيْءٍ أَرْسَلَكَ"؟ قَالَ: "أَرْسَلَنِي بِصِلَةِ الْأَرْحَامِ وَكَسْرِ الْأَوْثَانِ وَأَنْ يُوَحَّدَ اللّٰهُ لَا يُشْرَكُ بِهِ شَيْءٌ." (مسلم-رياض الصالحين)

301. అమ్ర్ బిన్ అబస (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: "నేను మక్కాలో మహాప్రవక్త (సఅసం) సన్నిధికి (దైవదౌత్యం ప్రారంభ కాలంలో) వెళ్లాను. ఆయన్ని 'మీరెవరో' తెలుపండన్నాను. ఆయన 'నేను ప్రవక్తను' అని సమాధానమిచ్చారు. 'ప్రవక్త అంటే ఏమిటి?' మళ్ళీ అడిగాను నేను. ఆయన ఇలాచెప్పారు, 'అల్లాహ్ నన్ను తన సందేశహరునిగా పంపాడు'. దానికి నేను, 'ఏ సందేశమిచ్చి ఆయన మిమ్మల్ని పంపాడు?' అని అడిగాను. ఆయన సమాధానంగా ఇలా సెలవిచ్చారు: "బంధుమిత్రుల ఎడల ప్రేమానురాగాలు కలిగి ఉండాలని బోధించడానికి, విగ్రహారాధనను రూపుమాపడానికి, అల్లాహ్ ఏకత్వాన్ని స్వీకరింపజెయ్యడానికి, ఆయన దైవత్వంలో మరెవ్వరినీ భాగస్వాములుగా భావించకుండా చేయడానికి నన్ను అల్లాహ్ పంపాడు." (ముస్లిమ్ - రియాజుస్సాలెహీన్)

---

"ఏకేశ్వరోపాసన చేయాలి. అంటే, ఒకే దైవాన్ని విశ్వసించాలి. ఆయన ఆధిపత్యమే భూమ్యాకాశాల్లో సర్వత్రా చెలామణి అవుతోందనీ, ఆయన నిర్వహణ క్రిందే ఈ ప్రపంచం, ఇక్కడి ప్రకృతి కార్యకలాపాలు కొనసాగుతున్నాయనీ ఈ ఆధిపత్యం, అధికారాల్లో ఆయన మరెవ్వరినీ తన సహవర్తిగా నియమించలేదనీ, లేదా మరెవ్వరూ తమ స్వశక్తితో ఆయనకు సహవర్తులుగా తయారయి కూర్చోలేదని భావం. అలాంటప్పుడు మనిషి ఆయనకే మోకరిల్లాలి. ఆయన పట్లనే ప్రేమ భావం కలిగి ఉండాలి, ఆయనకే విధేయుడయి మెలగాలి, సర్వావస్థల్లో ఆయన అండదండలనే అర్థించాలి. ఈ విషయాల కొరకు ఆయన్ని తప్ప ఇతరులెవ్వరినీ కన్నెత్తి చూడకూడదు. తాత ముత్తాతలు బహుదైవారాధన ప్రాతిపదికగా నెలకొల్పిన జీవిత విధానాన్ని త్యజించాలి. ఇంకా నమాజ్ ఆచరించాలి. మాటల్లో చేతల్లో సత్యసంధతను

# రాజకీయ వ్యవస్థగా ధర్మం

٣٠٢ عَنْ خَبَّابِ بْنِ الْأَرَتِّ قَالَ، شَكَوْنَا إِلَى النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ وَهُوَ مُتَوَسِّدٌ بُرْدَةً لَهُ فِي ظِلِّ الْكَعْبَةِ فَقُلْنَا: أَلَا تَسْتَنْصِرُ لَنَا؟ أَلَا تَدْعُوا اللهَ لَنَا؟ قَالَ: كَانَ الرَّجُلُ فِيمَنْ قَبْلَكُمْ يُحْفَرُ لَهُ فِي الْأَرْضِ فَيُجْعَلُ فِيهَا، فَيُجَاءُ بِالْمِنْشَارِ فَيُوضَعُ عَلَى رَأْسِهِ فَيُشَقُّ بِاثْنَيْنِ وَمَا يَصُدُّهُ ذَالِكَ عَنْ دِينِهِ، وَيُمْشَطُ بِأَمْشَاطِ الْحَدِيدِ مَا دُونَ لَحْمِهِ مِنْ عَظْمٍ وَّعَصَبٍ وَّمَا يَصُدُّهُ ذَالِكَ عَنْ دِينِهِ، وَاللهِ، لَيَتِمَّنَّ هٰذَا الْأَمْرُ حَتَّى يَسِيرَ الرَّاكِبُ مِنْ صَنْعَاءَ إِلَى حَضْرَمَوْتَ لَا يَخَافُ إِلَّا اللهَ أَوِ الذِّئْبَ عَلَى غَنَمِهِ وَلٰكِنَّكُمْ تَسْتَعْجِلُونَ - (بخاری)

302. హజ్రత్ ఖబ్బాబ్ బిన్ అల్ అరత్ ఉల్లేఖనం : 'ఒకసారి మహాప్రవక్త కాబా నీడలో దుప్పటి తలక్రింద పెట్టుకుని నడుం వాల్చి ఉండగా మేము ఇలా విన్నవించుకున్నాము, "మీరు మా కోసం దైవ సహాయాన్ని అర్థించరా? ఈ జులుం అంతం కావాలని అల్లాహ్‌ను వేడుకోరా?"

---

అలవర్చుకోవాలి. సౌశీల్యం, సదాచారం అవలంబించాలి. తోటి మానవులకు హానికరమయిన ఏ కార్యమూ చేయరాదు. తోటి సోదరులతో మంచిగా ప్రవర్తించాలి. దైవమే గగన భువనాల సృష్టికర్త, స్వామి, ప్రభువు కనుక అందరూ ఆ ఒక్క దైవానికే దాసులు. అందువల్ల అందరూ సోదర సోదరీలే, అందరూ సమానులే అన్న భావం మనిషి మరువరాదు.

301. ఈ హదీసు కూడా మహాప్రవక్త సందేశంలోని ప్రధానాంశాలను తెలుపుతోంది. ఆయన సందేశాన్ని అతి క్లుప్తంగా చెప్పారు. దాన్ని మనం రెండుగా విభజించవచ్చు.

1) మనిషికీ దైవానికీ మధ్య సంబంధం.

2) మనిషికీ మనిషికీ మధ్య సంబంధం.

1. మనిషికీ దైవానికీ మధ్య సంబంధాన్ని సరయిన పునాదులపై స్థాపించడం. అదే ఏకేశ్వరోపాసన. దేవుని ఏకత్వపు భావన. అంటే దేవుని అధికారంలో, ఆధిపత్యంలో మర్వెరినీ సహవర్తులని ఎంచకూడదు. ఆయన్నే ఆరాధించాలి. ఆయన విధేయతనే పాటించాలి.

2. మనిషి మనిషి మధ్య సంబంధానికి పునాది ప్రేమానురాగాలే. అంటే మానవులంతా ఒక దైవానికి దాసులు. అందువల్ల వాస్తవానికి అందరూ పరస్పరం సోదరులే. వారు అన్యోన్యంగా, ప్రేమానురాగాలు, ఆదరాభిమానాలు కల వారిగా జీవించాలి. అనాధులు, నిరాధారులయిన సోదరుల్ని ఆదుకోవాలి. ఒకరిపై అత్యాచారం జరుగుతూ ఉంటే అందరూ కలిసి అడ్డుపడాలి. ఒకరు ఆపదలకులోనైతే అంతా బాధానుభూతి పొందాలి. ఆ ఆపద నుండి అతన్ని రక్షించడానికి ముందంజ వేయాలి.

దైవ సందేశహరులందరూ అందజేసిన సందేశానికి ఇవే రెండు పునాదులు. ఒకటి, దేవుని ఏకత్వం. రెండు, మానవ సమానత్వం. ~~ఈ~~ రెండు విషయాలే విశ్వజనీనమైన ప్రేమకు ఆధారాలు. అసలు విషయమేమంటే ఏకేశ్వరోపాసనే ప్రధాన విషయం. ఆ భావనకు అనివార్యమయిన పరిణామమే మానవ ఏకత్వపు భావన. సృష్టికర్త అయిన దైవాన్ని ప్రేమించే మనిషి ఆ సృష్టికర్తే సృష్టించిన తోటి మానవుల్ని కూడా ప్రేమిస్తాడు. "నా దైవమే తోటి మనిషికీ దైవం" అన్న భావన విశ్వమానవ సోదరత్వానికి పునాది అవుతుంది.

మానవుల పట్ల ప్రేమ సానుభూతికి అనివార్యమయిన పర్యవసానంగా ఒక విషయాన్ని హజ్రత్ ముగీరా బిన్ షోబా పర్షియా సేనాని రుస్తుమ్ ఎదుట వర్ణించారు. ఆయన రుస్తుమ్ అపోహల్ని దూరం చేస్తూ ఇస్లాం సందేశాన్ని వివరిస్తూ దైవదౌత్య లక్ష్యాన్ని కూడా తెలియపరిచారు :

"మేము వ్యాపారులము కాము. మా సరకుల కోసం కొత్త వాణిజ్య స్థావరాలను వెదకటం మా ఉద్దేశ్యం కాదు. మా లక్ష్యం 'ప్రపంచం' ఏమాత్రం కాదు. మా ఏకైక ధ్యేయం, మా కోరికల కేంద్రం, కేవలం పరలోకమే. మేము సత్య ధర్మాన్ని చేపట్టిన వారము. ఆ సందేశ ప్రచారమే మా ఉద్దేశ్యం."

"ఆ సత్య ధర్మమేమిటో కాస్త వివరించండి" అడిగాడు అతను. ఆయన ఇలా చెప్పారు:

"أَمَّا عَمُودُهُ الَّذِي لَا يَصْلُحُ شَيْءٌ مِنْهُ إِلَّا بِهِ، فَشَهَادَةُ أَنْ لَا إِلٰهَ إِلَّا
اللهُ وَأَنَّ مُحَمَّدًا رَسُولُ اللهِ وَالْإِقْرَارُ بِمَا جَاءَ مِنْ عِنْدِ اللهِ۔"

" మా ధర్మానికి మూలం, కేంద్ర బిందువు, సకల సంస్కరణలకు ఆధారం ఏమంటే, మనిషి అల్లాహ్ తప్ప మరే ఆరాధ్య శక్తిలేదని, ముహమ్మద్ ఆ దేవుని అంతిమ సందేశహరులని సాక్ష్యం పలకాలి. ఇంకా దైవం తరపున అరుదెంచిన మార్గదర్శకత్వాన్ని, శాసనాన్ని (ఖుర్ఆన్ని) పాటించాలి."

అంతా విని సహన స్వరూపులయిన ప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు: "మీకు పూర్వం గతించిన వారిలో కొందరిని భూమిలో గుంత తీసి అందులో నిలబెట్టేవారు. ఆపైన రంపంతో వారి శరీరాన్ని చీల్చి రెండు ముక్కలుగా చేసేవారు. అప్పటికీ వారు తమ ధర్మాన్నుండి మరలేవారు కారు. కొందరి దేహాన్ని ఉక్కు దువ్వెనలతో దువ్వేవారు. అవి కండరాల్ని చీల్చుకుని ఎముకల్ని, నరాలన్నింటినీ కదిలించేవి. కాని ఆ సజ్జనులు తమ ధర్మాన్ని వదిలేవారు కారు. దైవం సాక్షిగా చెబుతున్నాను, ఈ ధర్మం సర్వాధిపత్యం వహిస్తుంది. కడకు ఒక ప్రయాణీకుడు తన వాహనంపైన సన్ఆ (ఎమన్) నుండి హజరమౌత్ (నేటి బెహ్రయిన్ ప్రాంతం) వరకు ప్రయాణిస్తాడు. అతనికి మార్గంలో దైవ భీతి తప్ప వేరే భయం కలగదు. గొర్రెల కాపరికి మాత్రం తోడేళ్ళ భయం కలగవచ్చు. మీరు చాలా తొందరపడుతున్నారు." (బుఖారి)

---

ఇది విన్న ఆ సేనాపతి, 'ఇదయితే చాలా ఉత్తమమయిన బోధన. ఈ ధర్మంలోని ఇంకా కొన్ని బోధనల్ని చెప్పండి' అని అడిగాడు. అప్పుడు హజ్రత్ ముగీరా ఇలా చెప్పారు:

"وَاِخْرَاجُ الْعِبَادِ مِنْ عِبَادَةِ الْعِبَادِ إِلَى عِبَادَةِ اللهِ -"

'ఈ ధర్మం, మనిషిని తోటి మనిషి దాస్యం నుండి విముక్తి కలిగించి దైవ దాస్యంలో ప్రవేశింపచెయ్యాలని బోధిస్తుంది.' ఆ పైన ఈరాన్ సేనాపతి, ఇదీ బాగానే ఉంది. ఈ ధర్మం చెప్పే మరో బోధన వినిపించమన్నాడు. ముగీరా తిరిగి ఇలా పలికారు:

"وَالنَّاسُ بَنُوْ آدَمَ، فَهُمْ إِخْوَةٌ لِأَبٍ وَّأُمٍّ -"

"ఈ ధర్మం, మానవులందరూ ఆదమ్ సంతానమని, పరస్పరం సోదరులని సమానులని బోధిస్తుంది."

ఆ సందర్భంలోనే ఆ సేనాపతి ఎదుటే హజ్రత్ రిబ్ఈయా బిన్ ఆమిర్ ఇలా దైవ ధర్మాన్ని నిర్వచించారు :

اَللهُ ابْتَعَثَنَا ، لِنُخْرِجَ مَنْ شَاءَ مِنْ عِبَادَةِ الْعِبَادِ إِلَى عِبَادَةِ
اللهِ وَمِنْ ضِيْقِ الدُّنْيَا إِلَى سَعَتِهَا، وَمِنْ جَوْرِ الْأَدْيَانِ إِلَى عَدْلِ

٣٠٣ عَنْ عَطَاءِ بْنِ أَبِيْ رَبَاحٍ قَالَ زُرْتُ عَائِشَةَ مَعَ عُبَيْدِ بْنِ عُمَيْرٍ اللَّيْثِيِّ فَسَأَلْنَاهَا عَنِ الْهِجْرَةِ ، فَقَالَتْ : " لَاهِجْرَةَ الْيَوْمَ، كَانَ الْمُؤْمِنُوْنَ يَفِرُّ أَحَدُهُمْ بِدِيْنِهٖ إِلَى اللّٰهِ وَإِلٰى رَسُوْلِهٖ مَخَافَةَ أَنْ يُّفْتَنَ عَلَيْهِ ، فَأَمَّا الْيَوْمَ فَقَدْ أَظْهَرَ اللّٰهُ الْإِسْلَامَ وَالْيَوْمَ يَعْبُدُ رَبَّهٗ حَيْثُ شَاءَ وَلٰكِنْ جِهَادٌ وَّنِيَّةٌ ." (بخاری)

303. అతా బిన్ అబీ రబాహ్ ఇలా ఉల్లేఖించారు : 'నేనొకసారి 'ఉబైద్ లైసీ'తో హజ్రత్ ఆయిషాను సందర్శించడానికి వెళ్ళాను. ఆమెను "హిజ్రత్ ఇప్పటికీ విధిగా ఉందా?" అని అడిగాము. "లేదు, ఇప్పుడు హిజ్రత్ జరగదు. ఆ ఆదేశం రద్దయిపోయింది. అప్పట్లో విశ్వాసి విశ్వాస కారణంగా ఎనలేని బాధలకు గురి అవడం చేత అతను తన ధర్మం, విశ్వాసాలు కాపాడుకుని అల్లాహ్ ఆయన సందేశహరుల ఆదేశం మేరకు హిజ్రత్ చేసిపోయేవాడు. ఇప్పుడయితే అల్లాహ్, ధర్మానికి సర్వాధిక్యత, సర్వాధికారాలు అనుగ్రహించాడు. నేడు విశ్వాసి తన ఇచ్ఛ వచ్చిన చోట స్వేచ్ఛగా దైవదాస్య విధుల్ని ఆచరించగలడు. అలాంటప్పుడు హిజ్రత్ చేయవలసిన అగత్యమే మేర్పడింది? జిహాద్, జిహాద్ సంకల్పం ఎప్పటికీ ఉంటాయి." (బుఖారి)

---

الْإِسْلَامِ فَأَرْسَلَنَا بِدِيْنِهٖ إِلٰى خَلْقِهٖ لِنَدْعُوَهُمْ إِلَيْهِ ـ

(البدایہ والنہایہ ج ۷، ص ۳۹)

"అల్లాహ్ మమ్మల్ని, ప్రజలు కోరినట్లయితే వారిని మానవ దాస్యం నుండి విముక్తి కలిగించి దైవ దాస్యంలో ప్రవేశింప చెయ్యమని నియమించాడు. మానవుల్ని విభిన్న సంకుచిత భావాల ఇరుకు ప్రపంచంలో నుండి వెలికి తీసి విశాల భావాల సువిశాల ప్రపంచంలోకి తీసుకుపోవాలని, దౌర్జన్యపరమయిన వ్యవస్థల బారినుండి రక్షించి దైవ విధేయతా, శాంతి మార్గమయిన ఇస్లాం సూచించే న్యాయం, సమానత్వాల వ్యవస్థ ఛత్ర ఛాయల్లో ఆశ్రయం కల్పించాలని మమ్మల్ని ఆదేశించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే దైవం తనకు సమ్మతమయిన ధర్మం మాకిచ్చి మానవాళిని ఆ దైవ ధర్మం వైపునకు పిలువడానికి పంపాడు." ('అల్ బిదాయ వన్నిహాయ' సంపుటి ; 7, పుట ; 39)

# సంఘ వ్యవస్థీకరణ

٣٠٤ إِنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "إِذَا كَانَ ثَلٰثَةٌ فِى سَفَرٍ فَلْيُؤَمِّرُوْا أَحَدَهُمْ." (ابوداؤد - ابوسعید خدریؓ)

304. మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "ముగ్గురు మాత్రమే ప్రయాణానికి బయల్దేరినా తమలో ఒకరిని వారు తమ అమీర్ (నాయకుని)గా నియమించుకోవాలి".

(అబూదావూద్ - అబూ సయీద్ ఖుద్రి)

---

302. ఈ సంఘటన జరిగిన కాలంలో ఇస్లామీయ ఉద్యమకారుల్ని మక్కా బహుదైవారాధకులు అత్యంత క్రూరంగా హింసిస్తున్నారని హదీసులోని అంతస్సాక్ష్యం చెబుతోంది.

మహాప్రవక్త (సఅసం) చెప్పిన "గతించిన వారు" అంటే గత ప్రవక్తల అనుయాయులు, ఇస్లామీయ ఉద్యమకారులని భావం.

చివరి శుభవార్తకు అర్థం ఏమిటంటే ఎమన్ నుండి బెహరెయిన్ వరకు గల విశాల భూభాగంలో సత్య విరోధుల శక్తి నశిస్తుందనీ, దైవదాసులు స్వేచ్ఛగా దైవ దాస్య మార్గాన్ని అనుసరించగలుగుతారనీ అర్థం.

హజ్రత్ ఖబ్బాబ్ మక్కా జీవితపు 13 ఏండ్ల చరిత్రను ఎంతో సమగ్రంగా ప్రస్తావించారు. ఆ ఒక్క మాటలోనే ఆ నాటి పరిస్థితులు కళ్ళకు కట్టినట్లు కనిపిస్తాయి. అయితే మహాప్రవక్త ఆ సంక్లిష్ట పరిస్థితుల్లో ఊహకందని భవిష్యద్వచనాన్ని అతి స్పష్టంగా తెలిపారు, ఓదార్చారు. భావిలో రాజకీయ అధికారం ఇస్లాం హస్తగతం కానున్నదనీ, దైవ దాసులు ఎలాంటి భయాందోళనలకు గురికాకుండా నిర్భయంగా స్థిరచిత్తులయి ఉండాలని, ప్రస్తుతం ఈ పరిస్థితుల్ని ధైర్యంతో, స్థయిర్యంతో ఎదుర్కోవాలనీ బోధించారు.

303. పై హదీసులో హజ్రత్ అతా అడిగిన ప్రశ్నకు భావం, ప్రజలు తమ ప్రాంతాలు వదలి ఆ నాటి ఇస్లామీయ రాజ్య పరిధి అయిన మదీనాకు వలస రావడం అవసరమా? అని. హజ్రత్ ఆయిషా ప్రస్తావించిన సాధికార ఆధిపత్యం గల ధర్మానికి దాని రాజకీయ వ్యవస్థకు మహాప్రవక్త దివంగతులయిన తరువాత ప్రమాదం ఏర్పడింది. కాని హజ్రత్ అబూ బక్ర్ (రజిఅన్) సమయస్ఫూర్తి, దాన్ని ఆ అపాయాన్నుండి కాపాడింది. మహాప్రవక్త నిర్యాణం వలన ప్రజల హృదయాలు అమితంగా గాయపడ్డాయి. నిరాశా నిస్పృహలు వారి ఆంతర్యాన్ని ఆవరించాయి. ఇస్లాం ప్రతిపాదించే సాంఘిక వ్యవస్థ

ఛిన్నాభిన్నమై పోయే ఆశంక ఏర్పడింది. ప్రమాదాన్ని హజ్రత్ అబూబక్ర్ పసిగట్టారు. ఆ సందర్భంలో ఒక సుదీర్ఘ ప్రసంగం చేశారు :

أَيُّهَا النَّاسُ مَنْ كَانَ يَعْبُدُ مُحَمَّدًا فَإِنَّ مُحَمَّدًا قَدْ مَاتَ، وَمَنْ كَانَ يَعْبُدُ اللهَ فَإِنَّ اللهَ حَيٌّ لَا يَمُوتُ، وَإِنَّ اللهَ قَدْ تَقَدَّمَ إِلَيْكُمْ فِي أَمْرِهِ فَلَا تَدَعُوهُ جَزَعًا، وَإِنَّ اللهَ قَدِ اخْتَارَ لِنَبِيِّهِ مَا عِنْدَهُ عَلَى مَا عِنْدَكُمْ وَقَبَضَهُ إِلَى ثَوَابِهِ وَخَلَّفَ فِيكُمْ كِتَابَهُ وَسُنَّةَ نَبِيِّهِ فَمَنْ أَخَذَ بِهِمَا عَرَفَ وَمَنْ فَرَّقَ بَيْنَهُمَا أَنْكَرَ، يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا كُونُوا قَوَّامِينَ بِالْقِسْطِ "وَلَا يَشْغَلَنَّكُمُ الشَّيْطَانُ بِمَوْتِ نَبِيِّكُمْ وَلَا يَفْتِنَنَّكُمْ عَنْ دِينِكُمْ، فَعَاجِلُوهُ بِالَّذِي تُعْجِزُونَهُ وَلَا تَسْتَنْظِرُوهُ فَيَلْحَقَ بِكُمْ -

"ప్రజల్లారా ! ముహమ్మద్‌ను తన ఆరాధ్య దైవంగా భావించిన వ్యక్తికి, ఆయన మృతి నొందారనే విషయం విదితం కావాలి. మరెవరయితే అల్లాహ్‌ను తమ దైవంగా భావించారో వారు, ఆయన సజీవంగా ఉన్నాడనీ, ఆయనకు మరణం సోకదనీ తెలుసుకోవాలి. అల్లాహ్ తన ధర్మ సంరక్షణా భారం మీకు అప్పజెప్పాడు. ఇక, తత్తరపాటుతో, బిత్తరపాటుతో ఈ ధర్మ సంరక్షణా బాధ్యతను విస్మరించకండి. అల్లాహ్ తన ప్రవక్తను మీ మధ్య నుండి తన వద్దకు పిలుచుకోడానికే ఇష్టపడ్డాడు. అక్కడ ఆయనకు, ఆయన చేసిన కర్మల ప్రతిఫలం అనుగ్రహిస్తాడు. మీ మధ్య తన గ్రంథాన్నీ, తన ప్రవక్త ఆదర్శ సంప్రదాయాన్ని వదిలాడు అల్లాహ్.

ఎవరు ఈ రెంటిపై సరిగ్గా అమలుజరుపుతారో వారు సన్మార్గాన్ని అనుసరించినవారవుతారు. మరెవరు ఈ రెంటికి మధ్య విభేదాన్ని కల్పిస్తారో వారు వక్ర మార్గాన్ని అవలంబించిన వారవుతారు. అల్లాహ్ మిమ్మల్ని సంబోధించి, "విశ్వాసులారా, మేము అవతరింపజేసిన మధ్యస్థ వ్యవస్థకు మీరు సంరక్షకులుగా ఉండాలి" అని ఆదేశించాడు. అందువలన షైతాన్, మీ ప్రవక్త నిర్యాణానికి సంబంధించిన చిక్కుల్లో నుండి మిమ్మల్ని బయటపడకుండా చేయగలడు, జాగ్రత్త!

షైతాన్‌కు ప్రతికూలంగా పోరాడి వాణ్ణి ఓడించే ఉపాయం చూడండి. వానికి తన పని చేసే వ్యవధి నివ్వకండి, లేకపోతే మీపై విరుచుకుపడతాడు. మీ ధార్మిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసి వేస్తాడు."

٣٠٥ عَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرٍو أَنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
قَالَ : لَا يَحِلُّ لِثَلَاثَةٍ يَكُوْنُوْنَ بِفَلَاةٍ مِّنَ الْأَرْضِ إِلَّا أَمَّرُوْا عَلَيْهِمْ
أَحَدَهُمْ ۔" (منتقى)

305. అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్ ఉల్లేఖనం: "ముగ్గురు వ్యక్తులు ఒక అడవిలో ఉన్నా వారు తమలో ఒకరిని తమ నాయకునిగా ఎన్ను కోవడం తప్ప మరో మార్గం ధర్మసమ్మతం కాదు, " అని మహాప్రవక్త ప్రబోధించారు.' (ముస్తకా)

హజ్రత్ అబూబక్ర్ సిద్దీక్ చేసిన ఈ ప్రసంగం ద్వారా విస్పష్టంగా తెలిసివచ్చేదేమంటే, మహాప్రవక్త జీవిత కాలంలో స్థాపించబడిన ధార్మిక వ్యవస్థకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. మహాప్రవక్త తనువు చాలించినంతనే ఆ బాధకు తట్టుకోలేక విశ్వసించినవారు ఏకేశ్వరవాదాన్నీ, నమాజ్‌ను త్యజించాలని అనుకోలేదు. వాళ్ళకు నచ్చజెప్పిందీ, బోధపరిచిందీ ఆ విషయాలను గురించి కాదు. అసలు విషయమేమంటే ఎన్నో త్యాగాలు చేసి, ఇంకెన్నో పరీక్షల్ని ఎదుర్కొని, ఎనలేని ఆపదల్ని సహించి స్థాపించిన ఇస్లామీయ ప్రభుత్వ వ్యవస్థ సమసిపోతుందేమో అన్న సంశయం పొడసూపింది అప్పుడు. అందుకే హజ్రత్ సిద్దీక్ ముందుకు వచ్చి సహాబా సమక్షంలో ప్రసంగించారు. దీనిలో నిసా సూరాలోని ఒక వాక్యాన్ని ప్రస్తావించి, అందులో అల్లాహ్, మధ్యస్థ వ్యవస్థ అయిన ఇస్లాం జీవన వ్యవస్థను కాపాడే ప్రమాణం ముస్లింలచేత చేయించుకున్నాడని, మరణ సంతాపాన్ని హద్దుమీరనివ్వకూడదని, లేచి షైతాన్‌ని ఓడించాలని, తమ ధార్మిక వ్యవస్థను (ఖిలాఫత్ ఆధారంగా ఏర్పడిన రాజకీయ వ్యవస్థను) నిలబెట్టే సమాలోచనలు జరపాలని హెచ్చరించారు.

హజ్రత్ అబూబక్ర్ ప్రస్తావించిన నిసా సూరాలోని వాక్యానికి ముందు అల్లాహ్ సెలవిచ్చిన విషయం ఇది: "మీకు ముందు బనీ ఇస్రాయీల్‌కు మేము మా అమానతు అప్పజెప్పాము. కాని వారు విశ్వాసఘాతుకం చేశారు. పర్యవసానంగా అల్లాహ్ ఆగ్రహం వారిపై ఆవరించింది. ప్రపంచ జాతులకు నాయకత్వం వహించే హోదా వారి నుండి వాపసు తీసుకోవడం జరిగింది. ఫలితంగా ఆనాటి బహుదైవారాధకులకు బానిసలుగా జీవించే గతి వారికి పట్టింది, ఇప్పుడు వారి స్థానే మిమ్మల్ని నిలబెట్టడం జరుగుతోంది. మీకు ఉద్గ్రంథాన్నీ, విజ్ఞతను మహత్తర అధికారాన్నీ అనుగ్రహించడం జరుగుతోంది.

జాగ్రత్త! బనీ ఇస్రాయీల్‌లా విశ్వాసఘాతుకానికి ఒడిగట్టకండి. మేము తౌరాహ్ అనుగ్రహించినవారికి (బనీ ఇస్రాయీల్), 'అవిధేయులుగా మారకండి, దైవంతో చేసిన ప్రమాణాన్ని నిలబెట్టుకోండి, గ్రంథం పట్ల నమ్మకద్రోహానికి పాల్పడకండి' అని బోధించాము. కాని వారు కృతఘ్నత, ద్రోహం, విశ్వాసఘాతుకాల మార్గాన్ని అవలంబించారు. మరి ఈ వైఖరికి ప్రతిఫలంగా గొప్ప దుష్పరిణామానికి గురిఅయ్యారు. ఇప్పుడు మిమ్మల్ని ( ముహమ్మద్ అనుయాయుల్లారా!) ఉపదేశిస్తున్నాము. తక్వా (భయభక్తుల) మార్గాన్ని అనుసరించండి. వాగ్దాన భంగం చేయకండి, ఖుర్‌ఆన్ చూపే మార్గాన్ని వదలి మా ఆగ్రహాన్ని ఆహ్వానించకండి." ఆ తరువాత ఉపదేశించబడింది, "విశ్వాసులారా! న్యాయం సమానత్వాలుకల ఈ దైవిక వ్యవస్థను ఎట్టి పరిస్థితిల్లోనయినా సంరక్షిస్తూ ఉండండి" అని.

ఇదే విషయం మాయిదా సూరాలో కూడా మరో విధంగా ప్రస్తావించబడింది. దైవాదేశాలు పరిపూర్ణం కావించబడిన చివరి సూరా మాయిదా. దాని తరువాత ఆదేశాలు తెలిపే మరో సూరా అవతరించలేదు. ఈ సూరా అవతరణ "అరఫాత్" మైదానంలో జరిగింది. ఆ మైదానంలో అనుచర సంఘాన్ని సమావేశపరచి వారిచేత ప్రమాణం చేయించుకుంటున్నట్లు ఉంది దాని ధోరణి. "ఇదో, మా అనుగ్రహాన్ని పరిపూర్ణం గావించాము మహోన్నత ఆధిపత్యం మీకు ప్రసాదించబడింది. మాతో చేసిన ప్రమాణాన్ని నిలబెట్టుకోవడం మీ కర్తవ్యం. లేకపోతే, జాగ్రత్త; బనీ ఇస్రాయీల్ చరిత్ర మీ కళ్ళ ఎదుటే ఉంది. వారు ప్రమాణభంగం చేసి ఎలా దౌర్భాగ్యానికి, హీనస్థితికి దిగజారారో మీకు తెలుసు" అని బోధించడం జరిగింది.

ఇదీ ధర్మంలో, ధార్మిక సామూహిక వ్యవస్థకు ఉన్న విలువ, ప్రాముఖ్యం. కాని విచారకరమయిన విషయం ఏమిటంటే ముస్లిం అనుచర సమాజం ఆ వ్యవస్థను కోల్పోయింది. పైగా ఈ సమాజం ఆదమరచి నిద్రబోతోంది. సౌభాగ్యం దూర మవడమే కాదు, ఆ నష్టం కలిగిన స్పృహ కూడా సమాజానికి లేదు. అదే బాధ.

304. "ప్రయాణావస్థలో సయితం సంఘటిత వర్గంగా కూడి ఒక నాయకుని నాయకత్వంలో జీవించటం విధిగా నిర్ణయించినప్పుడు, ముస్లింల సామాజిక వ్యవస్థ ఛిన్నాభిన్నం అయిన పరిస్థితుల్లో వారు ఎక్కడున్నా ఒక సంఘంగా రూపొందడం, ఒక నాయకత్వం క్రింద సమీకృతం అవడం విధి అనడంలో ఏ మాత్రం సందేహం లేదు. ముస్లింలు ఒక్కొక్కరుగా వ్యక్తిగత రూపంలో జీవించడానికి ధర్మం దృష్ట్యా ఎంత మాత్రం ఆస్కారం లేదు" అని ఇబ్నుతయిమియ్య అభిప్రాయపడ్డారు.

305. అడవిలో ఉన్నా సుసంఘటిత జీవితం గడపాలని బోధించే ధర్మం, ముస్లింలు చెల్లాచెదరుగా, చెట్టుకొకరు, పుట్టకొకరుగా అవడాన్ని, నాయకత్వంలేని దుర్వ్యవస్థలో జీవితాన్ని గడపడాన్ని ఎలా సహిస్తుంది? ముస్లిములు ఆలోచించాలి.

٣٠٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "إِنَّ الشَّيْطٰنَ ذِئْبُ الْإِنْسَانِ كَذِئْبِ الْغَنَمِ يَأْخُذُ الشَّاذَّةَ وَالْقَاصِيَةَ وَالنَّاحِيَةَ وَ إِيَّاكُمْ وَالشِّعَابَ، وَعَلَيْكُمْ بِالْجَمَاعَةِ وَالْعَامَّةِ."
(مسند احمد۔ مشکوٰۃ۔ معاذ بن جبلؓ)

306. దైవ సందేశహరుడు (సఅసం) ఇలా ఉపదేశించారు, "ఏ విధంగానయితే ఒక తోడేలు, మందనుంచి వేరయిన గొర్రెల్ని తేలికగా సంహరించగలుగుతుందో అలాగే షైతాన్ విడివడిన మనిషిపట్ల తోడేలే! మనుషులు ఒక సంఘంగా కూడి జీవించకపోతే వారిని షైతాన్ ఒక్కొక్కరినే సులువుగా వేటాడి వేస్తాడు. అందుకే జనులారా! వేర్వేరుగా చిన్న చిన్న కాలిబాటల వెంట నడవకండి. మీరు సంఘంలో చేరి, ముస్లిమ్ సమాజంతో కలిసి జీవించండి. ఇది మీ విద్యుక్త ధర్మం."
(ముస్నద్ అహ్మద్, మిష్కాత్ - ముఆజ్ బిన్ జబల్)

٣٠٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ سَرَّهٗ أَنْ يَّسْكُنَ بُحْبُوْحَةَ الْجَنَّةِ فَلْيَلْزَمِ الْجَمَاعَةَ فَإِنَّ الشَّيْطٰنَ مَعَ الْوَاحِدِ وَهُوَ مِنَ الْإِثْنَيْنِ أَبْعَدُ."

307. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు : "ఎవరు తమ గృహాన్ని స్వర్గం మధ్యన నిర్మించుకోవాలని కోరుకుంటారో వారు ఇస్లామీయ సాంఘిక వ్యవస్థను అంటి పెట్టుకుని ఉండాలి. ఎందుకంటే షైతాన్ ఒంటరి మనిషికి చేరువవుతాడు. కాని మనుషులు ఒకరికి ఇద్దరయినప్పుడు వాడు దూరమయిపోతాడు."

---

306. 'సంఘంలో చేరి' ఉండమని ఇచ్చిన ఆదేశం ఎప్పటిది? అది ముస్లింల సాంఘిక వ్యవస్థ స్థిరపడి ఉన్నప్పటిమాట. అయితే ఆ వ్యవస్థ లేనప్పుడు ఏమిటి కర్తవ్యం? "ఆ సాంఘిక వ్యవస్థ" రూపొందే వరకు దాన్ని స్థాపించే కృషి చేయడం. అందుకు సంఘటితమవడమే మార్గం. అంతేకాని, ఇప్పుడు ముస్లింల సాంఘిక వ్యవస్థ ఒకటి లేదు గనుక ఈ ఆదేశంవర్తించదని భావించడం ఘోరమయిన తప్పు. ముస్లింలు ఎప్పుడైనా ఎక్కడున్నా సంఘటితంగా, ఒక నాయకత్వం ఆధ్వర్యాన జీవించడమే ధర్మ సమ్మతం.

# నాయకుడు-అనుచరుల సంబంధాలు

٣٠٨ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "أَلَا كُلُّكُمْ رَاعٍ وَكُلُّكُمْ مَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهِ، فَالْإِمَامُ الَّذِيْ عَلَى النَّاسِ رَاعٍ وَهُوَ مَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهِ وَالرَّجُلُ رَاعٍ عَلٰى أَهْلِ بَيْتِهِ وَهُوَ مَسْئُوْلٌ عَنْ رَعِيَّتِهِ، وَالْمَرْأَةُ رَاعِيَةٌ عَلٰى بَيْتِ زَوْجِهَا وَوَلَدِهٖ وَهِيَ مَسْئُوْلَةٌ عَنْهُمْ." (بخاری۔ مسلم۔ ابن عمرؓ)

308. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: “ మీలో ప్రతి ఒక్కడూ ఒక సంరక్షకుడు, అతన్ని అతని సంరక్షణలో ఉన్న వారి గురించి ప్రశ్నించడం జరుగుతుంది. ప్రజల సంరక్షకుడు, పాలకుడు అయిన నాయకుణ్ణి అతని ప్రజలను గురించి అడగటం జరుగుతుంది. పురుషుడు తన ఇంటివారి (భార్యా పిల్లల) సంరక్షకుడు. అతన్ని తన ఆశ్రయంలో ఉన్నవారిని గురించి ప్రశ్నించడం జరుగుతుంది. స్త్రీ తన భర్త ఇల్లూ వాకిలికి, అతని వల్ల తనకు కలిగిన సంతానానికి సంరక్షకురాలు. ఆమెను వారిని గురించి విచారించడం జరుగుతుంది.”

(బుఖారి, ముస్లిమ్- ఇబ్ను ఉమర్)

---

307. ముస్లింల సాంఘిక వ్యవస్థ సంస్థాపితమయి ఉన్నప్పుడు దాన్ని అంటిపెట్టుకుని ఉండటం అత్యవసరం, అప్పుడు దాన్నుండి వేరుగా ఉండటం ధర్మసమ్మతం కాదు. ఇంకా, ఎవరయినా అలాంటి సుసంగఠిత వ్యవస్థకు దూరంగా ఉంటే వారు ఇస్లామ్ వ్యతిరేకచర్యలకు పాల్పడుతున్నారని భావం. సాంఘిక వ్యవస్థ అంటే, ఇస్లాం అధికారంలో ఉండాలి. ఆధిపత్యం, పరిపాలన ఇస్లాం హస్తగతమయి ఉండాలి. ముస్లింలంతా ఒకే అమీర్ (నాయకుని) నాయకత్వాన్ని సమ్మతించి, ఏకీభవించి ఉండాలి; అలాంటి పరిస్థితిలో ఎవరూ 'ఆ వ్యవస్థ (అల్ జమాఅత్)' కు దూరంగా జీవితం గడపటం ధర్మ సమ్మతం కాదు. అయితే ఒకవేళ “ ఆ వ్యవస్థ” (అల్ జమాఅత్) లేనప్పుడు అది ఉనికిలోకి వచ్చేందుకు సంగఠితంగా కృషిచేయడమే ధర్మం. దాన్ని ఉనికిలోకి తేవడానికయినా సంగఠిత కృషి ఒక నాయకత్వపు ఆధ్వర్యాన జరపడమే ధర్మబద్ధమైన విధానం.

٣٠٩ عَنْ مَعْقِلِ بْنِ يَسَارٍ قَالَ: سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ: مَا مِنْ وَّالٍ يَّلِيْ رَعِيَّةً مِّنَ الْمُسْلِمِيْنَ وَهُوَ غَاشٌّ لَّهُمْ إِلَّا حَرَّمَ اللّٰهُ عَلَيْهِ الْجَنَّةَ -" (متفق عليه)

309. మా 'కిల్ బిన్ యసార్ ఇలా ఉల్లేఖించారు: "ముస్లిమ్‌ల సాంఘిక వ్యవస్థలో బాధ్యతాయుతమయిన పదవిలో ఉన్న వ్యక్తి, వారిపట్ల ద్రోహం తలపెడితే అల్లాహ్ అతనికి స్వర్గాన్ని నిషేధిస్తాడు." అని మహాప్రవక్త చెప్పగా నేను విన్నాను. (ముత్తఫకున్ అలైహి)

٣١٠ عَنْ مَعْقِلِ بْنِ يَسَارٍ قَالَ سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ: "أَيُّمَا وَالٍ وَّلِيَ مِنْ أَمْرِ الْمُسْلِمِيْنَ شَيْئًا فَلَمْ يَنْصَحْ لَهُمْ وَلَمْ يَجْهَدْ لَهُمْ كَنُصْحِهٖ وَجُهْدِهٖ لِنَفْسِهٖ كَبَّهُ اللّٰهُ عَلٰى وَجْهِهٖ فِي النَّارِ، وَفِيْ رِوَايَةٍ عَنِ ابْنِ عَبَّاسٍ: "لَمْ يَحْفَظْهُمْ بِمَا يَحْفَظُ بِهٖ نَفْسَهٗ وَأَهْلَهٗ -" (طبرانی ـ کتاب الخراج)

310. మా 'కిల్ బిన్ యసార్ ఉల్లేఖించారు: మహాప్రవక్త (సఅసం) ఇలా బోధిస్తూ ఉండగా నేను విన్నాను: "ఎవరయినా ముస్లిముల సామూహిక విషయాల బాధ్యతను స్వీకరించిన తరువాత వారి శ్రేయాన్ని కాంక్షించకపోతే, ఏ విధంగానయితే తన సొంత విషయంలో శ్రద్ధ వహించి, తన మేలు కోసం కృషి చేసి అలసిపోతాడో ఆ విధంగా వారికి మేలు జరిగే కార్యకలాపాల్లో నిమగ్నుడయి, ఆ కృషి చేస్తూ అలసిపోకపోతే అలాంటి వ్యక్తిని అల్లాహ్ తలక్రిందులుగా నరకంలో పడవేస్తాడు." ఇబ్నె అబ్బాస్ (రజిఅన్) ఉల్లేఖనంలో-"తన సంరక్షణ, తన ఇంటిల్లిపాది సంరక్షణ ఏ విధంగా చేస్తాడో ఆ విధంగా వారిని (ముస్లింలను) సంరక్షించలేకపోతే....." అని ఉంది. (త్రిబాని - కితాబుల్ ఖరాజ్)

٣١١ عَنْ يَزِيْدِ بْنِ أَبِي سُفْيَانَ قَالَ، قَالَ أَبُوْبَكْرٍ حِيْنَ بَعَثَنِيْ إِلَى الشَّامِ،
يَا يَزِيْدُ، إِنَّ لَكَ قَرَابَةً عَسَيْتَ أَنْ تُؤْثِرَهُمْ بِالْإِمَارَةِ وَذَالِكَ أَكْبَرُ
مَا أَخَافُ عَلَيْكَ، فَإِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: مَنْ
وَّلِيَ مِنْ أَمْرِ الْمُسْلِمِيْنَ شَيْئًا فَأَمَّرَ عَلَيْهِمْ أَحَدًا مُّحَابَاةً، فَعَلَيْهِ
لَعْنَةُ اللّٰهِ لَا يَقْبَلُ اللّٰهُ مِنْهُ صَرْفًا وَّلَا عَدْلًا حَتّٰى يُدْخِلَهُ جَهَنَّمَ۔

(کتاب الخراج، امام ابویوسفؒ)

311. యజీద్ బిన్ అబూ సుఫ్యాన్ ఉల్లేఖనం: అబూబక్ర్ (రజిఅన్) నన్ను సేనాధిపతిగా నియమించి సిరియా వైపునకు పంపినప్పుడు ఈ విధంగా ఉపదేశించారు:"యజీద్! నీకు కొందరు బంధువులున్నారు. అధికారులుగా నియమించటంలో వారికి నీవు ప్రాధాన్యత ఇవ్వడం జరగవచ్చు. నీ గురించి నాకున్న పెద్ద భయమిదే. మహాప్రవక్త ఏమని చెప్పారంటే ముస్లిమ్‌ల సామూహిక వ్యవహారాలకు బాధ్యుడయిన వ్యక్తి బంధుప్రీతితో లేక ఆశ్రిత పక్షపాతంతో పదవులలో నియామకాలు చేస్తే అతనికి అల్లాహ్ అభిశాపం కలుగుతుంది. అల్లాహ్ అతను చేసిన ఏ ప్రాయశ్చిత్తాన్ని, ఏ పరిహారాన్నీ స్వీకరించడు, చివరికి అతన్ని నరకంలో పడవేయడం జరుగుతుంది."

(కితాబుల్ ఖరాజ్ : ఇమామ్ అబూ యూసుఫ్)

---

308. "సంరక్షకుడు" అంటే కనిపెట్టుకుని ఉండేవాడు, వారిపాలన, పోషణ, శిక్షణ, సంస్కరణ, సంరక్షణ అన్నిటికీ బాధ్యుడు అని భావం. తన అండలో ఉన్నవారి సుశిక్షణ, సంరక్షణల ఎడల అతడు నిర్లక్ష్యం చూపినట్లయితే, వారు పెడదారిన పోయేలా అలక్ష్యంగా ప్రవర్తిస్తే అల్లాహ్ అతన్ని ప్రళయానంతరం గణన దినాన ఈ విషయాలను గురించి విచారిస్తాడు.

309. ద్రోహమన్నది ఏ పరిస్థితిలోనూ సహించరానిదే, కాని సమాజానికి నాయకత్వం వహించేవారే నమ్ముకున్న వారికి అన్యాయం చేస్తే వారి ద్రోహం క్షమార్హం కాగలుగుతుందా? అందుకే స్వర్గం వారికి ప్రాప్తం కాకుండా నిషేధిస్తాడు దేవుడు.

٣١٢ قَالَتْ اَسْمَاءُ بِنْتُ عُمَيْسٍ: إِنَّ أَبَا بَكْرٍ قَالَ لِعُمَرَ: يَا ابْنَ الْخَطَّابِ إِنِّيْ إِنَّمَا اسْتَخْلَفْتُكَ نَظَرًا لِّمَا خَلَّفْتُ وَرَائِيْ، وَقَدْ صَحِبْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَرَأَيْتَ مِنْ اَثَرَتِهٖ اَنْفُسَنَا عَلٰى نَفْسِهٖ وَاَهْلَنَا عَلٰى اَهْلِهٖ حَتّٰى إِنْ كُنَّا لَنَظَلُّ لَنُهْدِيْ إِلٰى اَهْلِهٖ مِنْ فُضُوْلِ مَا يَاتِيْنَا عَنْهُ۔ (کتاب الخراج، امام ابویوسفؒ)

312. అస్మా బిన్తు ఉమైస్ ఇలా తెలిపారు: హజ్రత్ అబూ బక్ర్, హజ్రత్ ఉమర్‌ని సంబోధించి పలికారు, "ఖత్తాబ్ కుమారా! ముస్లిమ్‌లపట్లగల ప్రేమానురాగాల దృష్ట్యా నేను నిన్ను ఖలీఫాగా ఎంపిక చేశాను, నీవు దైవ సందేశహరుని సహచర్యంలో ఉన్నావు. మహాప్రవక్త ఏ విధంగా తనకంటే మనకు, తన ఇంటి వారి కంటే మన ఇంటివారికి ప్రాధాన్యత ఇచ్చే వారో నీవు స్వయంగా చూశావు. చివరికి ఆయన ద్వారామాకు లభించిన దాంట్లో మిగిలింది మేము ప్రవక్త ఇంటికి కానుకగా పంపేవాళ్ళం, గుర్తుందా." అని పలికారు. *(కితాబుల్ ఖరాజ్ - ఇమామ్ అబూ యూసుఫ్)*

---

310. ఈ హదీసు కూడా గత హదీసు మాదిరిగానే సంఘ నాయకుల బాధ్యతను వివరిస్తోంది. మనిషి సామూహిక విషయాల్లో ఏదైనా బాధ్యతను స్వీకరిస్తే అది పెద్దదయినా చిన్నదయినా, తన సొంత ప్రయోజనాలకు మించిన శ్రద్ధ ఆ బాధ్యత నిర్వహణలో చూపడం అవసరమని మహాప్రవక్త (సఅసం) ఉద్బోధ హెచ్చరిస్తోంది. తన సొంత విషయాల్లోనైతే అంతులేని ఆరాటం వ్యక్తపరచి తాను స్వీకరించిన బాధ్యత పట్ల అశ్రద్ధ చూపే వ్యక్తి ప్రపంచంలో ఎన్ని సాకులు చెప్పి ఎన్ని కల్లబొల్లి మాటలతో తప్పించుకున్నా పరలోకంలో మాత్రం సర్వజ్ఞాని అయిన విశ్వ ప్రభువు సమక్షంలో అతని కుంటి సాకులన్నీ బట్టబయలయి పోతాయి. అక్కడ ఘోర పరాభవం, వ్యధాభరితమైన యాతన అతన్ని చుట్టుముట్టుతాయి.

311. ఎవరయినా బాధ్యతాయుతమయిన స్థానాన ఉన్నప్పుడు అతని చుట్టూ బంధువులు, అగత్యపరులు ముసురుకోవడం సహజం. అతని అధికారాలు చెలామణి అయ్యే మేరకు అతనితో ప్రయోజనం పొందడానికి కృషి చెయ్యడం కూడా మామూలే. అలాంటి పరిస్థితిలో బాధ్యతాయుతమయిన పదవిలో ఉన్న వ్యక్తి మెలుకువతో వ్యవహరించడం అవసరం. బంధువులకు మిత్రులకూ పదవుల

٣١٣ خَطَبَ عُمَرُ بْنُ الْخَطَّابِ رَضِيَ اللّٰهُ عَنْهُ فَقَالَ: "أَيُّهَا النَّاسُ، إِنَّ لَنَا عَلَيْكُمْ حَقَّ النَّصِيحَةِ بِالْغَيْبِ وَالْمَعُوْنَةِ عَلَى الْخَيْرِ، أَيُّهَا الرِّعَاءُ، إِنَّهُ لَيْسَ مِنْ حِلْمٍ أَحَبَّ إِلَى اللّٰهِ وَلَا أَعَمَّ نَفْعًا مِّنْ حِلْمِ إِمَامٍ وَّ رِفْقِهٖ، وَلَيْسَ مِنْ جَهْلٍ أَبْغَضَ إِلَى اللّٰهِ وَأَعَمَّ ضَرَرًا مِّنْ جَهْلِ إِمَامٍ وَّخَرَقِهٖ." (کتاب الخراج - امام ابویوسفؒ)

313. హజ్రత్ ఉమర్ (రజిఅన్) అమీరుల్ మోమినీన్ (ఖలీఫా) గా (ప్రభుత్వాధికారులు, ప్రజలు పాల్గొన్న ఒక సమిష్టి సమావేశంలో) ప్రసంగిస్తూ ఇలా చెప్పారు: "జనులారా! మీరు మా వెనక మా మంచిని కోరుకునేవారుగా సత్కార్యాల్లో మాకు తోడ్పడేవారుగా మెలగాలి.ఇది మీపై మాకున్న హక్కు.అధికారుల్లారా! అధికారిలోని సహనశీలత, హృదయ మార్దవం కంటే లాభకరమయింది, అల్లాహ్‌కు ప్రియమయింది మరొక సహనగుణం లేదు. అలాగే, అధికారి మూర్ఖత్వం, అతని దుష్ప్రవర్తన కంటే నష్టకరమయింది, అల్లాహ్‌కు అప్రియమయింది మరొకటి లేదు." (కితాబుల్ ఖరాజ్ – ఇమామ్ అబూ యూసుఫ్)

---

పంపిణిలో, ఏ విధమయిన పక్షపాతం, దురభిమానాలకూ చోటు ఇవ్వకుండా మెలగాలి, విచక్షణారహితంగా వ్యవహరించాలి. అది ప్రపంచంలోనూ అతని కార్యనిర్వహణకు మచ్చ రానీయకుండా, సజావుగా సాగేలా చేస్తుంది. పరలోకంలోనూ అతన్ని దైవాగ్రహానికి గురికాకుండా కాపాడుతుంది.

312. దేవుని అంతిమ సందేశహరుడు (సఅసం) తన పరిపూర్ణ ఆదర్శంతో ఒక ఉత్తమ పరిపాలకుడుగా వ్యవహరించిన తీరు మనకు ఈ ఉల్లేఖనం ద్వారా తెలుస్తోంది. ఆయన (సఅసం) ఒక నాయకునిగా తన కంటే తన సహచరుల శ్రేయాన్నీ వారి బాగోగుల్నీ కాంక్షించే వారనీ, తన ఇంటి వారి యోగక్షేమాలకంటే తన సహచరుల ఇంటి వారి పట్ల ఆయనకు శ్రద్ధ అధికంగా ఉండేదని మనకు తెలుస్తోంది. ఆయన ఔదార్యం ఏ మేరకు పోయిందంటే ఆయన తన సహచరులకు వారి వాటాగా (పారితోషికంగా) ఇచ్చిన దాన్నుండి వారు తిరిగి ఆయనకు కానుకగా పంపిస్తే తప్ప ఆయనకు ఇల్లు గడిచేది కాదు. ఆ నాయకత్వపు ఉన్నత ఆదర్శం, ఆ ఆదర్శాన్ని అనునిత్యం గుర్తుంచుకుని, పరస్పరం దాన్ని జ్ఞాపకం చేసుకునే ఆ సహచరుల ఆదర్శం నేటి నాయకులకు వారి అనుయాయులకు అనుసరణీయం కాదా?

٣١٤ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "اَلسَّمْعُ وَالطَّاعَةُ عَلَى الْمَرْءِ الْمُسْلِمِ فِيْمَا أَحَبَّ وَكَرِهَ مَا لَمْ يُؤْمَرْ بِمَعْصِيَةٍ، فَإِذَا أُمِرَ بِمَعْصِيَةٍ فَلَا سَمْعَ وَلَا طَاعَةَ" (متفق عليه - ابن عمرؓ)

314. మహాప్రవక్త ఇలా ప్రవచించారు: "ముస్లిమ్‌లు తమ నాయకుల ఆజ్ఞల్ని వినడం, పాలించడం అత్యావశ్యం. ఆ ఆదేశం వారి నైజానికి అనుకూలమయినదయినా, ప్రతికూలమయినదయినా దాన్ని పాటించ వలసిందే. ఎటొచ్చీ అది పాప కార్యం మాత్రం కాకూడదు. అయితే దైవ అవిధేయతకు దారి తీసే ఆజ్ఞ ఇచ్చినప్పుడు మాత్రం వారి మాటను వినకూడదు, ఆజ్ఞల్ని పాలించకూడదు."

(ముత్తఫకున్ అలైహి - ఇబ్నె ఉమర్)

---

313. నాయకులకు అనుయాయుల తోడ్పాటు, సహకారం లేకపోతే వారు ఒక్క క్షణం కూడా తమ బాధ్యతల్ని సక్రమంగా నిర్వహించలేరు. అనుయాయులు తమ నాయకులపట్ల శ్రేయోభిలాషులుగా ఉంటే అది ఆ నాయకత్వంలో నిర్వహించబడుతున్న మహత్కార్యానికి ఎంతో బలాన్ని చేకూర్చుతుంది. శ్రేయోభిలాష ఏమిటంటే వారి సత్కార్యాల్లో పూర్తిగా తోడ్పాటును అందజేయటం, వారు ఎప్పుడయినా వక్రమార్గాన పోయినట్లు కనిపిస్తే వెంటనే వారిని హెచ్చరించి సరయిన బాట వైపునకు మళ్ళించటం. అనుయాయులు అలా చెయ్యకపోతే అది వారి కర్తవ్య నిర్వహణలోని వైఫల్యాన్ని సూచిస్తుంది. అలాగే నాయకులు సహనశీలురు, మృదుహృదయులు కాకపోతే అది వారి కార్యనిర్వహణలో అవరోధాలు సృష్టించడమే కాక అల్లాహ్ వద్దకూడా వారిని కించపరుస్తుంది.

314. ముస్లిం సమాజం ఒక సంఘటిత సమాజంగా, క్రమశిక్షణగల సమాజంగా ఉండాలని ఇస్లాం అభిలషిస్తుంది. వ్యవస్థ అన్న తరువాత నాయకత్వానికి విధేయత పాటించకపోతే అది సక్రమంగా నడవజాలదు. అందువల్లనే సభ్యులు తమకు ఇష్టం కాని పనులు సంఘం కొరకు చెయ్యవలసి వస్తే క్రమశిక్షణగల సభ్యులుగా వాటిని ఆచరిస్తారు. ఇంతకు ఆ సంఘ సిద్ధాంతాలకు వ్యతిరేకమైనవి, దాన్ని నష్టం కలిగించే ఆజ్ఞలనైతే, సంఘం, ఏ సంస్థ, ఏ సమాజమూ ఆచరించమని కోరదు, పైగా అలాంటి చర్యలను బోధించే, చేసే వారిని సంఘవిద్రోహులుగా పరిగణించడం జరుగుతుంది. వారిని సాధ్యమయిన సందర్భాల్లో శిక్షించడం కూడా జరుగుతుంది - అలా ద్రోహానికి పాల్పడేవారు వారి నాయకులయినా సరే.

۳۱۵ عَنْ تَمِیْمِ الدَّارِیِّ، اَنَّ النَّبِیَّ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ قَالَ:
"اَلدِّیْنُ النَّصِیْحَۃُ" ثَلَاثًا - قُلْنَا: لِمَنْ؟ قَالَ: "لِلّٰہِ وَلِرَسُوْلِہٖ وَلِکِتَابِہٖ
وَلِاَئِمَّۃِ الْمُسْلِمِیْنَ وَعَامَّتِہِمْ" - (مُسلم)

315. తమీమ్ దారీ (రజిఅన్) ఉల్లేఖనం ప్రకారంః మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు, "దీన్ (ధర్మం) చిత్తశుద్ధితో కూడిన శ్రేయోభిలాషకు మారుపేరు." ఈ మాట ఆయన మూడు మార్లు సెలవిచ్చారు. మేమడిగాము, ఈ శ్రేయోభిలాష ఎవరిపట్ల? అని. "అల్లాహ్ పట్ల, ఆయన సందేశహరుని పట్ల, ఆయన గ్రంథం పట్ల, ముస్లిమ్‌ల అమీర్ (నాయకుని) పట్ల, వారి సామాన్య ప్రజలపట్ల" అని బదులిచ్చారు ఆయన. (ముస్లిమ్)

---

315. అసలు హదీస్‌లో నసీహత్ అనే పదం వాడబడింది. ఇది విశ్వాస ఘాతుకానికి, వంచనకు, కల్తీ మాలిన్యాలకు వ్యతిరేకార్థంలో వాడబడుతుంది. దానికి నిష్కల్మష విశ్వాసమనీ, నిస్వార్థ శ్రేయోభిలాష అనీ అర్థం వస్తుంది. అల్లాహ్ పట్ల విశ్వసనీయత అంటే, దైవ గ్రంథంపట్ల, ఆయన ప్రవక్తల ఎడల విశ్వసనీయత అంటే ఏమిటో వెనుక ఒక అధ్యాయం(విశ్వాసాలు)లో వివరించడమయింది. అలాగే ముస్లిమ్ జనసామాన్యం ఎడల శ్రేయోభిలాష అంటే "సామాజిక వ్యవస్థ"లో ప్రస్తావించబడింది. ఇకపోతే ముస్లింల సామూహిక వ్యవహారాలకు బాధ్యులయిన వారిపట్ల విశ్వసనీయత అంటే, వారి ఎడల ప్రేమ భావం ఉండాలనీ, వారాజ్ఞలిచ్చినప్పుడు వాటిని విశ్వసనీయంగా పాలించాలని, సందేశ ప్రచార కార్యనిర్వహణల్లో వారితో సంతోషంగా సహకరించాలనీ, వారు తప్పుదారిన పోయినపుడు ప్రేమతో వారిని వారించాలనీ అర్థం. ఎవరయినా నాయకుల్ని తప్పు మార్గాన చూసినప్పటికీ వారిని వారించకపోతే వారు నాయకుని శ్రేయం కోరేవారు ఏ మాత్రం కాదు. కీడు ఎంచే వారుగనే పరిగణించబడతారు. ఈ ఉపేక్షా భావం సంఘం పట్ల విశ్వాస ఘాతుకంగా పేర్కొనబడుతుంది. అయితే నాయకులన్నవారు కూడా నిష్కల్మష హృదయంతో చేసే విమర్శను సహించాలి. కేవలం సహించడమే కాదు, తాము ఇలాంటి విమర్శను హర్షిస్తామనే భావం, ఇటువంటి వ్యక్తులపట్ల ప్రేమగా వ్యవహరిస్తామనే అభిప్రాయం, వారు మంచిని కోరి చేసే విమర్శకు బదులుగా వారికి ఆశీస్సులే ఇస్తామనే భావం తమ అనుయాయుల్లో జనింపజేయాలి. ఈ విషయంలో ఎవరయినా అసభ్యంగా ప్రవర్తిస్తే వారిని, అసభ్యంగా మాట్లాడకూడదని సానుభూతితో, ప్రేమతో మందలించాలి. ఒకసారి హజ్రత్ ఉమర్ (రజిఅన్) ను ఏదో విషయం మీద ప్రశ్నించారు ఒకరు. మరో వ్యక్తి అమీరుల్ మోమినీన్ (ఖలీఫా) హోదానీ ఆయన గొప్పతనాన్ని దృష్టిలో పెట్టుకుని ఆ ప్రశ్నించే వ్యక్తిని మందలించదలిస్తే హజ్రత్ ఉమర్ (రజిఅన్) అతన్ని వారించారు.

دَعْهُ لَاخَيْرَ فِيهِمْ إِنْ لَّمْ يَقُولُوهَا لَنَا - وَلَاخَيْرَ فِينَا إِنْ لَّمْ نَقْبَلْ -

(کتاب الخراج - امام ابویوسفؒ)

"అతన్ని చెప్పనీ. మాతో ప్రజలు ఇలా చెప్పకపోతే వీరిలో "మంచి" అన్నది లేదన్నమాట. అలాగే మేము వారు శ్రేయం కోరి పలికే మాటల్ని స్వీకరించకపోతే మాలోనూ మంచి నశించిందన్నమాట!"

ఇలాంటి అనేక ఉదాహరణలు మన పూర్వీకులు ఎన్నో వదలి వెళ్ళారు. వీటిలో ఉభయులకూ-నాయకులకు, అనుయాయులకు - మార్గదర్శకజ్యోతి ఉంది. మరొక ఉదాహరణ ఇస్తున్నాము. హజ్రత్ ఉమర్ (రజిఅన్) పై ఖిలాఫత్ బాధ్యత వచ్చిపడినప్పుడు అబూ ఉబైదా (రజిఅన్), ముఆజ్ బిన్ జబల్ కలసి ఒక ఉత్తరం వ్రాశారు. దాని ప్రతి పదంలో శ్రేయోభిలాష, ప్రేమ, సహృదయత ఉట్టిపడుతున్నాయి, చదవండి :

مِنْ أَبِي عُبَيْدَةَ بْنِ الْجَرَّاحِ وَمُعَاذِ بْنِ جَبَلٍ إِلَى عُمَرَ بْنِ الْخَطَّابِ-

سَلَامٌ عَلَيْكَ - أَمَّا بَعْدُ :

فَإِنَّا عَهِدْنَاكَ وَأَمْرُ نَفْسِكَ لَكَ مُهِمٌّ ، فَأَصْبَحْتَ قَدْ وُلِّيْتَ أَمْرَ هٰذِهِ الْأُمَّةِ أَحْمَرِهَا وَأَسْوَدِهَا ، يَجْلِسُ بَيْنَ يَدَيْكَ الشَّرِيْفُ وَالْوَضِيْعُ وَالْعَدُوُّ وَالصَّدِيْقُ ، وَلِكُلٍّ حِصَّةٌ مِّنَ الْعَدْلِ ، فَانْظُرْ كَيْفَ أَنْتَ عِنْدَ ذٰلِكَ يَا عُمَرُ ! وَإِنَّا نُحَذِّرُكَ يَوْمًا تَعْنُوْ فِيْهِ الْوُجُوْهُ ، وَتَجِفُ فِيْهِ الْقُلُوْبُ ، وَتَنْقَطِعُ فِيْهِ الْحُجَجُ لِحُجَّةِ مَلِكٍ قَهَرَهُمْ بِجَبَرُوْتِهِ ، فَالْخَلْقُ دَاخِرُوْنَ لَهُ ، يَرْجُوْنَ رَحْمَتَهُ ، وَيَخَافُوْنَ عِقَابَهُ وَإِنَّا كُنَّا نُحَدَّثُ أَنَّ أَمْرَ هٰذِهِ الْأُمَّةِ سَيَرْجِعُ فِي اٰخِرِ زَمَانِهَا إِلَى أَنْ يَّكُوْنُوْا إِخْوَانَ الْعَلَانِيَةِ أَعْدَاءَ السَّرِيْرَةِ وَإِنَّا نَعُوْذُ بِاللّٰهِ أَنْ يَّنْزِلَ كِتَابُنَا إِلَيْكَ سِوَى الْمَنْزِلِ الَّذِيْ نَزَلَ فِيْ قُلُوْبِنَا ، فَإِنَّمَا كَتَبْنَا بِهِ نَصِيْحَةً لَّكَ وَالسَّلَامُ عَلَيْكَ -

"ఉమర్ బిన్ ఖత్తాబ్ గారికి, అబూ ఉబైదా బిన్ జర్రాహ్, ముఆజ్ బిన్ జబల్ వ్రాసుకున్న లేఖ :

సలామున్ అలైక !

(మీపై శాంతి కలుగుగాక !)

మీరు గతంలో తమ వ్యక్తిగత సంస్కరణ, శిక్షణ, పరిరక్షణపై శ్రద్ధచూపుతూ ఉండటం మేము చూసిందే. అయితే ఇప్పుడు యావత్తు ముస్లిం సమాజం మంచీ చెడుల పరిరక్షణాభారం మీపై వచ్చిపడింది. ఇప్పుడు మీ చుట్టూ చేరి కూర్చునేవారిలో శ్రేష్ఠులు ఉంటారు, అధములు కూడా ఉంటారు. శత్రువులు, మిత్రులు అంతా చేరుతారు. అయితే న్యాయంలో అందరికీ వాటా ఉంది. ఓ ఉమర్ ! ఇలాంటి పరిస్థితుల్లో మీరు ఎలా ప్రవర్తించాలో బాగా ఆలోచించుకోండి.

ఆ రోజు గురించి-ఏ రోజయితే జనులు తలలు దించుకుని, వారి హృదయాలు భయం చేత కంపిస్తూ నిలబడి ఉంటారో, ఏ రోజైతే సర్వశక్తి మాన్యుడు ప్రచండ శక్తిమంతుడు అగ్రాహాదగ్రుడయిన దైవం చూపే ఆధారాల సమక్షంలో అందరి సంజాయిషీలూ నిరుపయోగమైపోతాయో - ఆ రోజును గురించి మేము మిమ్మల్ని భయపెడుతున్నాము. ఆ రోజు ఆయన ముందు అందరూ దీనులే, నిస్సహాయులే. అందరూ ఆయన కారుణ్యాన్ని కాంక్షిస్తూ ఆయన శిక్షకు భీతిల్లుతూ ఉంటారు.

ఇంకా, మేమొక హదీసు విన్నాము, "ఈ అనుచర సంఘం (ముస్లిములు) చివరి రోజుల్లో (ప్రళయ కాలానికి సమీపంలో) బయటికి మాత్రం మిత్రులుగా ఉంటారు, కాని ఆంతర్యాల్లో శత్రువులై ఉంటారు."

మా ఈ ఉత్తరానికి మేము ఉద్దేశించని భావాన్ని మీరు అంటకట్టకుండా మేము దైవాన్ని రక్షణ వేడుకుంటున్నాము. మేము ఈ ఉత్తరాన్ని కేవలం నిష్కల్మష హృదయంతో శ్రేయం కోరుతూ సద్భావంతో మాత్రమే వ్రాశాము. వస్సలాం."

ఈ ఉత్తరం అమీరుల్ మోమినీన్ హజ్రత్ ఉమర్(రజిఅన్)కు అందగానే ఆయన దానికి ఈక్రింది బదులిచ్చారు:

مِنْ عُمَرَ بْنِ الْخَطَّابِ إِلَى أَبِي عُبَيْدَةَ وَمُعَاذٍ سَلَامٌ عَلَيْكُمَا، أَمَّا بَعْدُ:- فَقَدْ أَتَانِي كِتَابُكُمَا تَذْكُرَانِ أَنَّكُمَا عَهِدْتُمَانِي وَأَمْرُ نَفْسِي لِي مُهِمٌّ، فَأَصْبَحْتُ قَدْ وُلِّيتُ أَمْرَ هٰذِهِ الْأُمَّةِ أَحْمَرِهَا وَأَسْوَدِهَا - يَجْلِسُ بَيْنَ يَدَيَّ الشَّرِيفُ وَالْوَضِيعُ وَالْعَدُوُّ وَالصَّدِيقُ - وَلِكُلٍّ حِصَّةٌ مِّنَ الْعَدْلِ كَتَبْتُمَا فَانْظُرْ كَيْفَ أَنْتَ عِنْدَ ذٰلِكَ يَا عُمَرُ؟ " وَإِنَّهُ لَا حَوْلَ وَلَا قُوَّةَ

عِنْدَ عُمَرَ عِنْدَ ذٰلِكَ اِلَّا بِاللّٰهِ عَزَّ وَجَلَّ ، وَكَتَبْتُمَا تُحَذِّرَانِنِي مَا حُذِّرَتْ
عَنْهُ الْأُمَمُ قَبْلَنَا ، وَقَدِيْمًا كَانَ اخْتِلَافُ اللَّيْلِ وَالنَّهَارِ بِاٰجَالِ
النَّاسِ يُقَرِّبَانِ كُلَّ بَعِيْدٍ ، وَيُبْلِيَانِ كُلَّ جَدِيْدٍ ، وَيَاْتِيَانِ بِكُلِّ
مَوْعُوْدٍ ، حَتّٰى يَصِيْرَ النَّاسُ إِلٰى مَنَازِلِهِمْ مِنَ الْجَنَّةِ وَالنَّارِ ،

كَتَبْتُمَا تُحَذِّرَانِنِي أَنَّ اَمْرَ هٰذِهِ الْأُمَّةِ سَيَرْجِعُ فِي اٰخِرِ زَمَانِهَا
إِلٰى أَنْ يَّكُوْنُوْا إِخْوَانَ الْعَلَانِيَةِ اَعْدَاءَ السَّرِيْرَةِ " وَلَسْتُمْ بِأُولٰٓئِكَ ، وَ
لَيْسَ هٰذَا بِزَمَانِ ذَاكَ ، وَذٰلِكَ زَمَانٌ تَظْهَرُ فِيْهِ الرَّغْبَةُ وَالرَّهْبَةُ ،
تَكُوْنُ رَغْبَةُ النَّاسِ بَعْضِهِمْ إِلٰى بَعْضٍ لِصَلَاحِ دُنْيَاهُمْ ،

كَتَبْتُمَا تُعَوِّذَانِنِي بِاللّٰهِ أَنْ أُنْزِلَ كِتٰبَكُمَا سِوَى الْمَنْزِلِ الَّذِيْ
نَزَلَ مِنْ قُلُوْبِكُمَا ،

وَأَنَّكُمَا كَتَبْتُمَا بِهِ نَصِيْحَةً لِّيْ ، وَقَدْ صَدَقْتُمَا ، فَلَا تَدَعَا
الْكِتَابَةَ إِلَيَّ ، فَإِنَّهُ لَا غِنٰى لِيْ عَنْكُمَا ، وَالسَّلَامُ عَلَيْكُمَا -

(المسلمون، فروری ۱۹۵۷ء)

అబూ ఉబైదా, ముఆజ్‌లకు ఉమర్ వ్రాసే లేఖ, మీ ఇద్దరికీ సలాములు.

మీరు ఇద్దరూ కలిసి వ్రాసిన ఉత్తరం అందింది. అందులో ఇంతకు ముందు నేను నా వ్యక్తిగత శిక్షణా సంరక్షణలకై పాటుపడుతుండగా మీరు చూసారని, ఇప్పుడు నా నెత్తిన సకల ముస్లిముల శిక్షణ, సంరక్షణ భారం వచ్చిపడిందనీ, నా చుట్టూ ఉన్నతులయినవారు, నీచులు, చేరి కూర్చుంటారనీ, మిత్రులూ, శత్రువులూ నా వద్దకు వస్తారని ప్రతి వ్యక్తికీ న్యాయం జరగడం అన్నది ఆ వ్యక్తి హక్కనీ మీరు వ్రాశారు. ఇంకా, "ఉమర్! ఇలాంటి పరిస్థితుల్లో నీవు ఎలా ప్రవర్తించాలో బాగా ఆలోచించుకొమ్మని మీరిద్దరు వ్రాశారు. - దానికి బదులు ఇంతకంటే ఏమని ఇవ్వమంటారు: ఉమర్ వద్ద యుక్తి లేదు, శక్తీలేదు. అతనికి శక్తి లభించే చోటేదయినా ఉంటే అది కేవలం అల్లాహ్ వద్దనే లభించగలదు. ఆ తరువాత మీరు మన పూర్వీకులనుభయపెట్టడం జరిగిన పర్యవసానాన్ని గురించి నన్ను హెచ్చరించారు.

# సత్యం పట్ల ప్రేమ, మిథ్య పట్ల ద్వేషం

٣١٦ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ وَقَّرَ صَاحِبَ بِدْعَةٍ فَقَدْ اَعَانَ عَلٰى هَدْمِ الْإِسْلَامِ۔" (مشكوٰة-ابراهيم بن ميسرةؒ)

316. మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "ఎవరు ఒక "బిద్ అతీ"ని గౌరవిస్తారో వారు (అలా చేసి) ఇస్లామ్‌ను అంతమొందించడంలో సహకరించారని అర్థం." (మిష్కాత్ - ఇబ్రాహీమ్ బిన్ మైసర)

---

మానవ జీవితాన్ని అంటిపెట్టుకున్న ఈ రేయింబవళ్ళ పరిభ్రమణం దూరంగా ఉన్నదాన్ని చేరువగా తెస్తోంది. ప్రతి ఆధునికానికి పురాతనం ఆపాదిస్తోంది. భవిష్యద్వచనాల్ని ఒక్కొక్కదాన్నే ముందుకు తెస్తోంది. చివరికి ఈ లోకానికి వయసు చెల్లిపోతుంది. పరలోకం ప్రభవిస్తుంది. అందులో ప్రతి వ్యక్తి స్వర్గానికో నరకానికో చేరిపోతాడు.

ఇంకా, ఈ అనుచర సంఘం (ముస్లిం సంఘం) లోని వారు చివరి కాలంలో బయటికి మిత్రులుగా కనిపించినా లోపల శత్రువులే అయి వుంటారనీ మీరు హెచ్చరించారు. అయితే బాగా జ్ఞాపకముంచుకోండి, ఈ భవిష్యద్వార్త ఎవరి గురించి ఇవ్వబడిందో వారు మీరు కారు. ఈ కాలమూ ఆ కాలం కాదు - ఇలాంటి కపటాచారం బయట పడటానికి! ఆ కాలం వస్తే అప్పుడు మనుషులు ప్రాపంచిక లాభాలకోసం అన్యోన్యంగా ప్రేమాభిమానాలతో మెలుగుతారు. కేవలం ప్రాపంచిక స్వలాభాలను రక్షించుకోడానికే ఒకరికొకరు భయపడతారు: అపార్థం చేసుకోకుండా దైవాన్ని శరణు కోరారు మీరు మీ లేఖలో. అలా ఎన్నటికీ జరగదు. మీరన్నది ముమ్మాటికీ సత్యం. మీరు నా మేలు కోరే ఆ లేఖ వ్రాశారు. ఇక ముందు కూడా వ్రాయడం మానివేయకండి. నేను మీ ఇద్దరి సదుపదేశాలకు అతీతుణ్ణి కాను. వస్సలాం."

316. "బిద్అతీ" అంటే, ఇస్లాంకు విరుద్ధమయిన లేక దానికి భిన్నమయిన ఏదయినా ఒక క్రొత్త దృక్పథాన్ని లేక ఆచరణను ప్రవేశపెట్టిన వ్యక్తి అన్నమాట. ఇస్లాం ఒక పటిష్ఠమయిన పరిపూర్ణజీవన వ్యవస్థ. అందులో ఏ అంగంపై దెబ్బతీసినా మొత్తం సౌధానికే ప్రమాదం ఏర్పడుతుంది. అలాంటప్పుడు ఇలాంటి వ్యక్తి ఇస్లాంను చెరిపివేయడానికి ప్రయత్నిస్తున్నాడనడంలో సందేహమేముంది? మరెవరు ఇలాంటి వ్యక్తిని ఆదరిస్తారో వారు ఇస్లాం నిర్మూలనానికి తోడ్పడిన వారు కారా? మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చిన దాని భావమేమంటే "బిద్అతీలకు ముస్లిం సమాజంలో గౌరవాదరణలు ప్రాప్తం కాకూడదు. వారి ఇలాంటి చర్యను ఏ మాత్రం సహించకూడదు.

٣١٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : لَا تَقُوْلَنَّ لِلْمُنَافِقِ سَيِّدٌ فَإِنَّهُ إِنْ يَكُنْ فَقَدْ اَسْخَطْتُمْ رَبَّكُمْ ـ (مشكوٰة)

317. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు : "మునాఫిక్ (కపటి)ని నాయకుడు అని అనకండి. ఇలా చేస్తే మీరు మీ ప్రభువు ఆగ్రహానికి గురవుతారు."
(మిష్కాత్)

٣١٨ عَنْ عَبْدِ اللّٰهِ بْنِ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ : " لَا تَعُوْدُوْا شُرَّابَ الْخَمْرِ إِذَا مَرِضُوْا ـ " (الادب المفرد)

318. "సారాయి త్రాగే వారు జబ్బుపడితే వారి పరామర్శకు వెళ్ళకండి" అని అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ అల్ ఆస్ బోధించారు.
(అల్ అదబుల్ ముఫ్రద్)

---

అయితే ఇలా ప్రవర్తించే ముందు ఆ వ్యక్తులకు వారు చేసే దారుణాన్ని గురించి తెలియచెప్పటం, నచ్చజెప్పటం ముఖ్యం. ఇలాంటి ధర్మ విచ్ఛేదక చర్య ఇహపరాలలో ఎలా పరిణమిస్తుందో సానుభూతితో, సహృదయతతో తెలియపరచడం అవసరం."

317. "మునాఫిక్" అంటే చెప్పేదానికి పూర్తిగా భిన్నంగా ప్రవర్తించేవాడని అర్థం. ఇస్లాం ఒక పరిపూర్ణమయిన జీవన వ్యవస్థగా రూపొంది మదీనాలో ఆచరణాత్మకంగా పాలకశక్తిగా పరిణమించింది. అప్పుడు కొందరు ఇస్లాం సిద్ధాంతాలను మనస్ఫూర్తిగా స్వీకరించలేకపోయినా తమ స్వప్రయోజనాల పరిరక్షణ కొరకు పైకి ముస్లింలుగా ప్రకటించుకున్నారు. వాస్తవానికి వారి కార్యకలాపాలన్నీ ఇస్లాంను లోలోపల గుల్ల చేయడానికే ! ఇలాంటి వారిని "నాయకుడు" అని అనకండి అనంటే, ఇస్లాం "సత్యత" లో విశ్వాసంలేని వ్యక్తినీ, ఇస్లాం బోధనలను గురించి సంశయాలు వెలిబుచ్చే వ్యక్తిని ఎట్టి పరిస్థితుల్లోనూ ముస్లింలు తమ నాయకుడుగా ఎన్నుకోరాదనీ, ఎన్నుకుంటే దైవాగ్రహానికి గురవుతారని భావం. దైవమే ఆగ్రహిస్తే మనిషికి ఇహపరాలలో ఆశ్రయం ఎక్కడ లభిస్తుంది?

318. భావమేమంటే, సారాయి ఒక నిషిద్ధమయిన పదార్థం. దాన్ని సేవించే మనిషి పలు శారీరక, మానసిక రుగ్మతలకు నిలయమై ఉంటాడు. అలాంటి హరాం కార్యాన్ని చేసే వ్యక్తి పట్ల తమ అయిష్టతను వ్యక్యపరిచేందుకు ఈ వైఖరిని అవలం బించాలి. అయితే అతన్ని సంస్కరించే ఉద్దేశ్యంతో అతనితో సఖ్యతగా మెలగడంలో తప్పులేదు.

۳۱۹ قَالَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ : "لَمَّا وَقَعَتْ بَنُوْ اِسْرَائِیْلَ فِی الْمَعَاصِیْ نَہَتْہُمْ عُلَمَاءُ ھُمْ فَلَمْ یَنْتَہُوْا فَجَالَسُوْھُمْ فِیْ مَجَالِسِہِمْ وَاٰکَلُوْھُمْ وَشَارَبُوْھُمْ فَضَرَبَ اللّٰہُ قُلُوْبَ بَعْضِہِمْ بِبَعْضٍ فَلَعَنَہُمْ عَلٰی لِسَانِ دَاؤُدَ وَعِیْسَی بْنِ مَرْیَمَ ، ذٰلِکَ بِمَا عَصَوْا وَکَانُوْا یَعْتَدُوْنَ - قَالَ : فَجَلَسَ رَسُوْلُ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ وَکَانَ مُتَّکِئًا فَقَالَ : "لَا ، وَالَّذِیْ نَفْسِیْ بِیَدِہٖ لَتَأْمُرُنَّ بِالْمَعْرُوْفِ وَلَتَنْہَوُنَّ عَنِ الْمُنْکَرِ وَلَتَأْخُذُنَّ عَلٰی یَدَیِ الظَّالِمِ وَلَتَأْطِرُنَّہٗ عَلَی الْحَقِّ أَطْرًا أَوْلَیَضْرِبَنَّ اللّٰہُ بِقُلُوْبِ بَعْضِکُمْ عَلٰی بَعْضٍ ثُمَّ لَیَلْعَنَنَّکُمْ کَمَا لَعَنَہُمْ -" (بیہقی - مشکوٰۃ - ابن مسعودؓ)

319. దైవ సందేశహరులు (సఅసం) ఇలా ప్రవచించారు. "బనీ యిస్రాయీల్ (ఇస్రాయీల్ సంతానం) దైవాజ్ఞల్ని ఉల్లంఘించడం మొదలెట్టినపుడు వారి ధర్మజ్ఞులు వారిని వారించారు. కాని వారు ధర్మజ్ఞుల మాటను వినలేదు. అయినా ఆ ధర్మజ్ఞులు వారితో కలిసి కూర్చోవడం మొదలెట్టారు. వారితో కలిసి తింటూ త్రాగుతూ గడప సాగారు. అప్పుడు అల్లాహ్ వారందరి హృదయాలను పరస్పరం సమానం చేసి వేశాడు. తరువాత హజ్రత్ దావూద్, మర్యం సుతుడు హజ్రత్ ఈసా నోటి ద్వారా వారిపైన అభిశాపాలు వర్షింపజేశాడు. ఇలా జరగటానికి కారణం వారు అవిధేయతావైఖరి అవలంబించి అందులో మితిమీరి పోవడమే." (ఈ హదీస్ ఉల్లేఖించి హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్) అన్నారు కదా, మహాప్రవక్త అప్పటి వరకు (గోడకు) ఆనుకుని కూర్చున్న వారల్లా లేచి సరిగ్గా కూర్చున్నారు, తిరిగి ఇలా సెలవిచ్చారు: "ఎవరి చేతుల్లో నా ప్రాణముందో ఆయనపై ఒట్టు, మీరు జనులకు మంచిని ఆదేశిస్తారు. వారిని చెడు నుండి అరికడతారు. అత్యాచారి చేతుల్ని స్వాధీనం చేసుకుంటారు. అత్యాచారిని సత్యానికి తలఒగ్గేలా చేస్తారు.

మీరు ఇలా చేయకపోతే మీ అంతర్యాలు సయితం పరస్పరం సమానమయిపోతాయి. అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని శాపగ్రస్తులుగా చేసి దూరం చేసివేస్తాడు. ఏ విధంగానయితే బనీ ఇస్రాయీల్ తో ఆయన వ్యవహరించాడో అలాగే మీతోనూ వ్యవహరిస్తాడు."

(బైహకీ, మిష్కాత్ - ఇబ్నె మస్ఊద్)

٣٢٠ عَنِ النُّعْمَانِ بْنِ بَشِيْرٍ قَالَ ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : مَثَلُ الْمُدْهِنِ فِىْ حُدُوْدِ اللّٰهِ وَالْوَاقِعِ مَثَلُ قَوْمٍ اِسْتَهَمُوْا سَفِيْنَةً ، فَصَارَ بَعْضُهُمْ فِىْ اَسْفَلِهَا وَصَارَ بَعْضُهُمْ فِىْ اَعْلَاهَا ، فَكَانَ الَّذِىْ فِىْ اَسْفَلِهَا يَمُرُّ بِالْمَاءِ عَلَى الَّذِيْنَ فِىْ اَعْلَاهَا ، فَتَأَذَّوْا بِهٖ فَأَخَذَ فَأْسًا ، فَجَعَلَ يَنْقُرُ اَسْفَلَ السَّفِيْنَةِ فَأَتَوْهُ فَقَالُوْا : مَالَكَ ؟ قَالَ : تَأَذَّيْتُمْ بِىْ وَلَا بُدَّ لِىْ مِنَ الْمَاءِ ، فَإِنْ أَخَذُوْا عَلٰى يَدَيْهِ اَنْجَوْهُ وَنَجَّوْا اَنْفُسَهُمْ وَإِنْ تَرَكُوْهُ أَهْلَكُوْهُ وَأَهْلَكُوْا اَنْفُسَهُمْ ـ" (بخارى)

320. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా బోధించారు : "అల్లాహ్ ఆజ్ఞల్ని ఉల్లంఘించే వ్యక్తి అలా చేస్తూ ఉండగా చూసి అతన్ని వారించక అతని చర్యపట్ల సహనం కనబరచే వ్యక్తి-వీరిద్దరి ఉదంతం ఈ విధంగా ఉంటుంది: కొందరు కలిసి ఒక నావను తీసుకున్నారు. (ఆ నావకు రెండంతస్తులున్నాయి) పాచికవేసి కొందరు క్రింది అంతస్తు లోను మరి కొందరు పై అంతస్తులోను కూర్చున్నారు. క్రింది అంతస్తువారు తమకు నీరు కావలసినప్పుడు పై అంతస్థు వారిని దాటుకుంటూ పోయి నీరు తెచ్చుకునే వారు. అప్పుడు పై అంతస్తు వారికి ఇబ్బంది కలిగేది. కడకు క్రింది అంతస్తు వారు గొడ్డలి తీసుకొని నావ అడుగుభాగాన్ని చీల్చడానికి ఉపక్రమించారు. పై అంతస్తువారు వచ్చి "ఇదేమని" అడిగితే, నీటికోసం మా రాకపోకల కారణంగా మీకు కష్టం కలుగుతోంది. అందుచేత ఇలా చేయవలసి వచ్చింది. ఇప్పుడు అడుగును చీల్చి సముద్రంనుండి నీరు తీసుకుంటాము అని బదులిచ్చారు. మహాప్రవక్త ఈ ఉపమానాన్ని

పేర్కొని, "ఇప్పుడు పై అంతస్తు వారు క్రింది అంతస్తు వారిని వారించి నావను చీల్చకుండా ఆపినట్లయితే క్రింది అంతస్తు వారినీ రక్షించ గలుగుతారు. తాము కూడా రక్షించబడతారు. అలాకాక మౌనంవహిస్తే వారినీ ముంచి వేస్తారు, తాము కూడా నిలువునా మునిగి పోతారు."

(బుఖారి)

## మంచిని పెంచటం, చెడును త్రుంచటం

٣٢١ خَطَبَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ ذَاتَ يَوْمٍ فَأَثْنٰى عَلٰى طَوَائِفَ مِنَ الْمُسْلِمِيْنَ خَيْرًا ثُمَّ قَالَ: "مَا بَالُ اَقْوَامٍ لَا يُفَقِّهُوْنَ جِيْرَانَهُمْ وَلَا يُعَلِّمُوْنَهُمْ وَلَا يَعِظُوْنَهُمْ؟ وَمَا بَالُ اَقْوَامٍ لَا يَتَعَلَّمُوْنَ مِنْ جِيْرَانِهِمْ وَلَا يَتَفَقَّهُوْنَ وَلَا يَتَّعِظُوْنَ؟ وَاللّٰهِ لَيُعَلِّمَنَّ قَوْمٌ جِيْرَانَهُمْ وَيُفَقِّهُوْنَهُمْ وَيَأْمُرُوْنَهُمْ وَيَنْهَوْنَهُمْ وَلَيَتَعَلَّمَنَّ قَوْمٌ مِّنْ جِيْرَانِهِمْ وَيَتَفَقَّهُوْنَ وَيَتَّعِظُوْنَ أَوْ لَاُعَاجِلَنَّهُمُ الْعُقُوْبَةَ" ثُمَّ نَزَلَ، فَقَالَ قَوْمٌ: "مَّنْ تَرَوْنَهُ عَنٰى بِهٰؤُلَاءِ"؟ قَالُوْا: "اَلْاَشْعَرِيِّيْنَ، هُمْ قَوْمٌ فُقَهَاءُ وَلَهُمْ جِيْرَانٌ جُفَاةٌ مِّنْ اَهْلِ الْمِيَاهِ وَالْاَعْرَابِ-" فَبَلَغَ ذٰلِكَ الْاَشْعَرِيِّيْنَ، فَأَتَوْا رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، قَالُوْا: يَا رَسُوْلَ اللّٰهِ، ذَكَرْتَ قَوْمًا بِخَيْرٍ وَّذَكَرْتَنَا بِشَرٍّ فَمَا بَالُنَا؟ فَقَالَ: لَيُعَلِّمَنَّ قَوْمٌ جِيْرَانَهُمْ وَلَيَعِظُنَّهُمْ وَلَيَأْمُرُنَّهُمْ وَلَيَنْهَوُنَّهُمْ وَلَيَتَعَلَّمَنَّ قَوْمٌ مِّنْ جِيْرَانِهِمْ وَيَتَّعِظُوْنَ وَيَتَفَقَّهُوْنَ أَوْ لَاُعَاجِلَنَّهُمُ الْعُقُوْبَةَ فِى الدُّنْيَا-" فَقَالُوْا: يَا رَسُوْلَ اللّٰهِ، اَنُفَطِّنُ غَيْرَنَا؟ فَأَعَادَ قَوْلَهُ عَلَيْهِمْ فَاَعَادُوْا قَوْلَهُمْ "اَنُفَطِّنُ غَيْرَنَا؟ فَقَالَ: ذَاكَ اَيْضًا، فَقَالُوْا: اَمْهِلْنَا سَنَةً، فَأَمْهَلَهُمْ سَنَةً، لِيُفَقِّهُوْهُمْ وَيَعِظُوْهُمْ- ثُمَّ قَرَأَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ

وَسَلَّمَ هٰذِهِ الآيَةَ : "لُعِنَ الَّذِيْنَ كَفَرُوْا مِنْ بَنِيْٓ اِسْرَائِيْلَ-" الخ
(طبرانی)

321. ఒకసారి మహాప్రవక్త (సఅసం) ప్రసంగిస్తూ కొందరు ముస్లిమ్‌లను ప్రశంసించారు. తరువాత ఇలా అన్నారు: "ఏమిటి ఈ విపరీతం, కొందరు తమ పొరుగు వారికి ధార్మిక జ్ఞానాన్ని బోధించడానికి, సరైన శిక్షణ గరపటానికి ముందుకు రారెందుకు? ధార్మిక విద్య పట్ల అలక్ష్యం కనబరచటం వల్ల కలిగే పర్యవసానం గురించి వారిని హెచ్చరించ రెందుకు? వారిని చెడుకార్యాలు చేయకుండా వారించరెందుకు? మరి కొందరు తమ పొరుగు వారి వద్ద ధర్మ విద్యను అభ్యసించడానికి ధర్మజ్ఞాన సముపార్జనకు ముందుకు రారెందుకు? ధర్మం పట్ల అజాగ్రత్త వహించడం చేత కలిగే పరిణామం గురించి తెలుసుకోరెందుకూ? దైవం సాక్షిగా చెబుతున్నాను, జనులు తమ పొరుగువారికి తప్పనిసరిగా ధర్మ శిక్షణ గరపాలి. వారికి ధర్మ బోధ చెయ్యాలి. వారిని సత్కార్యాలకు ప్రోత్స హించాలి. దుష్కార్యాల నుండి రక్షించాలి. అలాగే జనులు తమ పొరుగు వారి ద్వారా ధార్మిక విద్యను అభ్యసించాలి, ధర్మ జ్ఞానాన్ని సముపార్జించాలి. వారి సద్బోధల్ని స్వీకరించాలి, లేకపోతే అనతి కాలంలోనే నేను వారిని శిక్షిస్తాను," పిదప ఆయన ప్రసంగాన్ని ముగించి వేదిక దిగిపోయారు. శ్రోతల్లో కొందరు "ఆయన ఎవరిని గురించి ఇలా ఆగ్రహంగా పేర్కొన్నారు?" అని అడగ్గా అక్కడున్న వారు, "ఆయన అష్అర్ తెగ వారిని ఉద్దేశించి చెప్పారు, వీరు ధర్మవిద్య తెలిసిన వారే. కాని వీరి పొరుగున నీటి చెలమల సమీపాన ఉండేవారు, జానపదులు, పామరులు." అని అన్నారు. ఈ ప్రసంగం గురించి అష్అరీలకు సమాచారం అందగానే వారు మహాప్రవక్త (సఅసం) వద్దకు వచ్చారు. "దైవ ప్రవక్తా! మీరు తమ ప్రసంగంలో కొందరిని ప్రశంసించి మాపై ఆగ్రహించారు. మా వల్ల జరిగిన తప్పేమిటో సెలవీయండి" అని వారు అడిగిన దానికి

మహాప్రవక్త (సఅసం) చెప్పారుః "జనులు తమ పొరుగు వారికి ధర్మ విద్య తప్పక బోధించాలి. సద్బోధ చేయాలి. మంచి మాటల్ని ఉపదేశిం చాలి. చెడు నుండి వారించాలి. ఇలాగే జనులు తమ పొరుగువారి వద్ద ధర్మ విద్య నేర్చుకోవాలి. సదుపదేశాన్ని స్వీకరించాలి. తమ ధర్మానికి సంబంధించిన జ్ఞానాన్ని సముపార్జించుకోవాలి. లేకపోతే అనతికాలంలోనే నేను వారిని శిక్షిస్తాను." అప్పుడు అష్ అరీలు "దైవప్రవక్తా, ఇతరుల్లో దైవ జ్ఞానాన్ని వ్యాపింపజేయడం కూడా మా బాధ్యతల్లో ఉందా?" అని అడిగారు. "అవును ఇది కూడా మీ బాధ్యతే" అని తెలిపారు మహా ప్రవక్త(సఅసం). దానికి వారు "మాకు ఒక సంవత్సరం గడువుఇవ్వండి" అని అర్థించారు. వారు తమ పొరుగు వారిని ధర్మ విద్య గరపడానికి వారికి హితోపదేశం చేసి దైవాదేశాలు తెలుపడానికి మహనీయులు ప్రవక్త (సఅసం) వారికి అలాగే ఒక సంవత్సరం పాటు గడువిచ్చారు. దాని మీదట దైవప్రవక్త మాయిదా సూరాలోని ఈ వచనాన్ని పఠించారుః

"బనీ ఇస్రాయీల్ లో తిరస్కార వైఖరిని అవలంబించిన వారిపై అభిశాపం చేయబడింది. దావూద్ నోటి ద్వారా, మర్యం సుతుడు ఈసా నోటి ద్వారా! ఈ అభిశాపానికి కారణం వారు అవిధేయతా మార్గాన్ని అవలం బించడం, దైవాదేశాల్ని అనునిత్యం ఉల్లంఘిస్తూ ఉండడం. వారు ఒకరి నొకరు చెడుపనుల నుండి వారించకపోవడం. వారి ఈ వైఖరి అత్యంత హీనమయిందనడంలో సందేహం లేదు." (*అల్‌మాయిదాః78,79*)

(తిర్మిజీ)

---

319. ఈ హదీసు ద్వారా తెలిసివచ్చే విషయాలేమిటంటే :

1. సామాన్య ప్రజలు ధర్మానికి విరుద్ధంగా వ్యవహరిస్తున్నప్పుడు సంఘంలోని ధర్మజ్ఞుల మాటల్ని వారు తిరస్కరించినప్పుడు, ధర్మజ్ఞులయిన వారు వారికి దూరంగా మెలగాలి.
2. అలా చెయ్యకపోతే వారు ధర్మజ్ఞులయినప్పటికీ, దర్మోల్లంఘన చేసే వారితో కలిసి మెలిసి జీవించడం మూలాన వారందరు మంచిని ద్వేషించడంలోనూ, చెడును పెంచడంలోనూ సమానులయినవారే అవుతారు.
3. మహాప్రవక్త(సఅసం) తాపీగా కూర్చున్నవరల్లా, ఈ వైఖరివల్ల కలిగే దుష్పరిణామాన్ని తెలుపడానికి సరిగ్గా కూర్చున్నారంటే దాని ప్రాముఖ్యాన్ని బోధపరచడానికే.

7)

# ఆచరణ శూన్యమయిన సందేశ ప్రచారం

٣٢٢ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: يُجَاءُ بِالرَّجُلِ يَوْمَ الْقِيٰمَةِ فَيُلْقٰى فِى النَّارِ فَتَنْدَلِقُ اَقْتَابُهُ فِى النَّارِ فَيَطْحَنُ فِيْهَا كَطَحْنِ الْحِمَارِ بِرَحَاهُ فَيَجْتَمِعُ اَهْلُ النَّارِ عَلَيْهِ فَيَقُوْلُوْنَ: اَىْ فُلَانُ، مَا شَانُكَ؟ اَلَيْسَ كُنْتَ تَأْمُرُنَا بِالْمَعْرُوْفِ وَتَنْهَانَا عَنِ الْمُنْكَرِ؟ قَالَ: كُنْتُ اٰمُرُكُمْ بِالْمَعْرُوْفِ وَلَا اٰتِيْهِ وَاَنْهٰكُمْ عَنِ الْمُنْكَرِ وَاٰتِيْهِ-"

(بخاری - مُسلم - اُسامه بن زیدؓ)

322. మహాప్రవక్త (సఅసం) ప్రబోధనః "ప్రళయ దినాన ఓ వ్యక్తి నరకాగ్నిలో పడవేయబడతాడు. అతని ప్రేవులు కడుపును చీల్చుకుని బయట అగ్నిలోపడతాయి. అప్పుడు అతను వాటిని పట్టుకుని గానుగలో గాడిద తిరిగినట్లు తిరుగుతుంటాడు. ఇతర నరకవాసులు అతని వద్ద

---

4. అత్యాచారుడి చేతుల్ని స్వాధీనం చేసుకోవడమంటే అతన్ని అత్యాచారం చెయ్యకుండా నిరోధించడం అని భావం.
5. ముస్లింలు సయితం మంచిని పెంచే, చెడును నిర్మూలించే కార్యం చెయ్యకపోతే అల్లాహ్ వారి ఆంతర్యాలు సమానం చేస్తాడంటే చెడు పనులు చేసే వారికి సమానం చేస్తాడని అర్థం.
6. దూరం చెయ్యడమంటే అల్లాహ్ కారుణ్యానికి, మార్గ దర్శకత్వానికి దూరం చేయడం అని భావం.

320. సమాజంలో చెడుకు పాల్పడేవారు, వారిని "సహనభావం" చేత సంస్కరించనివారు ఈ ఉపమానంలో చక్కగా చిత్రించబడ్డారు. చెడు నడత గలవారి కారణంగా సమాజంలో ముంచుకువచ్చే ఉపద్రవం వల్ల కేవలం ఆ దుర్వర్తనులే నష్టపోతారని భ్రమపడటం అనంబద్ధమని ఈ హదీసు తెలుపుతోంది. అందువల్ల రుజువర్తనులయినవారు, తోటి సోదరులు వక్రమార్గాన పోతుంటే వారిని సన్మార్గాన నడిపింపజెయ్యడమే తమ బాధ్యతగా భావించాలి.లేకపోతే తామూ నష్టపోవలసి వస్తుందని తెలుసుకోవాలి.

321. ఇతరులకు ధర్మజ్ఞానాన్ని బోధించడం, ఇతరులు చెడు మార్గాన్ని అవలంబిస్తూ ఉంటే వారిని వారించడం ముస్లింలలో ప్రతి ఒక్కని విధి, అలాగే ముస్లిం సమాజాలపై

గుమికూడి, "నీకు ఈ గతి పట్టిందేమిటి? నీవు ప్రపంచంలో మాకు సత్కార్యాలను ఉపదేశించి దుష్కార్యాల నుండి వారించే వాడివి కదా?" అని అడుగుతారు. అతడు యదార్థాన్ని తెలుపుతాడుః 'నేను మీకు మంచిని బోధించే వాణ్ణే. కాని, నేను మాత్రం దాన్ని సమీపించేవాణ్ణి కాను; మిమ్మల్ని చెడు నుండి వారించే వాణ్ణే, కాని, స్వయంగా నేనే చెడును చేరదీసేవాణ్ణి." (బుఖారి, ముస్లిమ్ - ఉసామా బిన్ జైద్)

٣٢٣ إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: رَأَيْتُ لَيْلَةَ أُسْرِيَ بِيْ رِجَالاً تُقْرَضُ شِفَاهُهُمْ بِمَقَارِيْضَ مِنْ نَّارٍ، قُلْتُ: مَنْ هٰؤُلَاءِ يَا جِبْرِيْلُ؟ قَالَ: هٰؤُلَاءِ خُطَبَاءُ أُمَّتِكَ يَأْمُرُوْنَ النَّاسَ بِالْبِرِّ وَيَنْسَوْنَ أَنْفُسَهُمْ". (مشكوٰة - انسؓ)

323. మహాప్రవక్త (సఅసం) ఇలా తెలిపారుః నేను 'మేరాజ్' రాత్రి కొందరు మనుషుల పెదాలను అగ్ని కత్తెరలతో కత్తిరిస్తుండగా చూశాను. అప్పుడు జిబ్రీల్‌ని, 'వీరెవరు?' అనడిగాను. దానికి జిబ్రీల్, "వీరు మీ అనుచర సంఘంలోని ధర్మ బోధకులు. వీరు ప్రజలకు మంచిని ఉపదేశించి తమ సంగతి మరచిపొయ్యేవారు." (మిష్కాత్ - అనస్)

---

కూడా సామూహికంగా ఈ బాధ్యత వస్తుంది. మహాప్రవక్త (సఅసం) ఆగ్రహాన్ని గమనిస్తే ఈ కార్యం ప్రాముఖ్యత ఏమిటో బోధపడుతుంది. చెడును చూస్తూ నిర్లిప్తత వ్యక్తపరిచేవారు, "మేమయితే చెయ్యలేదుగా, ఎవడు చేసిన దానికి వాడు అనుభవిస్తాడు" అని భావించే వారు రేపు ప్రళయ దినాన దైవాగ్రహానికి, దైవప్రవక్త అప్రీతికి పాత్రులవుతారన్న విషయం ఈ హదీసు బోధిస్తోంది. కొందరు "మాకు ధర్మం అంటే ఏమిటో తెలియదే" అని తమ తప్పుడు నడతకు సంజాయిషీ చెప్పుకుంటారు. ఇది సరికాదు. ధర్మాన్ని గురించి తెలుసుకునే ప్రయత్నం వారి బాధ్యతే.

322. ఆ ప్రేవుల్ని లోనికి దూర్చడానికి చేసే ప్రయత్నంలో అతడు అలా తిరుగుతుంటాడన్నమాట. అతని ప్రేవులు అతని ముందు పడటం అంటే అతను పలికిన కార్యశూన్యమయిన పలుకులు అతనిపైకి త్రిప్పి కొట్టబడ్డాయన్నమాట. ఇతర నరకవాసుల ఆశ్చర్యం ఏమిటంటే ఏ చెడు పరిణామాలను గురించి నీవు

۳۲۴ عَنْ حَرْمَلَةَ قَالَ ، قُلْتُ : يَا رَسُولَ اللهِ ، مَا تَأْمُرُنِي بِهِ أَعْمَلُ ؟
فَقَالَ : إِئْتِ الْمَعْرُوفَ وَاجْتَنِبِ الْمُنْكَرَ ، وَانْظُرْ مَا يُعْجِبُ أُذُنَكَ أَنْ يَقُولَ
لَكَ الْقَوْمُ إِذَا قُمْتَ مِنْ عِنْدِهِمْ فَأْتِهِ وَانْظُرِ الَّذِي تَكْرَهُ أَنْ يَقُولَ
لَكَ الْقَوْمُ إِذَا قُمْتَ مِنْ عِنْدِهِمْ فَاجْتَنِبْهُ -" (بخاری)

324. హజ్రత్ హర్మల (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: "నేను ఒకసారి మహాప్రవక్త (సఅసం)ను "మీరు ఏయే విషయాలను ఆచరించాలని నాకు ఉపదేశిస్తారు?" అని అడిగాను. దానికి ఆయన బోధించారు: "మంచిని ఆచరించు, చెడుకు దూరంగా ఉండు. నీవు నలుగురిలో నుండి లేచి పోయినప్పుడు వారు నిన్ను ఏ గుణగణాలతో ప్రస్తావించాలని నీవు అభిలషిస్తావో వాటిని నీలో పెంపొందించుకో. నీవు లేనప్పుడు నలుగురు నీ గురించి ఏ విధంగా మాట్లాడడం నీకు యిష్టం కాదో ఆ విధానాలకు దూరంగా మెలుగు." (బుఖారి)

۳۲۵ إِنَّ رَجُلاً قَالَ لِابْنِ عَبَّاسٍ : أُرِيدُ أَنْ آمُرَ بِالْمَعْرُوفِ وَأَنْهٰى
عَنِ الْمُنْكَرِ ، فَقَالَ لَهُ ابْنُ عَبَّاسٍ : " أَبَلَغْتَ تِلْكَ الْمَنْزِلَةَ ؟ " قَالَ : " أَرْجُو "
فَقَالَ لَهُ : " إِنْ لَّمْ تَخْشَ أَنْ تُفْتَضَحَ بِثَلٰثِ اٰيٰتٍ مِّنْ كِتٰبِ اللهِ فَافْعَلْ "
قَالَ الرَّجُلُ : " وَمَا هُنَّ " ؟ قَالَ : قَوْلُهُ " أَتَأْمُرُوْنَ النَّاسَ " الْاٰيَةَ ، فَهَلْ
أَحْكَمْتَ هٰذِهِ ؟ قَالَ : لَا ، فَقَالَ : وَالثَّانِيَةُ قَوْلُهُ " لِمَ تَقُوْلُوْنَ مَا لَا
تَفْعَلُوْنَ " فَهَلْ أَحْكَمْتَهَا ؟ قَالَ : لَا ، فَقَالَ : وَالثَّالِثَةُ مَقَالَةُ شُعَيْبٍ
مَا أُرِيْدُ أَنْ أُخَالِفَكُمْ إِلٰى مَا أَنْهٰكُمْ عَنْهُ " فَهَلْ أَحْكَمْتَهَا ؟ قَالَ : لَا ،
قَالَ : " فَابْدَأْ بِنَفْسِكَ -" (الدعوة)

325. ఒక వ్యక్తి అబ్దుల్లా బిన్ అబ్బాస్ వద్దకు వచ్చి, ధర్మ ప్రచార కార్యంలో పాల్గొని జనులకు మంచిని బోధించి వారిని చెడు నుండి దూరంగా ఉంచే సేవ చెయ్యదలచినట్లు చెప్పుకున్నాడు. దానికి ఆయన "నీవు ఆ స్థాయికి ఎదిగావా?" అని అడిగారు. 'ఆఁ! నా అభిప్రాయం అదే!" అని పలికాడు అతడు. "ఖుర్ఆన్‌లోని మూడు ఆయత్‌లు నిన్ను అవమానంపాలు చేస్తాయేమో నన్న సంశయం నీకు లేకపోతే నీవు అలాగే ధర్మప్రచార కార్యం చేపట్టవచ్చు." అని చెప్పారు హజ్రత్ ఇబ్ను అబ్బాస్. అతడు అవి ఏవీ?' అని అడిగాడు. అప్పుడు ఆయన "ప్రజలకు హితోపదేశం చేసి మిమ్మల్ని మీరు మర్చిపోతుం టారా!" (అల్ బఖర : 44) అనే ఆయత్ పఠించి, "ఈ ఆయత్‌ను పూర్తిగా అమలు జరిపావా?"అని అడిగారు. అతడు 'లేదు' అని సమాధానమిచ్చాడు, ఆయన రెండవ ఆయత్, "మీరు స్వయంగా ఆచరించని మాటను (ఇతరులకు ) ఎందుకు బోధిస్తుంటారు?" (అస్ సఫ్:2) అని పఠించి "దీన్ని బాగా ఆచరించావా?" అని ప్రశ్నించగా అతడు 'లేదు' అని పలికాడు. అప్పుడు మూడోసారి షుఅయ్‌బ్ (అలైస) తన జాతి ప్రజలను సంబోధించి - "మిమ్మల్ని ఏ విషయాలను గురించి వారిస్తూ ఉంటానో వాటిని స్వయంగా నేనే చేయడం నా అభిమతంకాదు." (హూద్ : 87) అని పలికిన ఆయత్‌పఠించి, "నీవు ఈ ఆయత్‌ను ఆచరణలో పెట్టావా?" అని ఇబ్ను అబ్బాస్ ఆ వ్యక్తిని అడిగారు. అతడు 'లేదు' అన్నాడు. "అయితే వెళ్ళు (ప్రచార కార్యాన్ని) నీతోనే ప్రారంభించు." (అద్దావ)

---

మిమ్మల్ని భయపెట్టేవాడివో వాటిపట్ల భయపడి నీవు సదాచార పరాయణుడివి కాలేదా? నీకు ఈ దశ పట్టిందేమిటి? అన్నది.

323. అగ్ని కత్తెరలతో కత్తిరించడమంటే నోటిని దాటి ఆంతర్యంలో ప్రవేశించలేని ప్రబోధాలు చేసే వారి పెదాలు ఆ శిక్షకే అర్హమయినవన్న మాట.

324. మనిషి సహజంగా తాను ఏ విధంగా ఉన్నా తన ప్రతిష్ట మట్టుకు సవ్యంగా ఉండాలని కోరుకుంటాడు. కాని అది సాధ్యపడదని ఈ హదీసులో మహాప్రవక్త (సఅసం) ప్రబోధించారు. తన్ను ప్రజలు మంచి మాటలతో స్మరించాలనీ మనిషి అభిలషిస్తే మంచి పనులే చెయ్యాలి; అలాగే, ఇతరులు తనకు చెడు విషయాల్ని అంటకట్టరాదని భావిస్తే అలాంటి పనులకు దూరంగా ఉండాలి.

٣٢٦ عَنِ الْحَسَنِ قَالَ: "اَلْعِلْمُ عِلْمَانِ، فَعِلْمٌ فِي الْقَلْبِ فَذَاكَ الْعِلْمُ النَّافِعُ، وَعِلْمٌ عَلَى اللِّسَانِ فَذَاكَ حُجَّةُ اللهِ عَزَّ وَجَلَّ عَلَى ابْنِ اٰدَمَ-" (دارمی)

326. హజ్రత్ హసన్ (రజిఅన్) ఇలా బోధించారు : "ధర్మజ్ఞానం రెండు విధాలు : మొదటిది, హృదయ సీమలో స్థానం ఏర్పరచుకుంటుంది. ఇదే (ప్రళయంలో) ప్రయోజనకరమయిన జ్ఞానం. రెండవది, కేవలం నోటిపైనే ఉండి పోతుంది. ఇది మహోన్నత ప్రభువయిన అల్లాహ్ సన్నిధిలో ఆదం సుతునికి (మనిషికి) ప్రతికూలంగా నిదర్శనమయి నిలుస్తుంది." (దారమి)

## ధర్మ విద్యా సముపార్జన

٣٢٧ عَنْ مُعَاوِيَةَ قَالَ، قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ يُّرِدِ اللهُ بِهٖ خَيْرًا يُّفَقِّهْهُ فِي الدِّيْنِ-" (بخاری-مُسلم)

327. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారని హజ్రత్ ముఆవియా ఉల్లేఖించారు: "అల్లాహ్ ఎవరికి మేలు చెయ్యగోరుతాడో అతనికి ధార్మిక జ్ఞానాన్ని, అవగాహనా శక్తిని అనుగ్రహిస్తాడు. (బుఖారి, ముస్లిమ్)

---

325. ఆ వచ్చిన వ్యక్తి తన్నుతాను విస్మరించి ఇతరులకు ప్రచారం చేసే ఆరాటం, కుతూహలం కలవాడవటం చేత హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ పరిస్థితిని అర్థం చేసుకొని సరయిన సలహా ఇచ్చారు.

అయితే 'పరిపూర్ణత' సిద్ధించనంతవరకు ప్రచార చైతన్యం గలవారు కూడా మంచిని పెంచడానికి చెడును నిర్మూలించడానికి ముందుకు రాకూడదని మాత్రం దీని భావం కాదు. 'పరిపూర్ణత' వైపునకు పురోగమిస్తూ ఆ గమ్యంపట్ల ఏమరుపాటు లేకుండా అప్రమత్తులై సచేతనంగా మెలిగేవారు కార్యరంగంలో దిగవలసిందే! అలాంటి పరిస్థితిలో కార్యరంగంలో దిగకపోవడమే తప్పు. అయితే పరిపూర్ణతను చేరే సంకల్పం, కృషి ఉండటం అనేది అనివార్యం.

٣٢٨ عَنْ أَبِيْ هُرَيْرَةَ قَالَ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ سَلَكَ طَرِيْقًا يَّلْتَمِسُ فِيْهِ عِلْمًا سَهَّلَ اللّٰهُ لَهُ بِهٖ طَرِيْقًا إِلَى الْجَنَّةِ - وَمَا اجْتَمَعَ قَوْمٌ فِيْ بَيْتٍ مِّنْ بُيُوْتِ اللّٰهِ يَتْلُوْنَ كِتٰبَ اللّٰهِ وَيَتَدَارَسُوْنَهٗ بَيْنَهُمْ إِلَّا نَزَلَتْ عَلَيْهِمُ السَّكِيْنَةُ وَغَشِيَتْهُمُ الرَّحْمَةُ وَحَفَّتْهُمُ الْمَلٰئِكَةُ وَذَكَرَهُمُ اللّٰهُ فِيْمَنْ عِنْدَهٗ - وَمَنْ بَطَّأَ بِهٖ عَمَلُهٗ لَمْ يُسْرِعْ بِهٖ نَسَبُهٗ." (مسلم)

328. మహాప్రవక్త ఒకసారి ఇలా బోధించారని హజ్రత్ అబూ హురైరా (రజి) ఉల్లేఖించారు: "ఎవరు ధర్మజ్ఞాన సముపార్జన కొరకు దూర ప్రయాణం చేస్తారో అల్లాహ్ వారి కొరకు స్వర్గానికి పోయే మార్గాన్ని సుగమం చేస్తాడు. ఎవరు అల్లాహ్ గృహాల్లో ఏదేని ఒక గృహం (మస్జిద్) లో చేరి దైవ గ్రంథాన్ని అధ్యయనం చేస్తారో, దానిపై చర్చ, సంవాదన జరుపుతారో వారిపై అల్లాహ్ సన్నిధి నుండి విశ్వాస సంబంధమయిన ప్రశాంతత అవతరిస్తుంది. ఆయన కారుణ్యం వారిని కప్పివేస్తుంది, దైవ దూతల మధ్యన అల్లాహ్ వారిని ప్రశంసిస్తాడు. అయితే ఎవరు తమ ఆచరణలో వెనుకబడతారో వారి వంశం వారి పురోగతికి తోడ్పడదు." (ముస్లిమ్)

---

326. హృదయంలో నాటుకుంటుందంటే, మనిషి దాన్ని జీర్ణించుకుని తదనుగుణంగా ఆ జ్ఞానాన్ని ఆచరణ రూపంగా పదిల పరచుకుంటాడని అర్థం.

నోటిపైనే ఉండిపోవటానికి భావం, దాన్ని మనిషి ఆకళించుకోకపోవడం, ఆచరణలో పెట్టకపోవడం అని భావం. అంటే ఇలాంటి మనిషికి అల్లాహ్, "నీవు అన్నీ తెలిసి ఉండీ ఆచరణ ఎందుకు చెయ్యలేదు. ఆ ఆచరణే కదా నేడు నీకు ఉపకరించేది?" అని చెప్పి శిక్ష విధిస్తాడు అని అర్థం.

327. దీన్ని ఈ విధంగా కూడా విశదీకరించుకోవచ్చు. "అల్లాహ్ ఎవరికి ధర్మజ్ఞానాన్ని, ధర్మావగాహనను ప్రసాదిస్తాడో అతనికి సకల శుభాలను ప్రసాదించినట్లే". ధర్మజ్ఞానం, ధర్మావగాహన సర్వ శుభాలకు పుట్టిల్లు. వీటిని పొందిన వ్యక్తి ఇహపరాల భాగ్యాలను పొందినట్లే కదా! అతను తన జీవితాన్ని చక్కదిద్దుకోగలడు, తోటి మానవుల

٣٢٩ عَنْ عَبْدِ اللهِ بْنِ عَمْرٍو أَنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مَرَّ بِمَجْلِسَيْنِ فِيْ مَسْجِدِهٖ، فَقَالَ: "كِلَاهُمَا عَلٰى خَيْرٍ وَّأَحَدُهُمَا أَفْضَلُ مِنْ صَاحِبِهٖ، أَمَّا هٰؤُلَاءِ، فَيَدْعُوْنَ اللهَ وَيَرْغَبُوْنَ إِلَيْهِ، فَإِنْ شَاءَ أَعْطَاهُمْ وَإِنْ شَاءَ مَنَعَهُمْ، وَأَمَّا هٰؤُلَاءِ فَيَتَعَلَّمُوْنَ الْعِلْمَ وَيُعَلِّمُوْنَ الْجَاهِلَ فَهُمْ أَفْضَلُ، وَإِنَّمَا بُعِثْتُ مُعَلِّمًا، فَجَلَسَ فِيْهِمْ"

(مشكوٰة)

329. హ(జత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ బిన్ ఆస్ ఇలా ఉల్లేఖించారు : ఒక రోజు మహాప్రవక్త (సఅసం) తన మస్జిద్ - ప్రవక్త మస్జిద్‌లో జనులు రెండు చోట్ల గుమిగూడి కూర్చొని ఉండటం గమనించారు. వారిని చూసి ఆయన అన్నారు : "ఉభయవర్గాల వారున్నూ సత్క్రియల్లో నిమగ్నులై ఉన్నారు. కాని వారిలో ఒక వర్గం మరో వర్గం కంటే శ్రేష్ఠమైంది. ఒక వర్గం వారయితే దైవ సంస్మరణలో ప్రార్థనల్లో, క్షమార్పణల్లో నిమగ్నులయి ఉన్నారు. దైవం కోరితే వారిని అనుగ్రహించగలడు లేదా మానుకోగలడు. ఇక ఈ రెండవ వర్గం వారు ధర్మ జ్ఞాన సముపార్జనలో, ధర్మజ్ఞాన బోధనలో నిమగ్నులయి ఉన్నారు. నన్నూ బోధకునిగానే నియమించి పంపడం జరిగింది."

'ఆ తరువాత ఆయన ఆ (రెండవ) వర్గం వారితోనే కూర్చుండి పోయారు.
(మిష్కాత్)

---

జీవితాలనూ సంస్కరించగలడు. ప్రపంచంలో సుఖశాంతుల్నీ, పరలోకంలో సఫలతను పొందగలడు. దాన్నే అల్లాహ్ మేలు చేకూర్చడం అని పేర్కొనటం జరిగింది.

328. ఈ హదీసులో ప్రవక్త మహనీయులు (సఅసం) ఒకవైపు ధర్మజ్ఞానం కొరకు పాటుపడే వారిని ప్రోత్సహించి వారికి శుభవార్తను ఇచ్చారు. మరోవైపు గొప్పప్రమాదం గురించి హెచ్చరించారు కూడ. ధర్మజ్ఞాన సముపార్జనకు ఉద్దేశ్యం దాన్ని ఆచరణలో పెట్టడమే కావాలి. హదీసులో 'ఆచరణ వల్ల వెనకబడే వారన్న' దానికి భావం, వారు జ్ఞానం పొంది సదాచరణ చెయ్యని వారు, అలక్ష్య భావంతో మెలిగేవారు అని. ఎవరయినా జ్ఞానం సముపార్జించి ఆచరణను వదలివేస్తే అతనికి అతని ధర్మజ్ఞాన

# ధర్మ ప్రచారం : ముఖ్యాంశాలు

۳۳۰ كَانَ عَبْدُ اللهِ بْنِ مَسْعُوْدٍ يُّذَكِّرُ النَّاسَ فِي كُلِّ خَمِيْسٍ فَقَالَ لَهُ رَجُلٌ : يَا أَبَا عَبْدِ الرَّحْمٰنِ ، لَوَدِدْتُّ أَنَّكَ ذَكَّرْتَنَا فِي كُلِّ يَوْمٍ ، فَقَالَ : أَمَا إِنَّهُ يَمْنَعُنِي مِنْ ذَالِكَ أَنِّي أَكْرَهُ أَنْ أُمِلَّكُمْ وَإِنِّي أَتَخَوَّلُكُمْ بِالْمَوْعِظَةِ كَمَا كَانَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَتَخَوَّلُنَا بِهَا مَخَافَةَ السَّآمَةِ عَلَيْنَا ۔ (بخاری۔ مسلم)

330. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ ఊద్ ప్రతి గురువారం నాడు జనులకు హితోపదేశం చేసేవారు. ఒకసారి ఒకవ్యక్తి వచ్చి 'అబూ అబ్దుర్రహ్మాన్! మీరు ప్రతి దినం మాకు హితోపదేశం చేయాలని నా అభిలాష' అని ఆయన్ని అర్థించాడు, దానికి ఆయన చెప్పారు : "ప్రతి దినం ప్రసంగం చేయకుండా నన్ను వారించేది మీరు విసిగిపోతారన్న భావమే, మిమ్మల్ని విసిగించడం నాకు సుతరామూ ఇష్టంలేదు. అందుకే నేను విరామం ఇచ్చి ప్రసంగిస్తూ ఉంటాను. మహాప్రవక్త మాకు హితోపదేశం చేయడంలో ఇదే పంథాను అవలంబించే వారు. ఆయన అలా చేయడానికి కారణం కూడా మేము విసిగిపోతామన్నదే."
(బుఖారి, ముస్లిమ్)

---

సంపన్నతా ఉపకరించదు, అతని వంశ ఔన్నత్యమూ సహకరించదు. మనిషిని ఉన్నతపరిచేది కేవలం విశ్వాసం, ఆ తరువాతే ఆచరణ!

329. భావమేమంటే ఏ వర్గమయితే ధర్మజ్ఞాన సముపార్జనలో నిమగ్నమయి ఉందో అది సదాచార సంపన్నం కాగలదు. వారికి మంచీ చెడుల విచక్షణ కలుగుతుంది. నిత్య జీవితంలో సరయిన మార్గం ఏదో, సరయిన దృక్పథం ఏదో, సరయిన ఆచరణ ఏదో తెలిసివస్తుంది. దాని ప్రకారం వారు నడుచుకోగలరు. తమ ఈ ఆచరణవల్ల వారికి పరలోక సాఫల్యం, దైవ కారుణ్యం ప్రాప్తమవడం ఖాయం. మరే వర్గం వారయితే కేవలం ప్రార్థనల్లో, దైవనామసంస్మరణలో నిమగ్నులయి ఉన్నారో, వారు సరయిన జ్ఞానం, సంపూర్ణ ధర్మజ్ఞానం లేనందున ప్రార్థనల మట్టుకే జ్ఞానం కలిగి ఉండటం

۳۳۱ عَنْ عِكْرِمَةَ أَنَّ ابْنَ عَبَّاسٍ قَالَ: "حَدِّثِ النَّاسَ كُلَّ جُمُعَةٍ
مَرَّةً، فَإِنْ أَبَيْتَ فَمَرَّتَيْنِ، فَإِنْ أَكْثَرْتَ فَثَلَاثَ مَرَّاتٍ وَلَا تُمِلَّنَّ النَّاسَ
بِهٰذَا الْقُرْآنِ، وَلَا أُلْفِيَنَّكَ تَأْتِي الْقَوْمَ وَهُمْ فِي حَدِيْثٍ مِّنْ حَدِيْثِهِمْ
فَتَقُصُّ عَلَيْهِمْ فَتَقْطَعُ عَلَيْهِمْ حَدِيْثَهُمْ فَتُمِلُّهُمْ، وَلٰكِنْ أَنْصِتْ
فَإِذَا أَمَرُوْكَ فَحَدِّثْهُمْ وَهُمْ يَشْتَهُوْنَهُ، وَانْظُرِ السَّجْعَ مِنَ الدُّعَاءِ
فَاجْتَنِبْهُ فَإِنِّي عَهِدْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ وَأَصْحَابَهُ
لَا يَفْعَلُوْنَ ذٰلِكَ۔" (بخاری)

331. హజ్రత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ ఇలా బోధించారని హజ్రత్ ఇక్రమ తెలిపారు. "వారంలో ఒకసారి హితబోధ చేయండి, కావాలంటే రెండు సార్లు చెయ్యండి, మరీ అవసరమైతే మూడు సార్లు, కురాన్ పట్ల మనుషుల్లో విసుగును పుట్టించకండి. మీరు వారి వద్దకు వెళ్ళినప్పుడు వారు తమ మాటల్లో నిమగ్నులయి ఉండగా ఉపన్యాసానికి ఉపక్రమించి వారి మాటలకు మీరు అంతరాయం కలిగిస్తే వారికి హితోపదేశం పట్ల నిరసన భావం కలుగుతుంది. అలా ఎన్నటికీ చేయకండి. ఇలాంటి సందర్భాల్లో మౌనమే మేలు. వారిలో అభిలాష జనించి వారు మిమ్మల్ని కోరినప్పుడు హితబోధ చేయండి. చూడండి! యతిప్రాసలతో బరువెక్కిన వాక్యాలను వాడకండి. ఎందుకంటే నేను మహాప్రవక్త! ఆయన సహచరుల్ని విన్నాను. వారు అలా చేసేవారు కారు." (బుఖారి)

---

మూలాన జీవితపు వ్యవహారాల్లో తప్పుత్రోవను త్రొక్కే ప్రమాదం ఉంది. పెడత్రోవన పోతే దైవానుగ్రహం కలగటం అన్నది దుస్సాధ్యం.

ధర్మజ్ఞాన సముపార్జన ఎంత ముఖ్యమయిందో ఈ హదీసు వివరిస్తుంది. మహాప్రవక్త (సఅసం) తనను గురించి "ధర్మబోధకుడు" అనే మాటలు వినియోగించడం కూడా గమనార్హమయిన విషయమే. ఆయన ఉపాసకులతో కాకుండా బోధకులతో చేరి కూర్చోవడం కూడా గమనార్హమయిన విషయమే.

٣٣٢ إِنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ بَعَثَ رَجُلاً يُصَدِّقُ النَّاسَ حِيْنَ أَمَرَهُ اللهُ أَنْ يَأْخُذَ الصَّدَقَةَ، فَقَالَ لَهُ: لَا تَأْخُذْ مِنْ حَزَرَاتِ أَنْفُسِ النَّاسِ شَيْئًا، خُذِ الشَّارِفَ وَالْبِكْرَ وَذَاتَ الْعَيْبِ، فَذَهَبَ فَأَخَذَ ذٰلِكَ عَلٰى مَا أَمَرَهُ النَّبِيُّ أَنْ يَأْخُذَ حَتّٰى جَاءَ إِلٰى رَجُلٍ مِّنْ اَهْلِ الْبَادِيَةِ فَذَكَرَ لَهُ أَنَّ اللهَ أَمَرَ رَسُوْلَهُ أَنْ يَأْخُذَ الصَّدَقَةَ مِنَ النَّاسِ يُزَكِّيْهِمْ بِهَا وَيُطَهِّرُهُمْ بِهَا، فَقَالَ لَهُ الرَّجُلُ: "قُمْ فَخُذْ" فَذَهَبَ فَأَخَذَ الشَّارِفَ وَالْبِكْرَ وَذَاتَ الْعِيْبِ، فَقَالَ لَهُ الرَّجُلُ: "وَاللهِ مَا قَامَ فِيْ إِبِلِيْ أَحَدٌ قَطُّ يَأْخُذُ شَيْئًا لِلّٰهِ قَبْلَكَ، وَاللهِ لَتَخْتَارَنَّ." (كتاب الخراج)

332. "జకాతు" విధిగా నిర్ణయించబడి, జనుల నుండి జకాత్ వసూలు చేయవలసిందిగా మహాప్రవక్తను అల్లాహ్ ఆదేశించినప్పుడు, ఆయన ఒక వ్యక్తిని జకాత్ వసూలు చేయడానికి నియమించి అతనికి 'ప్రజలకు ఇష్టమైన ఉత్తమమైన సరకును జకాతుగా తీసుకోకు, ముసలి ఒంటెల్ని,

---

330. మహాప్రవక్త (సఅసం) అబ్దుల్లా బిన్ మస్ఊద్‌ల ఆచరణా రీతి వల్ల తెలిసి వచ్చిందేమంటే ధర్మ ప్రచారం చేసేవారు ప్రజల వెంటబడి తరుముకువచ్చి హితబోధ చేయడం సమంజసం కాదు, పరిస్థితుల్ని గమనించాలి; అవకాశం, అవసరం కోసం ఎదురుచూస్తూ ఉండాలి. ఒక రైతులా వ్యవహరించాలి, రైతు వర్షాలకోసం ఎదురు చూస్తూ ఉంటాడు. వర్షాలు పడకపోతే విత్తనాలు నాటి వాటిని, తన శక్తి సామర్థ్యాలను వ్యర్థం చెయ్యడు. వర్షాలు మొదలవగానే భూమిని దున్నడం మొదలెడతాడు. కనుక సమయం సందర్భం లేకుండా ప్రచారం చేయకూడదు. అలాగే అవకాశం దొరికినా నిర్లక్ష్యభావంతో కూడా మెలగకూడదు. అవకాశాలు లభిస్తూ ఉన్నప్పటికీ తన గౌరవ మర్యాదల లెక్కచూసుకుంటూ మొహమాటపడుతూ వాటిని జారవిడవడం అవివేకం.

331. మరొక హదీసులో మహాప్రవక్త :

"لَا تُبَغِّضُوْا عِبَادَ اللهِ عِبَادَةَ اللهِ."

గొడ్డుపోయినవాటిని, ఏవైనా వంకలు ఉన్న వాటినే తీసుకో" అని ఆదేశించారు. కనుక ఆ వ్యక్తి మహాప్రవక్త ఆదేశం ప్రకారమే ప్రజల పశువుల్లో నుండి జకాత్ వసూలు చేయసాగాడు. ఒకసారి ఒక పల్లెటూరి వాని ఇంటికి వెళ్ళి "అల్లాహ్ తన ప్రవక్తకు ప్రజల నుండి జకాత్ వసూలు చేయమని ఆదేశించాడు. జకాత్ ప్రజల(ఆత్మల) మాలిన్యాన్ని దూరం చేసి పరిశుద్ధపరుస్తుంది. విశ్వాసాన్ని అధికం చేస్తుంది." అని తెలిపాడు. ఆ జనపదుడు అతనితో వెళ్ళి తన పశువుల్లో నుంచి జకాత్‌కి సరిపడా పశువుల్ని తోలుకు పొమ్మని అన్నాడు. అతను వెళ్ళి వంకలున్న, గొడ్డుబోయిన ఒంటెల్ని ఏరి తీశాడు. అది చూసి ఆ గ్రామస్తుడు అతనితో అన్నాడు, "నీ కంటే ముందు మా పశువుల్లో నుండి, అల్లాహ్ కొరకు జకాత్ వసూలు చేయడానికి ఎవరూ రాలేదు. దేవునిపై ఒట్టు! నీవు మట్టుకు ఉత్తమమయిన ఒంటెల్నే తీసుకోవలసి ఉంటుంది."

(కితాబుల్ ఖరాజ్ -అబూ యూసుఫ్)

٣٣٣ كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا تَكَلَّمَ بِكَلِمَةٍ أَعَادَهَا ثَلَاثًا حَتَّى تُفْهَمَ عَنْهُ - (بخاری-انس رض)

**333.** మహాప్రవక్త ఏదైనా విషయం చెప్పదలిచినప్పుడు ప్రజలకు అర్థమయ్యేలా దాన్ని మూడు పర్యాయాలు పలికేవారు. (బుఖారి - అనస్)

---

"దేవుని దాసులకు దైవారాధనపట్ల నిరసన భావం కలిగేలా చెయ్యకండి." అని బోధించారని 'మబ్సూత్' అనే గ్రంథంలో పేర్కొనడం జరిగింది. పై హదీసులో "వారు" కోరినప్పుడు అంటే వారు నోటితో తమ అభిలాషను తెలిపినప్పుడు అనే అర్థంతోపాటు, వారి వాలకాన్నిబట్టి వారి కోరికవ్యక్తమయినప్పుడు అని కూడా అర్థం వస్తుంది.

**332.** మహాప్రవక్త (సఅసం) తొలినుంచే మంచి సరుకును జకాత్‌గా వసూలు చేయమొదలిడితే ఈ ఆదేశాన్ని శిరసావహించడానికి మనుషులు నిరాకరించే వారేమో! కాని మహాప్రవక్త(సఅసం) పైన పేర్కొన్న విధానాన్ని అవలంబించడం చేత, ప్రజల్లో ధర్మం పటిష్టం అయి వారి మానసిక సంస్కరణ, శిక్షణలు జరిగాక మదీనాకు బహుదూరంలో ఉన్న పల్లెల్లోని వారు సయితం ఉత్తమమయిన సరుకును బలవంతంగా జకాత్‌లో ఇచ్చేవారు. ఇంకా ప్రజల్లో స్వయంగా జకాతుగా ఉత్తమమయిన పదార్థాన్నే

۳۳۴ قَالَ عَلِيٌّ رَضِيَ اللّٰهُ عَنْهُ: "إِنَّ لِلْقُلُوْبِ شَهْوَاتٍ وَإِقْبَالًا وَّ
إِدْبَارًا فَأْتُوْهَا مِنْ قِبَلِ شَهْوَاتِهَا وَإِقْبَالِهَا، فَإِنَّ الْقَلْبَ إِذَا أُكْرِهَ
عَمِيَ۔" (کتاب الخراج - امام ابویوسفؒ)

334. హజ్రత్ అలీ (రజిఅన్) ఇలా ప్రబోధించారు : "మనసులకు కొన్ని తత్వాలుంటాయి, కొన్ని కాంక్షలుంటాయి. ఒకప్పుడు అంతర్యాలు మాటను స్వీకరించటానికి అనుకూలంగా ఉంటాయి. మరొకప్పుడు వాటిలో తిరస్కార భావం పుడుతుంది. కనుక ప్రజల అంతర్యాల తత్వాన్నిబట్టి, అవి ఆమోదించడానికి సిద్ధంగా వున్నప్పుడు వాటిలో ప్రవేశించండి. ఎందుకంటే, మనసును బలాత్కారించినప్పుడు అది గుడ్డిదయిపోతుంది." (కితాబుల్ ఖరాజ్ - అబూయూసుఫ్)

---

ఇవ్వాలన్న భావం జనించడానిక్కారణం దాన్ని తాము దైవమార్గంలో ఇస్తున్నామన్న పవిత్ర భావమే. వద్దన్నా మంచి ఒంటెల్నే ఆ సహచరుడు జకాత్‌గా ఇచ్చాడు. నేడు దైవ మార్గంలో ఇచ్చేటప్పుడు మన వైఖరి ఎలా వుంటుంది?

333. ప్రతి భాషలోనూ మాట్లాడే తీరు, ప్రసంగించే విధానం ప్రత్యేకంగా ఉంటాయి. ఆ భాషలో మాట్లాడదలచిన వారు వాటిని తెలుసుకోవడం అత్యవసరం. ఎందుకంటే మాటలు శ్రోతల హృదయాలకు హత్తుకునేలా చేయడమే అసలు ఉద్దేశ్యం. అరబీ భాషాసంప్రదాయాన్నిబట్టి ఏదయినా ముఖ్య విషయాన్ని చెప్పదలిస్తే వక్త దాన్ని మూడు మార్లు పునరుక్తం చేస్తాడు. శ్రోతలనుబట్టి భాష, విషయంఉండాలి. సామాన్యులలో తాత్విక భాషణలు చర్చలు లేవనెత్తడం, బరువయిన పదాలను, సమాసాలను వాడటం, నిష్ప్రయోజనమే కాక సందేశాన్ని వైఫల్యం పాలుచేస్తాయి. మహాప్రవక్త గురించి ఆయన సతీమణి హజ్రత్ ఆయిషా (రజిఅల్లాహు అన్హా) చెప్పేది వినండి :

كَانَ كَلَامُهُ كَلَامًا فَصْلًا يَفْهَمُهُ كُلُّ مَنْ يَسْمَعُهُ۔ (ابوداؤد)

"ఆయన ప్రసంగం ఎంతో విశదంగా, స్పష్టంగా ఉంటుంది. విన్న ప్రతివాడు ఇట్టే అర్థం చేసుకునేవాడు." (అబూదావూద్)

334. మనిషి మానసికంగా మాటను విని జీర్ణించుకోగల పరిస్థితిలో ఉన్నప్పుడే ఏదయినా విషయాన్ని అతనికి బోధించాలనీ, అలాకాక మనసు మరొకవైపు లగ్నమై ఉన్నప్పుడు బలవంతంగా ఏదయినా వినిపిస్తే మొండిగా దాన్ని తిరస్కరిస్తాడని వివేకం కోల్పోయి గుడ్డిగా వ్యవహరిస్తాడనీ దీని భావం.

٣٣٥ قَالَ عَلِيُّ بْنُ أَبِي طَالِبٍ رَضِيَ اللّٰهُ عَنْهُ: "اَلْفَقِيهُ كُلُّ الْفَقِيهِ مَنْ لَّمْ يُقْنِطِ النَّاسَ مِنْ رَّحْمَةِ اللّٰهِ وَلَمْ يُرَخِّصْ لَهُمْ فِي مَعَاصِي اللّٰهِ وَلَمْ يُؤَمِّنْهُمْ مِّنْ عَذَابِ اللّٰهِ -" (كتاب الخراج)

335. హజ్రత్ అలీ (రఅ) సెలవిచ్చారుః "ఎవరయితే ప్రజల్ని అల్లాహ్ కారుణ్యం పట్ల నిరాశకు గురి చెయ్యడో, వారు దైవాజ్ఞలను ఉల్లంఘించడానికి అనుమతించడో, వారిని దైవ శిక్ష పట్ల భయపడనట్లు చెయ్యడో - అలాంటి విద్వాంసుడే నిజమైన, అత్యుత్తమ ధర్మజ్ఞాని."

(కితాబుల్ ఖరాజ్-అబూయూసుఫ్)

## ధర్మ సేవ చేసేవారికి శుభవార్త

٣٣٦ قَالَ مُعَاوِيَةُ، سَمِعْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُولُ: لَا يَزَالُ مِنْ أُمَّتِي أُمَّةٌ قَائِمَةٌ بِأَمْرِ اللّٰهِ، لَا يَضُرُّهُمْ مَّنْ خَذَلَهُمْ وَ لَا مَنْ خَالَفَهُمْ حَتّٰى يَأْتِيَ أَمْرُ اللّٰهِ وَهُمْ عَلٰى ذٰلِكَ -" (بخاری۔مسلم)

336. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించగా విన్నానని హజ్రత్ ముఆవియా (రజిఅన్) అన్నారుః "నా ఉమ్మత్ (అనుచరుల)లో దైవ ధర్మాన్ని పరిరక్షించే ఒకవర్గం సదా ఉంటుంది. ఈ వర్గంవారిని ఎదిరించిన వారెవరూ వారికి ఎలాంటి హానీ కలగజేయరు. కడకు అల్లాహ్ నిర్ణయం అవతరించే వరకు ధర్మ పరిరక్షకులు తమ వైఖరిలో నిలకడగా ఉంటారు."

(బుఖారి, ముస్లిమ్)

---

335. భావమేమంటే, ప్రజలు తమ మోక్షం పట్ల అల్లాహ్ కారుణ్యంపట్ల నిరాశ చెందేలా భీతి గొలిపే బోధలు చేయడం లేక అల్లాహ్ క్షమాగుణాన్ని కరుణానుగ్రహాల్ని, దైవ ప్రవక్త సిఫార్సును తప్పుగా చిత్రించి ప్రజలు అల్లాహ్ ఆజ్ఞల్ని ఉల్లంఘించేలా వారిని మొండిగా తయారుచేసే ప్రసంగాలు చేయటం ఘోరమైన తప్పు. సరయిన పంథా ఏమంటే ఉభయ కోణాలూ ముందుండాలి. అటు నిరాశా జనించకూడదు, ఇటు నిర్భయమూ, దుస్సాహసమూ కలగకూడదు.

۳۳۷ إِنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: إِنَّ مِنْ أَشَدِّ أُمَّتِي لِي حُبًّا، نَاسٌ يَكُوْنُوْنَ بَعْدِي يَوَدُّ أَحَدُهُمْ لَوْ رَآنِي بِأَهْلِهِ وَمَالِهِ -" (مسلم - ابوھریرۃؓ)

**337.** మహాప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు: "నా అనుచరుల్లో, నన్ను అత్యధికంగా ప్రేమించేవారు కొందరున్నారు. వారు, నా తరువాత వచ్చే అనుచరులు. వారిలో ప్రతి ఒక్కడూ, తానూ, తన ఇంటిల్లిపాది, తన సంపదతోపాటు నన్ను దర్శిస్తే ఎంతో బావుంటుందని కోరు కుంటాడు."

(ముస్లిమ్- అబూహురైరా)

۳۳۸ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "إِنَّ الدِّيْنَ بَدَأَ غَرِيْبًا، وَسَيَعُوْدُ كَمَا بَدَأَ، فَطُوْبَى لِلْغُرَبَاءِ وَهُمُ الَّذِيْنَ يُصْلِحُوْنَ مَا أَفْسَدَ النَّاسُ مِنْ بَعْدِي مِنْ سُنَّتِي -" (مشکوٰۃ - عمرو بن عوفؓ)

**338.** మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "ఇస్లామ్ ధర్మం ప్రారంభంలో ప్రజలకు అపరిచితమయిందిగా గోచరించింది. సమీప కాలంలో తిరిగి అది లోగడవలెనే అపరిచితంగా మారబోతోంది. అప్పటి 'అపరిచితుల' (ఇస్లామ్ అనుయాయుల)కు శుభవార్త! వీరే నా తరువాత ప్రజలు చెరిపివేసిన నా సంప్రదాయాన్ని పునరుద్ధరించే వారు."

(మిష్కాత్ - అమ్ బిన్ ఔఫ్)

---

336. ధర్మ పరిరక్షణా భారం వహించే వర్గం నిత్యం మహాప్రవక్త (సఅసం) అనుచరుల్లో ఉంటూ వచ్చిందనడానికి గత 1400 ఏళ్ళ చరిత్రే సాక్ష్యం. తాము ధర్మం ప్రకారం జీవిస్తూ ఆ జీవన మార్గం వైపు ఇతరుల్ని ఆహ్వానించే ప్రజలు నేటికీ లోకంలో ప్రతి దేశంలోనూ ఉన్నారు. వారు ఎన్ని కష్టాలనయినా ఎదిరించి తమ కర్తవ్య నిర్వహణలో లోపం రానివ్వకుండా ధర్మ పథాన కృషి సలుపుతున్నారు. ప్రజలు వారిని నానావిధాలుగా బాధించి ఆ మార్గం నుండి తప్పించలేరని మనం కళ్ళారా చూస్తున్నాము. మహాప్రవక్త (సఅసం) మాట అక్షరాలా నిజమయింది.

337. మనిషి, తన కుటుంబంతో, తన సంపదతో మహాప్రవక్త (సఅసం) ను సందర్శించగోరడమంటే తన్ను, తన కుటుంబాన్ని, తన సంపదను దైవ సందేశహరులకు సమర్పించి, అంతా దైవ మార్గంలో వినియోగించి తరించాలని ఆశపడటమన్న మాట. మహాప్రవక్త పట్ల, ఆయన తెచ్చిన ధర్మం పట్ల ఆ విధమయిన ప్రేమ కలిగి ఉండటం మనిషికి ఇహపరాల భాగ్యానికి సోపానం. అంతకంటే మరో భాగ్యమేదీలేదు.

338. ఇస్లామ్ నిజానికి మానవుని సహజ ధర్మం. దైవం ప్రతికాలంలోనూ, ప్రతి దేశంలోనూ దీన్నే తన గుర్తింపు పొందిన ధర్మంగా ప్రజలకు అందజేశాడు. అయితే మాటిమాటికీ ప్రజలు దాన్ని విస్మరిస్తూ వచ్చారు. చివరికి అంతిమ దైవ సందేశహరులు ముహమ్మద్(సఅసం) దీన్ని పునరుద్ధరించడానికి ఆవిర్భవించారు. అది ప్రారంభదశలో క్రొత్తగా అగుపించేది. ప్రజలు దీన్ని గుర్తించలేకపోయారు.

తరువాత మహాప్రవక్త ఆయన సహచరులు జరిపిన అనర్గళ కృషి వల్ల దానికి ఆధిక్యత, ఆధిపత్యం లభించాయి. దానికి ముమ్మరంగా ప్రజాదరణ లభించింది. ఆ తరువాత క్రమేణ అది క్రొత్తగా, అపరిచితమయిందిగా తయారయింది. నేడు తిరిగి అది అపరిచితమయిందని, తమది కాదని మనుషులు ఇస్లాం పట్ల కొత్త వస్తువును చూసినట్లు చూడటం మనం గమనిస్తున్నాము. నేడు ఇస్లామ్ కొత్తది కాదని, పరాయిది అసలేకాదని వారి స్వామి, ప్రభువు, దైవం వారి కొరకు పంపిన జీవన వ్యవస్థ అని తోటి సోదరులకు తెలిపే వారిని ప్రజలు పరాయివారని భావిస్తున్నారు. ఇలాంటి అపరిచితులకే మహాప్రవక్త (సఅసం) శుభవార్త నిస్తున్నారు, దీనికి అర్హత సంపాయించగలిగిన వారు ధన్యులు.

# సందేశదాతల లక్షణాలు

## దైవంపట్ల కృతజ్ఞతాభావం

ముస్లిం సమాజంలోని ప్రతి వ్యక్తిలోనూ ఈ కృతజ్ఞతా భావం తప్పనిసరిగా ఉండవలసిందేకాని అంతకంతకూ చెడిపోతున్న నేటి సమాజంలో కనీసం ధర్మ సంస్థాపన కొరకు నడుం కట్టిన వారిలో ఈ దీపిక అనునిత్యం వెలుగుతూ ఉండటం అనివార్యం. దైవం పట్ల కృతజ్ఞతా భావం ఉన్న మనిషి ఇలా ఆలోచిస్తాడు: "అల్లాహ్ నా ఎడల ఎన్ని ఉపకారాలు చేశాడు. నేను ఈ లోకంలోకి రాక పూర్వం మాతృగర్భంలో నా పోషణకు ఎంతో విచిత్రంగా అన్ని ఏర్పాట్లు చేశాడు. ప్రపంచంలో వెలసిన తర్వాత శైశవంలో కాళ్ళూ చేతులు ఆడని కాలంలో అపురూపంగా చూసుకొనే ప్రేమమయిని, మాతృమూర్తిని నా పోషణ, రక్షణలకు నియమించాడు. క్రమక్రమంగా మాట్లాడటానికి కాళ్ళు చేతులు ఆడించడానికి శక్తి సామర్థ్యాలనిచ్చాడు. నేను ఎవరికీ ఏమీ కాని కాలం నుండి పుట్టి పెరిగి గిట్టే వరకు ఈ భూమ్యాకాశాల కార్ఖానా అంతటినీ నాకోసమే అన్నట్టు నిరంతరం నడిపించాడు. నా శారీరక, మానసిక, వైజ్ఞానిక అవసరాలకు వనరులు పుట్టించాడు." అంటూ దైవం చేసిన ఒక్కొక్క ఉపకారాన్ని అనుగ్రహించిన ఒక్కొక్క వరప్రసాదాన్ని మననం చేసుకుంటూ, ఒకవైపు ఎనలేనితన బలహీనతల్ని, మరో వైపు అంతులేని ఆయన అనుగ్రహాల్ని చూసుకుంటాడు. అతని ఆంతర్యంలో తన ఉపకారి, దాత ఎడల ప్రేమ భావం మేలుకుంటుంది. అతని నోరు ఆ ప్రభువు స్తోత్రాన్ని నవనవగానం చేస్తుంది. శరీరంలోని సమస్త అవయవాలు, సర్వశక్తులు ఆ స్వామిని ప్రసన్నం చెయ్యడానికి, ఆ మార్గంలో పరుగులు తీయడానికి అంకితమయిపోతాయి.

ఈ భావననే 'దైవంపట్ల కృతజ్ఞతా భావం' అంటాము. ఇది సర్వ సత్కార్యాలకు ఊపిరి లాంటిది. ఈ భావాన్ని మేల్కొలపడానికీ, పెంపొందించటానికీ దైవ గ్రంథాలు అవతరించాయి. దైవప్రవక్తలు ప్రభవించారు. ఈ భావాన్ని మనిషి మనస్సునుండి రూపుమాపడమే షైతాన్, ఇబ్లీస్ అసలు కార్యక్రమం. ఈ భావం ఎంత సజీవంగా ఉంటే అంతగా మనిషి దైవ విధేయతా చరణంలో ముమ్మందుంటాడు. ఈ భావం మనిషిలో అణగారి పోయినప్పుడే మనిషి పాపం వైపునకు అపరాధం వైపునకు అడుగిడగలుగుతాడు. కృతజ్ఞతా భావం మనిషిలో జాగృతమయితే అతని జీవితం దైవదాస్య మార్గంలో ఉజ్వలమానమవుతుంది.

٣٣٩ عَنْ مُعَاذِ بْنِ أَنَسٍ قَالَ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ
سَلَّمَ: مَنْ أَكَلَ طَعَامًا فَقَالَ: اَلْحَمْدُ لِلّٰهِ الَّذِىْ أَطْعَمَنِىْ هٰذَا مِنْ
غَيْرِ حَوْلٍ مِّنِّىْ وَلَا قُوَّةٍ غُفِرَ لَهٗ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهٖ۔" (ابوداؤد)

339. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారని ముఆజ్ బిన్ అనస్ (రజిఅన్) ఉల్లేఖించారు : 'ఎవరు భోంచేసి, అల్ హమ్దులిల్లాహ్ (అల్లాహ్‌కు అభివందనాలు), ఆయనే నాకు ఈ భోజనాన్ని ప్రసాదించాడు, నా కృషి, శక్తి, సామర్థ్యాల ప్రసక్తి లేకుండా!' అని కృతజ్ఞతా భావంతో అంటాడో గతంలో అతను చేసిన తప్పులన్నీ మన్నించబడతాయి.'

(అబూదావూద్)

٣٤٠ عَنْ أَبِىْ سَعِيْدِنِ الْخُدْرِيِّ قَالَ: كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ
وَسَلَّمَ إِذَا اسْتَجَدَّ ثَوْبًا سَمَّاهُ بِإِسْمِهٖ عِمَامَةً أَوْ قَمِيْصًا أَوْ رِدَاءً،
يَقُوْلُ: أَللّٰهُمَّ لَكَ الْحَمْدُ، أَنْتَ كَسَوْتَنِيْهِ، أَسْئَلُكَ خَيْرَهٗ وَخَيْرَ مَا
صُنِعَ لَهٗ وَأَعُوْذُبِكَ مِنْ شَرِّهٖ وَشَرِّ مَا صُنِعَ لَهٗ۔" (ابوداؤد)

340. అబూసయీద్ ఖుద్రీ (ర.అ.) ఇలా ఉల్లేఖించారు: 'మహా ప్రవక్త (సఅసం) కొత్తబట్టలు వేసుకున్నప్పుడు, అది తలపాగా అయినా, చొక్కా అయినా లేక దుప్పటి అయినా దాని పేరు పలికి "అల్లాహ్! అభివందనాలు. నీకు కృతజ్ఞుణ్ణి. నీవు దీన్ని నాకు తొడిగించావు. దీనిలోని మేలును,

---

339. ఏ వ్యక్తి భోంచేసినప్పుడల్లా తన పోషకుని గుర్తుంచుకుని, "నేనెంత, నాశక్తి సామర్థ్యాలెంత? దైవం ఎదుట అత్యంత అశక్తుణ్ణి. నా దగ్గరున్నదంతా ఆ ప్రభువు ప్రసాదించినదే. ఈ భోజన పానీయాలు కూడా ఆయన అనుగ్రహమే. ఆయనే ఇవ్వకపోతే నాకెక్కడిది?" అని భావిస్తాడో, ఏ వ్యక్తి తన కష్టార్జితం ముందుం చుకొని "ఇది నా స్వామి ప్రసాదం" అని భావిస్తాడో అతను తెలిసి ఏదయినా తప్పు, పాపం చేస్తాడా! ఏదయినా తప్పు జరిగినా తక్షణం తన ప్రభువు సమక్షంలో క్షమాపణ వేడుకోడా?? ఇలాంటి వ్యక్తి పాపాలు మన్నింపబడకపోతే మరెవరి పాపాలు మన్నింపబడతాయి???

దీన్ని తయారుచేసిన లక్ష్యంలోని మేలును కోరుకుం టున్నాము. దీనిలోని చెడునుండి దీన్ని తయారుచేసిన ఉద్దేశ్యంలోని చెడు నుండి నీ రక్షణను అర్థిస్తున్నాను" అని ప్రార్థించేవారు. (అబూదావూద్)

٣٤١ عَنْ عَلِيِّ بْنِ رَبِيْعَةَ، قَالَ شَهِدْتُّ عَلِيَّ ابْنَ أَبِي طَالِبٍ أُتِيَ بِدَابَّةٍ لِيَرْكَبَهَا، فَلَمَّا وَضَعَ رِجْلَهُ فِي الرِّكَابِ قَالَ: بِسْمِ اللهِ، فَلَمَّا اسْتَوَىٰ عَلَىٰ ظَهْرِهَا قَالَ: اَلْحَمْدُ لِلّٰهِ الَّذِيْ سَخَّرَ لَنَا هٰذَا، وَمَا كُنَّا لَهُ مُقْرِنِيْنَ وَإِنَّا إِلَىٰ رَبِّنَا لَمُنْقَلِبُوْنَ - (ابوداؤد)

341. అలీ బిన్ రబీయ ఇలా ఉల్లేఖించారు: 'నేను ఒకసారి అలీ బిన్ అబీ తాలిబ్ (రఅ)ను చూశాను. ఆయన స్వారీ చేయడానికి వాహనాన్ని తీసుకువచ్చారు. ఆయన దాని రికాబులో కాలు పెడుతూ "అల్లాహ్ పేరుతో" అని పెట్టారు. దాని మూపురంపై ఎక్కి కూచున్న తర్వాత "అల్లాహ్‌కు అభివందనాలు. ఆయనే దీన్ని మన స్వాధీనంలో ఇచ్చాడు. లేకపోతే మనం మన శక్తి సామర్థ్యాలతో దీన్ని స్వాధీన పరచుకోలేక పోయేవాళ్ళం. చిట్టచివరికి మనమంతా మన ప్రభువుచెంతకు మరలి పోవలసినవారమే!' (అబూదావూద్)

---

340. బట్టలయినా మరే ఇతర వస్తువయినా దాన్ని మంచి కొరకు వాడుకోవచ్చు, చెడు కోసమూ వాడుకోవచ్చు. మహాప్రవక్త (సఅసం) ఈ ప్రార్థన ద్వారా నేర్పిందేమంటే విశ్వాసి దేవుని ఒక్కొక్క వరాన్ని పొందినప్పుడల్లా ఆయనపట్ల కృతజ్ఞతా భావంతో అభివందనాలు అర్పించుకుంటాడు. ఆ వస్తువును ఉపయోగిస్తూ చెడుపని చెయ్యకుండా ఉండేలా, దాన్ని చెడు ఉద్దేశ్యాల కొరకు వినియోగించుకోకుండా ఉండేలా అల్లాహ్‌ను వేడుకుంటాడు.
బట్టల్లోనూ, బట్టలు కుట్టడం, కట్టుకోవడంలోనూ మనిషి మనో ప్రవృత్తినిబట్టి ఎన్నో విధాలుంటాయంటే ఆశ్చర్యం లేదు. బట్టలు మనిషిలో ఉదార గుణం, వినమ్రత కూడా జనింపజేస్తాయి. అలాగే మనిషిలో గర్వం, దర్పం, దర్జాను కూడా పెంచడానికి కారణమవుతాయి. అందువల్లనే మహాప్రవక్త (సఅసం) పై ప్రార్థనను నేర్పారు.

۳۴۲ عَنْ حُذَيْفَةَ قَالَ: كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا أَخَذَ مَضْجَعَهُ مِنَ اللَّيْلِ وَضَعَ يَدَهُ تَحْتَ خَدِّهِ ثُمَّ يَقُولُ: "اَللّٰهُمَّ بِاسْمِكَ اَمُوْتُ وَأَحْيَا" وَإِذَا اسْتَيْقَظَ قَالَ: "اَلْحَمْدُ لِلّٰهِ الَّذِىْ أَحْيَانَا بَعْدَ مَا أَمَاتَنَا وَإِلَيْهِ النُّشُوْرُ۔" (بخاری)

342. హజ్రత్ హుజైఫా (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: 'మహాప్రవక్త (సఅసం) పడుకునేటప్పుడు తన కుడి చేయిని చెంప క్రింద పెట్టుకునేవారు, అప్పుడు "అల్లాహ్! నేను నీ పేరు పలికే మరణి స్తాను, జీవిస్తాను." అని ప్రార్థించుకునేవారు. తిరిగి మేల్కొన్నప్పుడు, "అల్లాహ్‌కే సకల స్తోత్రాలు. ఆయనే మమ్మల్ని మరణం ప్రసాదించి తిరిగి జీవింపజేశాడు, తిరిగి లేచి ఆయన వద్దకే పోవలసి ఉంది." అని పలికేవారు.'

(బుఖారి)

---

341. అల్లాహ్ ఒంటెల్ని, గుర్రాల్ని ఇతర పశువుల్ని మనిషి స్వాధీనంలో ఇవ్వకపోతే, మనిషి హస్తగతం చెయ్యకపోతే, వాటి కంటే బలహీనుడయిన వాడూ, వాటి కంటే చిన్న శరీరం కలవాడూ అయిన మనిషి వాటిని ఎలా స్వాధీనపరచుకో గలిగేవాడు? కాని అల్లాహ్ వాటి కోసం తయారు చేసిన నియమం ప్రకారం అవి అతి సునాయాసంగా మనిషికి లొంగిపోతాయి. విశ్వాసి ఈ దైవానుగ్రహాన్నిగ్రహించి కృతజ్ఞతా భావంతో దైవస్తోత్రగానం చేస్తాడు. అతని మనస్సు తక్షణం దైవంవైపునకు మరలుతుంది.'ఇన్ని అనుగ్రహాలు వరాలు ప్రసాదించిన ప్రభువు వీటిని గురించి నన్ను ప్రశ్నిస్తాడు కదా, తిరిగి అందరూ ఆయన వద్దకు పోవలసిన వారే కదా' అని అతను తలపోస్తాడు.
ఈ విధంగా దేవుని ఒక్కొక్క వరప్రసాదాన్ని అనుభవించినప్పుడు మనిషి ఆయన్ని, పరలోకజీవితాన్ని తలుస్తూ మనుగడ సాగిస్తే అతని ఆచరణాత్మక జీవితం ఎంత పుణ్యప్రదం, జయప్రదమౌతుందో ఊహించండి.

342. మనిషి అంతర్యంలో పరలోక చింతన స్థానమేర్పరచుకున్నప్పుడు, అతనికి దైవ నామస్మరణే దిన చర్యగా మారుతుంది. పడుకునేటప్పుడు, మేల్కొనేటప్పుడు, జీవితం సాగినంతకాలం, మరణానంతరం - ఎల్లప్పుడూ ఆయన నామమే తనకు తోడూ నీడ కావాలని కోరుకుంటాడు.
ఓ విధమయిన మృత్యువులాంటి నిద్రలో నుండి మేల్కొనగానే విశ్వాసికి పరలోక పరీక్ష జ్ఞప్తికి వస్తుంది. ఇదే విధంగా తాను మరణించిన పిదప ఒకరోజు తిరిగి బ్రతకవలసి ఉందనీ ఆ రోజు ఐహిక జీవితంలో తాను చేసిన కర్మల లెక్కలు దైవానికి చూపవలసి ఉందని, ఈ జీవితకాలాన్ని, ఈ వ్యవధిని వృథా చేస్తే రేపు దైవ సమక్షంలో నిలువలేనని గుర్తు చేసుకుంటాడు.

٣٤٣ عَنْ أَبِي سَعِيْدٍ، قَالَ مُعَاوِيَةُ: إِنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ خَرَجَ عَلٰى حَلْقَةٍ مِنْ أَصْحَابِهِ، فَقَالَ: مَا أَجْلَسَكُمْ هٰهُنَا؟ فَقَالُوْا: جَلَسْنَا نَذْكُرُ اللّٰهَ وَنَحْمَدُهُ عَلٰى مَا هَدَانَا لِلْإِسْلَامِ وَمَنَّ بِهِ عَلَيْنَا

(مسلم)

343. హజ్రత్ ముఆవియా (రజిఅన్) చెప్పారని అబూసయీద్ ఖుద్రీ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : 'ఒకరోజు మహాప్రవక్త వెలుపలికి వచ్చి తన సహచరులు గుండ్రంగా కూర్చుని ఉండటం గమనించారు. వారిని ఉద్దేశించి, "మీరు ఇక్కడ దేనికి కూర్చున్నారు?" అని అడిగారు. వారు దానికి బదులుగా, "మేమిక్కడ కూర్చొని అల్లాహ్ నామ సంస్మరణ చేస్తున్నాము; ఆయన మాపై కురిపించిన అనుగ్రహాలను మననం చేస్తూ ఆయన కీర్తిని గానం చేస్తున్నాము; ఆయన మమ్మల్ని ఇస్లామ్ వైపునకు మార్గం చూపించి, మాకు దాన్ని విశ్వసించి స్వీకరించే బుద్ధి కలిగించిన ఉపకారాన్ని గుర్తు చేసుకుంటున్నాము' అని పలికారు.

(ముస్లిమ్)

٣٤٤ عَنْ أَبِي مُوْسَى الْأَشْعَرِيِّ أَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "إِذَا مَاتَ وَلَدُ الْعَبْدِ قَالَ اللّٰهُ تَعَالٰى لِمَلٰئِكَتِهِ: قَبَضْتُمْ وَلَدَ عَبْدِيْ؟ فَيَقُوْلُوْنَ: نَعَمْ، فَيَقُوْلُ: قَبَضْتُمْ ثَمَرَةَ فُؤَادِهِ؟ فَيَقُوْلُوْنَ: نَعَمْ، فَيَقُوْلُ: فَمَاذَا قَالَ عَبْدِيْ؟ فَيَقُوْلُوْنَ: حَمِدَكَ وَاسْتَرْجَعَ، فَيَقُوْلُ اللّٰهُ تَعَالٰى: اِبْنُوْا لِعَبْدِيْ بَيْتًا فِي الْجَنَّةِ وَسَمُّوْهُ بَيْتَ الْحَمْدِ

(ترمذی)

344. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించినట్లు హజ్రత్ అబూ మూసా అష్ అరీ (రజిఅన్) ఉల్లేఖించారు : 'తన దాసుల్లోని ఒక దాసుని బిడ్డ మరణించినప్పుడల్లా అల్లాహ్ తన దూతల్ని అడుగుతాడు - "మీరు నా

దాసుని బిడ్డ ప్రాణంతీశారా?" దానికి వారు 'అవును' అని సమాధాన మిస్తారు. తిరిగి వారితో "మీరు నా దాసుని గుండెలో భాగమయిన వాని ప్రాణం తీశారా?" అని ప్రశ్నిస్తాడు. వారు 'అవును' అని బదులిస్తారు. అప్పుడు ఆయన అడుగుతాడు, "అయితే నా దాసుడు ఏమన్నాడు?" వారు ఇలా అంటారు, "దీనికై అతడు నీకు అభివందనాలు అర్పించు కున్నాడు, 'మేమంతా అల్లాహ్ కొరకే ఆయన వైపునకు మరలిపోవలసిన వారమే' అని పలికాడు." "నా ఈ దాసునికొరకు స్వర్గంలో ఒక గృహం నిర్మించండి, దానికి కృతజ్ఞతా గృహమని పేరు పెట్టండి" అని ఆదేశిస్తాడు వారిని అల్లాహ్.' (తిర్మిజి)

۳۴۵ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: عَجَبًا لِّأَمْرِ الْمُؤْمِنِ
إِنَّ أَمْرَهُ كُلَّهُ لَهُ خَيْرٌ، وَلَيْسَ ذٰلِكَ إِلَّا لِلْمُؤْمِنِ، إِنْ أَصَابَتْهُ ضَرَّاءُ
صَبَرَ فَكَانَ خَيْرًا لَّهُ، وَإِنْ أَصَابَتْهُ سَرَّاءُ شَكَرَ فَكَانَ خَيْرًا لَّهُ؛

(مُسلم ـ سهيبؓ)

345. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు: "మోమిన్ (విశ్వాసి) వ్యవహారంకూడా వింతయినది. అతను ఏ స్థితిలోఉన్నా తద్వారా శుభాన్నే సేకరిస్తాడు. ఈ మహాభాగ్యం మోమిన్‌కి తప్ప మరెవ్వరికీ ప్రాప్తంకాలేదు. అతను కష్టాలకు, వ్యాధీ వ్యధలకు గురయి నప్పుడు వాటిని 'సహనం'తో

---

343. దైవం మానవునికి చేసే ఉపకారాల్లో, మానవ జీవితానికిగాను మార్గం చూపడం. జీవితపు ఒడిదుడుకుల్లో మార్గదర్శకత్వం వహించడం మహోపకారం. అందువల్ల మనిషిలో ఈ సన్మార్గం పొందటం పట్ల అత్యధికంగా కృతజ్ఞతా భావం కలగటం సహజం, సమంజసం కూడా. ఈ మహోపకారాన్ని ఎంతగా గుర్తు చేసు కుంటూ ఉంటే అంతే దాని విలువ మనిషికి అర్థమవుతుంది. దాన్ని పరిరక్షించుకునేందుకు అతడు అంతే కృషి చేస్తాడు కూడా.

344. విశ్వాసి ఆపద వచ్చినప్పుడు అల్లాహ్‌ను స్మరించి ఆయనకు అభివందనాలు అర్పించుకుంటాడు అంటే నాకు ఈ ఆపద వచ్చినంత మాత్రాన, నా సంతానం నాకు దూరమయినంత మాత్రాన నేను నీ పట్ల దురభిప్రాయం కలిగి లేను. నీవు ఏది చేసినా అది దౌర్జన్యం కానేరదు, అన్యాయం కాజాలదు.

ఎదుర్కొంటాడు. అది అతనికి శుభాన్ని చేకూర్చుతుంది. అలాగే సుఖ సంపన్నతలు వరించినప్పుడూ 'కృతజ్ఞత'తో మెలుగుతాడు. అదీ అతనికి శుభప్రదమవుతుంది." (ముస్లిమ్ - సుహైబ్)

٣٤٦ قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : أُنْظُرُوا إِلَى مَنْ هُوَ أَسْفَلُ مِنْكُمْ وَلَا تَنْظُرُوا إِلَى مَنْ هُوَ فَوْقَكُمْ فَهُوَ أَجْدَرُ أَنْ لَا تَزْدَرُوا نِعْمَةَ اللّٰهِ عَلَيْكُمْ -" (مسلم - ابوهريرة رض)

346. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా ప్రవచించారు : "మీరు, మీకంటే, ధన ధాన్యాల్లో ప్రాపంచిక హోదాల్లో కొరవడిన వారిని చూడండి. మీకంటే ధన ధాన్యాల్లో భోగభాగ్యాల్లో అధికులయిన వారి వంక చూడకండి. అప్పుడు మీకు అల్లాహ్ ప్రసాదించిన కానుకలు, వరాలు, బహుమానాలు మీ దృష్టిలో అల్పం కావు."

(ముస్లిమ్ - అబూహురైరా)

---

ఈ పాపను తీసుకోవడమే నీ ఇష్టమయితే నీ ఇష్టంతో నేనేకీభవిస్తున్నాను. నీ ఇష్టమే నా ఇష్టం అని అంటాడన్నమాట.

ఈ హదీసు ద్వారా ఆపద ఎదురయినప్పుడు 'ఇన్నా లిల్లాహి వ యిన్నా ఇలైహి రాజిఊన్ (మేమంతా అల్లాహ్ కొరకే, అందరం ఆయన వైపునకే మరలి పోవలసిన వారము) అని పలకాలని నేర్పబడింది. దీని మూలంగా ప్రపంచంలోని ప్రతి వస్తువు అనిత్యమయిందనే భావన కలిగి ఆపదను మనిషి సహనంతో అవలీలగా దాటి పోగలుగుతాడు.

345. అంటే విశ్వసించిన వ్యక్తి ఎట్టి పరిస్థితిలోనూ పుణ్య ఫలాన్ని కోల్పోడు. కష్టాలు, ఆపదలు వచ్చినప్పుడు తన విశ్వాసం కారణంగా అవన్నీ దైవం తనకు పెట్టిన పరీక్షలని భావించి వాటిని కడు నిబ్బరంగా సహన స్థయిర్యాలతో ఎదుర్కొంటాడు. దానికి పుణ్యం లభిస్తుంది. సుఖసంతోషాలు కలిగితే అప్పుడూ ఇవన్నీ దైవం ప్రసాదించినవే కనుక వాటికి దైవం పట్ల కృతజ్ఞతాభివందనాలు అర్పించుకుంటాడు. ఈ భావం వల్ల కూడా అతనికి పుణ్యమే ప్రాప్తమవుతుంది.

346. మనకంటే ప్రాపంచిక విషయాల్లో హీనమయినస్థితిలో ఉన్నవారిని చూసినప్పుడు మనకు ఉన్న దానిపై దైవం పట్ల మనకు కృతజ్ఞతాభావం జనిస్తుంది. అధికుల్ని

## లజ్జ

۳۴۷ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "اَلْحَيَاءُ لَا يَأْتِيْ إِلَّا بِخَيْرٍ"

(بخاری - مُسلم - عمران بن حصینؓ)

347. దైవప్రవక్త (సఅసం) ఇలా బోధించారు : "లజ్జాగుణం వల్ల మేలు తప్ప మరేమీ చేకూరదు."

(బుఖారి, ముస్లిమ్ - ఇమ్రాన్ బిన్ హుసేన్)

## సహనం, స్థయిర్యం

۳۴۸ قَالَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ يَّتَصَبَّرْ يُصَبِّرْهُ اللهُ وَمَا أُعْطِيَ أَحَدٌ عَطَاءً خَيْرًا وَّأَوْسَعَ مِنَ الصَّبْرِ"

(بخاری - مسلم - ابوسعید خدریؓ)

348. దైవ సందేశహరులు (సఅసం) ఒకసారి ఇలా ఉపదేశించారు: "ఎవరు సహన గుణాన్ని అలవరచుకో గోరుతారో, అల్లాహ్ వారికి సహనాన్ని ప్రసాదిస్తాడు. సహనం కంటే మేలయినదీ, ఇతోధికంగా మేళ్ళను సమకూర్చేదీ మరొక దైవ వరం లేదు."

(బుఖారి, ముస్లిమ్ - అబూ సయీద్ ఖుద్రీ)

---

చూస్తే లేని దానికై ప్రాకులాడే బుద్ధి, ఉన్నదాని పట్ల అసంతృప్తి జనిస్తాయి.

347. అంటే లజ్జాగుణం ఎన్నో మేళ్ళకు మూలమని భావం. ఈ గుణం ఉన్న వ్యక్తి చెడులకు దూరంగా మసలుకుంటాడు. మంచిని సొంతం చేసుకుంటాడు. ఇమామ్ నవవి తన గ్రంథం 'రియాజుస్సాలిహీన్' లో ఈ స్థితిని పేర్కొంటూ ఇలా వ్రాశారు :

حَقِيْقَةُ الْحَيَاءِ خُلُقٌ يَبْعَثُ عَلَى تَرْكِ الْقَبِيْحِ وَيَمْنَعُ مِنَ التَّقْصِيْرِ فِيْ حَقِّ ذِي الْحَقِّ - وَقَالَ الْجُنَيْدُ: "اَلْحَيَاءُ رُؤْيَةُ الْآلَاءِ أَيِ النِّعَمِ وَرُؤْيَةُ التَّقْصِيْرِ فَيَتَوَلَّدُ بَيْنَهُمَا حَالَةٌ تُسَمَّى حَيَاءً"

۳۴۹ عَنْ أُسَامَةَ قَالَ : اَرْسَلَتْ بِنْتُ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ سَلَّمَ أَنَّ ابْنِيْ قَدِ احْتُضِرَ فَاشْهَدْنَا ، فَأَرْسَلَ يُقْرِئُ السَّلَامَ وَ يَقُوْلُ : "إِنَّ لِلّٰهِ مَا أَخَذَ وَلَهٗ مَا أَعْطٰى وَكُلُّ شَيْءٍ عِنْدَهٗ بِأَجَلٍ مُّسَمًّى، فَلْتَصْبِرْ وَلْتَحْتَسِبْ ـ" فَأَرْسَلَتْ إِلَيْهِ تُقْسِمُ عَلَيْهِ لَيَأْتِيَنَّهَا - فَقَامَ وَمَعَهٗ سَعْدُ بْنُ عُبَادَةَ وَمُعَاذُ بْنُ جَبَلٍ وَأُبَيُّ بْنُ كَعْبٍ وَّزَيْدُ بْنُ ثَابِتٍ وَّرِجَالٌ رَضِيَ اللّٰهُ عَنْهُمْ فَرَفَعَ إِلٰى رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ الصَّبِيُّ فَأَقْعَدَهٗ فِيْ حِجْرِهٖ وَنَفْسُهٗ تَقَعْقَعُ فَفَاضَتْ عَيْنَاهُ ، فَقَالَ سَعْدٌ : "يَا رَسُوْلَ اللّٰهِ ، مَا هٰذَا ؟" فَقَالَ : "هٰذِهٖ رَحْمَةٌ جَعَلَهَا اللّٰهُ فِيْ قُلُوْبِ عِبَادِهٖ -" (بخاری-مُسلم)

349. హజ్రత్ ఉసామా (రఅ) ఇలా ఉల్లేఖించారు: మహాప్రవక్త (సఅసం) కుమార్తె "నా కుమారుడు అవసానదశలో ఉన్నాడు, మీరు వెంటనే రావలసింది" అని మహాప్రవక్త వద్దకు కబురంపారు. అప్పుడు ఆయన ఆమెకు సలాముతో బాటు ఇలా చెప్పి పంపారు: 'తన సొంత మైన దాన్ని అల్లాహ్ తీసుకుంటాడు ఆయన అనుగ్రహించేదంతా ఆయన సొంతమయినదే. ప్రతి విషయమూ ఆయన వద్ద నిశ్చయమై ఉంటుంది. ప్రతి దానికి ఒక అవధి నిర్ణయమయి ఉంటుంది. నీవు పరలోకంలో

---

"లజ్జ ఎలాంటి గుణం అంటే అది మనిషిని చెడు పనులు చెయ్యరాదని నిరోధిస్తుంది. హక్కుదారుల హక్కులు నిర్వర్తించకుండా ఉంటే అలా చేయరాదని వారిస్తుంది." ఇంకా 'హజ్రత్ జునైద్ బుగ్దాదీ' తన అభిప్రాయాన్ని ఇలా వ్రాశారు: "దైవం తనకు ప్రసాదించిన అనుగ్రహాలను మనిషి గమనిస్తాడు. తరువాత ఆ దాతకు కృతజ్ఞతలు తెలుపడంలో తాను చేసిన అశ్రద్ధ గుర్తుకు వస్తుంది. అప్పుడు ఆ రెండు తలంపుల మధ్య ఏర్పడే మనోస్థితినే 'లజ్జ' అని అంటాము." మహాప్రవక్త (సఅసం) ఈ గుణాన్ని మరో హదీసులో విపులీకరించారు. (దాన్ని హదీసు సంఖ్య 384లో చూడండి).

348. ఒక వ్యక్తి పరీక్షా సమయాలు, ఆపదలు ఎదురైనప్పుడు సహనంగా స్థయిర్యంగా నిలువగలుగుతున్నాడంటే అతనికి అల్లాహ్‌పై గట్టి భరోసా, అచంచల విశ్వాసమూ ఉంటేనే తప్ప అది సాధ్యపడదు. ఇంకా ఆ వ్యక్తికి దైవం పట్ల గొప్ప కృతజ్ఞతాభావం లేకపోయినా ఆ సహన గుణాన్ని అలవరచుకోలేడు. ఇలాగే కొంచెం లోతుగా ఆలో

ప్రతిఫలం పొందే లక్ష్యంతో ఓర్పువహించు.' తప్పక రావలసిందని ఆమె తిరిగి పిలువనంపారు. అప్పుడు ఆయనతో సఅద్ బిన్ ఉబాదా, ముఆజ్ బిన్ జబల్, ఉబై బిన్ కఅబ్, జైద్ బిన్ సాబిత్ ఇంకా కొందరు సహచరులతో ఆమె ఇంటికి వెళ్లారు. పిల్లవాణ్ణి ఆయన (సఅసం)వద్దకు తెచ్చారు. ఆయన అతణ్ణి ఒడిలో కూర్చోబెట్టుకున్నారు. అతని ప్రాణంపోయే దృశ్యాన్ని చూసి మహాప్రవక్త (సఅసం) కనులనుండి అశ్రువులు రాలసాగాయి. అది చూచి సఅద్ బిన్ ఉబాదా "ప్రవక్తా ఇదేమిటి?" అని అడిగారు, దానికి ఆయన, "అల్లాహ్ తన దాసుల హృదయాల్లో సృజించిన కరుణారసం ఇది" అని సమాధానం పలికారు.

(బుఖారి, ముస్లిమ్)

٣٥٠ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: مَا يَزَالُ الْبَلَاءُ بِالْمُؤْمِنِ وَالْمُؤْمِنَةِ فِيْ نَفْسِهٖ وَوَلَدِهٖ وَمَالِهٖ حَتّٰى يَلْقَى اللهَ تَعَالٰى وَمَا عَلَيْهِ خَطِيْئَةٌ" (ترمذی - ابوھریرہؓ)

350. మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు : "విశ్వాసులయిన స్త్రీ పురుషులపై అప్పుడప్పుడు పరీక్షా సమయాలు ఆసన్నమవుతూ ఉంటాయి. ఒక్కోసారి స్వయంగా అతనికీ, మరోసారి అతని సంతానానికి, ఇంకొకసారి అతని సంపదకీ ఈ ఆపదలు వాటిల్లుతాయి. చివరకు అతను అల్లాహ్‌ను కలుసుకున్నప్పుడు అతని (కర్మపత్రం)లో ఎలాంటి పాపమూ ఉండదు." (తిర్మిజీ-అబూహురైరా)

---

చిస్తే ఈ సహన గుణంతో పాటు మరెన్నో సద్గుణాలు తామయి అలవడుతాయి అని తెలుసుకోగలం.

349. అంటే మనిషి ఎంత ఉదాత్త గుణం కలవాడైనా ఎంత కఠిన హృదయం కలవాడైనా సహజసిద్ధమయిన దయార్ద్రత కారణంగా అలాంటి దృశ్యాలకు ప్రభావితుడయిన అతని ఆంతర్యం కరిగి అశ్రువులు రాలడం సహజం. ఇది దైవం పట్ల నమ్మకానికి, దైవ నిర్ణయం పట్ల తుష్టికి ఏ విధంగానూ వ్యతిరేకం కాదు, కరుణగల ఏ హృదయమయినా కష్టాల్లో ఉన్న తోటి మానవుల్ని చూసి ద్రవించడం అనివార్యం.

۳۵۱ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ عِظَمَ الْجَزَاءِ مَعَ عِظَمِ الْبَلَاءِ، وَإِنَّ اللّٰهَ تَعَالٰى إِذَا اَحَبَّ قَوْمًا ابْتَلَاهُمْ، فَمَنْ رَضِيَ فَلَهُ الرِّضٰى وَمَنْ سَخِطَ فَلَهُ السَّخَطُ۔" (ترمذی۔انسؓ)

351. దైవప్రవక్త ఇలా ప్రబోధించారు: "పరీక్ష ఎంత క్లిష్టమైనదైతే అంతే గొప్ప బహుమానం కూడా లభిస్తుంది. అల్లాహ్ ఎవరిని, ఏ జాతిని, ఏ సంఘాన్ని, ఏ ప్రజల్ని ప్రేమిస్తాడో వారిని పరీక్షలో పడవేస్తాడు. అప్పుడు ఎవరు దైవనిర్ణయం పట్ల సమ్మతిని, ఆమోదాన్ని తెలిపి ఓర్పు వహిస్తారో అల్లాహ్ వారి ఎడల ప్రసన్నుడవుతాడు. ఎవరు ఈ పరీక్షలో అల్లాహ్‌పట్ల అసమ్మతిని తెలుపుతారో వారి ఎడల అల్లాహ్ కూడా అసమ్మతిని కనబరుస్తాడు. (తిర్మిజి-అనస్)

۳۵۲ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَا يُصِيْبُ الْمُسْلِمَ مِنْ نَّصَبٍ وَّلَا وَصَبٍ وَّلَا هَمٍّ وَّلَا حُزْنٍ وَّلَا اَذًى وَّلَا غَمٍّ حَتَّى الشَّوْكَةِ يُشَاكُهَا إِلَّا كَفَّرَ اللّٰهُ بِهَا مِنْ خَطَايَا۔" (متفق علیہ)

352. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు : "ఒక ముస్లిమ్ మానసిక వ్యధకూ లేదా అనారోగ్యానికి లేదా ఏదయినా కష్టానికి దుఃఖానికి గురయి దాన్ని ఓరిమితో సహించినట్లయితే దీనికి ప్రతిఫలంగా అల్లాహ్ అతని తప్పులను మన్నిస్తాడు. కడకు అతనికి ఒక ముల్లు గుచ్చుకున్నా అది అతని పాపవిమోచనానికి కారణభూతమవుతుంది." (ముత్తఫకున్ అలైహ్)

---

350. ఎలాంటి పాపమూ ఉండదంటే, ఈ కష్టాలన్నింటినీ ఓరిమితో ఎదుర్కోవడంచేత అతని పాపాలు హరించబడి హృదయం, ఆంతర్యం నిర్మలమవు తుందన్నమాట.

351. బహుమానం లభించాలంటే మనిషి కష్టాలకు బేజారై సన్మార్గాన్ని వదలి పరుగెత్తకూడదు. ప్రేమించేవాణ్ణి పరీక్షలకు గురిచేయడమంటే, అతని నైతికతను, నైతిక బలాన్ని ఇంకా మెరుగుపరచడమన్నమాట.

352. విశ్వాసి జీవితం మొత్తం మీద ధర్మపథంలో సక్రమంగా నడుస్తూ ఉన్నప్పుడు అందులో మానవ సహజంగా ఏవయినా పొరపొచ్చులు జరగవచ్చు. వాటి నివృత్తికై

٣٥٣ عَنْ سُفْيَانَ بْنِ عَبْدِ اللهِ قَالَ : قُلْتُ يَا رَسُوْلَ اللهِ ، قُلْ لِيْ فِي الْإِسْلَامِ قَوْلًا لَا أَسْئَلُ عَنْهُ أَحَدًا غَيْرَكَ ، قَالَ : "قُلْ اٰمَنْتُ بِاللهِ ثُمَّ اسْتَقِمْ." (مسلم)

353. సుఫియాన్ బిన్ అబ్దుల్లాహ్ ఉల్లేఖించారు : "నేనొకసారి మహాప్రవక్త (సఅసం)ను, "ఇస్లామ్ గురించి ఒక సమగ్ర వాక్యాన్ని నాకు బోధించండి. ఆ తరువాత నాకు మరెవ్వరినీ అడిగే అగత్యం ఏర్పడ కూడదు" అని అడిగాను. అప్పుడు ఆయన ఉపదేశించారు "ఆమన్తు బిల్లాహ్ (నేను అల్లాహ్‌ను విశ్వసించాను) అని పలికి ఆ మాటపై స్థిరంగా నిలబడు."
(ముస్లిమ్)

٣٥٤ عَنِ الْمِقْدَادِ بْنِ الْأَسْوَدِ قَالَ : سَمِعْتُ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ : إِنَّ السَّعِيْدَ لَمَنْ جُنِّبَ الْفِتَنَ (ثَلٰثًا) وَلَمَنِ ابْتُلِيَ فَصَبَرَ فَوَاهًا ." (ابوداؤد)

354. మహాప్రవక్త (సఅసం) ఇలా సెలవియ్యగా విన్నానని హజ్రత్ మిక్దాద్ (రజి) చెప్పారు : "పరీక్షల బారి నుండి తప్పించుకుని సురక్షితంగా ఉండే వ్యక్తి మహాభాగ్యవంతుడు:" ఈ మాటలు ఆయన మూడు పర్యాయాలు పలికారు. తరువాత, "అయితే ఎవరు పరీక్షలకు లోనయి, ఆపదల పాలవుతారో వారు సత్యంపై ఓరిమి, నిలకడ కనబరిస్తే ఇక వారి సౌభాగ్యాన్ని గురించి చెప్పనక్కరలేదు." (అబూదావూద్)

---

దేవుడు ఈ మార్గాలను ప్రసాదిస్తాడని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. విశ్వాసి సాఫల్యం పొందడం దైవానికి ఎంత ప్రీతిపాత్రమో బోధపడుతోంది.

353. అంటే ఒకే దైవాన్ని ఆరాధించమని బోధించే ధర్మం (ఇస్లామ్)ను మనిషి తన జీవన మార్గంగా స్వీకరించి అమలు జరపాలి. ఆ తరువాత ఎన్ని అవాంతరాలు ఎదురయినా, ప్రతికూల వాతావరణం ఎంతగా బాధించినా దానిపై నిలకడ కనబరచాలి. ఆ ధర్మం, ఆ జీవిత విధానంపై స్థిరంగానిలవాలి. ఇదే ఇహపరాల సఫలతకు సరళమయిన మార్గం; ఇస్లామ్ అంటే అతి క్లుప్తమయిన నిర్వచనం, దైవానికి స్వయంసమర్పణ చేసుకోవడం. ఆ ధర్మాన్ని ఆచరించడం అంటే ఆ స్వయం

٣٥٥ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: يَأْتِيْ عَلَى النَّاسِ زَمَانٌ الصَّابِرُ فِيْهِمْ عَلٰى دِيْنِهٖ كَالْقَابِضِ عَلَى الْجَمْرِ ـ " (ترمذی ـ مشکوٰۃ ـ انس)

**355.** మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు : "భావిలో ఒక కాలం రానున్నది. అప్పుడు మనుషులు ధర్మంపై స్థిరంగా నిలబడట మంటే అగ్ని కణాలను చేతుల్లో పట్టుకున్నంత కష్టమవుతుంది. అలాంటి సంక్లిష్ట పరిస్థితులేర్పడతాయి." (తిర్మిజి, మిష్కాత్ - అనస్)

---

సమర్పణను స్థిరంగా పాటించటం అని భావం. ఈ హదీసు దీన్నే వివరిస్తుంది.

**354.** అసలు హదీసులో "ఫిత్నా" అన్నపదం ప్రయోగించడం జరిగింది. దానికి పరీక్ష- బాహ్యపరమైనదీ అంతరంగమయినదీ అని భావం. విశ్వాసి తన ఆంతరంగిక స్థితినిబట్టి, తన జ్ఞానం, విద్య, శక్తి సామర్థ్యాలను బట్టి, ప్రజల్లో తన పలుకుబడి, తన నాయకత్వం, తన ఖ్యాతికి ఆధారంగా పరీక్షకు - మానసిక పరీక్షకు - లోనవవచ్చు. అలాంటి పరిస్థితులలో తన నిజ స్థితిని గుర్తించి తనకు ఉన్న వన్నీ ఆ ప్రభువు అనుగ్రహాలేనని మరవకుండా వినమ్రతతో అణకువతో మెలిగేవాడు నిష్ఫలతను ఎదుర్కోడు. అయితే ఒకవేళ ఆ పరీక్షలో అతడు స్థయిర్యాన్ని కోల్పోయి మానసిక ప్రలోభాలకు, అహంభావాలకు లోనయ్యాడంటే సర్వనాశనమయిపోతాడు.

మనిషికి బాహ్యమయిన పరీక్షలు ఎప్పుడు ఆసన్నమవుతాయి? అసత్యవాదనకు, మిథ్యా దృష్టికి సమాజంలో ఆధిక్యత, ఆధిపత్యం లభించినప్పుడు, సత్యం లొంగి అచేతనంగా ఉన్నప్పుడు, సత్యధర్మాన్ని అనుసరించే వారికి ఎనలేని కష్టాలు, అంతులేని ఆపదలు ఎదురవుతాయి. ఇలాంటి గడ్డుకాలంలో ఎవరయితే సత్యాన్ని ఆశ్రయించి మిధ్యావాదులు సృష్టించిన అవాంతరాలను, ఆపదల్ని భరిస్తూ స్థిరంగా ఉండగలుగుతారో వారికే మహాప్రవక్త హదీసులో పేర్కొన్న దీవెనలు, ప్రశంసలూ లభిస్తాయి.

"తిబ్రాని" తన గ్రంథంలో హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ ఉల్లేఖించిన ఒక హదీసును ప్రస్తావించారు. అందులో ధర్మబద్ధమైన రాజకీయ వ్యవస్థ ఛిన్నాభిన్నమై పోయినప్పుడు సమాజాన్ని తప్పుడు మార్గాల వైపునకు నడిపించే పాలకులు ముస్లింలపై ఆధిపత్యం వహిస్తారు. ప్రజలు వారి మాటను విన్నట్లయితే ధర్మ భ్రష్టులై పోతారు. వారి మాటను వినకపోతే ముస్లిమ్‌లను వారు హతమార్చుతారు అనే విషయాన్ని మహాప్రవక్త చెప్పారు. అప్పుడు అక్కడ ఉన్నవారు:

كَيْفَ نَصْنَعُ يَا رَسُوْلَ اللّٰهِ ؟

# అల్లాహ్‌పై భరోసా

٣٥٦ عَنْ عُمَرَ بْنِ الْخَطَّابِ قَالَ: سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ: "لَوْ أَنَّكُمْ تَتَوَكَّلُوْنَ عَلَى اللّٰهِ حَقَّ تَوَكُّلِهِ لَرَزَقَكُمْ كَمَا يُرْزَقُ الطَّيْرُ، تَغْدُوْ خِمَاصًا وَتَرُوْحُ بِطَانًا-" (ترمذی)

356. మహాప్రవక్త ఇలా ప్రబోధించగా విన్నట్లు హజ్రత్ ఉమర్ (రజి) ఉల్లేఖించారు: "మీరు అల్లాహ్‌పై సముచితమైన రీతిలో భరోసా చేసినట్లయితే ఏ విధంగానైతే ఆయన చిన్న చిన్న పిచ్చుకలకు జీనోపాధిని కల్పిస్తున్నాడో, అదే విధంగా ఆయన మీకు మీ ఉపాధిని సమకూర్చుతాడు. అవి (పిచ్చుకలు) తమ ఆహార అన్వేషణలో ప్రాతఃకాలం తమ గూళ్ళనుండి బయల్దేరేటప్పుడు వాటి పొట్టలు లొట్టబోయి ఉంటాయి. అయితే సాయం కాలం అవి తమ గూళ్ళకు తిరిగివచ్చేటప్పుడు వాటి పొట్టలు నిండి ఉంటాయి." (తిర్మిజి)

٣٥٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مِنْ سَعَادَةِ ابْنِ اٰدَمَ رِضَاهُ بِمَا قَضَى اللّٰهُ لَهُ، وَمِنْ شَقَاوَةِ ابْنِ اٰدَمَ تَرْكُهُ اسْتِخَارَةَ اللّٰهِ وَمِنْ شَقَاوَةِ ابْنِ اٰدَمَ سَخَطُهُ بِمَا قَضَى اللّٰهُ-" (ترمذی- سعدؓ)

357. "అల్లాహ్ తనకై చేసిన నిర్ణయంపట్ల ఆమోద భావం కలిగి దానిపై మనిషి తృప్తి చెందటం సౌభాగ్యవంతమయిన వైఖరి. అయితే అల్లాహ్‌ను తనకు మంచిని చెయ్యమని ప్రార్థించకపోవడం గొప్ప దౌర్భాగ్యం. అల్లాహ్ చేసిన నిర్ణయం ఎడల తిరస్కార భావం, అసంతృప్తి కలిగి ఉండటం కూడా దౌర్భాగ్యమే." అని ప్రవక్త మహనీయులు ఉపదేశించారు (తిర్మిజి -సఅద్)

---

" అలాంటి పరిస్థితుల్లో మమ్మల్ని ఏమి చెయ్యమన్నారు ప్రవక్తా!" అని అడిగారు. దానికి ఆయన ఇలా బోధించారు :

"كَمَا صَنَعَ أَصْحَابُ عِيْسَى بْنِ مَرْيَمَ ، نُشِرُوْا بِالْمَنَاشِيْرِ وَحُمِلُوْا عَلَى

٣٥٨ قَالَ رَجُلٌ: يَا رَسُوْلَ اللهِ، أَعْقِلُهَا وَأَتَوَكَّلُ أَوْ أُطْلِقُهَا وَأَتَوَكَّلُ؟
قَالَ: اِعْقِلْهَا وَتَوَكَّلْ۔" (ترمذی-انسؓ)

358. ఒక వ్యక్తి వచ్చి, "ప్రవక్తా! నేను ఒంటెను కట్టివేసి అల్లాహ్‌పై భారం మోపాలా లేక దాన్ని వదలి వేసి అల్లాహ్‌ను నమ్ముకోవాలా!" అని ప్రశ్నించాడు, దానికి మహాప్రవక్త (సఅసం)ఇలా బోధించారు: "ముందు దాన్ని కట్టివెయ్యాలి తరువాత అల్లాహ్‌పై భారం మోపాలి."

(తిర్మిజి - అనస్)

٣٥٩ عَنْ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ، قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ:
"إِنَّ قَلْبَ ابْنِ آدَمَ بِكُلِّ وَادٍ شُعْبَةٌ، فَمَنْ اَتْبَعَ قَلْبَهُ الشُّعَبَ كُلَّهَا لَمْ
يُبَالِ اللهُ بِأَيِّ وَادٍ اَهْلَكَهُ، وَمَنْ تَوَكَّلَ عَلَى اللهِ كَفَاهُ الشُّعَبَ۔"
(ابن ماجه)

359. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారని హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ ఉల్లేఖించారు : "మనిషి హృదయం పరిపరి విధాల పరిభ్రమిస్తూ అనేక ఊహారణ్యాల్లో తప్పిపోతూ ఉంటుంది. ఎవరు తమ మనస్సును అరణ్యాల్లో తప్పిపోవడానికి వదలివేస్తారో వారిని ఏ అరణ్యం హతమార్చినా దాన్ని గురించి అల్లాహ్ ఏమాత్రం లక్ష్యం చెయ్యడు. మరెవరు అల్లాహ్‌పై భారం మోపుతారో, అల్లాహ్ వారిని ఆ అరణ్యాల్లోని పెడదారుల్లో తప్పి పోకుండా కాపాడతాడు." (ఇబ్నుమాజా)

---

"اَلْخُشُبُ - مَوْتٌ فِيْ طَاعَةِ اللهِ خَيْرٌ مِّنْ حَيَاةٍ فِيْ مَعْصِيَةِ اللهِ۔"

"మర్యం కుమారుడు ఈసా (అలైహిస్సలాం) సహచరులు చేసినదే మీరూ చెయ్యాలి. వారిని రంపాలతో చీల్చివేశారు, సిలువలపై వ్రేలాడకట్టారు. (కాని వారు మిధ్యావాదులకు తల వొగ్గలేదు) అల్లాహ్‌కు అవిధేయులయి జీవించడం కంటే విధేయులై మరణించడమే ఉత్తమం."

355. అప్పుడు పరిస్థితులు ధర్మానికి అత్యంత ప్రతికూలంగా ఉంటాయి. మిధ్యా దృష్టి ఆధిపత్యంలో ఉంటుంది. సత్యం అణగి ఉంటుంది. ప్రపంచంలో అధికులు

# పశ్చాత్తాపం – క్షమార్పణ

٣٦٠ عَنْ أَنَسِ بْنِ مَالِكٍ قَالَ ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : اَللّٰهُ أَفْرَحُ بِتَوْبَةِ عَبْدِهٖ مِنْ أَحَدِكُمْ سَقَطَ عَلٰى بَعِيْرِهٖ وَقَدْ اَضَلَّهٗ فِىْ أَرْضٍ فَلَاةٍ -" (بخاری-مسلم)

360. అనస్ బిన్ మాలిక్ (రజిఅన్), దైవప్రవక్త (సఅసం) ఇలా బోధించారని ఉల్లేఖించారు : "దాసుడు తప్పు చేసిన పిదప పశ్చాత్తాపంతో క్షమాభిక్ష కొరకు అల్లాహ్ వైపునకు మరలినప్పుడు అల్లాహ్‌కు కలిగే సంతోషం–ఒక ఒంటెపై ఆధారపడి జీవించే వ్యక్తి ఆ ఒంటెను కోల్పోయి తిరిగి దాన్ని అకస్మాత్తుగా పొందినప్పుడు పొందే సంతోషం కంటె ఎంతో అధికంగా ఉంటుంది." (బుఖారి, ముస్లిమ్)

---

భౌతిక వాదులుగా మారిపోతారు. అలాంటి పరిస్థితిలో ధర్మంపై నిలకడ కనపరచే వారికి శుభసూచన ఇవ్వబడింది. అగ్గితో చెలగాటం అన్నది ధీరులూ శూరులయినవారి వల్లనే సాధ్యం. పిరికి వారి వల్ల ఇది సాధ్యపడుతుందా? అగ్గితో ఆడుకున్న వారికి తగిన బహుమానం లభించటం కూడా తథ్యమే.

356. సాధారణ పిచ్చుకలకు ఆహారం అందజేసే ప్రభువు తనను సచేతనంగా నమ్ముకున్న వారికి వట్టిగనే వదిలేస్తాడా? అయితే మనో మస్తిష్కాల్లో ఆయనపై ఆ అచంచలమయిన భరోసాను కలిగి ఉండటం అవసరం.

357. "తవక్కుల్" (అల్లాహ్‌పై భారం మోపడం) కు భావం అల్లాహ్‌ను తన "వకీల్" అని నమ్మడమన్నమాట. అరబీ భాషలో "వకీల్" అంటే సంరక్షకుడు అని అర్థం. మన మంచిని కాంక్షించే, చెడు నుండి రక్షించే వారినే కదా మనం సంరక్షకులని అంటాము!

విశ్వాసి అల్లాహ్‌నే తన 'వకీల్'గా నమ్ముకుంటాడు. అల్లాహ్ వద్దనుంచి వచ్చే నిర్ణయాలు, నిర్దేశాలు తన మేలుకే, తన మంచికే అని అతని విశ్వాసం. దైవం తనను ఏ స్థితిలో ఉంచినా అందులో సంతృప్తి, సంతుష్టి కలిగి ఉంటాడు. ఏ పనిలోనయినా తనకు సాధ్యమయినంత కృషిచేసి వ్యవహారాన్ని అల్లాహ్‌పై వదలి వేస్తాడు. "నేను బలహీనుణ్ణి, అసమర్థుణ్ణి నా వల్ల జరిగిన లోపాన్ని పూర్తిచేసి గట్టెక్కించే భారం నీదే!" అని దైవాన్ని వేడుకుంటాడు. ఆపై దైవనిర్ణయం ఏది జరిగితే అదే సంభవిస్తుంది. ఆ సంభవించినదానిపై సంతుష్టి కలిగిఉండటం కూడా ఆయన్ని "వకీల్"గా నమ్ముకోవడంలోని అంశమే.

۳۶۱ عَنْ أَبِي مُوسَى الْأَشْعَرِيِّ عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ
قَالَ: إِنَّ اللهَ يَبْسُطُ يَدَهُ بِاللَّيْلِ لِيَتُوبَ مُسِيءُ النَّهَارِ وَيَبْسُطُ يَدَهُ
بِالنَّهَارِ لِيَتُوبَ مُسِيءُ اللَّيْلِ حَتَّى تَطْلُعَ الشَّمْسُ مِنْ مَغْرِبِهَا۔" (مسلم)

361. మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారని హజ్రత్ అబూ మూసా అష్ అరీ ఉల్లేఖించారు: "అల్లాహ్ రాత్రివేళ తన చెయ్యి చాపుతాడు - పగటి వేళ తప్పుచేసిన వారు (రాత్రికయినా) పశ్చాత్తాపంతో ఆయన వైపునకు మరలాలని. అలానే పగటి వేళ చెయ్యి చాపుతాడు - రాత్రి వేళ తప్పు చేసినవారు క్షమార్పణకోసం ఆయన వైపునకు మరలుతారని. చివరికి సూర్యుడు పడమర నుండి ఉదయించే వరకు (ప్రళయం సంభవించే వరకు) ఇలానే జరుగుతూ ఉంటుంది." (ముస్లిమ్)

۳۶۲ عَنْ عَبْدِ اللهِ بْنِ عُمَرَ عَنِ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ:
إِنَّ اللهَ عَزَّ وَجَلَّ يَقْبَلُ تَوْبَةَ الْعَبْدِ مَا لَمْ يُغَرْغِرْ۔" (ترمذی)

362. అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ ఇలా ఉల్లేఖించారు : "దాసుని చివరి ఊపిరి చెదరిపొయ్యే వరకు అల్లాహ్ అతని పశ్చాత్తాపాన్ని స్వీకరిస్తాడు" అని మహాప్రవక్త ప్రవచించారు. (తిర్మిజి - అబ్దుల్లా బిన్ ఉమర్)

---

358. అంటే ఏ పని చెయ్యడమయినా దాన్ని సాధించటానికి వీలు అయినంతమేరకు కృషిచేసి, ఆ తరువాత దైవ సహాయాన్ని అర్థించాలి. ఆపైన అంతా ఆయనపై వదలివేయడమే "తవక్కుల్" (అల్లాహ్‌పై భారం మోపడం) అనబడుతుంది.

359. మనిషి దైవాన్ని తన పరిరక్షకునిగా నమ్మి తన కృషి అంతటికీ ఆయనదే భారం అని నమ్మకపోతే ఆంతర్యం ఎల్లప్పుడూ కలతలకులోనయి, పరిపరి విధాలాపోతూ ఉంటుంది. హృదయంలో విభిన్న భావాలు చోటుచేసుకుంటాయి. మనిషికి మనశ్శాంతి కరువవుతుంది. కాని మనస్సును అల్లాహ్ వైపు లగ్నం చేసిన వ్యక్తికి ఏకాగ్రత లభిస్తుంది. అతడు తన కార్య కలాపాలలో ఏకోన్ముఖుడయి వ్యవహరిస్తాడు.

360. దారి తప్పిన ఒంటె దొరికినప్పుడు ఆ వ్యక్తికి మహదానందంగా ఉంటుంది. అలాగే తన దాసుడయిన మానవుడు దారి తప్పి తిరిగినా చివరికి తన వైపునకు మరలి

٣٦٣ عَنِ الْاَغَرِّ بْنِ يَسَارٍ قَالَ ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : "يَاَيُّهَا النَّاسُ ، تُوْبُوْا إِلَى اللّٰهِ وَاسْتَغْفِرُوْهُ ، فَإِنِّي اَتُوْبُ فِي الْيَوْمِ مِائَةَ مَرَّةٍ -" (مُسلم)

363. దైవ సందేశహరులు ఇలా ఉపదేశించారు: "జనులారా! అల్లాహ్‌ను మీ తప్పులకు క్షమాపణకై వేడుకోండి, ఆయన వైపునకు మరలండి. నేనయితే రోజుకు వందేసిమార్లు క్షమాపణకై అర్థిస్తూ ఉంటాను."
(ముస్లిమ్-అల్ అగర్ బిన్ ఎసార్)

٣٦٤ عَنْ أَبِي ذَرٍّ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فِيْمَا يَرْوِي عَنِ اللّٰهِ تَبَارَكَ وَتَعَالَى أَنَّهُ قَالَ : يَا عِبَادِي ، إِنِّي حَرَّمْتُ الظُّلْمَ عَلَى نَفْسِي وَجَعَلْتُهُ بَيْنَكُمْ مُحَرَّمًا فَلَا تَظَالَمُوْا - يَا عِبَادِي كُلُّكُمْ ضَالٌّ إِلَّا مَنْ هَدَيْتُهُ فَاسْتَهْدُوْنِي اَهْدِكُمْ - يَا عِبَادِي ، كُلُّكُمْ جَائِعٌ إِلَّا مَنْ اَطْعَمْتُهُ فَاسْتَطْعِمُوْنِي اُطْعِمْكُمْ - يَا عِبَادِي ، كُلُّكُمْ عَارٍ إِلَّا مَنْ كَسَوْتُهُ فَاسْتَكْسُوْنِي اَكْسُكُمْ - يَا عِبَادِي ، إِنَّكُمْ تُخْطِئُوْنَ بِاللَّيْلِ وَالنَّهَارِ وَأَنَا أَغْفِرُ الذُّنُوْبَ جَمِيْعًا فَاسْتَغْفِرُوْنِي أَغْفِرْ لَكُمْ -" (مُسلم)

364. అల్లాహ్ ఈ విధంగా బోధించినట్లు ప్రవక్త మహనీయులు (సఅసం) తెలిపారని అబూజర్ (రజిఅన్) ఉల్లేఖించారు: "నా దాసులారా! నేను దౌర్జన్యాన్ని నిషేధిస్తున్నాను. మీరు కూడా ఒకరిపై నొకరు దౌర్జన్యం చేయడం నిషిద్ధం అని భావించండి, అలాగే ఆచరించండి.

"నా దాసులారా! మీలో ప్రతి ఒక్కడూ దారి తప్పినవాడే -నేను మార్గం చూపిన వ్యక్తి తప్ప. కనుక సన్మార్గం చూపమని నన్ను ప్రార్థించండి. నేను మీకు మార్గం చూపుతాను.

"దాసులారా! మీలో ప్రతి ఒక్కడూ ఆకలిగొన్న వాడే-నేను భోజనం చేయించిన వాడు తప్ప. కనుక మీ జీవనోపాధికై నన్ను అర్థించండి. నేను మీకు పెడతాను.

"నా దాసులారా! మీలో ప్రతివాడూ వస్త్ర విహీనుడే - నేను తొడిగించిన వ్యక్తి తప్ప. నన్ను వస్త్రాలకై అర్థించండి. నేను మీకు వస్త్రాలను ప్రదానం చేస్తాను.

"నా దాసులారా ! మీరు రాత్రీ, పగలూ పాపాలు చేస్తుంటారు. నేను పాపాలన్నింటినీ మన్నించగలను. కనుక నన్ను క్షమాభిక్షకై వేడు కోండి నేను మిమ్మల్ని క్షమిస్తాను." (ముస్లిమ్)

## ప్రేమ

٣٦٥ | عَنْ أَبِي ذَرٍّ قَالَ : سَأَلْتُ رَسُولَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ أَيُّ الْعَمَلِ أَفْضَلُ ؟ قَالَ : "إِيمَانٌ بِاللهِ وَجِهَادٌ فِي سَبِيلِهِ -" قَالَ، قُلْتُ : فَأَيُّ الرِّقَابِ أَفْضَلُ ؟ قَالَ : أَغْلَاهَا ثَمَنًا وَأَنْفَسُهَا عِنْدَ أَهْلِهَا-" قُلْتُ : فَإِنْ لَّمْ أَفْعَلْ ؟ قَالَ ، تُعِينُ صَانِعًا أَوْ تَصْنَعُ لِأَخْرَقَ." قُلْتُ : فَإِنْ لَّمْ أَفْعَلْ ؟ قَالَ : " تَدَعُ النَّاسَ مِنَ الشَّرِّ، فَإِنَّهَا صَدَقَةٌ تَصَدَّقُ بِهَا عَلٰى نَفْسِكَ -" (بخاری، مسلم)

365. అబూజర్ గిఫారీ (ర.అ.) ఇలా ఉల్లేఖించారు: 'నేనొకసారి మహాప్రవక్త (సఅసం) ను ఏ సత్ క్రియ ఉత్తమమయింది? అని అడిగాను. ఆయన "దైవాన్ని విశ్వసించడం, దైవమార్గంలో 'జిహాద్' చేయడం" అని సమాధానం ఇచ్చారు. నేను తిరిగి "ఎలాంటి బానిసలకు స్వేచ్ఛ

సన్మార్గాన్ని అవలంబించడం అల్లాహ్‌కు ఎంత ప్రీతికరమో, ఎంత ఆనందదాయకమో ఈ హదీసు చెబుతోంది. ఆయన మార్గం వైపునకు మరలి ఆయన ప్రసన్నత పొందగల అదృష్టవంతులెవరో!

361. అల్లాహ్ చెయ్యి చాపడమంటే, ఆయన పాపులయిన తన దాసుల్ని తన వైపునకు, తన కారుణ్య ఛాయల్లోకి రమ్మని పిలువడమన్నమాట. క్షణికోద్రేకాలకులోనై మనిషి ఏ వేళైనా ఏదైనా తప్పుచేస్తే వెంటనే జాగుచెయ్యక, పశ్చాత్తాపంతో క్షమాభిక్షకై వేడుకోవాలి. ఆలస్యం జరిగితే షైతాను అతన్ని ఇంకా దూరాలకు తీసుకుపోవచ్చు. దైవానికి దూరమయితే మనిషికి దుర్గతి తప్ప మరేం ప్రాప్తమవుతుంది?

కల్పించడం ఉత్తమం" అని అడగ్గా "అధిక ధరగల వారినీ, తమ యజమానుల దృష్టిలో శ్రేష్ఠమయినవారినీ" అని తెలిపారాయన. "నేనది చెయ్యలేకపోతే?" అని అడిగాను నేను. దానికి ఆయన, "కష్టపడి జీవించే వారికి సహాయం చెయ్యి. లేదా తన పనిని తాను సక్రమంగా చేసుకోలేని వారి పని చేసిపెట్టు." అని బోధించారు. తిరిగి నేను "అదీ చేయలేకపోతే?" అని అడిగిన దానికి ఆయన, "జనులకు నీ ద్వారా ఎలాంటి హాని కలుగకుండా ప్రవర్తించు, ఇదీ ఒక దానమే-దీని ప్రతిఫలం కూడా నీకు లభ్యమవుతుంది" అని ఉపదేశించారు.' (బుఖారి, ముస్లిమ్)

٣٦٦ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ أَعْتَقَ رَقَبَةً مُّسْلِمَةً أَعْتَقَ اللّٰهُ بِكُلِّ عُضْوٍ مِّنْهُ عُضْوًا مِّنَ النَّارِ -" (بخاری-مسلم)

366. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "ఎవరు ఇస్లామ్ స్వీకరించిన ఒక బానిసను విడుదల చేయిస్తారో, అల్లాహ్ ఆ బానిస ఒక్కొక్క అవయవానికి బదులుగా అతని ఒక్కొక్క అవయవాన్ని నరకాగ్ని నుండి రక్షిస్తాడు." (బుఖారి, ముస్లిమ్)

---

362. ఒకడు యావజ్జీవితం అజ్ఞానంవల్ల పాపపంకిలంలో గడిపి మరణశయ్యపై అవసానదశకంటే ముందు నిర్మల హృదయంతో పశ్చాత్తాప్పడి క్షమాపణకై వేడుకుంటే అతని పాపాలన్నీ హరించిపోవచ్చు. కాని శ్వాస చెదరిపోయిన తరువాత అవసాన దశలో క్షమార్పణ వేడుకుంటే అది చెల్లదు. అందువల్లే మృత్యువును ఎదుర్కొనే ముందే మనిషి జాగ్రత్తపడాలి. అపరాధాల క్షమాపణకై వేడుకోవాలి. ఎవరి మృత్యువు ఎప్పుడు సాక్షాత్కరిస్తుందో ఎలా చెప్పగలం?

363. క్షమాపణకై అర్థించడమంటే, అదీ ప్రతి దినం వందేసిమార్లు వేడుకోవడమంటే నిత్యం దైవం వైపునకు మనస్సును లగ్నం చేస్తూ అడుగడుగునా మనకు తెలిసీ తెలియక జరిగే తప్పిదాల నుండి క్షమాపణ కోరడమన్నమాట. అర్థం చేసుకుని మనస్పూర్తిగా "అస్తగ్ ఫిరుల్లాహ్" అని దైవం మన్నింపును అర్థించడమన్నమాట.

365. దైవాన్ని విశ్వసించడమంటే ఏకేశ్వరోపాసన బోధించే ధర్మం ఇస్లాంను స్వీకరించడం ; జిహాద్ అంటే సత్యధర్మాన్ని రూపుమాపడానికి పూనుకున్న వారికి ఎదురొడ్డి వారి వ్యతిరేకతను నిష్ప్రయోజనం చేయడానికి నిరంతరం కృషి చెయ్యడం, అవసరమైతే యుద్ధం చేయడం అని అర్థం.

٣٦٧ عَنْ جَابِرٍ قَالَ، قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: " لَا تَحْقِرَنَّ مِنَ الْمَعْرُوْفِ شَيْئًا، وَإِنَّ مِنَ الْمَعْرُوْفِ أَنْ تَلْقَى أَخَاكَ بِوَجْهٍ طَلْقٍ وَّأَنْ تُفْرِغَ مِنْ دَلْوِكَ فِي إِنَاءِ أَخِيْكَ - " (ترمذی)

367. "మంచి పనిని ఏమాత్రం హీనంగా భావించకు. నీవు నీ సోదరుడిని నగుమోముతో పలకరించడం కూడా ఒక పుణ్యకార్యమే. నీ చేదలోని నీరు నీ సోదరుని కడవలో పోయడం కూడా సత్కార్యమే" అని దైవప్రవక్త (సఅసం) ఉపదేశించారు. (తిర్మిజి)

٣٦٨ | عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ، قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: تَعْدِلُ بَيْنَ اثْنَيْنِ صَدَقَةٌ، وَتُعِيْنُ الرَّجُلَ فِي دَابَّتِهِ فَتَحْمِلُهُ عَلَيْهَا أَوْ تَرْفَعُ لَهُ عَلَيْهَا مَتَاعَهُ صَدَقَةٌ، وَالْكَلِمَةُ الطَّيِّبَةُ صَدَقَةٌ، وَبِكُلِّ خَطْوَةٍ تَمْشِيْهَا إِلَى الصَّلٰوةِ صَدَقَةٌ، وَتُمِيْطُ الْأَذٰى عَنِ الطَّرِيْقِ صَدَقَةٌ-

(بخاری)

368. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు : "ఇద్దరు వ్యక్తుల మధ్య సయోధ్యను కుదర్చడం ఒక సత్కార్యం; ఎవరినయినా తన వాహనంపై

---

ఇస్లాం ప్రారంభకాలంలో, ఒక్క అరబ్బులోనే కాదు ఆ నాటి నాగరిక ప్రపంచమంతటా బానిసత్వపు దురాచారం వుండేది. సర్వమానవ సౌభ్రాతత పునాదిగా, మానవ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ప్రాతిపదికగా, వాటి పరిరక్షణకై పిలుపుతో బయల్దేరిన ఇస్లాం, బానిసల విడుదలను దాని కార్యక్రమంలో ప్రవేశ పెట్టింది. దాన్ని మహాపుణ్యకార్యంగా ప్రకటించింది. తద్వారా అనతికాలంలోనే సమాజం నుండి బానిసత్వం అంతమయింది.

సమాజంలోని అగత్యపరులకు తోడ్పడటం, వారి పనులు సవ్యంగా చేసి పెట్టడం, పైకి ఎంతో సాధారణమైందిగా కన్పించినా కాస్త లోతుగా ఆలోచిస్తే అది ఎంత గొప్ప సత్కార్యమో విదితమౌతుంది.

ఎక్కించుకోవడం లేదా అతని మోపును దానిపైకి ఎక్కించు కోవడం కూడా పుణ్యకార్యమే; మంచి మాటను పలకడం కూడా సత్క్రియయే; నమాజ్‌కై నీవు వేసే ప్రతి అడుగు ఒక సత్కార్యమే; త్రోవలోనుండి ముళ్ళను, రాళ్ళు-రప్పల్ని తొలగించడం సయితం పుణ్యకార్యమే."

(బుఖారి)

٣٦٩ عَنْ أَبِي مُوسَىٰ عَنِ النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: "عَلَىٰ كُلِّ مُسْلِمٍ صَدَقَةٌ"، قَالَ: أَرَأَيْتَ إِنْ لَّمْ يَجِدْ؟ قَالَ: "يَعْمَلُ بِيَدَيْهِ فَيَنْفَعُ نَفْسَهُ وَيَتَصَدَّقُ"؟ قَالَ: أَرَأَيْتَ إِنْ لَّمْ يَسْتَطِعْ؟ قَالَ: "يُعِيْنُ ذَا الْحَاجَةِ الْمَلْهُوْفِ." قَالَ: أَرَأَيْتَ إِنْ لَّمْ يَسْتَطِعْ؟ قَالَ: "يَأْمُرُ بِالْمَعْرُوْفِ أَوِ الْخَيْرِ"، قَالَ: أَرَأَيْتَ إِنْ لَّمْ يَفْعَلْ؟ قَالَ: "يُمْسِكُ عَنِ الشَّرِّ فَإِنَّهَا صَدَقَةٌ." (مسلم)

369. అబూ మూసా అష్ అరీ (రజి) ఇలా ఉల్లేఖించారు: ఒకసారి మహాప్రవక్త (సఅసం) "సదకా (దానం) చేయడం, ప్రతిముస్లిమ్ తప్పని సరిగా నిర్వహించవలసిన విధి" అని చెప్పారు. నేను అడిగాను "ఎవరి వద్దనైనా ధనం లేకపోతే?' దానికి ఆయన "అతను సంపాదించాలి,

---

తన పరిస్థితుల దృష్ట్యా మనిషి ఎలాంటి సత్కార్యమూ చేయలేకపోతే కనీసం తన వల్ల ఒకరికి హాని కలుగనివ్వకుండా జాగ్రత్తపడి జీవితం సాగించినా అదీ పుణ్యఫలాన్ని ఆర్జించి పెడుతుందని పలికిన మహాప్రవక్త దివ్య సూక్తిలోని అంతరార్థం కాస్త మౌనంగా ఆలోచిస్తే గాని అర్థం కాదు.

సంఘంలోని వ్యక్తులు ఒకరికొకరు సహాయం చేసుకునే వారుగా, కనీసం పరస్పరం హానిచేయని వారుగా - మనగలిగితే మానవతకు అంతకంటే గొప్పవరం ఏదికాగలదు?

366. బానిసత్వపు బంధాల నుండి మానవుల్ని రక్షించేందుకు మహాప్రవక్త తీసుకున్న చర్యల్లో ఇదొకటి. నిరుపేదావస్థలో ఉన్న ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తలు కనీసం ఇస్లాం స్వీకరించిన తమ సోదరుల్ని అయినా బానిసత్వపు సంకెళ్ళ నుండి విముక్తం చేయాలని ఉద్బోధించడం జరిగింది.

తానూ తిని లేని వారికీ పంచిపెట్టాలి" అన్నారు. "అతను అదీ చెయ్య లేకపోతే?" అని అడిగాను నేను, "అప్పుడు పీడాగ్రస్తుడయిన అగత్యపరునికి తోడ్పడాలి" అన్నారాయన. దానికి నేను తిరిగి అడిగాను "అతను అది కూడా చెయ్యగల పరిస్థితిలో లేకపోతే ?" అప్పుడు ఆయన బోధించారు "ప్రజల్ని మంచిని చెయ్యడానికి పురికొల్పాలి." "అతను అదీ చెయ్య లేకపోతే?" అని నేను అడిగిన దానికి ఆయన చెప్పారు, "ఇతరులను కష్టపెట్టకుండా ఉండాలి. ఇది కూడా ఒక పుణ్యకార్యమే." (ముస్లిమ్)

---

367. మంచి చెయ్యడం అన్న భావనకు, పుణ్యకార్యం అన్న భావనకు విస్తృతార్థం ఇచ్చారు మహాప్రవక్త. సామాన్య మర్యాదలుగా భావించబడే ఈ చిన్న చిన్న పనులు కూడా పరలోకంలో సత్ఫలం ప్రసాదించే సత్కార్యాలుగా బోధించారు. వీటికి ధార్మికత అబ్బడం మూలాన మనిషి ఏదో మర్యాదకు కాక తన విద్యుక్త ధర్మంగా చేస్తాడు. మానవ జీవితానికి సంబంధించిన సవివరమయిన మార్గదర్శకత్వం ఇస్లాం అని ఈ హదీసు చాటుతోంది.

368. ఎంత చిన్నపనయినా, అది మరొకరికి ఏమాత్రం మేలు చేకూర్చేదయినా దాన్ని చిన్న చూపు చూడకూడదని బోధించటం జరిగింది. ప్రతి సత్కార్యాన్నీ మనిషి, తాను నలుగురినోట మంచివాడు అనిపించుకునే బుద్ధితో కాకుండా, దైవ ప్రసన్నత పొందే తలంపుతో చేస్తే చిత్తశుద్ధి ఏర్పడుతుంది. చిత్తశుద్ధి, సంకల్పశుద్ధి ఆ పనికి పరిపూర్ణత చేకూర్చుతాయి.

వేరే హదీసుల్లో ఇంకా ఎన్నో మంచి పనుల జాబితా ఇవ్వటం జరిగింది. ఒక చోట మహాప్రవక్త (సఅసం) చెప్పారు, "మనిషి తన హోదా వల్ల మరొకరికి లాభం చేకూర్చడం, ఒక వ్యక్తి తన అభిప్రాయాన్ని ఉద్దేశ్యాన్ని సరిగ్గా వ్యక్తం చేయలేని స్థితిలో ఉన్నప్పుడు అతని పక్షాన నిలబడి మాట్లాడటం, చేతనయినప్పుడు బలహీనునికి న్యాయబద్ధంగా సహాయం చెయ్యడం, తనకు తెలిసిన (విద్యా విజ్ఞాన పరమయిన) విషయాలను ఇతరులకు చెప్పడం ఇవన్నీ సత్కార్యాలే.

369. ఎవరికయినా దానం చెయ్యడానికి వీలులేకపోతే వారు మంచిని సంపాదించే, పుణ్యఫలాన్ని పొందే అవకాశాలు ఎన్నెన్ని ఉన్నాయో గమనిస్తే, అల్లాహ్ కారుణ్యామృతం ఎన్ని విధాలుగా వర్షిస్తుందో ఆలోచిస్తే ఉల్లం దైవంపట్ల ఎనలేని భక్తీ, ప్రేమభావాలతో నిండిపోతుంది. ఆయన తన దాసులయిన మానవులకు తన కారుణ్యాన్ని పంచడానికి, కనీసం ఎవ్వరికీ కష్టం కలిగించకుండా ఉన్నా దాని ఆధారంగా కూడా పుణ్య ఫలాన్ని ప్రసాదిస్తాడు!

٣٧٠ عَنِ ابْنِ عُمَرَ أَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ:
"مَنْ كَانَ فِيْ حَاجَةِ أَخِيْهِ كَانَ اللّٰهُ فِيْ حَاجَتِهٖ." (بخاری-مُسلم)

370. "ఎవరు తన సోదరునికి అవసరమున్నప్పుడు తోడ్పడతారో వారి అవసరానికి అల్లాహ్ తానే వారిని ఆదుకుంటాడు" అని మహాప్రవక్త (సఅసం) బోధించారని ఇబ్నె ఉమర్ ఉల్లేఖించారు. (బుఖారి, ముస్లిమ్)

## కార్యశుద్ధి

٣٧١ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: قَالَ اللّٰهُ تَعَالٰى:
"أَنَا أَغْنَى الشُّرَكَاءِ عَنِ الشِّرْكِ، مَنْ عَمِلَ عَمَلًا أَشْرَكَ فِيْهِ مَعِيْ
غَيْرِيْ فَأَنَا مِنْهُ بَرِيْئٌ، هُوَ لِلَّذِيْ عَمِلَ لَهٗ." (مُسلم-ابوہریرہؓ)

371. అల్లాహ్ ఇలా సెలవిచ్చినట్లు మహాప్రవక్త (సఅసం) తెలిపారు : "ఇతర (కాల్పనిక) సహవర్తులకంటే అధికంగా నేనే "షిర్క్"కు అతీతుణ్ణి. ఎవరు ఒక సత్కార్యం చేసి అందులో నాతోబాటు ఇతరుల్ని సహవర్తులుగా చేస్తారో వారి ఆ సత్కార్యంతో నాకు ఎలాంటి సంబంధం లేదు. నేను దాన్ని నిరసిస్తాను. ఆ వ్యక్తి ఆ సత్కార్యంలో నాతోపాటు ఎవరిని నా సహవర్తులుగా చేస్తాడో వారికే చెల్లుతుంది ఆ కార్యం."

(ముస్లిమ్ - అబూహురైరా)

---

370. పరోపకారం ఎంత మహత్పూర్వకమయినదో ఈ హదీసుల ద్వారా వ్యక్తమవుతోంది. మనిషి తనకు వీలయిన సత్కార్యాన్ని అది ఎంత స్వల్పమైనదైనా తుచ్ఛమైనదిగా భావించకుండా చెయ్యడానికి ఇందులో పురికొల్పటం జరిగింది. పరోపకారం పరలోక సాఫల్యానికి సోపానంగా పరిగణించటం జరిగింది. మరో హదీసులో ప్రవక్త మహనీయులు ఇలా బోధించారు: "అల్లాహ్ తన దాసులు కొందర్ని ప్రజల అక్కరలు తీర్చడానికే పుట్టించాడు. ప్రజలు తమ అవసరాలను గురించి వారి సమక్షంలో తెలుపగా వారు వాటిని తీరుస్తారు. ఇలాంటి వారు ప్రళయదినాన అల్లాహ్ ఆగ్రహానికి దూరంగా సురక్షితంగా ఉంటారు."

371. "షిర్క్" అంటే దైవత్వంలో దైవంతో పాటు ఇతరుల్ని సహవర్తులుగా భావించడం. సత్కార్యాలు చేసే మంచి బుద్ధి కలిగిన సోదరులూ ధార్మిక సేవచేసే పుణ్య పురుషులూ ఈ హదీసును బాగా అర్థం చేసుకోవాలి. అల్లాహ్ "షిర్క్" ని ఎంత తీవ్రంగా పరిగణిస్తాడో బోధిస్తుంది ఈ హదీసు. దైవంతో పాటు ఇతరుల సంతోషాన్ని పొందడానికి చేసే ఏ కార్యమయినా దానికి పుణ్యఫలం ప్రాప్తంకాదు అని అర్థం. సత్కార్యాలు ఏవయినా, ఆరాధనలయినా లేక వ్యవహారాలయినా దేవుని సేవయినా, మానవ సేవ అయినా వాటికి ప్రేరణ పేరు ప్రతిష్టలు, లేక కొందరు మనుషుల ప్రశంసలు అయినట్లయితే అల్లాహ్ సన్నిధిలో వాటికి విలువపూజ్యం. ఇంకా, దైవ ప్రసన్నత పొందడంతో పాటు ప్రజల ప్రశంసలు కూడా వాటికి కారణ భూతాలయినప్పుడు కూడా ఆ సత్కార్యాలు నిష్ప్రయోజనమయి పోతాయి. అలాగే ప్రారంభంలో కేవలం అల్లాహ్ ప్రసన్నతే ప్రేరణ అయినా క్రమేణా ఇతరుల మెప్పు కూడా దాని స్థానే వచ్చి చేరినా ఆ సత్కార్యాలు నిష్ఫలమయిపోతాయి. అందువల్లనే ఎంతో జాగ్రత్తగా మెలగవలసి ఉంటుంది. షైతాన్ ప్రవేశించే మార్గాలు అనేకం, ఇలా తెలియకుండా చొరబడే శత్రువు నుండి రక్షణ పొందడానికి మార్గం ఒక్కటే. అన్నిటి నుండీ రక్షించే ఒకే శక్తి దైవం ఆయన శరణు పొందడం. ఆయన వద్ద తన అసహాయత, నిరుపాయత వెలిబుచ్చడం. ఆయన సహాయాన్ని అర్థించడం. ఆయన రక్షించకపోతే షైతాన్ బారి నుండి మరెవరు రక్షించగలరు ?

# సంస్కరణ శిక్షణలకు మార్గాలు

## దైవ గుణగణాల సంస్మరణ

٣٧٢ عَنْ أَبِي هُرَيْرَةَ أَنَّ رَسُولَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ: لِلّٰهِ تِسْعَةٌ وَّتِسْعُوْنَ اِسْمًا مِائَةٌ اِلَّا وَاحِدًا، مَنْ أَحْصَاهَا دَخَلَ الْجَنَّةَ۔

(بخاری)

**372. "అల్లాహ్‌కు తొంభయి తొమ్మిది పేర్లున్నాయి. అంటే నూటికి ఒకటి తక్కువ, ఎవరు వీటిని జ్ఞాపకం పెట్టుకుంటారో వారు స్వర్గంలో ప్రవేశిస్తారు." అని దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారని హజ్రత్ అబూ హురైరా (ర.అ.) తెలిపారు.** (బుఖారి)

---

372. "99 పేర్లు" అంటే గుణగణాలన్నమాట. జ్ఞాపకముంచుకోవడమంటే మనిషి వాటి అర్థాన్ని, భావాన్ని తెలుసుకుని వాటివల్ల తనపై ఆసన్నమయ్యే బాధ్యతల్ని గుర్తించి వాటిని నెరవేర్చాలి. అంటే ఆ గుణగణాలను మనిషి తన అంతరాంతరాళాల్లో పొందుపరచుకోవాలి. తన జీవితం మొత్తంలో అవి ప్రతిబింబించేలా మనుగడను మలచుకోవాలి, అవి కోరిన విధంగా ఆచరించాలి అని అర్థం.

ఈ హదీసులో పేర్ల వివరాలు లేవు. వాటిని తెలుసుకునే సరయిన పద్ధతి ఖుర్‌ఆన్ పఠనం. అందులో అల్లాహ్ తన గుణాలన్నింటినీ వివరించాడు. అవి మనల్ని కోరేదేమిటో వాటివల్ల మనం పొందగలిగే లాభం ఏమిటో అంతా వివరించబడి ఉంది. ఖుర్‌ఆన్ పఠించడం, దాన్ని అర్థంచేసుకోవడం అలవాటు చేసుకున్న వ్యక్తే వాటి ద్వారా ప్రయోజనం పొందగలుగుతాడు. మహాప్రవక్త (సఅసం) కూడా తన మాటల్లో వాటిని విశదీకరించారు. ఈ రెంటినీ (ఖుర్‌ఆన్, హదీసులను) చేర్చి అధ్యయనం చేయడం వల్లనే దైవ గుణగణాల సంస్మరణ సాధ్యమవుతుంది.

ప్రస్తుతం కొన్ని గుణాల్ని క్లుప్తంగా పరిశీలిద్దాము. వాటిని ఖుర్‌ఆన్‌లో మాటిమాటికి ప్రస్తావించడం జరిగింది. వీటి ద్వారా ముస్లిముల సుశిక్షణ జరిగిన మాట కూడా వాస్తవమే.

**అల్లాహ్ :** ఇది విశ్వం మొత్తాన్ని సృజించిన స్వామిపేరు. ఈ పదం ఏ ధాతువుతో

ఏర్పడిందో దానికి రెండు అర్థాలుః ఒకటి ఒకరివైపునకు ప్రేమతో పరుగిడడం. రెండు, అపాయాన్నుండి రక్షణకై ఒకరి శరణుజొచ్చడం. కనుక అల్లాహ్ మన దైవం- ఈ రెండు అర్థాల్లోనూ. దీనికి భావమేమంటే మన ఆంతర్యం ఆయన ప్రేమమయ మయిపోవాలి. మన హృదయాల్లో ఆయన ప్రేమకు తప్ప మరి దేనికీ చోటుండకూడదు. మన శారీరక, మానసిక శక్తులూ సామర్థ్యాలన్నీ ఆయనకే అంకితమవ్వాలి; ఆయనకే ఆరాధన, సేవలు జరగాలి; ఆయన ముందరే మోకరిల్లాలి; ఆయనకే అర్చనలు, త్యాగాలు సమర్పించాలి; ఆయనపైనే భరోసా పెట్టుకోవాలి; ఆయన్నే నమ్ముకోవాలి. ఆయన ఆజ్ఞాపాలనకే నిత్యం సంసిద్ధులమయి ఉండాలి. ఆయన్ని తప్ప మరెవ్వరినీ కష్టాల్లో, నష్టాల్లో , ఆపదల్లో, ఆవేదనల్లో సహాయం అర్థించకూడదు. ఇదీ అల్లాహ్‌ను దైవంగా నమ్మడమంటే.

**అల్-రబ్ :** దీని ధాతువుకు, పోషించడం, సంరక్షించడం ప్రమాదాలన్నింటి నుండి కాపాడటం, పరిణామ ప్రగతులకు కావలసిన హంగులన్నీ సమకూర్చడం, పరిపూర్ణత చేకూర్చడం అని అర్థం. దైవాన్ని ఈ భావంలో "రబ్" అంటే దానికి ఎంతో విస్తృతమయిన భావం ఉంది. మాతృ గర్భకుహరంలో శిశువు పుట్టే ముందు గాలీ, ఆహారం సరఫరా చేసే దెవరు? పుట్టిన తరువాత ఆ పసికందును ఎత్తుకుని లాలించి పోషించేందుకు తల్లిదండ్రుల హృదయాల్లో ప్రేమానుబంధాన్ని సృజించేదీ, దాన్ని పెంచేదీ ఎవరు? క్రమంగా శారీరక శక్తుల్నీ, బుద్ధి బలాన్నీ సమకూర్చి శైశవం నుండి బాల్యం వరకు ఆపైన యౌవ్వనంవరకు ఆరోగ్యం, శక్తి సామర్థ్యాలను అనుగ్రహించే దెవరు? మానవుల కొరకు ఈ విశ్వ కార్యకలాపాలను నడిపిస్తున్నదెవరు? ఇదంతా ఆయన "రబూబియత్"కు (కర్తృత్వానికి, రబ్ అవడానికి)నిదర్శనాలు కావా? ఆయన కర్తృత్వంలో ఆయన తప్ప మరెవరయినా ఆయనకు తోడు ఉన్నారా?

ఆయనే మన దాత, పోషకుడు. అయితే మన కాళ్ళు చేతుల, శారీరక మానసిక శక్తి సామర్థ్యాలన్నీ ఆయనకే అంకితమయి పోవాలి. ఆయన మనకు అన్న పానీయాల ఏర్పాటు మాత్రమే చెయ్యలేదు, మనం జీవితాన్ని సక్రమంగా నడుపుకోడానికీ, మన ఆత్మల సంస్కార వికాసాలకు ఆయన తన మార్గదర్శకగ్రంథాన్నీ పంపాడు.

మన భౌతిక అవసరాలను తీర్చడంతోపాటు ఆధ్యాత్మిక సంస్కరణ, వికాసాలకు మానసిక సుశిక్షణకు, వ్యక్తిగతజీవనానికి, సాంఘిక వ్యవస్థకూ కావలసిన మార్గదర్శక సూత్రాలను, నియమనిబంధనలను ఆయన తన ఉద్గ్రంథం ద్వారా మనకు తెలియపరిచాడు. ఆయన్ని రబ్‌గా నమ్మడమంటే ఆయన ప్రతిపాదించిన భౌతిక వరాలను వినియోగించుకోవడంతోపాటు ఆయన చేసిన మహోపకారాన్ని ఆయన అందజేసిన మార్గదర్శక గ్రంథాన్ని శక్తి పుంజంగా భావించి తద్వారా మన జీవితానికి శక్తిని సేకరించుకోవాలి. దాన్ని మన జీవితంలో నింపుకోవాలి. కృతజ్ఞతాపరుడయిన దాసునిలా ప్రపంచమంతటా దాన్ని చాటి చెప్పాలి. దాని మాధుర్యాన్ని ఆస్వాదించని వారికి దాన్ని పంచి పెట్టాలి.

**అల్ – రహ్మాన్, అల్ – రహీమ్ :** ఈ రెండు పదాలు "రహ్మత్" నుండి ఉద్భవించాయి. రహ్మత్ అంటే కారుణ్యం అని భావం, "రహ్మాన్" అనే పదంలో ఉత్తేజత, ఉద్వేగత, అపారత అనే భావాలు ఉండగా "రహీమ్" పదంలో నిత్యత, నిరంతరతా భావాలు ఉన్నాయి. రహ్మాన్ - అత్యంత ఉత్తేజవంతమయిన కరుణ కలవాడు, మన అవసరాలన్నీ... గాలి నీరు మొదలుకుని అనంతమయిన ఖనిజ నిధులు అన్నీ ఆయన ఈ కారుణ్యగుణానికి ప్రతిరూపాలే.

ఆయన కారుణ్య ఫలమే దివ్యఖుర్‌ఆన్ కూడా. ఖుర్‌ఆన్ లోనే ఉంది -

اَلرَّحْمٰنُ ۙ عَلَّمَ الْقُرْاٰنَ ۙ خَلَقَ الْاِنْسَانَ ۙ عَلَّمَهُ الْبَيَانَ

"అర్ రహ్మాన్ ఆయనే ఖుర్‌ఆన్‌ని బోధించాడు ; ఆయనే మనిషిని సృజించాడు, ఆయనే అతనికి మాట్లాడే శక్తిని ఇచ్చాడు." (అర్రహ్మాన్ : 1-4)

**రహీమ్ :** అనంతమయిన, నిరంతర కరుణా కటాక్షాలు కలవాడు.

అల్లాహ్‌ను రహ్మాన్‌గా రహీమ్‌గా నమ్ముతున్నామంటే ఆయన కారుణ్యాన్ని పొందే కార్యాలు చెయ్యాలి. ఆయన కారుణ్యాన్ని ఉత్తేజపరిచే ఆచరణా విధానాన్ని అవలంబించాలి. ఆయనకు అప్రియమయిన మాటలకు, చేతలకు దూరంగా ఉండాలి. మంచిని పెంచేందుకు, చెడును చెరిపేందుకు ఆయన చూపిన ధర్మ పథాన్ని అనుసరించే వారు ఆ మార్గంలో కష్ట నష్ట నిష్ఠూరాలు ఎదురయినప్పుడు ఆయన కారుణ్యాన్ని గురించి నిరాశ చెందకూడదు. ఆ కరుణామయుని కొరకు ఆ సంక్లిష్ట మార్గాన్ని అనుసరించినప్పుడు ఆయన మనల్ని తన కరుణాకటాక్షాలకు దూరం చేస్తాడా?

**అల్ కాయిమ్ బిల్ కిస్త్ :** అంటే న్యాయశీలుడు అని అర్థం. అల్లాహ్ న్యాయశీలుడు కాబట్టి ఆయన దృష్టిలో ప్రత్యేక జాతికి, ప్రత్యేక సంతతికి, ప్రత్యేక వర్గం వారికి ప్రత్యేక భాష వారికీ ఎలాంటి ప్రాధాన్యం లేదు. ఆయన సన్నిధిలో అందరూ సమానులు. ఏదయినా విచక్షణ ఉంటే అది కేవలం వారి శీలం, స్వభావాల దృష్ట్యా మాత్రమే ఉంటుంది. తదనుగుణంగా ఆయన దృష్టిలో విశ్వాసి, అపరాధి ఇద్దరూ సమానులు కాజాలరు. పరలోకంలోనే కాదు ఈ లోకంలోనూ ఇద్దరి పట్ల ఆయన ఒకే విధానాన్ని అవలంబించడు.

**అల్ అజీజ్ :** అంతటా, అందరిపైనీ అధికారం కలవాడు. ఆయన అధికారాన్ని ఎవరూ ఎదిరించలేరు. ఆయన తన విశ్వసనీయులయిన దాసులకు ఆధిక్యత, ఆధిపత్యం, అధికారం అనుగ్రహించే నిర్ణయం తీసుకుంటే ఏ శక్తీ దాన్ని వారించలేదు. ఎవరినయినా ఆయన శిక్షించాలని నిర్ణయిస్తే దాన్ని ఎవరూ నిరోధించలేరు.

**అల్–రకీబ్ :** కనిపెట్టి ఉండేవాడు. అల్లాహ్‌ను రకీబ్ అంటే ఆయన తన దాసుల పనుల్ని క్షుణ్ణంగా వీక్షిస్తున్నాడని అర్థం. వారి కర్మల ప్రకారమే వారికి సఫలత నిష్ఫలతలు లభిస్తాయి. శిక్షా బహుమానాలు అనుగ్రహించబడతాయి.

# ప్రపంచానికి దూరంగా, పరలోకానికి చేరువగా!

٣٧٣ عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ : تَلَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ :
" فَمَنْ يُّرِدِ اللّٰهُ أَنْ يَّهْدِيَهُ يَشْرَحْ صَدْرَهُ لِلْإِسْلَامِ " فَقَالَ رَسُوْلُ اللّٰهِ
صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : " إِنَّ النُّوْرَ إِذَا دَخَلَ الصَّدْرَ انْفَسَحَ " فَقِيْلَ :
يَا رَسُوْلَ اللّٰهِ ، هَلْ لِتِلْكَ مِنْ عَلَمٍ يُّعْرَفُ بِهٖ ؟ قَالَ : " نَعَمْ ، اَلتَّجَافِيْ
عَنْ دَارِ الْغُرُوْرِ وَالْإِنَابَةُ إِلٰى دَارِ الْخُلُوْدِ وَالْاِسْتِعْدَادُ لِلْمَوْتِ قَبْلَ
نُزُوْلِهٖ " (مشكوٰة)

373. అబ్దుల్లాహ్ బిన్ మస్ ఊద్ ఇలా ఉల్లేఖించారు : 'ఒకసారి మహాప్రవక్త (సఅసం) ఒక ఖుర్ ఆన్ ఆయత్ పఠించారు. "అల్లాహ్ ఎవరికి సన్మార్గం చూపదలచుకుంటాడో అతని ఆంతర్యాన్ని ఇస్లాం కొరకు తెరచి వేస్తాడు."
*(అన్ ఆమ్ : 125)*

---

**అల్-అలీమ్ :** అంతా ఎరిగిన వాడు, అన్నీ తెలిసిన వాడు. అల్లాహ్‌కు ఎవరు ఎక్కడున్నారో, ఏమి చేస్తున్నారో, ఎవరికి ఏమేమి అవసరమో అన్నీ తెలుసు. మనిషి తన జీవితాన్ని సవ్యంగా సాగించుకోవాలంటే అత్యుత్తమ రూపంలో జీవితాన్ని మలచుకోవాలంటే, ఎలాంటి జీవిత విధానం కావాలో ఆయనకు తెలుసు. మనిషికి మంచిని చేకూర్చేది ఏదో, చెడుగును ఆపాదించేది ఏదో ఆయనకే తెలుసు. అందుకే ఆయన మంచిని, చెడును అతి స్పష్టంగా, నిర్దుష్టంగా, నిర్దిష్టంగా తన దివ్య మార్గదర్శక గ్రంథం ద్వారా తెలిపాడు. ఆయన సర్వజ్ఞాని కనుక, ఎవ్వరికీ అపాత్ర దానం చెయ్యడు. ఎవరెవరు దేనికి అర్హులో దాన్నే వారికి అనుగ్రహిస్తాడు. ఆయన కరుణానుగ్రహాలకు పాత్రులయిన విశ్వసనీయ దాసులు అపజయాన్ని పొందరు. వారు ఎక్కడున్నా, ఎలాంటి ఆపదల్లో ఉన్నా అంతా ఆయనకు ఎరుకే. అలాగే ఆయన ఆగ్రహానికి అర్హులయిన ధిక్కారులు సఫలతను కానజాలరు. వారు ఎప్పటికయినా తమ గడువు పూర్తి చేసుకుని శిక్షను పొందవలసిందే.

ఈ కొన్ని దైవ గుణాలనే ప్రస్తావించడం ఇక్కడ సాధ్యం. దైవ గుణాల్ని వివరంగా తెలుసుకోవాలంటే దివ్యఖుర్ఆన్ని, హదీసులను అధ్యయనం చేయాలి. ఖుర్ఆన్‌లో వాక్యాలకు చివర కొన్ని కొన్ని గుణాల్ని ప్రస్తావించడం జరిగింది. అది అలా ఎందుకు ఉందో, తద్వారా మనకు ఎలాంటి మార్గదర్శకత్వం లభిస్తుందో మనం గమనించాలి.

ఈ ఆయత్ పఠించి మహాప్రవక్త "అంతర్యంలో మార్గదర్శక జ్యోతి ప్రవేశించగానే అంతర్యం విచ్చుకుంటుంది" అని అన్నారు. అది విన్న సహబా "దైవ ప్రవక్తా! దాన్ని గుర్తు పట్టటానికి ఏదయినా సంకేతం ఉందా?" అని అడిగారు. దానికి మహాప్రవక్త ఇలా అన్నారు: "ఆఁ! ఉంది అదేమంటే, మనిషి మనసుకు అశాశ్వతమయిన ప్రపంచంపట్ల నిర్లిప్త భావం కలుగుతుంది. శాశ్వతమయిన పరలోకంపట్ల కుతూహలం, ప్రేమ పుట్టుకు వస్తాయి. అతడు మృత్యువు అవతరణకు పూర్వమే దాని కొరకు సమాయత్తమవుతూ ఉంటాడు." (మిష్కాత్)

٣٧٤ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ أَخْوَفَ مَا أَتَخَوَّفُ عَلٰى أُمَّتِي الْهَوٰى وَطُوْلُ الْأَمَلِ، فَأَمَّا الْهَوٰى فَيَصُدُّ عَنِ الْحَقِّ، وَأَمَّا طُوْلُ الْأَمَلِ فَيُنْسِي الْاٰخِرَةَ- هٰذِهِ الدُّنْيَا مُرْتَحِلَةٌ ذَاهِبَةٌ وَّهٰذِهِ الْاٰخِرَةُ مُرْتَحِلَةٌ قَادِمَةٌ، وَلِكُلٍّ وَاحِدَةٍ مِّنْهُمَا بَنُوْنَ، فَإِنِ اسْتَطَعْتُمْ أَنْ لَّا تَكُوْنُوْا مِنْ بَنِي الدُّنْيَا فَافْعَلُوْا، فَإِنَّكُمُ الْيَوْمَ فِي دَارِ الْعَمَلِ وَلَا حِسَابَ، وَأَنْتُمْ غَدًا فِي دَارِ الْاٰخِرَةِ وَلَا عَمَلَ- (مشكوٰة-جابرؓ)

374. మహాప్రవక్త ఇలా బోధించారు: "నాకు నా అనుచర సంఘం గురించి కలిగే ఆందోళన ఒక్కటే, వారు మనో వాంఛలను అనుకరించటం మొదలెడుతారన్నది, ప్రాపంచిక వ్యామోహంలోపడి పెద్దపెద్ద ప్రణాళికలు వేసుకోవడంలో లీనమవుతారన్నదే నా ఆందోళన. మనోవాంఛలు వారిని సత్యానికి బహుదూరం చేస్తాయి. ప్రాపంచిక ప్రణాళికలు వారిచే పరలోకాన్ని

---

373. అంటే ఏ వ్యక్తి హృదయంలో ఇస్లామ్ వాస్తవికత నాటుకుంటుందో అతని మనస్సు ప్రపంచ వ్యామోహాలకు లోనవదు. అతడు ప్రపంచంలో జీవించినా ప్రపంచం కొరకు జీవించడు. తన యావత్తు ఐహిక జీవితాన్ని పరలోక జీవన సాఫల్యం కొరకు వినియోగించుకుంటాడు.

అతడు పరలోకంలో అక్కడి మోక్షం మీదే ఎంత సేపటికీ దృష్టి కేంద్రీకరించి జీవిస్తాడు. అనునిత్యం మరణాన్ని ఎదురుచూస్తూ తన శక్తి సామర్థ్యాలన్నింటినీ మంచిని పెంపొందించడానికి, చెడును చెరపడానికే వినియోగిస్తాడు.

విస్మరింపజేస్తాయి. ప్రపంచం బయలుదేరింది. ముందుకు వెళుతోంది. పరలోకం కూడా బయలుదేరింది అది ఎదురువస్తోంది. వీటిలో ప్రతిదాన్నీ ప్రేమించేవారున్నారు. అయితే మీరు ప్రపంచాన్ని అభిమానించేవారు కాకపోవడమే శ్రేయస్కరం. సత్కార్మలు చేయండి. ఈ ప్రపంచం క్రియా గృహం. ఇక్కడ లెక్కల విచారణ లేదు. రేపు మీరు పరలోకంలో ఉంటారు, అక్కడ (లెక్కల విచారణే కాని) ఆచరణలకు తావుండదు."

(మిష్కాత్ - జాబిర్)

٣٧٥ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لِرَجُلٍ وَّهُوَ يَعِظُهُ :
"اِغْتَنِمْ خَمْسًا قَبْلَ خَمْسٍ، شَبَابَكَ قَبْلَ هَرَمِكَ، وَصِحَّتَكَ قَبْلَ
سُقْمِكَ، وَغِنَاكَ قَبْلَ فَقْرِكَ، وَفَرَاغَكَ قَبْلَ شُغْلِكَ، وَحَيَاتَكَ
قَبْلَ مَوْتِكَ." (مشكوٰة)

375. మహాప్రవక్త (సఅసం) ఒక వ్యక్తికి ఉపదేశిస్తూ ఇలా అన్నారు: "నీవు అయిదు విషయాలను మరో అయిదు విషయాలకంటే ఎంతో మేలయినవని తెలుసుకో-వృద్ధాప్యం రాక పూర్వమే యవ్వనాన్ని, వ్యాధి రాక పూర్వమే ఆరోగ్యాన్నీ, లేమి దాపురించక పూర్వమే కలిమినీ, పనులు వచ్చి ఆక్రమించుకొనక పూర్వమే తీరికను; మృత్యువుకుపూర్వమే జీవితాన్నీ గుర్తించు." (మిష్కాత్)

---

374. మహాప్రవక్త (సఅసం) తన అనుచర సంఘమయిన ముస్లిములను గురించి చెందిన ఆవేదన నేడు నిజమవుతూ అగుపిస్తోంది. మనో వాంఛలు అంటే ఐహిక భోగలాలస ముస్లిమ్ సమాజాన్ని ఎలా మార్చివేస్తున్నదో మనం కళ్ళారా చూస్తూనే ఉన్నాము. ప్రాపంచిక ప్రణాళికలంటే ప్రపంచంలో హోదా పలుకుబడి, పేరు ప్రతిష్ఠల కొరకు ముస్లిముల్లోని కొందరు ధర్మానికి ఎలా దూరమవుతున్నది సయితం ఎవరికీ తెలియని విషయం కాదు.

ఇలాంటి వారంతా మహాప్రవక్త (సఅసం) హితవును పాటించడం ముఖ్యం. సాగిపొయ్యే ప్రపంచంకన్నా ఎదురువచ్చే పరలోకం కొరకు పాటుపడటం నేర్చుకోవాలి. ఎందుకంటే పరలోకంలో ప్రతిఫలమే తప్ప కృషికి తావులేదు. కృషి చేసేదంతా ఇహలోకంలోనే చేసుకోవాలి.

٣٧٦ عَنْ أَبِي سَعِيْدٍ قَالَ: خَرَجَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لِصَلٰوةٍ فَرَأَى النَّاسَ كَأَنَّهُمْ يَكْتَشِرُوْنَ، قَالَ: أَمَا إِنَّكُمْ لَوْ أَكْثَرْتُمْ ذِكْرَ هَاذِمِ اللَّذَّاتِ لَشَغَلَكُمْ عَمَّا أَرَى، الْمَوْتِ، فَأَكْثِرُوْا ذِكْرَ هَاذِمِ اللَّذَّاتِ الْمَوْتِ، فَإِنَّهُ لَمْ يَأْتِ عَلَى الْقَبْرِ يَوْمٌ إِلَّا تَكَلَّمَ، فَيَقُوْلُ أَنَا بَيْتُ الْغُرْبَةِ، وَأَنَا بَيْتُ الْوَحْدَةِ وَأَنَا بَيْتُ التُّرَابِ، وَأَنَا بَيْتُ الدُّوْدِ، وَإِذَا دُفِنَ الْعَبْدُ الْمُؤْمِنُ قَالَ لَهُ الْقَبْرُ: مَرْحَبًا وَّأَهْلًا، أَمَا إِنْ كُنْتَ لَأَحَبَّ مَنْ يَّمْشِيْ عَلٰى ظَهْرِيْ إِلَيَّ فَإِذْ وُلِّيْتُكَ الْيَوْمَ وَصِرْتَ إِلَيَّ، فَسَتَرٰى صَنِيْعِيْ بِكَ، قَالَ: "فَيَتَّسِعُ لَهُ مَدَّ بَصَرِهٖ وَيُفْتَحُ لَهُ بَابٌ إِلَى الْجَنَّةِ، وَإِذَا دُفِنَ الْعَبْدُ الْفَاجِرُ أَوِ الْكَافِرُ، قَالَ لَهُ الْقَبْرُ: "لَا مَرْحَبًا وَّلَا أَهْلًا، أَمَا إِنْ كُنْتَ لَأَبْغَضَ مَنْ يَّمْشِيْ عَلٰى ظَهْرِيْ إِلَيَّ، فَإِذْ وُلِّيْتُكَ الْيَوْمَ وَصِرْتَ إِلَيَّ فَسَتَرٰى صَنِيْعِيْ بِكَ"، قَالَ: فَيَلْتَئِمُ عَلَيْهِ حَتّٰى تَخْتَلِفَ أَضْلَاعُهُ، قَالَ: وَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: بِأَصَابِعِهٖ فَأَدْخَلَ بَعْضَهَا فِيْ جَوْفِ بَعْضٍ، قَالَ: وَيُقَيَّضُ لَهُ سَبْعُوْنَ تِنِّيْنًا لَوْ أَنَّ وَاحِدًا مِّنْهَا نَفَخَ فِي الْأَرْضِ، مَا أَنْبَتَتْ شَيْئًا مَّا بَقِيَتِ الدُّنْيَا، فَيَنْهَسْنَهُ وَيَخْدِشْنَهُ حَتّٰى يُفْضٰى بِهٖ إِلَى الْحِسَابِ، قَالَ، وَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "إِنَّمَا الْقَبْرُ رَوْضَةٌ مِّنْ رِيَاضِ الْجَنَّةِ أَوْ حُفْرَةٌ مِّنْ حُفَرِ النَّارِ." (ترمذی)

376. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రి ఇలా ఉల్లేఖించారుః 'ఒకరోజు మహాప్రవక్త (సఅసం) నమాజ్ చేయడానికి మస్జిద్‌లోకి ప్రవేశించారు.

---

375. అంటే జీవితంలో ఏ పని చేయడానికయినా ఈ అయిదు ఆటంకాలు ఏ క్షణంలోనయినా ఆసన్నం కావచ్చు. అవి ఎలా వస్తాయో కూడా చెప్పలేము. అవి వచ్చిన తరువాత పశ్చాత్తాప్పడి, వగచి ప్రయోజనముండదు. అవి పైబడకముందే

అక్కడ కొందరు విరగబడి నవ్వుతుండగా చూశారాయన. అప్పుడు ఇలా బోధించారు : "మీరు కోరికల్ని హరించివేసేదాన్ని అధికంగా స్మరిస్తూ ఉన్నట్లయితే అది మిమ్మల్ని ఇలా నవ్వనిచ్చేది కాదు - అది మృత్యువు. మృత్యువును అధికంగా స్మరించండి అది సమస్త వాంఛల్ని చంపివేస్తుంది. గోరీ ప్రతి దినం చాటుతూ ఉంటుంది. 'నేను సత్రంలాంటి గృహాన్ని, ఏకాంత కుహరాన్ని, బురద మట్టి నిలయాన్ని, పురుగులకు పుట్టినిల్లును' అని. ఒక విశ్వాసి గోరీలో పూడ్చబడినప్పుడు, గోరీ అతనికి స్వాగతం పలుకుతుంది - 'నా వెన్నుపై నడచినవారిలోకెల్లా నీవు నాకు ఎంతో ప్రియమయినవాడవు. ఈ వేళ నీవు నాకు అప్పగించబడ్డావు. నీ ఎడల ఎంత మంచిగా ప్రవర్తిస్తానో చూస్తావుగా!" అని. మహాప్రవక్త ఇంకా ఇలా అన్నారు: "అతని కోసం గోరీ విశాలం చేయబడుతుంది. అక్కడ స్వర్గం వైపునకు ఒక ద్వారం తెరవబడుతుంది." అలాగే ఒక దురాచారుడు, దుర్మార్గుడు లేక అవిశ్వాసిని పూడ్చినప్పుడు భూమి అతనికి స్వాగతం పలుకదు. పైపెచ్చు అంటుంది "నా వెన్నుపై నడచిన వారిలోకెల్ల నీవు నాకు అమితంగా అయిష్టమయిన వాడివి, ఇప్పుడు నీవు నాకు అప్పగించ బడ్డావు. ఇక నిన్ను ఎలా సాధిస్తానో చూద్దువుగాని!" అని. మహా ప్రవక్త ఇంకా ఇలా అన్నారు: "అతనికి ఆ గోరీ ఇరుకయిపోతుంది. ఎంత ఇరుకవుతుందంటే అతని ప్రక్కటెముకలు ఒక దానిలో ఒకటి చొచ్చుకు పోతాయి" ఈ మాట చెబుతూ మహాప్రవక్త ఒక చేతి వ్రేళ్ళను మరో

---

జాగ్రత్తపడి మసలుకోవాలనీ దైవమిచ్చిన అయిదు వరాలు - యౌవ్వనం, ఆరోగ్యం, కలిమి, తీరిక, జీవితం - వీటి విలువను తెలుసుకుని వాటిని కాపాడుకుంటూ వాటిని ధర్మపథంలో వినియోగించడానికి పూనుకోవాలని ఈ హదీసు బోధిస్తోంది.

యౌవ్వనంలో ఉన్నవారు వృద్ధాప్యం రాకముందే ఉత్తేజవంతంగా ధర్మ సందేశ ప్రచార కార్యాలను నెరవేర్చాలి. ధర్మ పరాయణతను అలవరచుకోవాలి. వృద్ధాప్యంలో కష్టాలను ఓర్చుకునే శక్తి ఉండదు. ఆరోగ్యంగా ఉన్నప్పుడే పనులు చక్కబెట్టుకోవాలి. ఆరోగ్యం చెడిందంటే కనీసం నమాజ్ నయినా సరిగ్గా చెయ్యలేము. ఇతర ధర్మ కార్యాల మాట సుదూరం. దైవం సంపదనిస్తే దాన్ని దుబారా ఖర్చుల్లో వ్యర్థం చెయ్యకుండా సరయిన మార్గంలో వ్యయపరచాలి. అదే విధంగా తీరిక ఉన్నప్పుడే పనులన్నీ చేసుకోవాలి. నేటి పని రేపటికి వాయిదావేయరాదు. ఎందుకంటే రేపటి పనులు రేపు ఎలాగూ ఉంటాయి.

చేతి(వేళ్ళలో వేసి చూపెట్టారు. ఇంకా ఇలా అన్నారు: "ఆ తరువాత అతనిపై డెబ్బయి మహా విషసర్పాలు వదలబడతాయి. అవి ఎంతో విషపూరితమయి ఉంటాయి. వాటిలో ఏ ఒక్కటి పృధ్విపై ఒక్కసారి బుసకొట్టినా భూమి శాశ్వతంగా బీడు వారి పోతుంది. ఇలాంటి విషసర్పాలు అతన్ని కాటువేస్తాయి. తీర్పుదినం వచ్చే వరకు ఇది ఇలా సాగుతూనే ఉంటుంది." ఇంకా మహాప్రవక్త ఇలా తెలిపారు: "గోరీ మనిషికి స్వర్గపు ఉద్యానవనాల్లో ఒకటిగానో, నరక కూపాల్లో ఒకటిగానో రూపొందుతుంది."

(తిర్మిజి)

٣٧٧ عَنْ بُرَيْدَةَ قَالَ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ:
كُنْتُ نَهَيْتُكُمْ عَنْ زِيَارَةِ الْقُبُوْرِ فَزُوْرُوْهَا - (مسلم)

377. "మీరు స్మశానానికి పోకూడదని, గోరీలను దర్శించకూడదనీ ముందు నేను మీకు నిషేధించాను. అయితే ఇప్పుడు మీరు వెళ్ళవచ్చు, ఎందుకంటే స్మశానవాటిక పరలోకాన్ని గుర్తుచేస్తుంది" అని బోధించారు మహాప్రవక్త (సఅసం).

(ముస్లిమ్)

---

376. హదీసులో ఇహలోక జీవితం · పరలోక జీవితం మధ్యనుండే మరణావస్థ (బర్జఖ్)కు గోరీని సంకేతంగా ప్రయోగించటం జరిగింది.

గోరీ చేత పలికించబడిన మాటలు వాస్తవంగా గోరీ పలుకుతుందనడం కంటే ఆ మాటల్ని మానవులకు అర్థమయ్యేలా, వారు తమ ఐహిక జీవితాన్ని మలచుకోవడంలో వాటి ద్వారా మార్గదర్శకత్వం పొందేలా రూపొందించడం జరిగిందనడం సబబు. ఒక వ్యక్తి ప్రపంచంలో తనకు సాధ్యపడినంతవరకు చెడుతో పోరాడుతూ మంచిని ఆచరిస్తూ, పరలోక సాఫల్యం కొరకు కృషి చేస్తూ తన జీవితాన్ని చాలించుకున్నాడంటే గోరీలో అతని ఎడల ప్రేమ పూర్వకంగా వ్యవహరించడం జరుగుతుంది. అలా కాక ఒక వ్యక్తి జీవితాంతం చెడును ఆచరిస్తూ, పశ్చాత్తాపపడకుండా, క్షమాపణ వేడుకోకుండా మరణిస్తే గోరీలో శిక్షాపూరితమయిన వాతావరణంలో ఉండవలసి ఉంటుంది. అంటే గోరీలోని జీవితాన్ని తన ఆచరణ మూలంగానే మలచుకోగలడన్నమాట. అదే మాటను హదీసు చివరలో చెప్పటం జరిగింది.

377. ప్రారంభంలో నిషేధించడానికి కారణం దేవుని ఏకత్వపు విశ్వాసం మనస్సుల్లో నాటుకుపోవాలన్న ధ్యేయమే. అది పరిపక్వం చెందనప్పుడు లేక అది క్షీణించినప్పుడు

٣٧٨ عَنْ بُرَيْدَةَ قَالَ : كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يُعَلِّمُهُمْ إِذَا خَرَجُوْا إِلَى الْمَقَابِرِ أَنْ يَّقُوْلَ قَائِلُهُمْ : "اَلسَّلَامُ عَلَيْكُمْ أَهْلَ الدِّيَارِ مِنَ الْمُؤْمِنِيْنَ وَالْمُسْلِمِيْنَ ، وَإِنَّا إِنْ شَاءَ اللّٰهُ بِكُمْ لَاحِقُوْنَ ، أَسْأَلُ اللّٰهَ لَنَا وَلَكُمُ الْعَافِيَةَ - (مسلم)

378. మహాప్రవక్త (సఅసం) స్మశానానికి పోయే వారిని అక్కడికి వెళ్ళి ఈ విధంగా పలకమని బోధించారని హజ్రత్ బురైదా అన్నారు: "అస్సలాము అలైకుమ్ అహలద్దియారి మినల్ మోమినీన వల్ ముస్లిమీన్. వ ఇన్నా ఇన్షాఅల్లాహు బికుమ్ లాహి కూన్ అస్అలుల్లాహలనా వలకుముల్ ఆఫియ." (మీపై శాంతి నెలకొనుగాక, ఈ బస్తీలో నివసించే ఓ విశ్వాసు లారా, విధేయులైన దేవుని దాసులారా! దైవ చిత్తమయితే మేము కూడా అనతి కాలంలో మీతో వచ్చి కలుస్తాము. మమ్మల్నీ, మిమ్మల్నీ నరకయాతన నుండి రక్షించమని అల్లాహ్‌ను వేడుకుంటున్నాము). (ముస్లిమ్)

٣٧٩ عَنْ مُعَاذِ بْنِ جَبَلٍ أَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَمَّا بَعَثَ بِهٖ إِلَى الْيَمَنِ قَالَ : "إِيَّاكَ وَالتَّنَعُّمَ ، فَإِنَّ عِبَادَ اللّٰهِ لَيْسُوْا بِالْمُتَنَعِّمِيْنَ ." (مشکوٰة)

379. హజ్రత్ ముఆజ్ బిన్ జబల్‌ను ఎమన్ గవర్నరుగా నియమించి పంపినప్పుడు మహాప్రవక్త బోధించిన విషయాన్ని హజ్రత్ ముఆజ్ ఇలా తెలిపారు: "ముఆజ్! భోగభాగ్యాలకు దూరంగాఉండు. ఎందుచేతనంటే దైవదాసులు భోగభాగ్యాల్లో మునిగితేలుతూ ఉండరు." (మిష్కాత్)

---

గోరీలకు పోవడాన్ని అనుమతించి ఉంటే తమ కోర్కెలు ఫలించడానికి మృతులకు మ్రొక్కుబడులు చేసుకునే భ్రష్టాచారం ప్రబలిపోయేది. నేడు మనం ఇలాంటి దృశ్యాలు చూస్తూనే ఉన్నాము. నేడు జరిగేదంతా దేవుని ఏకత్వపు భావం సన్నగిల్లడం మూలానే! ఆ తరువాత అనుమతించారంటే దానిక్కారణం అప్పటికి ఆయన తన అనుచరుల్లో విశ్వాస పరిపక్వతను గమనించారన్నమాట. నేడు కూడా దేవుని

٣٨٠ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "يُوْشِكُ الْاُمَمُ اَنْ تَدَاعٰى عَلَيْكُمْ كَمَا تَدَاعَى الْاَكَلَةُ اِلٰى قَصْعَتِهَا " فَقَالَ قَائِلٌ: وَّمِنْ قِلَّةٍ نَحْنُ يَوْمَئِذٍ؟ قَالَ: "بَلْ اَنْتُمْ يَوْمَئِذٍ كَثِيْرٌ وَّلٰكِنَّكُمْ غُثَاءٌ كَغُثَاءِ السَّيْلِ، وَلَيَنْزِعَنَّ اللّٰهُ مِنْ صُدُوْرِ عَدُوِّكُمُ الْمَهَابَةَ مِنْكُمْ، وَلَيَقْذِفَنَّ فِيْ قُلُوْبِكُمُ الْوَهْنَ" قَالَ قَائِلٌ: يَا رَسُوْلَ اللّٰهِ، وَمَا الْوَهْنُ؟ قَالَ: حُبُّ الدُّنْيَا وَكَرَاهِيَةُ الْمَوْتِ" (ابوداؤد، ثوبان)

380. ఒకసారి మహాప్రవక్త (సఅసం) తన అనుచరుల్ని సంబోధిస్తూ ఇలా హెచ్చరించారు " నా అనుచర సంఘానికి ఒక గడ్డుకాలం ఆసన్నం కానున్నది, అప్పుడు ఏ విధంగానయితే ఆకలిగొన్నవారు భోజనాలపై విరుచుకు పడతారో అదే విధంగా ఇతర జాతులవారు వారిపై విరుచుకు పడుతారు." అది విని ఒకరు, 'అయితే ఆ కాలంలో మేము (ముస్లిమ్‌లు) అల్ప సంఖ్యలో ఉంటామా?' అని అడిగారు. "కాదు, అప్పుడు మీరు ఎంతో అధిక సంఖ్యలో ఉంటారు. కాని మీరు వరద నీటి నురుగులా మారిపోతారు. మీ శత్రువుల హృదయాల్లో నుండి మీ దర్పం, మీ పట్ల భయభీతులు దూరమవుతాయి. మీ హృదయాల్లో అధైర్యం, పిరికితనం చోటుచేసుకుంటాయి" అన్నారు మహాప్రవక్త (సఅసం). 'వ్యక్తికి పిరికితనం ఎందుకు ఆవహిస్తుంది దైవప్రవక్తా!' అని అడగ్గా మహాప్రవక్త ఇలా సమాధానం ఇచ్చారు, "ప్రపంచ వ్యామోహం, మరణభీతివల్ల."

(అబూదావూద్ - సౌబాన్)

---

ఏకత్వంపట్ల అచంచల విశ్వాసం ఉన్నవారు తమ సంస్కరణ కొరకు స్మశాన వాటికను సందర్శించడం మంచిదే.

378. మహాప్రవక్త (సఅసం) నేర్పిన "దుఆ" లోని ముఖ్య అంశం "అనతికాలంలో మేము కూడా మీతో కలుస్తాము" అన్నదే. మనిషి స్మశానానికి వెళ్ళినప్పుడు కూడా ఐహిక విషయాలని మననం చేసుకుంటూ ఉండటం అన్నది సరయిన పద్ధతి కాదు. అక్కడికి తానూ ఓ రోజున రావలసి ఉందని గుర్తుంచుకోడానికి ఈ 'దుఆ' రూపంలో ఓ జ్ఞాపికను మహాప్రవక్త (సఅసం) ప్రసాదించారు. దీన్ని అర్థం చేసుకుంటూ పఠించినప్పుడే దుఆ సార్థకమవుతుంది.

٣٨١ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ أَحَبَّ دُنْيَاهُ أَضَرَّ بِاٰخِرَتِهٖ، وَمَنْ أَحَبَّ اٰخِرَتَهٗ أَضَرَّ بِدُنْيَاهُ فَاٰثِرُوْا مَا يَبْقٰى عَلٰى مَا يَفْنٰى۔ (مشکوٰۃ-ابوموسیٰ)

381. మహాప్రవక్త (సఅసం) ఇలా బోధించారు, "ఏ వ్యక్తి అయితే ప్రపంచాన్ని ప్రేమిస్తాడో అతడు తన పరలోక సాఫల్యాన్ని కోల్పోతాడు. ఎవరు తన పరలోక సఫలతను వాంఛిస్తాడో అతడు తన ప్రాపంచిక స్వలాభాలను త్యజిస్తాడు. కనుక మీరు శాశ్వత జీవితానికి అశాశ్వత జీవితంపై ప్రాధాన్యమివ్వండి." (మిష్కాత్ - అబూ మూసా)

---

379. భావమేమిటంటే నీవు పెద్ద హోదాను చేపట్టబోతున్నావు. అక్కడి భోగభాగ్యాల్లో తేలి ఆడే అవకాశాలు కోకొల్లలు. అయితే నీవు ప్రపంచ వ్యామోహంలో పడి పరలోకాన్ని విస్మరించకూడదు. ఈ నడవడి దేవుని దాసులకు తగదు. దేవుని దాసులు నిత్యం పరలోకాన్ని గుర్తుంచుకుని ప్రపంచంలో భయభక్తుల జీవితాన్ని గడుపుతారు.

380. మహాప్రవక్త (సఅసం) హెచ్చరిక విన్నంతనే ముస్లిమ్‌లు ఎంతో అల్ప సంఖ్యాకులయి పోవడంవల్ల అప్పుడు ఇతరులందరూ ఏకమయి వీరిని తుద ముట్టిస్తారేమోనని సందేహం కలిగింది 'సహబా' (సహచరుల)కు. సహబా ఇతరత్రా ఆలోచించలేకపోయ్యారు. ఎందుకంటే వారు స్వతహాగా అల్ప సంఖ్యాకులయినప్పటికీ అధిక సంఖ్యాకులయిన తమ ధర్మ విరోధులపాలిటి ఇనుప గుగ్గిళ్ళుగా తయారయ్యారు. వారి విరోధులు వారిని ఏనాడూ అధిగమించలేకపోయారు.

అధైర్యం ఆవహించడానికి కారణం ప్రపంచ వ్యామోహాల్లోపడి పరలోక సఫలతను విస్మరించడం, పర్యవసానంగా దైవభీతి సన్నగిల్లి ప్రపంచ భీతి నెలకొనడం, దైవంపై భరోసా క్షీణించి క్రమేణ ప్రాపంచిక సామాగ్రి సాధనాలపై భరోసా ఏర్పడటం- ఒక్కమాటలో చెప్పాలంటే "దైవం" స్థానే "ప్రపంచం" తిష్ఠ వేసుకోవడం అన్నమాట. రెండవ కారణం ధర్మపథంలో అంతర్ బాహ్య అవరోధాలను అధిగమించే వాంఛ, ఆ మార్గాన అవసరమయితే ప్రాణాలనయినా త్యాగం చేయగల కోరిక, ఆత్మస్థయిర్యం ఆత్మబలం కోల్పోయి, చావంటేనే కంపరం, భీతి జనించడం అని భావం.

381. ప్రపంచాన్నో లేక పరలోకాన్నో ఏదో ఒక దాన్ని ఎన్నుకోవాలి. ప్రపంచాన్నే పరమార్థంగా భావిస్తే పరలోక సఫలత శూన్యం. పరలోకాన్ని పరమార్థంగా ఎన్నుకుంటే, ప్రాపంచిక స్వలాభాలు దెబ్బతినడం సాధ్యమే. కాని పరలోకంలో లభించే బహుమానాలు శాశ్వతమయినవి. పరలోక మార్గాన పురోగమిస్తే క్షీణించేది క్షణికమైన ఐహిక సుఖమే,

٣٨٢ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "اَلْكَيِّسُ مَنْ دَانَ نَفْسَهُ وَعَمِلَ لِمَا بَعْدَ الْمَوْتِ وَالْعَاجِزُ مَنْ اَتْبَعَ نَفْسَهُ هَوَاهَا وَتَمَنّٰى عَلَى اللّٰهِ۔" (ترمذی-شداد بن اوسؓ)

382. దైవప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు "ఎవరు తన మనసును అదుపులో పెట్టుకుని, మరణానంతర జీవితాన్ని చక్కదిద్దుకోవడంలో నిమగ్నుడవుతాడో అతడే వాస్తవంగా వివేచనాపరుడు. ఎవరు తన మనోకాంక్షల పరిపూర్తి కోసం తల్లీనుడయిపోయి అల్లాహ్ ఎడల ఆధారంలేని ఆశలు పెంచుకుంటాడో అతడే బుద్ధిహీనుడు."

(తిర్మిజి - షద్దాద్ బిన్ అవస్)

٣٨٣ قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: أَعْذَرَ اللّٰهُ إِلَى امْرِئٍ اَخَّرَ أَجَلَهُ حَتّٰى بَلَغَ سِتِّيْنَ سَنَةً۔ (بخاری، ابوھریرۃؓ)

383. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు : "ఎవరి గడువును అల్లాహ్ పొడిగించగా అతను అరవయి ఏళ్ళ వయసును పొందుతాడో అతనికి దైవం ఎదుట సాకులు చెప్పడానికి ఎలాంటి ఆస్కారం లేదు, అవకాశమూ లేదు."

٣٨٤ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: اِسْتَحْيُوْا مِنَ اللّٰهِ حَقَّ الْحَيَاءِ، قُلْنَا: إِنَّا نَسْتَحْيِيْ مِنَ اللّٰهِ يَا رَسُوْلَ اللّٰهِ، وَالْحَمْدُ لِلّٰهِ، قَالَ: لَيْسَ ذٰلِكَ، وَلٰكِنَّ الْإِسْتِحْيَاءَ مِنَ اللّٰهِ حَقَّ الْحَيَاءِ أَنْ تَحْفَظَ الرَّأْسَ وَمَا وَعٰى، وَالْبَطْنَ وَمَا حَوٰى وَتَذْكُرَ الْمَوْتَ وَالْبِلٰى وَمَنْ أَرَادَ الْاٰخِرَةَ تَرَكَ زِيْنَةَ الدُّنْيَا وَاٰثَرَ الْاٰخِرَةَ عَلَى الْأُوْلٰى، فَمَنْ فَعَلَ ذٰلِكَ فَقَدِ اسْتَحْيَا مِنَ اللّٰهِ حَقَّ الْحَيَاءِ۔ (ترمذی)

384. మహాప్రవక్త ఒకసారి అల్లాహ్ ఎడల లజ్జగా మెలగండి. సిగ్గుపడవలసిన రీతిలో ఆయన ఎదుట సిగ్గుపడండి అన్నారు. దానికి అక్కడున్న వారు "దైవప్రవక్తా, అల్లాహ్ కృపవల్ల మేము అల్లాహ్ ఎడల లజ్జా పూరితంగానే మెలుగుతున్నాము." అని బదులు పలికారు. అప్పుడు ఆయన బోధించారు, "అదికాదు, అల్లాహ్ ఎడల సిగ్గుపడవలసిన రీతిలో సిగ్గుపడటమంటే మీరు మీ మస్తిష్కాన్ని, అందులో ఉత్పన్నమయ్యే ఆలోచనల్ని అదుపులో పెట్టుకోవాలి. కడుపును, అందులో వేసుకునే భుక్తిని కనిపెట్టుకుంటూ ఉండాలి. మృత్యువును, దాని పర్యవసానంగా కుళ్ళి కృశించి అంతమయి పోవడాన్ని జ్ఞాపకం చేసుకుంటూ ఉండాలి. ఏ వ్యక్తి పరలోక సాఫల్యాన్ని కోరుకుంటాడో అతడు ప్రాపంచిక ఆడంబరాలను త్యజిస్తాడు. ప్రపంచానికి బదులు పరలోకానికి ప్రాముఖ్యాన్నిస్తాడు. ఇలా ఆచరించిన వ్యక్తే వాస్తవానికి అల్లాహ్ పట్ల సిగ్గుపడవలసిన రీతిలో సిగ్గుపడినవాడు." (తిర్మిజి)

٣٨٥ عَنْ أَبِىْ أَيُّوْبَ الْاَنْصَارِيِّ قَالَ: جَاءَ رَجُلٌ إِلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ: عِظْنِىْ وَأَوْجِزْ، فَقَالَ: إِذَا قُمْتَ فِىْ صَلٰوتِكَ فَصَلِّ صَلٰوةَ مُوَدِّعٍ وَّلَا تَكَلَّمْ بِكَلَامٍ تُعْذِرُ مِنْهُ غَدًا وَاَجْمِعِ الْيَأْسَ مِمَّا فِىْ أَيْدِى النَّاسِ۔ (مشكوٰة)

385. అబూ అయ్యూబ్ అన్సారీ ఇలా ఉల్లేఖించారు: 'ఒక వ్యక్తి మహాప్రవక్త(సఅసం) సమక్షంలో హాజరయి, "దైవప్రవక్తా! నాకు చిన్నదయినా, గొప్ప ఉపదేశాన్ని ఒకటి చెయ్యండి" అని వేడుకున్నాడు. దానికి

---

ఐహిక జీవితం కూడా క్షణికమయిందే. కనుక ఈ అశాశ్వత స్వలాభాల, సుఖాల త్యాగం వల్ల శాశ్వత బహుమానాలు లభిస్తే లాభకరం కాదా?

382. శాశ్వత జీవిత నిర్మాణం కొరకు అశాశ్వతమయిన మనోకాంక్షలను అదుపుచేసేవాడు బుద్ధిమంతుడవడం సుస్పష్టమే. సత్యాన్ని అనుసరించడం మానుకుని, మనోవాంఛలను అనుసరిస్తూ అల్లాహ్ తనకు పరలోకంలో సఫలత చేకూర్చుతాడని, స్వర్గం బహూకరిస్తాడని ఆశించే వ్యక్తి బుద్ధిహీనుడనడంలో సందేహమేముంది? నేటికీ ముస్లింలు, ముస్లిమేతరులు ఎందరో ఇలాంటి గాలిమేడలలో జీవితం సాగిస్తున్నారు. మనిషి దేనికయితే కృషిచేస్తాడో అదే పొందగలడు కాని మరొకటి కాదు.

ఆయన ఇలా బోధించారు. "నీవు నమాజ్ చెయ్యడానికి నిలబడి నప్పుడు ప్రపంచాన్ని విడిచిపోయేవానిలా నమాజ్ చెయ్యి. రేపు ఏ సమాధానమూ చెప్పుకోలేని మాటను నోటినుండి రానీకు, ఇతరుల వద్ద ఉన్న సిరిసంపదల ఎడల నిరపేక్షాపరుడిగా జీవించు." (మిష్కాత్)

٣٨٦ عَنْ أَبِي بَرْزَةَ الْأَسْلَمِيِّ قَالَ، قَالَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "لَا تَزُولُ قَدَمَا عَبْدٍ حَتّٰى يُسْئَلَ عَنْ عُمْرِهٖ فِيمَا أَفْنَاهُ وَعَنْ عِلْمِهٖ فِيمَا فَعَلَ، وَعَنْ مَالِهٖ مِنْ أَيْنَ اكْتَسَبَهُ وَفِيمَا أَنْفَقَهُ وَعَنْ جِسْمِهٖ فِيمَا أَبْلَاهُ" (ترمذی)

386. ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు. "ప్రళయ దినాన అల్లాహ్ న్యాయస్థానంలో మనిషి అయిదు విషయాల లెక్క ఒప్పజెప్పనంతవరకు అక్కడి నుండి కదలలేడు. అతనిని, (ఈ ప్రశ్నలు) అడగటం జరుగుతుంది: జీవితకాలాన్ని ఏ కార్యకలాపాల్లో గడిపావు? సంపాదించిన జ్ఞానాన్ని ఎంతవరకు ఆచరణలో పెట్టావు? ధనం ఎలా సంపాదించావు? ఎలా ఖర్చుచేశావు? నీ శరీరాన్ని ఏ కార్యాల్లో కృశింప జేశావు?" (తిర్మిజి)

---

383. అంటే మనిషి అరవయి ఏళ్ళ జీవితంలో తాను తెలుసుకున్న విషయాలవల్ల గడించిన అనుభవంవల్ల, కూడా సన్మార్గం వైపునకు మరలకపోతే, సదాచారుడు కాలేకపోతే, అతనికి ఇంకా వ్యవధి అవసరమా? ఇంకా సాకులు చెప్పుకోడానికి ఏమైనా మిగులుతుందా?

385. తాను ఇక జీవించబోవడం లేదనీ ప్రపంచాన్ని వదలి వెళ్ళబోతున్నానని ఏ వ్యక్తికి నమ్మకం కలుగుతుందో అతడు ఎంతో దీక్షతో, దైవ ధ్యానంలో మనసు లగ్నం చేసి నమాజ్ చేస్తాడు. నమాజ్ చేసేటప్పుడు అతని మనసు పరిపరి విధాల పరిభ్రమించదు. ఏకోన్ముఖుడయి నమాజ్ పూర్తి చేస్తాడు. వాస్తవానికి నిత్యం ఇలా మనస్సు లగ్నంచేసి, ఇది నా చివరి నమాజ్ కావచ్చు. ఇకపై నాకు నమాజ్ చేసే అవకాశం తిరిగి రాదేమో అనే భావంతో చేసే నమాజ్‌లోని మాధుర్యం మాటల్లో చెప్తే వ్యక్తమయ్యేది కాదు. యదార్థం కాని మాటల్ని పలికిన వ్యక్తి ప్రపంచంలో దాని గురించి మన్నింపు కోరి

٣٨٧ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "مَنْ خَافَ أَدْلَجَ
وَمَنْ أَدْلَجَ بَلَغَ الْمَنْزِلَ، أَلَا إِنَّ سِلْعَةَ اللّٰهِ غَالِيَةٌ، أَلَا إِنَّ سِلْعَةَ اللّٰهِ الْجَنَّةُ."
(ترمذی-ابوھریرۃؓ)

387. దైవప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "ఏ ప్రయాణీకునికి తాను సకాలంలో గమ్యస్థానం చేరలేనని భయం కలుగుతుందో అతను నిద్రపోడు. పెందలాడే ప్రయాణం మొదలెడతాడు. ఇలా చేసినవాడు సకాలంలో క్షేమంగా గమ్యం చేరుకుంటాడు.
సావధానంగా వినండి: అల్లాహ్ సొత్తు ఎంతో ఖరీదయినది. తెలుసు కోండి, అల్లాహ్ సొత్తు అంటే స్వర్గమే." (తిర్మిజి - అబూహురైరా)

---

ఉండకపోతే రేపు, అంటే తీర్పు దినాన అతడు దానికి సంజాయిషి ఏమీ చెప్పుకోలేడు. అందువల్ల అలాంటి మాటను పలకరాదని మహాప్రవక్త (సఅసం) బోధించారు.

ఇతరుల ధన, ధాన్య సామాగ్రిని ఈర్ష్యతో చూడకూడదు. ఇదంతా ఒక రోజున నిరుపయోగమయిపోయేదే. మనిషి జీవితంలోనే అది దగా చేసి అతనికి దూరం కావచ్చు లేక తన జీవితాన్ని చాలించి అతడే దాన్ని వదలి వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడవచ్చు. ప్రపంచం పట్ల నిరపేక్షాభావం కలగనంతవరకు పరలోకం పట్ల మనిషికి వ్యామోహం జనించదు. అందువల్ల తనకు లేని దాని కోసం కీచులాట లాడటం శ్రేయస్కరం కాదని బోధించడం జరిగింది.

386. ఈ అయిదు ప్రశ్నలు చాలు, మనిషి జీవితాన్నంతా తిరగతోడడానికి. వాస్తవానికి ప్రళయ దినాన మనిషి తన జీవితం మొత్తాన చేసిన వాటికీ చెయ్యలేకపోయినవాటికీ అన్నింటికీ సంజాయిషీ చెప్పుకోవలసివస్తుంది. ఈ అయిదు ప్రశ్నలకు సరయిన జవాబులు ఏమిటో కూడా దైవం తన గ్రంథంలో, తన ప్రవక్త జీవిత ఆదర్శం ద్వారా తెలిపాడు. పరీక్షా పత్రమూ, సమాధానాలూ అన్నీ ముందే తెలిపిన ఆ పరమ ప్రభువు ఎంత దయామయుడు? ఇక దీని తరువాత కూడా ఎవరయినా ఈ పరీక్షలో నెగ్గేందుకు కావలసిన సరంజామాను సిద్ధంచేసుకోలేకపోతే వారి దురదృష్టాన్ని ఏమని చెప్పగలం?

387. మనిషి వాస్తవంలో ఒక ప్రయాణీకుడిలాంటివాడే. అతని స్వస్థలం, జన్మభూమి స్వర్గం. మనిషి ప్రపంచంలో చేసే కృషి అంతా తన సొంత ఊరు చేరుకోడానికి చేసే ప్రయాణమే. మనిషి ఈ యదార్థాన్ని మరచిపోయి, రైలుబండిలో కూర్చుని అక్కడ ప్రాప్తమైన సౌలభ్యాల కారణంగా తన అసలు గమ్యాన్ని విస్మరించి రైలే తన స్వస్థలమని మోసపోయే ప్రయాణీకుడిలాంటివాడే. ప్రపంచం కేవలం రైలుబండిలాంటిదో

# ఖుర్ఆన్ అనుసంధానం

٣٨٨ عَنِ النَّوَّاسِ بْنِ سَمْعَانَ قَالَ، سَمِعْتُ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ: "يُؤْتَى يَوْمَ الْقِيٰمَةِ بِالْقُرْاٰنِ وَأَهْلِهِ الَّذِيْنَ كَانُوْا يَعْلَمُوْنَ بِهٖ فِي الدُّنْيَا تَقْدُمُهٗ سُوْرَةُ الْبَقَرَةِ وَاٰلُ عِمْرَانَ تُحَاجَّانِ عَنْ صَاحِبِهِمَا۔" (مسلم)

388. హ|జత్ నవాస్ బిన్ సమ్ ఆన్ ఉల్లేఖనం: 'నేను మహాప్రవక్త (సఅసం) ఇలా బోధిస్తూ ఉండగా విన్నాను. "ప్రళయ దినాన దివ్య ఖుర్ ఆన్ ని, దాన్ని నమ్మి దానికనుగుణంగా ఆచరించే వారిని అల్లాహ్ సమక్షానికి రప్పించడం జరుగుతుంది. బఖర, ఆలి ఇమ్రాన్ సూరాలు ఖుర్ ఆన్ మొత్తానికి ప్రాతినిధ్యం వహిస్తూ తమను అనుసరించే వారి కొరకై అల్లాహ్ సమక్షంలో సిఫారసు చేస్తాయి." (ముస్లిమ్)

٣٨٩ عَنْ عُبَيْدَةَ الْمُلَيْكِيِّ وَكَانَتْ لَهٗ صُحْبَةٌ — قَالَ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: "يَا أَهْلَ الْقُرْاٰنِ، لَا تَتَوَسَّدُوا الْقُرْاٰنَ، وَاتْلُوْهُ حَقَّ تِلَاوَتِهٖ مِنْ اٰنَاءِ اللَّيْلِ وَالنَّهَارِ وَأَفْشُوْهُ وَتَغَنَّوْهُ وَتَدَبَّرُوْا مَا فِيْهِ لَعَلَّكُمْ تُفْلِحُوْنَ، وَلَا تَعَجَّلُوْا ثَوَابَهٗ فَإِنَّ لَهٗ ثَوَابًا۔" (مشكوٰة)

389. మహాప్రవక్త (సఅసం) ఇలా హెచ్చరించారు: "ఖుర్ ఆన్ ని విశ్వసించే వారలారా! దివ్యఖుర్ ఆన్ ని తలదిండుగా మార్చివేయకండి. రేయింబవళ్ళు దాన్ని పారాయణం చేయవలసిన ఉత్తమ రీతిలో పారాయణం చేయండి. దాన్ని, దాని సందేశాన్ని ప్రచారం చేయండి, దాని పదాల్ని సరైన

---

లేక ఓ సత్రం లాంటిదో అన్న వాస్తవాన్ని తెలుసుకుంటే మోసపోకుండా మెలుగుతాడు. ఎవరయితే తమ స్వస్థలానికి సురక్షితంగా చేరాలని కోరుకుంటారో వారు నిర్లక్ష్య భావంతో ఏమరుపాటుతో మెలగరాదు. ప్రజలు తమ ప్రయాణ సన్నాహాలు చేసుకోకుండా నిద్ర పోయారా గమ్యం చేరుకోలేరు, తరువాత వగచి లాభం లేదు.

ఉచ్చారణ సహితంగా పఠించండి. అందులో వివరించబడ్డ విషయాలను లోతుగాయోచించండి. తద్వారా సన్మార్గ సూచనలు పొంది మీరు సాఫల్యం పొందుతారు. దాని మూలంగా ప్రాపంచిక ప్రతిఫలాన్ని ఆశించకండి. దాని ద్వారా కేవలం దైవప్రసన్నత మాత్రమే కోరుకోండి."

(మిష్కాత్ - ఉబైదా ములై)

٣٩٠ عَنْ أَبِي ذَرٍّ قَالَ: دَخَلْتُ عَلَى رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ ...... قُلْتُ: يَارَسُوْلَ اللهِ، أَوْصِنِيْ، قَالَ: أُوْصِيْكَ بِتَقْوَى اللهِ فَإِنَّهُ أَزْيَنُ لِأَمْرِكَ كُلِّهِ، قُلْتُ زِدْنِيْ، قَالَ: عَلَيْكَ بِتِلَاوَةِ الْقُرْاٰنِ وَذِكْرِ اللهِ عَزَّوَجَلَّ، فَإِنَّهُ ذِكْرٌ لَّكَ فِي السَّمَاءِ وَنُوْرٌ لَّكَ فِي الْاَرْضِ - (مشكوٰة)

390. హజ్రత్ అబూజర్ గిఫారీ (ర.అ.) వివరణః "నేనొకసారి మహాప్రవక్త (సఅసం) సన్నిధిలో హాజరయ్యాను..... 'దైవప్రక్తా ! ఏదైనా సదుపదేశం చెయ్యండి' అని అర్థించాను. "అల్లాహ్ పట్ల 'తక్వా' (నిష్ఠ) కలిగి జీవించు. ఇది నీ వ్యవహారాలన్నింటినీ చక్కదిద్దుతుంది" పలికా రాయన. "ఇంకా ఏదైనా సెలవియ్యండి" అని కోరాను. దానికి ఆయన ఉపదేశించారుః "దివ్యఖుర్ఆన్ అనుసంధానం చెయ్యడాన్ని, మహోన్నతు డయిన అల్లాహ్ నామ సంస్మరణ చెయ్యడాన్ని ఏమరపాటు లేకుండా పాటించు. ఈ దినచర్యవల్ల అల్లాహ్ నిన్ను ఆకాశాలలో జ్ఞాపకం చేస్తాడు. ఇది భూలోక జీవితంలో నీకు జ్యోతిగా పరిణమిస్తుంది." (మిష్కాత్)

---

అల్లాహ్ ప్రసన్నతను, ఆయన బహుమానమయిన స్వర్గాన్ని కాంక్షించే వ్యక్తి తెలుసు కోవలసిన విషయమేమంటే, స్వర్గం ఏదో సాధారణ సొత్తు కాదు. దాన్ని పొందడానికి గొప్ప మూల్యం చెల్లించవలసి ఉంటుంది. పెద్దపెద్ద పరీక్షా సమయాలు ఎదురవుతాయి. సమయాన్ని, సంపదల్ని, శక్తి సామర్థ్యాల్ని దాని ప్రాప్తికొరకు వినియోగించవలసి ఉంటుంది. ఎన్ని త్యాగాలకయినా సిద్ధమయి నిల్వోవలసి ఉంటుంది. అప్పటికి గాని మనిషికి అతని కష్టాలన్నింటినీ మరిపింపచేసే ఆ స్వర్గం ప్రాప్తం కాదు.

388. దివ్యఖుర్ఆన్‌ని దైవ గ్రంథమని నమ్మడం, దాని ప్రకారం ఆచరించడం అంటే దైవాజ్ఞలనన్నింటినీ, మహాప్రవక్త (సఅసం) సంప్రదాయాల నన్నింటినీ పాటించడం అన్నమాట. బఖర, ఆలి ఇమ్రాన్ సూరాల్లోనే మానవులు సామూహిక జీవితానికి,

٣٩١ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنَّ هٰذِهِ الْقُلُوْبَ تَصْدَءُ كَمَا يَصْدَءُ الْحَدِيْدُ إِذَا أَصَابَهُ الْمَاءُ، قِيْلَ: يَارَسُوْلَ اللّٰهِ، وَمَا جَلَاؤُهَا؟ قَالَ: كَثْرَةُ ذِكْرِ الْمَوْتِ وَتِلَاوَةُ الْقُرْاٰنِ ۔ (مشكوٰة-ابن عمرؓ)

391. మహాప్రవక్త (సఅసం) ఇలా ఒకసారి ప్రబోధించారు : "హృదయానికి కూడా త్రుప్పు పడుతుంది - ఇనుముకు నీరు చేరినప్పుడు త్రుప్పు పట్టినట్లు." అక్కడున్న వారు అడిగారు. 'దైవప్రవక్తా! హృదయాల త్రుప్పును వదిలించేది ఏదో సెలవియ్యండి' అని. దానికి ఆయన "హృదయానికి పట్టిన త్రుప్పు దూరమవటానికి మనిషి మృత్యువును సదా గుర్తు చేసుకుంటూ ఉండాలి. దివ్య ఖుర్ఆన్‌ని అనుసంధానం చేస్తూ ఉండాలి" అని ఉపదేశించారు. (మిష్కాత్ - ఇబ్ను ఉమర్)

---

వ్యక్తిగత వ్యవహారాలకు తగిన శాసనాలు ప్రసాదించబడ్డాయి. అవి రెండు సిఫారసు చేస్తాయంటే "ఇతడు దివ్య ఖుర్ఆన్ ఏ లక్ష్యం కొరకు అవతరించిందో దాన్ని నెరవేర్చాడు. మీ విధేయతను పాటించాడు. ఇప్పుడు మీ కరుణానుగ్రహాలకు అర్హుడు. ఇతన్ని అనుగ్రహించండి" అని దైవ సముక్షంలో సాక్ష్యం పలుకుతాయన్నమాట.

389. ఖుర్ఆన్‌ను తలదిండుగా మార్చడమంటే దాన్ని కట్టిపడేయటం, దాని పట్ల అలక్ష్యం చేయడం అన్నమాట. దిండును సామాన్యంగా తలకింద పెట్టుకుని మన సుఖనిద్ర కొరకు సాధనంగా వాడుకుంటాము. అలాగే దివ్యఖుర్ఆన్‌ని దాన్ని చదవడానికి ముందుంచుకోవడానికి బదులు వెనక కట్టిపెట్టరాదని, దాన్ని మన సుఖసంతోషాల కొరకు, మనో కాంక్షల పరిపూర్తి కొరకు వాడుకోరాదని బోధించడం జరిగింది. చివరి వాక్యానికి- ఖుర్ఆన్ విజ్ఞానాన్ని ప్రాపంచిక హోదా, సిరిసంపదలు పొందడానికి వినియోగించకూడదని భావం. ఈ వాక్యం తొలి వాక్యాన్ని విశదీకరిస్తోంది.

390. "తక్వా" అన్న పదానికి చాలా విస్తృతమయిన అర్థం ఉంది. 'నిష్ఠ' అన్నది దానికి సమీప భావం మాత్రమే. జీవితం మొత్తాన దైవాజ్ఞల్ని అనుసరించడం, వాటి ఉల్లంఘన పట్ల దైవభీతి కలిగి ఉండటం అని భావం. "ఆకాశంలో" అంటే దైవ సన్నిధానంలో అని భావం. అల్లాహ్ జ్ఞాపకం చెయ్యడం అంటే అల్లాహ్ మరవడనీ నిత్యం తన రక్షణలో ఆశ్రయం కల్పిస్తాడనీ భావం. నిత్యం తోడునీడగా ఉండే అల్లాహ్ నామసంస్మరణ, దివ్య ఖుర్ఆన్ అధ్యయనం మనిషికి ఐహిక జీవితంలోని కారు చీకట్లలో, భిన్న మార్గాల్లో వెలుగును సరయిన మార్గదర్శకత్వాన్ని అందజేస్తాయి.

391. హృదయం సహజసిద్ధంగా పునీతమయింది. కాని భవబంధాలు తెచ్చే విషయలోలత్వంవల్ల అది తన పవిత్రతను, తేజస్సును కోల్పోయే ప్రమాదముంటుంది.

# నఫిల్ (అదనపు) ప్రార్థనలు

٣٩٢ عَنْ أَبِي ذَرٍّ قَالَ، قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: يَقُوْلُ اللهُ...... وَمَنْ تَقَرَّبَ مِنِّي شِبْرًا، تَقَرَّبْتُ مِنْهُ ذِرَاعًا، وَمَنْ تَقَرَّبَ مِنِّي ذِرَاعًا، تَقَرَّبْتُ مِنْهُ بَاعًا، وَمَنْ أَتَانِي يَمْشِي أَتَيْتُهُ هَرْوَلَةً۔ (مسلم)

392. "ఏ వ్యక్తి నాకు జానెడు సమీపమవుతాడో నేను అతని వైపునకు ఒక మూరెడు జరుగుతాను. ఎవరు నా వైపునకు ఒక మూరెడు జరుగుతారో నేను వారికి రెండు మూరలు సమీపమవుతాను. ఎవరు నా వైపునకు నడకన వస్తాడో నేను అతని వైపునకు పరుగిడి వస్తాను" అని అల్లాహ్ అన్నాడని మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు.

(ముస్లిమ్ - అబూజర్ గిఫారి)

٣٩٣ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ، قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: ...... وَمَا تَقَرَّبَ إِلَيَّ عَبْدِي بِشَيْءٍ أَحَبَّ إِلَيَّ مِمَّا افْتَرَضْتُ عَلَيْهِ، وَمَا يَزَالُ عَبْدِي يَتَقَرَّبُ إِلَيَّ بِالنَّوَافِلِ حَتّٰى أَحْبَبْتُهُ فَإِذَا أَحْبَبْتُهُ كُنْتُ سَمْعَهُ الَّذِي يَسْمَعُ بِهِ وَبَصَرَهُ الَّذِي يُبْصِرُ بِهِ، وَيَدَهُ الَّتِي يَبْطِشُ بِهَا، وَرِجْلَهُ الَّتِي يَمْشِي بِهَا۔" (بخاری)

393. అబూహురైరా ఉల్లేఖనం : "మహాప్రవక్త (సఅసం) ఒకసారి అల్లాహ్ ఇలా అన్నాడని తెలిపారు: "నా దాసుడు నా సాన్నిధ్యం కోరి ఆచరించే వాటిలోకెల్ల, నేను అతనిపై విధిగా నిర్ణయించినవి నాకు ప్రియమయినవి.

---

అందువల్ల ఐహిక జీవితం పట్ల, పరలోక శాశ్వత జీవితం పట్ల సరయిన భావన నిత్య నూతనంగా మనిషి కళ్ళెదుట సాక్షాత్కరించడానికి మహాప్రవక్త చూపిన మార్గమిది. మృత్యువును గుర్తు చేసుకోవడమంటే ఈ జీవితాన్ని ఎప్పుడో చాలించవలసివస్తుందని కర్మలకు వ్యవధి ఈ జీవిత కాలంతో అంతమయిపోతుందని, మరొకసారి ఇలాంటి

నా దాసుడు అదనపు ప్రార్థనల ద్వారా నాకు ఎంతో ఇంకా చేరువ అవుతాడు, కడకు అతడు నా ప్రేమకు పాత్రుడవుతాడు. అతడు నాకు ప్రీతిపాత్రుడయినప్పుడు నేను, అతడు వినే చెవి నవుతాను; అతడు చూసే కన్ను నవుతాను; అతడు పట్టుకునే చెయ్యినవుతాను, అతడు నడిచే కాలునవుతాను." (బుఖారి - అబూహురైరా)

٣٩٤ عَنْ أُمِّ سَلَمَةَ أَنَّ النَّبِيَّ صَلَّى اللهُ وَسَلَّمَ اِسْتَيْقَظَ لَيْلَةً فَقَالَ : "سُبْحٰنَ اللهِ - مَاذَا أُنْزِلَ اللَّيْلَةَ مِنَ الْفِتَنِ، مَاذَا أُنْزِلَ مِنَ الْخَزَائِنِ مَنْ يُّوْقِظُ صَوَاحِبَ الْحُجُرَاتِ ؟ يَارُبَّ كَاسِيَةٍ فِي الدُّنْيَا عَارِيَةٌ فِي الْاٰخِرَةِ - (بخاری)

394. ఉమ్మెసల్మా (రఅ) ఉల్లేఖనం: "ఒక రోజు రాత్రి మహాప్రవక్త (సఅసం) నిద్రనుండి మేల్కొని ఇలా అన్నారు: "అల్లాహ్ పరమ పవిత్రుడు! ఈ రేయి ఎన్ని పరీక్షలకు ఆలవాలమయింది! ఈ రేయి ఎన్ని అమూల్యమయిన నిధులకు నిలయమయిందీ! ఆ గదుల్లో ఉండే మహిళల్ని ఎవరు మేల్కొలుపుతారో! ఎంతో మంది లోపాలు ఈ లోకంలో మరుగునపడి ఉంటాయి. పరలోకంలో అవి బయటపడి పోతాయి." (బుఖారి)

---

వ్యవధి దొరకదనీ మనిషి గుర్తుచేసుకోవటం అన్నమాట.

దివ్యకుర్ఆన్ అనుసంధానం అంటే సరయిన పంథాలో పారాయణం చెయ్యడం, అందులో ఉన్నదాన్ని అర్థం చేసుకుని దాని ప్రకారం ఆచరించడం ఇంకా ఇతరుల వరకు దాని సందేశాన్ని అందజేయడమన్నమాట.

392. చంటివాడు తన తండ్రిని చూచి తప్పటడుగు వేస్తూ సమీపించబోతే తండ్రి పరుగునపోయి అతన్ని అక్కున చేర్చుకుంటాడు. గుండెకు హత్తుకుంటాడు. తండ్రికంటే ఎన్నో రెట్లు అధిక వాత్సల్యం కలవాడు సర్వేశ్వరుడు మనిషి అతన్ని సమీపించడానికి సత్సంకల్పంతో ఆయన మార్గంలో తప్పటడుగులు వేసేటప్పుడు ఆయన తన మార్గాన్ని జ్యోతిర్మయం, సుగమం చేస్తాడు, ప్రేమతో, ముందుకుపోయి చెయ్యందుకుంటాడు.

٣٩٥ عَنْ عَلِيٍّ أَنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ طَرَقَهُ وَفَاطِمَةَ لَيْلاً فَقَالَ: أَلَا تُصَلِّيَانِ؟ (بخاری-مُسلم)

395. హజ్రత్ అలీ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : "మహాప్రవక్త (సఅసం) ఒకనాటి రేయి తహజ్జుద్ నమాజ్ సమయాన మా ఇంటికి వచ్చి నన్నూ, ఫాతిమాను సంబోధించి "మీరు యిద్దరూ తహజ్జుద్ నమాజ్ చేయరా?" అని అడిగారు." (బుఖారీ, ముస్లిం)

٣٩٦ عَنْ عَبْدِ اللهِ ابْنِ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ، قَالَ لِي رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: "يَا عَبْدَ اللهِ، لَا تَكُنْ مِثْلَ فُلَانٍ كَانَ يَقُوْمُ مِنَ اللَّيْلِ فَتَرَكَ قِيَامَ اللَّيْلِ." (بخاری-مسلم)

396. అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్(రఅ) ఇలా ఉల్లేఖించారు, "అబ్దుల్లాహ్, నీవు ఫలానా వ్యక్తిలా మారిపోకు అతడు మునుపయితే రాత్రివేళ తహజ్జుద్ నమాజ్‌కు లేచేవాడు కాని తరువాత మానుకున్నాడు" అని నాకు ఉపదేశించారు ప్రవక్త మహనీయులు(సఅసం). (బుఖారీ, ముస్లిం)

393. ఏ వ్యక్తి అల్లాహ్ సాన్నిధ్యాన్ని కోరుకుంటాడో అతడు ముందు ఆయన విధిగా నిర్ణయించిన వాటిని ఆచరించడానికి ప్రయత్నిస్తాడు, అంతేకాక, స్వచ్ఛందంగా దైవ ప్రేమచేత అదనపు నమాజులు, అదనపు రోజాలు, అదనపు దాన ధర్మాలు ఇంకా ఇతర సత్కర్మలు చేస్తూ ఉంటాడు. చివరికి అతడు అల్లాహ్ ప్రేమకు పాత్రుడవుతాడు. అంటే అల్లాహ్ అతని శక్తి సామర్థ్యాలన్నింటినీ తన రక్షణలోకి తీసుకుంటాడన్నమాట. ఇక అతని సర్వాంగాలు, సర్వశక్తులు కేవలం అల్లాహ్ ప్రసన్నత బడయటానికే అంకితమయిపోతాయి. షైతాన్ అతన్ని సమీపించజాలడు. అల్లాహ్ అతని అవయవాలు కావడమంటే, అతని ఆ అవయవాల ద్వారా అల్లాహ్‌కు ఇష్టమయిన పనులే తప్ప ఇతర పనులు కాజాలవు. అతని అవయవాలు అతన్ని ఎన్నటికీ పెడత్రోవన నడపవు అని భావం.

394. రాత్రి, మనిషికి ఎన్నో పరీక్షల్ని చిక్కుల్ని తెచ్చి పెడుతుంది. చీకటిలో చెడులు చెయ్యడానికి అనేక అవకాశాలు ఉత్పన్నమవుతాయి. దురాత్ములు దురాగతాలకు

٣٩٧ عَنْ مَسْرُوْقٍ قَالَ: سَأَلْتُ عَائِشَةَ أَيُّ الْعَمَلِ كَانَ أَحَبَّ إِلَى رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ؟ قَالَتْ: الدَّائِمُ. قُلْتُ: فَأَيَّ حِيْنٍ كَانَ يَقُوْمُ مِنَ اللَّيْلِ؟ قَالَتْ: كَانَ يَقُوْمُ إِذَا سَمِعَ الصَّارِخَ.

(بخاری - مسلم)

397. మస్రూక్ ఇలా తెలిపారు. 'నేను ఒకసారి హజ్రత్ ఆయిషా (రజి)ను మహాప్రవక్త (సఅసం)కు ప్రియప్రదమయిన పని ఏది?' అని అడిగాను "ఏ పనిని నిలకడగా నిరంతరం చేస్తారో అదీ మహాప్రవక్త (సఅసం)కు ఇష్టమయింది" అని సమాధానమిచ్చారామె. నేను తిరిగి అడిగాను. 'మహాప్రవక్త రాత్రుల్లో ఎప్పుడు మేల్కొనే వారు?' అని. ఆమె సమాధానమిచ్చారు, "తొలికోడి కూసేవేళ ఆయన మేల్కొనేవారు."

(బుఖారి, ముస్లిమ్)

---

పాల్పడటం అలా ఉంచి మంచివారు కూడా దారితప్పడానికి చీకటి దారి చూపుతుంది. ఇవన్నీ మనిషికి గడ్డు పరీక్షలు. వాటినుంచి తప్పించుకోవాలి. అలాగే రాత్రిలో దేవుని కారుణ్యానుగ్రహాలు కూడా అమితంగా వర్షిస్తాయి. ఆ ప్రశాంత వాతావరణంలో నిష్కల్మష హృదయంతో, దైవచింతనలో, దైవోపాసనలో నిమగ్నులయిన ఆత్మలే ఆ కారుణ్య మాధుర్యాన్ని గ్రోలగలుగుతాయి.

మహాప్రవక్త రాత్రి (తహజ్జుద్)ప్రార్థనకై మేల్కొనడానికి తన సతీమణుల్ని కూడా ప్రోత్సహించేవారని ఈ హదీసుద్వారా తెలుస్తోంది. దైవప్రవక్త అర్థాంగి అయి దేవుని కరుణానుగ్రహాల సౌరభాన్ని ఆఘ్రాణించలేకపోతే దేవుని వద్ద ఆమెకు ఉన్నత స్థానం ఎలా ప్రాప్తమవుతుంది? అక్కడ ప్రతి మనిషికి తాను చేసుకున్న సత్కర్మలే కదా ఉపయోగపడతాయి. ప్రవక్త సతీమణి అయినా, సంతానమయినా ఈ సంబంధం మాత్రమే అక్కడ ఉపకరించదు కదా!

395. హజ్రత్ అలీ (రజి) మహాప్రవక్త (సఅసం) అల్లుడు. హజ్రత్ ఫాతిమా ప్రవక్త కుమార్తె. ఈ హదీసు ద్వారా పెద్దవారు బాధ్యతాయుత స్థానంలో ఉండేవారు, తమ క్రిందివారిని తహజ్జుద్ నమాజ్ సలపడం గురించి, అదనపు ఆరాధనలు చెయ్యడం గురించి ప్రోత్సహించాలని తెలుస్తోంది. తన ఆత్మీయులు సయితం భక్తితత్పరతలో అగ్రగాములుగానే వుండాలన్న మహాప్రవక్త తపన కూడా ఈ హదీసు ద్వారా ద్యోతకమవుతోంది.

۳۹۸ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : يَنْزِلُ رَبُّنَا تَبَارَكَ وَتَعَالٰى كُلَّ لَيْلَةٍ إِلَى السَّمَاءِ الدُّنْيَا حِيْنَ يَبْقٰى ثُلُثُ اللَّيْلِ الْاٰخِرُ فَيَقُوْلُ: مَنْ يَّدْعُوْنِيْ فَأَسْتَجِيْبَ لَهٗ، مَنْ يَّسْئَلُنِيْ فَأُعْطِيَهٗ ! مَنْ يَّسْتَغْفِرُنِيْ فَأَغْفِرَ لَهٗ۔! (بخاری ۔مسلم۔ ابوھریرۃؓ)

398. మహాప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు: 'ప్రతి రోజు ఒక జాము రాత్రి ఉండగా అల్లాహ్ మనకు కనిపించే ఈ ఆకాశానికి వస్తాడు. తన దాసుల్ని పిలిచి "నన్ను పిలిచేదెవరు? నేను అతన్ని ఆదుకోవడానికి వెళతాను, నన్ను అర్థించేదెవరు? అతనికి ప్రసాదిస్తాను. నన్ను క్షమాపణ వేడుకునేదెవరు? నేనతన్ని క్షమిస్తాను" అని పిలుపునిస్తాడు'.

(బుఖారి, ముస్లిమ్ - అబూహురైరా)

## ఇన్ఫాక్ : దైవ మార్గంలో ఖర్చుచెయ్యడం

۳۹۹ عَنْ ثَوْبَانَ قَالَ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: أَفْضَلُ دِيْنَارٍ يُّنْفِقُهُ الرَّجُلُ دِيْنَارٌ يُّنْفِقُهٗ عَلٰى عِيَالِهٖ، وَدِيْنَارٌ يُّنْفِقُهٗ عَلٰى دَابَّتِهٖ فِيْ سَبِيْلِ اللّٰهِ، وَدِيْنَارٌ يُّنْفِقُهٗ عَلٰى أَصْحَابِهٖ فِيْ سَبِيْلِ اللّٰهِ۔

(مسلم)

399. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రబోధించారు: "మనిషి తన భార్యా పిల్లలపై ఖర్చు చేసే దీనారు ఉత్తమమయింది; మనిషి దైవమార్గంలో (ధర్మ వ్యాప్తికై కృషి చేసే నిమిత్తం) వాహన పశువును కొనడానికి ఖర్చు చేసే దీనారు ఉత్తమమయింది. మనిషి దైవ మార్గంలో శ్రమించే తన మిత్రులకై ఖర్చు చేసే దీనారు ఉత్తమమయింది." (ముస్లిమ్)

---

396. అదనపు (నఫిల్) ఆరాధనలు మనిషి విధేయతా భావాన్ని సూచిస్తాయి. ముందు అత్యధిక వినయంచూపి తరువాత ఆ విధేయతలో అలసత్వం చూపడం ఆధ్యాత్మికంగా మనిషిని నష్టపరిచే విషయం. చిన్నదయినా నిత్యం చేసే సత్కార్యానికి ఎంతో

٤٠٠ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ: جَاءَ رَجُلٌ إِلَى النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ: يَا رَسُولَ اللهِ، أَيُّ الصَّدَقَةِ أَعْظَمُ أَجْرًا؟ فَقَالَ: أَنْ تَصَدَّقَ وَأَنْتَ صَحِيحٌ تَخْشَى الْفَقْرَ وَتَأْمُلُ الْغِنَى، وَلَا تُمْهِلْ حَتَّى إِذَا بَلَغَتِ الْحُلْقُومَ قُلْتَ لِفُلَانٍ كَذَا وَلِفُلَانٍ كَذَا، وَقَدْ كَانَ لِفُلَانٍ -

(بخاري-مسلم)

**400.** ఒక వ్యక్తి మహాప్రవక్త సన్నిధిలో వచ్చి "దైవప్రవక్తా! పుణ్య ఫలం దృష్ట్యా, ఏ దానం అన్నిటికంటే ఉత్తమమయింది?' అని అడిగాడు. ఆయన ఇలా బోధించారు: "నీవు ఆరోగ్యంగా ఉండి, ఒక వైపు లేమి వచ్చి పడుతుందన్న భయమూ మరో వైపు కలిమి వరిస్తుందన్న ఆశ నిన్ను ఆవహించి ఉన్నప్పుడు దానం చేయడం అత్యుత్తమమయింది. జీవుడు కంఠంలో నుండి ఎగిరిపోయే ముందు 'ఇది ఫలానా వ్యక్తికి, అది ఫలానా వారికి' అని దానం ఇచ్చే పరిస్థితి వచ్చే వరకు నిరీక్షించకు. అప్పుడు అదంతా ఆ ఫలానా ఫలానా వారికి చెందేదే కదా!"

(బుఖారి, ముస్లిమ్- అబూ హురైరా)

---

ప్రాముఖ్యం ఉంది. నఫిల్ నమాజులయినా, రోజాలయినా, దాన ధర్మాలయినా కొంతయినా సరే వాటిలో నిత్యత, నిలకడవుండాలి.

397. మహాప్రవక్త (సఅసం) నిజమయిన అనుచరులకు నిత్యం ఆయన్ని అనుసరించే ధ్యాసే ఉండేది. ఆయన కుటుంబ సభ్యుల్ని, ఆయన సమీప సహచరుల్ని అడిగి ఆయన సంప్రదాయాలను, ఆచరణా వివరాలను తెలుసుకునేవారు. మస్రూక్ (రహ్మలై)"తాబయీ"లకు చెందినవారు. సహబా (రజిఅన్)తో కలిసి, వారి ద్వారా ధర్మబోధనలు విన్నవారిని తాబయీలని అంటారు. హజ్రత్ ఆయిషా (రజిఅన్) మహాప్రవక్త (సఅసం) సతీమణి. రాత్రుల్లో మేల్కొనడమంటే తహజ్జుద్ నమాజ్ కొరకు మేల్కొనడమన్నమాట, తొలి కోడికూసే వేళంటే రాత్రి చివరిభాగంలో అని అర్థం.

398. ఆ వేళ దేవుడు మనకు కనిపించే ఆకాశానికి వస్తాడంటే ప్రపంచ ప్రజలు దైవానికి చేరువయ్యే వేళ అదన్నమాట. ప్రశాంత వాతావరణంలో చడీచప్పుడులేని వేళ ఏకాగ్రతతో దీక్షతో దైవాన్ని ధ్యానించడం సాధ్యమవుతుంది. ఆ వేళన పరిశుద్ధ

٤٠١ عَنْ أَبِي هُرَيْرَةَ أَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ، مَا مِنْ يَوْمٍ يُصْبِحُ الْعِبَادُ فِيْهِ إِلَّا مَلَكَانِ يَنْزِلَانِ فَيَقُوْلُ أَحَدُهُمَا، اَللّٰهُمَّ أَعْطِ مُنْفِقًا خَلَفًا، وَيَقُوْلُ الْآخَرُ: اَللّٰهُمَّ أَعْطِ مُمْسِكًا تَلَفًا۔ (بخاری۔مسلم)

401. మహాప్రవక్త (సఅసం) ఇలా తెలిపారని హజ్రత్ అబూ హురైరా ఉల్లేఖించారు: "ఇద్దరు దైవ దూతలు దిగి, వారిలో ఒకతను 'దేవా! ఖర్చుచేసే వానికి దాని సత్ఫలితం ప్రదానం చెయ్యి' అని దీవిస్తారు. మరొకతను 'దేవా! పిసినారికి వినాశనాన్ని సమకూర్చు' అని శపిస్తాడు. ఇలా జరగనిదే ఏ రోజూ తెల్లవారదు." (బుఖారి, ముస్లిమ్)

٤٠٢ عَنْ أَبِي أُمَامَةَ قَالَ، قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: يَا ابْنَ آدَمَ، إِنَّكَ أَنْ تَبْذُلَ الْفَضْلَ خَيْرٌ لَّكَ، وَأَنْ تُمْسِكَهُ شَرٌّ لَّكَ وَلَا تُلَامُ عَلٰى كَفَافٍ وَابْدَأْ بِمَنْ تَعُوْلُ۔ (ترمذی)

402. మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు. "ఆదమ్ సుతుడా! నీవు నీ దగ్గరున్న అధిక ధనాన్ని దాన ధర్మాలలో ఖర్చు చేసి నట్లయితే అది నీకే మేలు కలుగజేస్తుంది. దాన్ని ఖర్చు చేయకపోయావంటే అది నీకు కీడును తెచ్చిపెడుతుంది. అయితే నీ వద్ద నీకు సరిపోయే సొమ్ము మాత్రమే ఉన్నట్లయితే నీపై ఆక్షేపణ లేదు - నీ సంబంధీకులతోనే దాన ధర్మాలు ప్రారంభించు." (తిర్మిజి)

---

హృదయంతో ఏకదీక్షగా ఆయన్ని ధ్యానిస్తే ఆయన కరుణానుగ్రహాలు తన దాసునిపై వర్షిస్తాయి. దాసుని కోరికలు ఈడేరే అవకాశం ఉంటుంది.

399. దీనార్ అన్నది అరేబియాలో వాడబడే నాణెంపేరు. ఈ హదీసులో మహాప్రవక్త (సఅసం) మూడు రకాల ఖర్చును ఉత్తమమైన ఖర్చులుగా పేర్కొన్నారు. ఒకటి భార్యాపిల్లల పోషణ శిక్షణలకై చేసేది, రెండోది దైవమార్గంలో కృషి చేసేందుకు వాహనం ఇంకా ఇతర పరికరాలు కొనుగోలుకై చేసేది. మూడోది దైవమార్గంలో కృషి చేసే మిత్రుల అవసరాలను తీర్చడానికి చేసేది. దైవమార్గంలో జరిగే కృషిలో

۴۰۳ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ، قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: قَالَ اللهُ تَعَالَىٰ: أَنْفِقْ أُنْفِقْ عَلَيْكَ - (بخاری۔مسلم)

403. అల్లాహ్ ఇలా సెలవిచ్చినట్లు మహనీయ ముహమ్మద్ (సఅసం) తెలిపారు: "నీవు దైవ మార్గంలో ధనం ఖర్చు చెయ్యి. నేను నీకై ధనం ఖర్చు చేస్తాను." (బుఖారి, ముస్లిమ్- అబూహురైరా)

۴۰۴ عَنْ أَبِي ذَرٍّ قَالَ انْتَهَيْتُ إِلَى النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ وَهُوَ جَالِسٌ فِي ظِلِّ الْكَعْبَةِ، فَلَمَّا رَآنِي قَالَ: هُمُ الْأَخْسَرُونَ، فَقُلْتُ: فِدَاكَ أَبِي وَأُمِّي، مَنْ هُمْ؟ قَالَ: هُمُ الْأَكْثَرُونَ أَمْوَالاً إِلَّا مَنْ قَالَ: هٰكَذَا وَهٰكَذَا وَهٰكَذَا مِنْ بَيْنِ يَدَيْهِ وَمِنْ خَلْفِهِ وَعَنْ شِمَالِهِ وَ قَلِيلٌ مَّا هُمْ - (بخاری۔مسلم)

404. హజ్రత్ అబూజర్ గిఫారీ ఇలా ఉల్లేఖించారు: "నేనొకసారి మహా ప్రవక్త (సఅసం) వద్దకువెళ్లాను. ఆయన అప్పుడు కాబాఛాయల్లో కూర్చుని ఉన్నారు. ఆయన నన్నుచూడగానే "వారంతా సర్వనాశన మయిపోయారు" అన్నారు. నేను ఆతృతగా 'నాతల్లిదండ్రుల్ని మీకై అర్పిస్తా, ఏవరు వారు' అని అడిగాను. దానికి ఆయన "శ్రీమంతులై నప్పటికీ ధనం ఖర్చు చేయనివారే సర్వనాశనమయ్యేవారు. తమ ధనాన్ని నిస్సంకోచంగా ఖర్చు చేసేవారే సాఫల్యం పొందేవారు. తమ ముందువున్న వారికి, వెనక నున్న వారికి, ప్రక్కనున్న వారికి ఇచ్చేవారు. ఇలా ఖర్చుచేసే ధనవంతులు చాలా అరుదు." (బుఖారి, ముస్లిమ్)

---

నిమగ్నులయి ఉన్నవారు తమ కనీస అవసరాలకొరకు వేరుగా శ్రమించలేరు. గనుక వారి అవసరాలకై ఖర్చు చెయ్యడం కూడా దైవమార్గంలో ఖర్చు చెయ్యడంతో సమానం అని తెలుస్తోంది.

# సంస్మరణ, ప్రార్థన

۴۰۵ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ، قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ:
إِنَّ اللهَ تَعَالَى يَقُولُ: أَنَا مَعَ عَبْدِي إِذَا ذَكَرَنِي وَتَحَرَّكَتْ بِي شَفَتَاهُ -
(بخاری)

405. "నా దాసుడు నన్ను స్మరించినప్పుడు, నా సంస్మరణకై అతని పెదాలు కదలినప్పుడు నేను అతని చెంతనే ఉంటాను" అని అల్లాహ్ సెలవిచ్చినట్లు మహనీయ ముహమ్మద్ (సఅసం) తెలిపారు.

(బుఖారి - అబూహురైరా)

۴۰۶ عَنْ أَبِي مُوسَى قَالَ، قَالَ رَسُولُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ:
مَثَلُ الَّذِي يَذْكُرُ رَبَّهُ وَالَّذِي لَا يَذْكُرُ مَثَلُ الْحَيِّ وَالْمَيِّتِ-(بخاری-مسلم)

406. మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు. "తన ప్రభువు ధ్యానంలో ఏకాగ్రత కలిగి సంస్మరించే వ్యక్తి సజీవుడయిన వ్యక్తిని పోలి వుండగా, విస్మరించిన వ్యక్తి మృత కళేబరాన్ని పోలివున్నాడు."

(బుఖారి, ముస్లిం - అబూ మూసా)

---

400. మనిషి ఆరోగ్యంగా సంపాదనాపరుడుగా ఉన్నప్పుడు దానంచేస్తే ఉన్న ఆస్తి హరించుకుపోతుందన్న భయానికయినా లోనవుతాడు లేదా దానంచేసే డబ్బు ఉంటే తద్వారా తన రాబడి పెరుగుతుందని అత్యాశకయినా గురవుతాడు. ఆ ఉపద్రవాన్ని గురించే మహాప్రవక్త (సఅసం) హెచ్చరించారు. సాధారణంగా చివరిదశలో దానధర్మాలు చెయ్యాలన్న బుద్ధిపుట్టడాన్ని ఇందులో నిరసించారు. మనిషి ఆస్తి అతని తరువాత యెలాగూ పరులపాలయ్యేదే. అది తనదిగా ఉన్నప్పుడు చేసేదే నిజమయిన దానం అని మహాప్రవక్త ప్రవచనానికి భావం.

٤٠٧ عَنْ سَعْدِ بْنِ أَبِي وَقَّاصٍ قَالَ : جَاءَ أَعْرَابِيٌّ إِلَى رَسُولِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، فَقَالَ : عَلِّمْنِي كَلَامًا أَقُوْلُهُ، قَالَ : قُلْ لَآ إِلٰهَ إِلَّا اللّٰهُ وَحْدَهُ لَا شَرِيْكَ لَهُ، اَللّٰهُ أَكْبَرُ كَبِيْرًا وَالْحَمْدُ لِلّٰهِ كَثِيْرًا وَّسُبْحٰنَ اللّٰهِ رَبِّ الْعٰلَمِيْنَ، لَا حَوْلَ وَلَا قُوَّةَ إِلَّا بِاللّٰهِ الْعَزِيْزِ الْحَكِيْمِ، فَقَالَ: هٰؤُلَاءِ لِرَبِّيْ فَمَا لِيْ؟ فَقَالَ : قُلْ اَللّٰهُمَّ اغْفِرْ لِيْ وَارْحَمْنِيْ وَاهْدِنِيْ وَارْزُقْنِيْ۔

(مُسلم)

407. సఅద్ బిన్ అబీ వక్కాస్ ఇలా ఉల్లేఖించారు: ఒక పల్లెటూరి వ్యక్తి మహాప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి, "నేను నిత్యం పఠించుకోవడానికి ఏదైనా సద్వచనం నేర్పండి" అని అర్థించాడు. దానికి ఆయన, "లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ, లా షరీకలహూ, అల్లాహు అక్బర్ కబీరా, వల్ హమ్దు లిల్లాహి కసీరా, వ సుబ్‌హానల్లాహి రబ్బిల్ ఆలమీన్, లా హౌల వలా కువ్వత ఇల్లా బిల్లాహిల్ అజీజుల్ హకీమ్ - అని ధ్యానించు" అని ఉపదేశించారు. ఇది విని అతడు తిరిగి అడిగాడు "అల్లాహ్‌కు సంబంధించినంత వరకు ఇది సరే, ఇక నేనేమి అర్థించాలి ?" "నీవు, అల్లాహుమ్మగ్ ఫిర్ లీ, వర్ హమ్‌నీ, వహ్‌దినీ, వర్ జుక్ నీ-అని అర్థించు" అని ఉపదేశించారు.

(ముస్లిమ్)

---

401. దైవదూతలు దీవించడం అంటే అది దైవానికి ఇష్టమయిన పనయి ఉంటుంది. శపించడమంటే ఆ పని దైవానికి ఇష్టం కానిదయి ఉంటుంది అన్న విషయం స్పష్టంగా తెలుస్తూనే ఉంది. ఖర్చు చెయ్యడమంటే, మంచి మార్గంలో అన్న భావమని వేరే చెప్పనవసరంలేదు. దైవదూతలు ప్రతిరోజూ ఇలా అభీష్టాన్ని తెలుపుతూ ఉంటారంటే నిజమైన దైవ విశ్వాసి ఎలాగయినాసరే దైవదూతల దీవెనలు పొందడానికే ప్రయత్నించాలని ఈ ఉపదేశానికి భావం.

402. అధిక ధనమంటే అవసరాలకుపోగా మిగులు ధనం అని అర్థం. సంబంధీకులు అంటే తన పోషణలో సంరక్షణలో ఉన్నవారన్నమాట. ఆప్తులు ఆత్మీయుల్ని ముందు ఆదుకొని తరువాత ఇతరుల సహాయార్థం ధనం వెచ్చించాలన్నమాట. తనవారే లేమికి లోనయి, ధన సహాయానికి అర్హులయి ఉండగా బయటి వారికి

٤٠٨ عَنْ شَدَّادِ بْنِ أَوْسٍ قَالَ، قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: سَيِّدُ الْإِسْتِغْفَارِ أَنْ تَقُوْلَ: اَللّٰهُمَّ أَنْتَ رَبِّيْ لَا إِلٰهَ إِلَّا أَنْتَ خَلَقْتَنِيْ، وَأَنَا عَبْدُكَ وَأَنَا عَلٰى عَهْدِكَ وَوَعْدِكَ مَا اسْتَطَعْتُ - أَعُوْذُبِكَ مِنْ شَرِّ مَا صَنَعْتُ، أَبُوْءُ لَكَ بِنِعْمَتِكَ عَلَيَّ، وَأَبُوْءُ بِذَنْبِيْ فَاغْفِرْ لِيْ فَإِنَّهٗ لَا يَغْفِرُ الذُّنُوْبَ إِلَّا أَنْتَ - (بخاری)

408. మహాప్రవక్త (సఅసం) ఇలా ఉపదేశించారు: "అత్యుత్త మమయిన క్షమార్పణకై ఇలా వేడుకోవాలి: అల్లాహుమ్మ! అన్త రబ్బీ,లా ఇలాహ ఇల్లా అన్త, ఖలక్ తనీ, వఅనా అబ్ దుక,వ అనా అలా అహ్దిక, వవ'దిక మస్తత'తు, అఊజుబిక మిన్ షర్రిమా సనతు అబూఉలక బినీ'మతిక అలయ్య, వ అబూఉ బిజంబీ, ఫగ్ఫిర్ లీఫఇన్నహూ లాయగ్ ఫిరుజ్జునూబ ఇల్లాఅన్త."
(బుఖారి - షద్దాద్ బిన్ ఔస్)

---

మాత్రమే దాన ధర్మాలు చేయడం సమంజసమూ కాదు ఉచితమూ కాదు - అందుకే ధర్మసమ్మతం కూడా కాదు.

403. దైవ మార్గంలో అంటే బీదసాదలకు, అర్హులకు, అనాధలకు, ఉపేక్షిత ప్రజలకు, ఇంకా ధార్మిక పురోభివృద్ధికై ఖర్చు చేయడం అని అర్థం. ఈ పద్ధుల్లో ఖర్చు చేసేవాని ధనం వ్యర్థం కాదు. దాని ప్రతిఫలం పరలోకంలోనూ ప్రాప్తమవుతుంది, ఇహలోకంలోనూ అతని సంపదలో దైవికంగా శుభప్రదమైన వృద్ధి కలుగుతుంది. దైవం మనిషికై ధనం ఖర్చుచెయ్యడమంటే అర్థం ఇదే.

404. వెనుకనున్నవారు, ముందున్న వారు, ప్రక్కనున్న వారంటే ఎలాంటి పక్షపాతం లేకుండా వివక్షత చూపకుండా అగత్యపరులైన వారందరికీ సహాయం చెయ్యడం అన్నమాట.

ధనముండీ ఖర్చు చెయ్యకపోవడమంటే దైవం తమకు ప్రసాదించిన సిరిలో ఉన్న ఉపేక్షితుల భాగాన్ని వారికి అప్పజెప్పక పోవడమన్నమాట. అలా నిధినాగులై కూర్చున్నవారు దైవాగ్రహానికి గురయి సర్వనాశనమవడంలో సందేహమేముంది?

405. "అతని చెంతనే ఉంటాను" అంటే అతన్ని దైవం తన పరిరక్షణలో తీసుకున్నాడని అర్థం. ఈ హదీసు ద్వారా తేలే మరో విషయమేమంటే దైవ ధ్యానం అన్నది మానసిక ఏకాగ్రతతో మాత్రమే కాక నోటితోనూ జరగాలి. ప్రతి విషయంలో దైవ

٣٠٩ عَنْ أَبِي هُرَيْرَةَ ...... ثُمَّ يَقُوْلُ بِاسْمِكَ رَبِّي وَضَعْتُ جَنْبِي وَبِكَ أَرْفَعُهُ، أَنْ أَمْسَكْتَ نَفْسِي فَارْحَمْهَا وَإِنْ أَرْسَلْتَهَا فَاحْفَظْهَا بِمَا تَحْفَظُ بِهِ عِبَادَكَ الصّٰلِحِيْنَ- (بخاری)

409. హజ్రత్ అబూ హురైరా (ర.అ) ఉల్లేఖనం, 'మహాప్రవక్త (సఅసం) పడుకునేటప్పుడు తన కుడిచేయిని చెంపక్రింద పెట్టుకునే వారు. అప్పుడు ఇలా ప్రార్థించుకునేవారుః "బి ఇస్మిక రబ్బీవజ'తు జన్బీ వ బిక అర్ ఫహూ ఉఇన్ అమ్‌సక్త నఫ్సీ ఫర్ హమ్‌హా, వ ఇన్ అర్స ల్తహా, ఫజ్ హా ఫహ్-బిమా తహ్‌ఫజు బిహీ ఇబాదక స్సాలిహీన్" (బుఖారి)

---

సంస్మరణను ముఖ్యాంశంగా పాటించే విశ్వాసికి దైవం నిత్య సన్నిహితుడని విదితమవుతోంది.

406. దైవ ధ్యానం ఆంతర్యానికి జీవం లాంటిది. దైవాన్ని విస్మరిస్తే మనస్సును మృత్యువు ఆక్రమించుకుంటుంది. మానవ శరీరానికి ఆహారం అవసరమయినట్లే ఆత్మకు కావలసిన ఆహారం దైవధ్యానం. ఈ ఆహారం లభించకపోతే ఆత్మ నశించిందన్న మాటే – ఆ మనిషి శారీరకంగా ఎంత ఆరోగ్యవంతుడయినా అది అంతే!

407. మొదట నేర్పిన సద్వచనానికి అర్థంః "అల్లాహ్ తప్ప వేరే దైవం లేనేలేడు. ఆయన కేవలం ఒక్కడే. దైవత్వంలో ఆయనకు సహవర్తులు ఎవ్వరూ లేరు. అల్లాహ్ ఎంతో గొప్పవాడు. స్తోత్రములు, అభివందనాలు ఆయనకే. అల్లాహ్ సకల విధాల లోటుపాట్లకు, లోపాలకు అతీతుడు, పరిశుద్ధుడు, సర్వలోకాల ప్రభువు, పోషకుడు, అల్లాహ్ తప్ప ఇతరులెవ్వరి వద్ద కూడా ఎలాంటి శక్తి సామర్థ్యాలు లేవు. ఆయన సర్వాధిపత్యం కలవాడు, వివేకమూ విజ్ఞానమూ కలవాడు."

తదుపరి నేర్పిన సద్వచనానికి అర్థం : "అల్లాహ్ ! నా అపరాధాలను మన్నించు, నాపై నీ కారుణ్యాన్ని కురిపించు, నన్ను సన్మార్గంపై నడిపించు, నాకు నా ఉపాధిని ప్రసాదించు."

408. మహాప్రవక్త ఉపదేశించిన వేడుకోలుకు అర్థం – "అల్లాహ్! నీవే నా ప్రభువు, నీవు తప్ప మరే దైవం లేడు. నీవే నన్ను సృష్టించావు, నేను నీ దాసుణ్ణి. నేను నీతో చేసిన (దాస్య) ప్రమాణాన్ని, వాగ్దానాన్ని నా శక్తి మేరకు నిలబెట్టుకుంటాను. నేను చేసుకున్న తప్పులవల్ల కలిగే దుష్పరిణామాల నుండి రక్షణ కొరకు నీ శరణు

٤١٠ عَنْ أَبِي بَكْرَةَ قَالَ، قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: دَعْوَةُ الْمَكْرُوْبِ: اَللّٰهُمَّ رَحْمَتَكَ اَرْجُوْ فَلَا تَكِلْنِيْ إِلٰى نَفْسِيْ طَرْفَةَ عَيْنٍ، وَأَصْلِحْ لِيْ شَأْنِيْ كُلَّهُ، لَا إِلٰهَ إِلَّا أَنْتَ - (ابوداؤد)

410. కలత చెందిన మనసు అర్థించవలసిన వేడుకోలు మహాప్రవక్త (సఅసం) బోధించారని హజ్రత్ అబూబక్ర్ (రజిఅన్) ఉల్లేఖించారు : "అల్లాహుమ్మ రహ్మతక అర్జూ ఫలాతకిల్నీ ఇలానఫ్సీ తర్ ఫత అయినిన్ వ అస్లహ్‌లీషా' నికుల్లహు లా ఇలాహ ఇల్లా అన్త" (అబూదావూద్)

٤١١ عَنْ أَنَسٍ، كَانَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَقُوْلُ: اَللّٰهُمَّ إِنِّيْ أَعُوْذُبِكَ مِنَ الْهَمِّ وَالْحُزْنِ وَالْعَجْزِ وَالْكَسْلِ وَضَلَعِ الدَّيْنِ وَ غَلَبَةِ الرِّجَالِ- (بخاري-مسلم)

411. మహాప్రవక్త ఇలా వేడుకునేవారని హజ్రత్ అనస్ ఉల్లేఖిం చారు: "అల్లాహుమ్మ ! ఇన్నీ అఊజు బిక మినల్ హమ్మి వల్ హుజ్ని, వల్ అజ్ జి వల్ కస్‌లీ వ జలయిద్దయిని వ గలబతి ర్రిజాల్." (బుఖారి, ముస్లిమ్)

---

కోరుతున్నాను. నీవు నాకు చేసిన ఉపకారాలను నేను ఒప్పుకొంటున్నాను. నేను చేసిన అపచారాలనూ ఒప్పుకుంటున్నాను. నా అపరాధాలను మన్నించు ప్రభూ ! పాపాలను మన్నించేవాడు నీవు తప్ప నాకు మరెవరున్నారు?"

409. మహాప్రవక్త చేసే దుఆకు అర్థం : "నా ప్రభూ ! నీ పేరు చెప్పి నేను పడకపై మేను వాల్చాను. నీ ఆధారంతోటే మళ్ళీ అది లేస్తుంది; ఒకవేళ నీవు నా ప్రాణాల్ని (ఇలాగే) పట్టు కెళ్ళేటట్లయితే దానిపై కరుణించు, వదిలి పెట్టేటట్లయితే రక్షించు - ఏ విధంగానయితే నీవు సత్పురుషులయిన నీ దాసుల్ని రక్షిస్తావో ఆ విధంగా."

410. మహాప్రవక్త నేర్పిన దుఆకు అర్థం "అల్లాహ్! నీ కారుణ్యాన్ని అర్థిస్తున్నాను. నీవు ఒక్క క్షణానికయినా నన్ను నా మనస్సుకు అధీనంగా చెయ్యకు.నా వ్యవహారాలన్నింటినీ పరిష్కరించు. నీవుతప్ప నాకు దైవం ఎవరు?" మనిషి అల్లాహ్ రక్షణలో ఉన్నంతవరకు అతని మనోకాంక్షలు అతన్ని జయించలేవు. అతనిచేత పాపకార్యాలు చేయించలేవు.

۴۱۲ اَللّٰھُمَّ اٰتِ نَفْسِیْ تَقْوٰھَا وَزَکِّھَا أَنْتَ خَیْرُ مَنْ زَکّٰھَا، أَنْتَ وَلِیُّھَا وَمَوْلَاھَا، اَللّٰھُمَّ إِنِّیْ أَعُوْذُبِكَ مِنْ عِلْمٍ لَّا یَنْفَعُ، وَمِنْ قَلْبٍ لَّا یَخْشَعُ، وَمِنْ نَّفْسٍ لَّا تَشْبَعُ، وَمِنْ دَعْوَۃٍ لَّا یُسْتَجَابُ لَھَا۔(مسلم۔ زید بن ارقمؓ)

412. మహాప్రవక్త ఇలా వేడుకునే వారు, "అల్లాహ్! నా హృద యాన్ని నీపట్ల భయభక్తులతో నింపి దాన్ని పరిశుద్ధపరచు. అత్యుత్తమ పరిశుద్ధకుడివి నీవే! నా హృదయ సీమకు సంరక్షకుడివి, స్వామివి నీవే! ప్రభూ! నీ శరణం అర్థిస్తున్నాను-నిరుపయోగమయిన విజ్ఞానాన్నుండి, వినమ్రత లేని హృదయాన్నుండి, తుష్టిలేని మనసునుండి, బదులు రాని ప్రార్థనల నుండి నన్ను కాపాడు ప్రభూ." (ముస్లిం - జైద్ బిన్ అర్ఖం)

۴۱۳ کَانَ مِنْ دُعَاءِ رَسُوْلِ اللّٰہِ صَلَّی اللّٰہُ عَلَیْہِ وَسَلَّمَ: اَللّٰھُمَّ إِنِّیْ أَعُوْذُبِكَ مِنْ زَوَالِ نِعْمَتِكَ وَتَحَوُّلِ عَافِیَتِكَ وَفُجَاءَۃِ نِقْمَتِكَ وَجَمِیْعِ سَخَطِكَ۔ (مسلم۔ عبد اللہ بن عمرؓ)

413. మహాప్రవక్త (సఅసం) వేడుకునే ప్రార్థనల్లో ఒకటి; "అల్లాహ్! నేను నీ శరణు కోరుతున్నాను. నీవు ప్రసాదించిన వరాలు నా నుండి దోచుకోవడం జరక్కుండా, నాకు ప్రాప్తమయిన రక్షణ నేను కోల్పోకుండా, నీ ఆగ్రహం నాపై కలగకుండా, నీవు నా ఎడల అప్రసన్నుడవు కాకుండా నన్ను కాపాడు." (ముస్లిమ్ - అబ్దుల్లా బిన్ ఉమర్)

---

కాని అల్లాహ్ రక్షణకు మనిషి దూరమవగానే మనస్సు అధీనం తప్పుతుంది. అతనిచేత పెడదోవలు తొక్కిస్తుంది. అందుకే విశ్వాసి నిత్యం తాను, మనస్సు అధీనంలోకి పోకుండా మనస్సు తన ప్రభువు చూపిన మార్గదర్శకత్వానికి అధీనమయి వుండేలా చూడమని, రక్షించమని అల్లాహ్‌ను వేడుకుంటూ ఉండాలి.

411. వేడుకోలుకు అర్థం: "అల్లాహ్ ! నేను నీ శరణు వేడుకుంటున్నాను - కలతల నుండి, దుఃఖాల నుండి, తలవంపుల నుండి, సోమరితనం నుండి, అప్పులబారి నుండి, మనుషుల ఆధిక్యత నుండి (నన్ను) రక్షించు." ఈ హదీసులో ప్రయోగించిన కొన్ని పదాల అర్థం తెలుసుకోవడం అవసరం. రాబోయే కష్టం కారణంగా ఏర్పడే

٤١٤ عَنْ أَبِي مَالِكٍ الْأَشْجَعِيِّ عَنْ أَبِيهِ قَالَ: كَانَ الرَّجُلُ إِذَا أَسْلَمَ عَلَّمَهُ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ الصَّلٰوةَ ثُمَّ أَمَرَهُ أَنْ يَدْعُوَ بِهٰؤُلَاءِ الْكَلِمَاتِ: اَللّٰهُمَّ اغْفِرْ لِي وَارْحَمْنِي وَاهْدِنِي وَعَافِنِي وَارْزُقْنِي۔ (مُسْلِم)

414. తన తండ్రి ఇలాతెలిపారని అబూ మాలిక్ ఉల్లేఖించారు: 'ఒకవ్యక్తి ఇస్లామ్ ధర్మాన్ని స్వీకరించగానే మహాప్రవక్త అతనికి నమాజ్ చేయడం నేర్పేవారు. ఆ తరువాత ఈ విధంగా ప్రార్థించుకో అని బోధించేవారు. "నా స్వామీ! నా అపరాధాలను మన్నించు, నాపై కరుణించు, నన్ను ఋజుమార్గంపై నడిపించు, నాకు ఆరోగ్యాన్ని, ఉపాధిని ప్రసాదించు." (ముస్లిమ్)

---

ఆందోళనకు "హమ్మ్" అనంటారు. కష్టం కలిగిన తరువాత ఏర్పడే బాధకు "హుజ్న్" అని అంటారు. "ఆజ్జ్" అన్న పదానికి అశక్తత అని, అవివేకం అని కూడా అర్థం. కస్ల్ అని అంటే అలసత్వం. మనిషి, ఇదయితే చాలా తేలికయిన పని, రాత్రి చేసుకుందాము అని అనుకుంటాడు. కాని రేయి దాటిపోతుంది, అతను దాన్ని చెయ్యలేడు. అప్పుడు, సరే రేపు చేసుకుందామని భావిస్తాడు. కాని అసలు అవకాశాన్ని జారవిడుచుకొని బాధల పాలవుతాడు.

దైవ రక్షణని అర్థించడమంటే మనిషి దైవం సమక్షంలో తన బలహీనతను, నిరుపాయతను గుర్తించాడనీ, అందుకే ఆ కొరతల వల్ల కలిగే నష్టాల నుండి రక్షణకై శక్తిశాలి అయిన ప్రభువు శరణు కోరుకుంటున్నాడని భావం.

412. ఉపయోగకరమైన విజ్ఞానమే మనిషికి భయభక్తుల్ని నేర్పుతుంది. సత్కార్యాలకై పురికొల్పుతుంది. మనిషిని ఇహపరాలలో దైవ కారుణ్యానికి పాత్రుణ్ణి చేస్తుంది.

మనసుకు తుష్టిలేక పోవడమంటే, ప్రాపంచిక ధనసామాగ్రి ఎంత సమకూరినా మనిషి తృప్తిపడక అతని ధనపిపాస అధికమవుతూ వుండటం అన్నమాట. దాన్నుండి రక్షణకోరడమంటే మనిషి ఏ దశలోనయినా తనకు ఉన్నదానికి తుష్టికలిగి మెలగడమన్నమాట.

ప్రార్థనలు ఆలకించబడకపోవడానికి కారణాలు ఎన్నో వున్నాయి. అధర్మ సంపాదన కూడా అందులో ఒకటి. తనకు హక్కులేని, తాను అర్హుడుకాని సంపదను మనిషి

٤١٥ عَنْ مُعَاذٍ أَنَّ رَسُوْلَ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ أَخَذَ بِيَدِهٖ وَقَالَ: يَا مُعَاذُ، وَاللّٰهِ، إِنِّيْ لَأُحِبُّكَ، ثُمَّ قَالَ: أُوْصِيْكَ يَا مُعَاذُ، لَا تَدَعَنَّ فِيْ دُبُرِ كُلِّ صَلٰوةٍ تَقُوْلُ: "اَللّٰهُمَّ أَعِنِّيْ عَلٰى ذِكْرِكَ وَشُكْرِكَ وَحُسْنِ عِبَادَتِكَ." (رياض الصالحين - ابوداؤد - نسائی)

415. హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ ఇలా అన్నారుః 'మహాప్రవక్త (సఅసం) నా చేతిని పట్టుకుని, "ముఆజ్! నీవంటే నాకు ఎంతో ప్రేమ" అని పలికారు. తర్వాత "ప్రతి నమాజ్ తర్వాత ఈ దుఆ చేయాలి, దాన్ని మరవవద్దు - 'నా దేవా! సంస్మరణ విషయంలో, కృతజ్ఞత విషయంలో సదారాధన విషయంలో నాకు సహాయం చెయ్యి' అని ఉపదేశించారు." (రియాజుస్సాలిహీన్, అబూదావూద్, నసాయి)

---

ఆర్జించడంవల్ల అతని మొర దైవసన్నిధిలో ఆలకించబడే అర్హతను కోల్పోతుంది. మొర ఆలకించబడాలంటే సంతృప్త, సంతుష్ట హృదయంతో జీవించడం మనోవాంఛలను తీర్చడానికి అక్రమ సంపాదనలకు ప్రాకులాడకుండా పరిశుద్ధమయిన మనుగడ గడపడం అవసరం.

413. "రక్షణ" అంటే ఆధ్యాత్మిక స్వస్థత, శారీరక ఆరోగ్యం రెండూ ఇందులో ఇమిడి వున్నాయి.

414. అసలు దుఆ ఇదిః "అల్లాహుమ్మగ్ఫిర్లీ, వర్హమ్నీ, వహ్దినీ, వ ఆఫినీ, వర్జుక్నీ." ఈ దుఆలో మనిషి ఇహపరాల్లో కోరుకునే విషయాలన్నీ సమగ్రంగా ఉన్నాయి. చైతన్యవంతంగా దుఆ చేసేవారు ఆ విషయాలకై సక్రమమయిన కృషి కూడా చెయ్యాలి. అప్పుడే దుఆ ఫలప్రదమవుతుంది.

415. మహాప్రవక్త (సఅసం) హజ్రత్ ముఆజ్ (రజి) చెయ్యిపట్టుకొని నేను నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పి ఆ తర్వాత ఆయన ఉపదేశించారు. ప్రేమించే వ్యక్తికి విలువైనదాన్నే తెలుపుతాడు మనిషి. ఆ విధంగా తన బోధన తన సహచరుని హృదయంలో హత్తుకుని పోతుందన్నదే ఆయన ఉద్దేశం.

ఆ ఉపదేశంలో దాసుడు తన ప్రభువుతో "నాకు జీవనరంగాలన్నిటిలో నిన్ను స్మరించాలని, నీకు కృతజ్ఞుణ్ణిగా ఉండాలనీ ఉత్తమోత్తమమయిన రీతిలో నిన్ను ఆరాధించాలని వుంది. కాని నేను బలహీనుణ్ణి, నీవే నాకు ఆధారం, నీ సహాయం లేనిదే ఈ పనులు కాజాలవు" అని వేడుకోవాలని బోధించడం జరిగింది.

۴۱۶ إِنَّ رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ كَانَ يَقُوْلُ فِيْ دُبُرِ كُلِّ صَلٰوةٍ مَكْتُوْبَةٍ إِذَا سَلَّمَ : لَا إِلٰهَ إِلَّا اللهُ وَحْدَهُ لَا شَرِيْكَ لَهُ ، لَهُ الْمُلْكُ وَلَهُ الْحَمْدُ وَهُوَ عَلٰى كُلِّ شَيْءٍ قَدِيْرٌ - اَللّٰهُمَّ لَا مَانِعَ لِمَا اَعْطَيْتَ وَلَا مُعْطِيَ لِمَا مَنَعْتَ ، وَلَا يَنْفَعُ ذَا الْجَدِّ مِنْكَ الْجَدُّ - (بخاری)

416. మహాప్రవక్త (సఅసం) ఫర్జ్ నమాజులు ముగించి సలామ్ పలికిన తరువాత నిత్యం ఇలా ప్రార్థించేవారు: "లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లా షరీకలహూ లహుల్ ముల్కు వ లహుల్ హమ్దు. వహువ అలాకుల్లి షయ్యిన్ కదీర్, అల్లాహుమ్మ లా మానిఅ లిమాఆతయ్‌త. వలా మూ'తి లిమా మన'త. వలా యన్ ఫఉజల్ జద్ది మిన్కల్ జద్దు."

(బుఖారి, ముస్లిమ్)

---

416. అల్లాహ్ తప్ప ఇతర దైవం లేడు. ఆయన ఒక్కడే, ఆయనకు తోడు ఎవ్వరూ లేరు. అధికారం, ఆధిపత్యం అంతా ఆయన కైవసమయి ఉంది. సకల స్తోత్రాలు ఆయనకే ! కృతజ్ఞతాభివందనాలు ఆయనకే! ఆయన సమస్త వస్తువులపై సకల చర్యలపై శక్తి, అధికారం కలవాడు. అల్లాహ్ ! నీవు అనుగ్రహించదలిస్తే దాన్ని ఆపే శక్తి ఎవ్వరికీ లేదు. నీవు కాదంటే దాన్ని ఇచ్చే శక్తి ఎవ్వరికీ లేదు. నీ సమక్షంలో ఏ అధికారం కలవాని అధికారమూ ఉపకరించదు."

దీనికి అర్థం : మహాప్రవక్త (సఅసం) నేర్పిన అనేక దుఆల మాదిరిగానే ఇది నిజానికి మానవునికి ఓ బోధలాంటిది. దేవుని ఏకత్వమే ఇస్లామ్ మౌలిక విశ్వాసం గనక ఆ భావన విభిన్న రూపాల్లో మనిషిముందు రావాలన్నది మహాప్రవక్త (సఅసం) ఆకాంక్ష. ఆ భావన అసలు ఎన్నటికీ చెరిగి పోకుండా సదా విశ్వసించిన వాని ఆంతర్యాన నిలవాలంటే ప్రతి దుఆ, ప్రతి వేడుకోలులో దాని అంశం ఉండటం ఎంతో ప్రముఖంగా ఉపకరిస్తుంది.

# మహాప్రవక్త జీవితంలో శిక్షణాంశాలు

## ఆరాధనలు

٤١٧ عَنْ جَابِرِ بْنِ سَمُرَةَ قَالَ: كُنْتُ أُصَلِّيْ مَعَ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَكَانَتْ صَلٰوتُهُ قَصْدًا وَّخُطْبَتُهُ قَصْدًا - (مسلم)

**417.** హజ్రత్ జాబిర్ బిన్ సమురా ఇలా ఉల్లేఖించారు, "నేను మహాప్రవక్త (సఅసం)తో నమాజ్ చేసేవాడిని. ఆయన నమాజ్ కూడా మధ్యస్థంగా ఉండేది. ఆయన ప్రసంగం కూడా మధ్యస్థంగానే ఉండేది."

(ముస్లిమ్)

٤١٨ قَالَ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ: إِنِّيْ لَأَقُوْمُ إِلَى الصَّلٰوةِ وَأُرِيْدُ أَنْ أُطَوِّلَ فِيْهَا فَأَسْمَعُ بُكَاءَ الصَّبِيِّ فَأَتَجَوَّزُ فِيْ صَلٰوتِيْ كَرَاهِيَةَ أَنْ أَشُقَّ عَلٰى أُمِّهٖ - (بخاری - ابوقتادہؓ)

**418.** మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు: "నేను నమాజ్ కొరకు నిలబడి సుదీర్ఘమయిన ప్రార్థనచేయాలని తలుస్తాను. కాని, ఏదో పిల్లవాని ఏడుపు వినిపించగానే దాన్ని క్లుప్తంగా ముగిస్తాను. ఎందువల్ల నంటే నమాజ్‌ను సుదీర్ఘం చేసి పిల్లతల్లిని చిక్కుల్లో పడవేయటం నాకు నచ్చదు."

(బుఖారి - అబూకతాదా)

---

417. 'మధ్యస్థంగా, అంటే అంత దీర్ఘమయినదీ కాదు, మరీ క్లుప్తమయినదీ కాదు అని భావం. మహాప్రవక్త (సఅసం) తన జీవితంలో ప్రతి విషయంలోనూ మధ్యస్థమార్గాన్నే అవలంబించారు. తన అనుయాయుల్ని కూడా ఆ మార్గాన్నే అవలంబించమని బోధించారు.

418. ఇక్కడ ప్రస్తావించబడిన నమాజ్ మస్జిదుల్లో జరిగే సామూహిక నమాజ్ అని తెలుసుకోవడం ముఖ్యం. మహాప్రవక్త (సఅసం) కాలంలో మహిళలు కూడా మస్జిదులకు వచ్చేవారు. సామూహిక ప్రార్థనలు చేసేవారు. వారిలో పిల్లలుగల తల్లులు కూడా

۴۱۹ عَنْ زِيَادٍ قَالَ : سَمِعْتُ الْمُغِيْرَةَ رَضِيَ اللّٰهُ عَنْهُ يَقُوْلُ: إِنْ كَانَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ لَيَقُوْمُ لِيُصَلِّيَ حَتّٰى تَرِمَ قَدَمَاهُ أَوْسَاقَاهُ فَيُقَالُ لَهُ، فَيَقُوْلُ: أَفَلَا أَكُوْنُ عَبْدًا شَكُوْرًا ـ (بخاری)

419. హజ్రత్ ముగైరా ఇలా వివరిస్తూ ఉండగా విన్నట్టు జియాద్ ఉల్లేఖించారు: 'మహాప్రవక్త (సఅసం) రాత్రి తహజ్జుద్ నమాజ్‌లో నిలబడేవారు. చివరికి ఆయన కాళ్ళపై వాపు వచ్చేది. దాన్ని చూసి "మీరు ఇంత శ్రమపడటం దేనికి?" అని అడిగేవారు జనులు. "నేను కృతజ్ఞతాపరుడయిన దాసుణ్ణి కావద్దా?" అని బదులిచ్చేవారు ఆయన.' (బుఖారి)

## శిక్షణా విధానం

۴۲۰ عَنْ عَائِشَةَ قَالَتْ: كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِذَا أَمَرَهُمْ مِنَ الْأَعْمَالِ بِمَا يُطِيْقُوْنَ ـ (بخاری)

420. "జనులు చేయశక్యమయిన పనులనే మహాప్రవక్త (సఅసం) చెయ్యమని వారికి ఆదేశించేవారు" అని హజ్రత్ ఆయిషా రజి అల్లాహు అన్‌హా తెలిపారు. (బుఖారి)

---

వుండేవారు, పిల్లలను ఇంటివద్ద వదలివచ్చే వసతి లేక పోవడంచేత వారినీ మస్జిదుకు తీసుకువచ్చేవారు. ఈ హదీసులో అలాంటి పిల్లల తల్లుల గురించే ప్రస్తావించడం జరిగింది. ఈ హదీసులో తమ వెనక నమాజ్‌చేసే ముక్తదీల ప్రమేయం లేకుండా నమాజ్‌లో సుదీర్ఘమయిన ఖుర్‌ఆన్ పఠనం సాగించే ఇమామ్‌లకు (అంటే సామూహిక నమాజ్ జరిపించే వారికి) మంచి గుణపాఠం ఉంది.

419. మహనీయ ముహమ్మద్ (సఅసం) దేవుని సందేశహరులు కావటాన ఆయనకు నిత్యం దైవరక్ష వుంటుంది. ఆయన చేత ఎలాంటి పొరపాటు, అపరాధం జరక్కుండా దైవపరంగానే జాగ్రత్తలు తీసుకోబడతాయి. అయినా నమాజ్ కేవలం పాపహారిణి కాదు. అది దైవం పట్ల మానవుని దాస్య భావనకు, విధేయతాభావనకు, స్వయం

٤٢١ عَنْ مُعَاوِيَةَ بْنِ الْحَكَمِ السُّلَمِيِّ قَالَ: بَيْنَا أَنَا أُصَلِّي مَعَ رَسُوْلِ
اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ إِذْ عَطَسَ رَجُلٌ مِّنَ الْقَوْمِ، فَقُلْتُ يَرْحَمُكَ
اللّٰهُ - فَرَمَانِي الْقَوْمُ بِأَبْصَارِهِمْ، فَقُلْتُ: وَاثُكْلَ اُمِّيَاهُ - مَاشَأْنُكُمْ
تَنْظُرُوْنَ إِلَيَّ؟ فَلَمَّا رَأَيْتُهُمْ يُصَمِّتُوْنَنِيْ لٰكِنِّيْ سَكَتُّ فَلَمَّا صَلَّى
رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، فَبِأَبِيْ هُوَ وَأُمِّيْ، مَارَأَيْتُ مُعَلِّمًا
قَبْلَهُ وَلَا بَعْدَهُ اَحْسَنَ تَعْلِيْمًا مِّنْهُ، مَاكَهَرَنِيْ وَلَا ضَرَبَنِيْ وَلَا شَتَمَنِيْ،
قَالَ: إِنَّ هٰذِهِ الصَّلٰوةَ، لَا يَصْلُحُ فِيْهَا شَيْءٌ مِّنْ كَلَامِ النَّاسِ، إِنَّمَا
هِيَ التَّسْبِيْحُ وَالتَّكْبِيْرُ وَقِرَاءَةُ الْقُرْاٰنِ - (مُسلم)

421. ముఆవియా బిన్ హకమ్ సులమ్మీ ఉల్లేఖించారు : 'నేనొకసారి మహాప్రవక్త (సఅసం)తో నమాజ్ చేస్తున్నాను. ఇంతలో ఒక వ్యక్తి తుమ్మాడు. నేను 'ఎర్ హముకల్లా' అనేశాను. దానికి నమాజ్ చేసేవారు నా వంకచూశారు. నేను తిరిగి "మీరు చల్లగా ఉండ! నన్ను అలా చూస్తా రెందుకూ?" అని ప్రశ్నించాను. వారు నన్ను నిశ్శబ్దంగాఉండమని సైగతో బోధించారు. నేను ఊరుకున్నాను. మహాప్రవక్త (సఅసం) నమాజ్ ముగించిన తరువాత - నా తల్లిదండ్రులను ఆయనకై అర్పిస్తా మహాప్రవక్త (సఅసం) కంటే బాగా శిక్షణా బోధనలు చేసే వారిని నేను అంతకు ముందూ ఆ తరువాతా ఎన్నడూ చూడలేదు - ఆయన నన్ను మందలించ లేదు. కొట్టనూ లేదు తిట్టనూ లేదు. కేవలం -"ఇది నమాజ్ కదా, ఇందులో మనుషులు మాట్లాడుకోవడం ఉచితం కాదు. నమాజ్ అంటే అల్లాహ్ పవిత్రతను కొనియాడటం, ఆయన ఘనతను స్తోత్రించడం, ఖుర్ఆన్ పారాయణం చెయ్యడం" అని అన్నారు.' (ముస్లిమ్)

---

సమర్పణ (ఇస్లామ్) భావనకు చిహ్నం. అదే మాట మహాప్రవక్త (సఅసం) అన్నారు.

420. ఆరాధనల విషయంలోనైనా, ఇతర ధార్మిక విషయాల్లోనయినా ప్రజలకు ధర్మమార్గం సుగమం చెయ్యడానికే దైవం తనను పంపినట్లు మహాప్రవక్త (సఅసం) మరోచోట నుడివి ఉన్నారు. అందువల్ల ప్రతివ్యక్తికి అతని శక్తి సామర్థ్యాలు, వీలునుబట్టి మంచి పనులు చెయ్యమనేవారు ఆయన.

۴۲۲ بَالَ أَعْرَابِيٌّ فِي الْمَسْجِدِ فَقَامَ النَّاسُ إِلَيْهِ لِيَقَعُوا بِهِ، فَقَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: دَعُوهُ وَأَرِيقُوا عَلَى بَوْلِهِ سَجْلاً مِّنْ مَّاءٍ أَوْ ذَنُوبًا مِّنْ مَّاءٍ، فَإِنَّمَا بُعِثْتُمْ مُيَسِّرِيْنَ وَلَمْ تُبْعَثُوا مُعَسِّرِيْنَ۔

(بخاری۔ ابوھریرۃؓ)

422. ఒకసారి ఒక అరబ్బు జనపదుడు మస్జిద్‌లో మూత్రం చేశాడు. అక్కడున్న వారు అతన్ని కొట్టడానికి ఎగబడ్డారు. అప్పుడు మహాప్రవక్త (సఅసం) వారితో, "అతన్ని వదలివేయండి; ఆ మూత్రంపై ఒక బొక్కెన నీరుపోసి శుభ్రం చేయండి, మీరు ప్రజల కొరకు సౌలభ్యాలను చేకూర్చడానికి ప్రభవింపబడ్డారు. ప్రజల మార్గాన్ని కష్టతరం చేయడానికి మిమ్మల్ని పుట్టించడం జరగలేదు" అని పలికారు. (బుఖారి - అబూహురైరా)

۴۲۳ عَنْ مَالِكِ بْنِ الْحُوَيْرِثِ قَالَ: اَتَيْنَا النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَ سَلَّمَ وَنَحْنُ شَبَبَةٌ مُّتَقَارِبُوْنَ، فَأَقَمْنَا عِنْدَهُ عِشْرِيْنَ لَيْلَةً وَّ كَانَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ رَحِيْمًا رَفِيْقًا، فَظَنَّ أَنَّا قَدِ اشْتَقْنَا اَهْلَنَا فَسَأَلَ عَمَّنْ تَرَكْنَا مِنْ اَهْلِنَا، فَأَخْبَرْنَاهُ، فَقَالَ: ارْجِعُوْا إِلٰى أَهْلِيْكُمْ فَأَقِيْمُوْا فِيْهِمْ وَعَلِّمُوْهُمْ وَمُرُوْهُمْ وَصَلُّوْا صَلٰوةَ كَذَا فِيْ حِيْنِ كَذَا وَصَلَاةَ كَذَا فِيْ حِيْنِ كَذَا - (وَفِيْ رِوَايَةٍ" وَصَلُّوْا كَمَا رَأَيْتُمُوْنِيْ أُصَلِّيْ) فَإِذَا حَضَرَتِ الصَّلٰوةُ فَلْيُؤَذِّنْ لَكُمْ أَحَدُكُمْ وَلْيَؤُمَّكُمْ أَكْبَرُكُمْ۔

(بخاری۔ مسلم)

423. మాలిక్ బిన్ హువైరిస్ ఇలా ఉల్లేఖించారు: 'మేము సమవయస్కులమయిన యువకులం కొంతమందిమి ధర్మశిక్షణకై మహాప్రవక్త (సఅసం) వద్దకు వచ్చాము. ఆయన సన్నిధిలో మేము ఇరువై దినాలు బస

చేశాము. మహాప్రవక్త (సఅసం)ఎంతో కనికరంతో ఎంతో ప్రేమతో మెలిగే వారు. మేము ఇండ్లకు పోగోరుతున్నట్లు ఆయన పసిగట్టి, "మీ ఇండ్లల్లో మీ వెనక ఎవరున్నారు?" అనడిగారు. మేము చెప్పాము, అప్పుడు ఆయన ఇలా బోధించారు: "మీ భార్యా పిల్లల వద్దకు పొండి. మీరు నేర్చుకున్న దంతా వాళ్ళకు నేర్పండి. వారికి మంచి మాటల్ని బోధించండి. ఫలాన నమాజ్‌ని ఫలాన సమయాన, ఫలానా నమాజ్‌ని ఫలాన సమయాన చెయ్యండి, (మరో హదీసులో "నేను ఎలా నమాజ్ చేయడం మీరు చూశారో మీరున్నూ అలాగే నమాజ్ చెయ్యండి అని అన్నార"ని ఉంది). నమాజ్ సమయం ఆసన్నం కాగానే మీలో ఒకరు అజాన్ పలకండి, మీలో ఎవరు విద్యా విజ్ఞానాల్లో అధికులో వారికే నమాజ్‌కు 'ఇమామత్' (నాయకత్వం) చేసే అధికారం ఇవ్వండి." (బుఖారి, ముస్లిమ్)

## తోటి సోదరుల పట్ల ప్రేమ

٤٢٣ عَنْ جَرِيْرِ بْنِ عَبْدِ اللهِ قَالَ : كُنَّا فِىْ صَدْرِ النَّهَارِ عِنْدَ رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَجَاءَهُ قَوْمٌ عُرَاةٌ مُجْتَابِى النِّمَارِ أَوِ الْعَبَاءِ مُتَقَلِّدِى السُّيُوْفِ، عَامَّتُهُمْ مِنْ مُّضَرَ بَلْ كُلُّهُمْ مِّنْ مُّضَرَ - فَتَمَعَّرَ وَجْهُ رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ لِمَا رَاٰى بِهِمْ مِنَ الْفَاقَةِ، فَدَخَلَ ثُمَّ خَرَجَ، فَأَمَرَ بِلَالًا فَأَذَّنَ وَأَقَامَ فَصَلّٰى ثُمَّ خَطَبَ فَقَالَ: "يَا اَيُّهَا النَّاسُ

---

**421.** నమాజ్ చేసేటప్పుడు ఇతర విషయాలను మాట్లాడటం, వాటివైపు శ్రద్ధచూపడం తప్పు. అది నమాజ్‌నే భంగపరచవచ్చు. దానిని మహాప్రవక్త (సఅసం) ఎంతో సౌమ్యంగా తన సహచరుడయిన ముఆవియాకు బోధించారు.

**422.** ఈ హదీసు ద్వారా తెలిసేదేమంటే ప్రయాణీకులు మస్జిద్‌లో పడుకోడానికి వసతి వుండాలి. తెలియక వారు మస్జిద్‌పట్ల లేక మరే ఇతర గౌరవప్రదమయిన వస్తువుపట్ల అగౌరవంగా ప్రవర్తించినట్లయితే వారి ఈ అల్ప జ్ఞానానికి కోపగించుకోకుండా మంచి మాటలతో నచ్చచెప్పాలి. మహాప్రవక్త నిత్యం ప్రజల సౌకర్యాల కొరకు తన అనుయాయుల్ని హెచ్చరించేవారనడానికి మరో హదీసు ప్రబల నిదర్శనం. మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం), హజ్రత్ అబూ మూసా మరియు హజ్రత్ ముఆజ్

اتَّقُوْا رَبَّكُمُ الَّذِىْ خَلَقَكُمْ مِّنْ نَّفْسٍ وَّاحِدَةٍ إِلَىٰ اٰخِرِ الْاٰيَةِ "إِنَّ اللّٰهَ كَانَ عَلَيْكُمْ رَقِيْبًا"، وَالْاٰيَةُ الْأُخْرٰى الَّتِىْ فِىْ اٰخِرِ الْحَشْرِ "يَا أَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اتَّقُوا اللّٰهَ وَلْتَنْظُرْ نَفْسٌ مَّا قَدَّمَتْ لِغَدٍ "لِيَتَصَدَّقْ رَجُلٌ مِّنْ دِيْنَارِهٖ، مِنْ دِرْهَمِهٖ، مِنْ ثَوْبِهٖ مِنْ صَاعِ بُرِّهٖ، مِنْ صَاعِ تَمْرِهٖ- حَتّٰى قَالَ: وَلَوْ بِشِقِّ تَمْرَةٍ، "فَجَاءَ رَجُلٌ مِّنَ الْأَنْصَارِ بِصُرَّةٍ كَادَتْ كَفُّهٗ تَعْجِزُ عَنْهَا بَلْ قَدْ عَجَزَتْ، ثُمَّ تَتَابَعَ النَّاسُ حَتّٰى رَأَيْتُ كَوْمَيْنِ مِنْ طَعَامٍ وَّثِيَابٍ حَتّٰى رَأَيْتُ وَجْهَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ يَتَهَلَّلُ كَأَنَّهٗ مُذْهَبَةٌ، فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: مَنْ سَنَّ فِى الْإِسْلَامِ سُنَّةً حَسَنَةً فَلَهٗ أَجْرُهَا وَأَجْرُ مَنْ عَمِلَ بِهَا بَعْدَهٗ مِنْ غَيْرِ أَنْ يَّنْقُصَ مِنْ أُجُوْرِهِمْ شَيْءٌ، وَمَنْ سَنَّ فِى الْإِسْلَامِ سُنَّةً سَيِّئَةً كَانَ عَلَيْهِ وِزْرُهَا وَوِزْرُ مَنْ عَمِلَ بِهَا مِنْ بَعْدِهٖ مِنْ غَيْرِ أَنْ يَّنْقُصَ مِنْ أَوْزَارِهِمْ شَيْءٌ"۔

(مسلم)

424. జరీర్ బిన్ అబ్దుల్లాహ్ ఇలా ఉల్లేఖించారు: "మేమొక ఉదయం మహాప్రవక్త (సఅసం) సన్నిధిలో కూర్చుని ఉండగా కొందరు కరవాలాలు కట్టుకుని, గొంగళ్ళు కప్పుకుని వచ్చారు. వారి శరీరంలో అధికభాగం వస్త్రహీనంగానే ఉంది. వారిలో చాలామంది 'ముజర్' తెగకు చెందినవాళ్ళు - కాదు వాళ్ళంతా 'ముజర్' తెగవారే - వారి బీదరికాన్నీ ఆకలి బాధని చూచి మహాప్రవక్త (సఅసం) ముఖం వ్యాకులతతో పాలిపోయింది. ఆయన తన ఇంటిలోనికి వెళ్ళి వచ్చారు; హజ్రత్ బిలాల్‌కు (నమాజ్ సమయం అవడం చేత) "అజాన్" ఇవ్వమని ఆదేశించారు, హజ్రత్ బిలాల్ అజాన్ పలికారు. ఇకామత్ చెప్పారు. తరువాత అందరూ నమాజ్ చేశారు. నమాజ్ తరువాత ఆయన ప్రసంగించారు. అందులో నిసా సూరాలోని తొలి ఆయత్ హష్ సూరాలోని చివరి రుకూలోని మొదటి ఆయత్ పఠించారు. తరువాత ఇలా బోధించారు, "దైవ మార్గంలో సదకా చెయ్యాలి: దీనారు

లివ్వండి, దిరహ మివ్వండి, వస్త్రాలివ్వండి, ఒక 'సా' గోధమలివ్వండి, ఒక 'సా' ఖర్జూర ఫలాలివ్వండి." ఆయన చివరికి ఎవరివద్దయినా సగం ఖర్జూరపు ముక్కే ఉంటే అదే దానం చెయ్యమని ఉపదేశించారు. ప్రసంగం విన్న అన్సారుల్లోని వ్యక్తి ఒకతను తన రెండు చేతుల్లోనూ పట్టని సంచిని ఒక దాన్ని తెచ్చాడు. అప్పుడు జనులు ఒక్కరొక్కరే దానం చెయ్యడం మొద లెట్టారు. కడకు నేను ధాన్యం, బట్టల రెండు రాసుల్ని చూసాను. అది చూసి మహాప్రవక్త ముఖారవిందం బంగరులా మెరిసింది. అప్పుడు మహాప్రవక్త (సఅసం) సెలవిచ్చారు: "ఎవరైనా ఇస్లామ్‌లో ఒక మంచి సంప్రదాయాన్ని ప్రవేశపెట్టినట్లయితే అతనికి దాని సద్ఫలితం లభిస్తుంది, ఆ తరువాత ఆ మంచి ఆచారాన్ని ఎవరయినా పాటిస్తే దాని సద్ఫలితంకూడా అతనికి లభిస్తుంది. అయితే అలా ఆచరించే వారికి లభించే పుణ్యఫలంలో ఎలాంటి లోటు రాదు. అలాగే ఎవరు ఇస్లామ్‌లో ఒక దురాచారాన్ని మొదలెడతారో వారికి తమ పాపానికి దుష్ఫలితం లభిస్తుంది. అది కాక ఆ తరువాత ఆ దురాచారాన్ని అవలంబించినవారి పాప ఫలం కూడా అతని కర్మ పత్రంలో లిఖించబడుతుంది. అయితే ఆ దురాచారాన్ని పాటించిన వారి పాపంలో మాత్రం ఎలాంటి తగ్గుదల ఉండబోదు." (ముస్లిమ్)

---

(రజి)ను యమన్‌కు అధికారులుగా పంపేటప్పుడు "మీరు ప్రజలకై సౌలభ్యాలను చేకూర్చండి. కష్టాలను కలుగజేయకండి. అందరితో కలుపుగోలుతనంతో మెలగండి. ప్రజలు మిమ్మల్ని చూసి జడుసుకునేలా నడుచుకోకండి" అని ఉపదేశించారు.

423. మహాప్రవక్త (సఅసం) కాలంలో ఆయన సహచరులు కొంతకాలం ఆయనతో, ఆయన సన్నిహిత సహచరులతో గడిపి వారి సాంగత్యంలో ధార్మిక, లౌకిక ఇతర విషయాలు అన్నీ సమగ్రంగా తెలుసుకుని తగు విధంగా తర్ఫీదుపొందేవారని, తమ ధార్మిక శిక్షణ కొరకు తమ జీవితకాలం కొంత గడపడం వారికి పెద్ద సమస్య కాకపోయేదని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. మహాప్రవక్త (సఅసం) తన సహచరులకు చిన్నచిన్న విషయాలు సయితం బోధించేవారని కూడా దీనివల్ల అవగతమవుతోంది. "ఇమామత్" (నమాజ్ చేయించే నాయకత్వం) కొరకు కావలసిన కనీస అర్హతలు సయితం ఈ హదీసు మనకు బోధిస్తోంది. దీని ద్వారా ప్రయోజనం పొందే మనసు, సంకల్పం కావాలి!

٤٢٥ عَنْ عَبْدِ الرَّحْمٰنِ بْنِ أَبِيْ بَكْرٍ الصِّدِّيْقِ أَنَّ أَصْحٰبَ الصُّفَّةِ كَانُوْا أُنَاسًا فُقَرَاءَ، وَأَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ مَرَّةً: مَنْ كَانَ عِنْدَهُ طَعَامُ اثْنَيْنِ فَلْيَذْهَبْ بِثَالِثٍ، وَمَنْ كَانَ عِنْدَهُ طَعَامُ أَرْبَعَةٍ فَلْيَذْهَبْ بِخَامِسٍ بِسَادِسٍ أَوْ كَمَا قَالَ - وَأَنَّ أَبَا بَكْرٍ جَاءَ بِثَلَاثَةٍ وَّانْطَلَقَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ بِعَشَرَةٍ - (بخاری-مسلم)

425. హ(జత్ అబూబ(క్ సిద్దీక్ (రజి) కుమారుడు అబ్దుర్ర హ్మాన్ ఇలా ఉల్లేఖించారు: "సుఫ్ఫా" వారు చాలా బీదవారు. ఒకసారి మహా(ప్రవక్త (సఅసం) అందరినీ ఉద్దేశించి, ఇలా ఆదేశించారు, "ఇంటిలో ఇద్దరు వ్యక్తుల భోజనమున్నవారు ఇక్కడినుండి మూడో వ్యక్తిని తీసుకు వెళ్ళండి. నలుగురు మనుషుల భోజనమున్నవారు ఒకరినో ఇద్దరినో తీసుకువెళ్ళండి" తదనుగుణంగా మా నాన్న అబూ బ(క్ గారు ముగ్గురిని పిలుచుకు వచ్చారు. మహా(ప్రవక్త (సఅసం) తన ఇంటికి పది మందిని తీసుకు వెళ్ళారు.

(బుఖారి, ముస్లిమ్)

---

424. సదకా అంటే దానం అని అర్థం. "సా" అన్నది ఓ కొలమానం. ఒక "సా" దాదాపు రెండు కిలోలకు సమానం. హదీసు (ప్రారంభంలో "వారిలో చాలా మంది ముజర్ తెగకు చెందిన వాళ్ళు - కాదు వాళ్ళంతా ముజర్ తెగవారే" అని వుంది. దీన్ని బట్టి హదీసును ఉల్లేఖించేవారు విన్నది విన్నట్టుగా, చెప్పిన వ్యక్తి ఏ మాటల్లో ఎలా చెప్పాడో అదేవిధంగా అప్పచెప్పడానికి ఎంత (శద్ధ తీసుకునేవారో బోధపడుతోంది. ఇస్లామ్ శిక్షణలన్నింటినీ రెండు శీర్షికల్లో విభజించవచ్చు. ఒకటి దైవంపట్ల మనుష్యుల బాధ్యతలు. రెండవది తోటి మానవులపట్ల బాధ్యతలు. మొదటి దానిలో మౌలిక విశ్వాసమయిన తౌహీద్(ఏకేశ్వరవాదం) (ప్రధానమయింది. రెండవదానిలో లేమికి గురైన మానవుల ఎడల కరుణ, (పేమను కలిగివుండటం ముఖ్యమయింది. ఈ కారణంగానే మహా(ప్రవక్త (సఅసం) ఆ అభాగ్యుల్ని చూసి వ్యాకులపడ్డారు. వదనం ఖేదావృతమయింది. కాని ఆ పేదలకోసం కూడూ గుడ్డల ఏర్పాటు జరిగినంతనే ఆయన మోము దివ్యకాంతులతో విరాజిల్లింది.

మహా(ప్రవక్త (సఅసం) తన ఉపన్యాసంలో పఠించిన నిసా సూరా తొలి ఆయత్‌కు అర్థం: "జనులారా ! మీ పోషకుని ఆ(గహానికి భయపడండి. ఆయన మిమ్మల్ని ఒకే

۴۲۶ عَنْ أَنَسٍ قَالَ، مَا سُئِلَ رَسُولُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ عَلَى
الْإِسْلَامِ شَيْئًا إِلَّا أَعْطَاهُ، وَلَقَدْ جَاءَهُ رَجُلٌ فَأَعْطَاهُ غَنَمًا بَيْنَ جَبَلَيْنِ،
فَرَجَعَ إِلَى قَوْمِهِ، فَقَالَ: يَا قَوْمِ، أَسْلِمُوا فَإِنَّ مُحَمَّدًا يُعْطِي عَطَاءً مَنْ
لَا يَخْشَى الْفَقْرَ، وَإِنْ كَانَ الرَّجُلُ لَيُسْلِمُ مَا يُرِيدُ إِلَّا الدُّنْيَا فَمَا يَلْبَثُ
إِلَّا يَسِيرًا حَتَّى يَكُونَ الْإِسْلَامُ أَحَبَّ إِلَيْهِ مِنَ الدُّنْيَا وَمَا عَلَيْهَا - (مسلم)

**426.** హజ్రత్ అనస్ ఇలా ఉల్లేఖించారు: "మహాప్రవక్తను ఎవరు ఏది అర్థించినా అది ఇచ్చివేసేవారు. ఆ విధంగా ప్రజలు ఇస్లామ్‌కు సన్నిహితు లయ్యేవారు. ఒకసారి ఒక వ్యక్తి ఆయన వద్దకు వచ్చాడు. అతనికి మహాప్రవక్త (సఅసం) రెండు కొండల మధ్య మేస్తున్న మేకలన్నిం టినీ దానం చేసివేశారు. అతడు తన తెగవారి వద్దకు పోయి "జనులారా!

---

జీవినుండి పుట్టించాడు. దాని (ఆ జీవి) ద్వారా దాని జతను సృష్టించాడు. ఆ ఉభయుల ద్వారానే అనేక స్త్రీ పురుషుల్ని ప్రపంచం మొత్తంలో వ్యాపింపచేశాడు. అందుకే మీ పోషకుడు, సృష్టికర్త అయిన అల్లాహ్ అవిధేయతనుండి దూరంగా ఉండండి. ఆయన పేరు చెప్పుకునే మీరు ఒండొకరినుండి తమ హక్కుల్ని పొందు తారు. బంధుత్వపు సంబంధాల్ని ఆదరించండి. వారి హక్కుల్ని వారికి ఇప్పించండి. నిస్సందేహంగా అల్లాహ్ మిమ్మల్నందరినీ కనిపెడుతూనే ఉన్నాడు."

ఈ ఆయత్‌లో రెండు మౌలిక విశ్వాసాలు పొందుపరచబడి వున్నాయి. ఒకటి దేవుని ఏకత్వపు భావన అంటే, ఆరాధన, ఆజ్ఞా పాలనకు అర్హుడు కేవలం అల్లాహ్ ఒక్కడే అన్న భావం. రెండవది మానవుల ఏకత్వపు భావన. అంటే మానవులంతా ఒకే జంట ద్వారా ఉనికిలోనికి వచ్చారనీ, అందువల్ల వారి మధ్యన సోదర భావం, పరస్పర ప్రేమానురాగాలు విలసిల్లాలని భావం. మహాప్రవక్త (సఅసం) ఆ బీదల సహాయార్థం విజ్ఞప్తి చేస్తూ ఈ ఆయత్ పఠించారంటే సమాజంలోని బీదసాదలకు సహాయం చేయకపోవడం దేవుని ఆగ్రహాన్ని రేకెత్తిస్తుందని విస్పష్టంగా తెలుస్తోంది.

హష్ర్ సూరాలోని ఆయత్‌కు భావం : "విశ్వాసులారా ! అల్లాహ్ ఆగ్రహాన్నుండి మిమ్ముతాము రక్షించుకోండి. ప్రతి ఒక్కడు, రేపు రానున్న (ఖియామత్) దినం కొరకు తాను ఏ నిధుల్ని ప్రోగుచేసుకుంటున్నాడు అన్న విషయాన్ని దృష్టిలోవుం చుకోవాలి. జనులారా ! అల్లాహ్ ఆగ్రహాన్నుండి తప్పించుకోండి. మీరు చేసే పనుల

ఇస్లామ్ స్వీకరించండి. ఎందుకంటే ఆకలి బాధలకు ఏ మాత్రం భయ పడని వ్యక్తిలా ముహమ్మద్ దానంచేస్తారు" అని పిలుపునిచ్చాడు. కొందరు కేవలం ప్రాపంచిక లాభం కొరకు విశ్వాసం స్వీకరించినా మహాప్రవక్త సుశిక్షణ వల్ల ఇస్లామ్ వారి ఆంతర్యంలో సజీవమయి నిలిచేది, పర్యవసానంగా ప్రపంచం, ప్రాపంచిక వస్తుసామాగ్రి కంటే అతని దృష్టిలో ఇస్లామ్ ప్రియతమమయి పొయ్యేది. (ముస్లిమ్)

---

న్నింటి గురించి అల్లాహ్‌కు సర్వమూ తెలుసు."

ఈ ఆయత్ ద్వారా తెలిసిందేమంటే బీదసాదలపై వ్యయపరచిన ధనం పరలోక జీవితంలో నిధిగా మనకు లభిస్తుంది. అది వృధాపోదు.

దానం చేయడంలో ముందంజ వేసిన వ్యక్తిని మహాప్రవక్త (సఅసం) ప్రశంసించారు, అతనికి తన దానానికి పుణ్యఫలం లభించడమే కాక, అతని ఈ చర్యవల్ల ఇతరుల్లో సత్క్రియచేసే ప్రేరణ కలిగినందుకుగాను అదనపు పుణ్యఫలం కూడా లభిస్తుందని, ఈ సూత్రం ప్రతి సత్కార్యాన్ని ఆరంభించిన వారికీ వర్తిస్తుందని, అలాగే దుష్క్రియను మొదలెట్టిన వారికీ వర్తిస్తుందనీ తెలిపారు.

425. "సుఫ్ఫా" వారంటే కుటుంబం లేకుండా ఇల్లూ, వాకిలి లేకుండా కేవలం ధర్మజ్ఞాన సముపార్జనమే తమ జీవిత లక్ష్యంగా, ధర్మ ప్రబోధనే తమ ఆశయంగా జీవించే కొందరు సహచరులన్నమాట. వీరంతా ప్రవక్త మస్జిద్ వద్ద ఓ అరుగుపై ఉంటుండేవారు. అరుగును 'సుఫ్ఫా' అనంటారు అరబీలో. మహాప్రవక్త నాయకత్వ స్థానంలో ఉన్నారు. ఆయన పదిమంది ఆతిధ్యానికి పూనుకోకపోతే ఇతరులు ఇద్దరేసి, నలుగురేసి మనుషుల్ని ఎలా తీసుకువెళతారు? నాయకులయినవారు ఆదర్శవంతులయి, త్యాగనిరతిగలవారయితేనే అనుయాయులు ఇతోధికంగా త్యాగశీలురవుతారు. ముందున్నవారే వెనకబడితే వెనకున్నవారు తిరుగుముఖం పడతారు !

426. ఇది ధనాశ చూపడంకాదు. ధనప్రీతిని ఆంతర్యాల్లో నుండి తొలగించే కార్యం. ధనాన్ని, సంపదను, ప్రాపంచిక ఐశ్వర్యాన్ని తృణప్రాయంగా చూసేలా ఇస్లామ్ మనిషికి తర్ఫీదునిస్తుంది అన్న విషయానికి ఆచరణాత్మక నిదర్శనం. అర్థికి ప్రియంతో అర్థించినదంతా ఇచ్చివేయడం ధనప్రీతిని అంతమొందిస్తుందనడంలో సందేహం లేదు. మహాప్రవక్త (సఅసం) ఆదర్శవంతమయిన తన జీవితంలో ప్రాపంచిక సంపదలు తన వద్దకు వచ్చినా కొంతకాలమయినా ఉండనిచ్చే వారు కాదు. అగత్యపరులకు పంచనంతవరకు ఆయనకు తృప్తివుండేదికాదు. "రేపటికి నేను దాచుకోలేదు" అన్న చింత ఆయన్ని ఎన్నడూ బాధించలేదు. తన సహచరులకు ఆయన అలాంటి తర్ఫీదునే ఇచ్చారు.

# ధర్మ సంస్థాపనా మార్గంలో

٤٢٧ عَنِ ابْنِ مَسْعُوْدٍ قَالَ : كَأَنِّيْ أَنْظُرُ إِلىٰ رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَحْكِيْ نَبِيًّا مِّنَ الْأَنْبِيَاءِ صَلَوَاتُ اللهِ وَسَلَامُهُ عَلَيْهِمْ، ضَرَبَهُ قَوْمُهُ فَأَدْمَوْهُ وَهُوَ يَمْسَحُ الدَّمَ عَنْ وَّجْهِهٖ وَيَقُوْلُ : اَللّٰهُمَّ اغْفِرْ لِقَوْمِيْ فَإِنَّهُمْ لَا يَعْلَمُوْنَ - (بخاری۔مُسلم)

427. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి) ఇలా ఉల్లేఖించారు: 'మహాప్రవక్త (సఅసం) ఒకసారి ఒక దైవ ప్రవక్త గాథను వినిపించారు. ఆ దృశ్యం ఇప్పటికీ నా కళ్ళ ముందు కదలాడుతోంది. ఆయన ఇలా తెలిపారు: "ఆ ప్రవక్త ధర్మ సందేశాన్ని అందచేయడం మూలాన ఆ జాతి వారు ఆయన్ని విపరీతంగా కొట్టారు. కడకు రక్తసిక్తమయిపోయారు ఆ ప్రవక్త. అయినా తన ముఖాన్నుండి చిమ్మే రక్తాన్ని తుడుచుకుంటూ ఆ ప్రవక్త ఇలా ప్రార్థించారు 'అల్లాహ్! నా జాతి చేసే ఈ అపరాధాన్ని మన్నించు. ఎందుకంటే వారు ఇంకా అజ్ఞానులు, వారికి అసలు యదార్థం తెలియదు.' (బుఖారి, ముస్లిమ్)

٤٢٨ عَنْ عَائِشَةَ أَنَّهَا قَالَتْ لِلنَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ : هَلْ أَتىٰ عَلَيْكَ يَوْمٌ كَانَ أَشَدَّ مِنْ يَّوْمِ أُحُدٍ ؟ قَالَ : قَدْ لَقِيْتُ مِنْ قَوْمِكِ وَكَانَ أَشَدُّ مَا لَقِيْتُهُ يَوْمَ الْعَقَبَةِ إِذْ عَرَضْتُ نَفْسِيْ عَلَى ابْنِ عَبْدِ يَالِيْلَ بْنِ عَبْدِ كُلَالٍ، فَلَمْ يُجِبْنِيْ إِلىٰ مَا أَرَدْتُّ ، فَانْطَلَقْتُ — وَأَنَا مَهْمُوْمٌ — عَلىٰ وَجْهِيْ، فَلَمْ أَسْتَفِقْ إِلَّا بِقَرْنِ الثَّعَالِبِ ، فَرَفَعْتُ رَأْسِيْ فَنَظَرْتُ ، فَإِذَا فِيْهَا جِبْرِيْلُ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ ، فَنَادَانِيْ ، فَقَالَ : إِنَّ اللهَ تَعَالىٰ سَمِعَ قَوْلَ قَوْمِكَ لَكَ وَمَا رَدُّوْا عَلَيْكَ ، وَقَدْ بَعَثَ إِلَيْكَ مَلَكَ الْجِبَالِ لِتَأْمُرَهُ

بِمَا شِئْتَ فِيهِمْ ، فَنَادَانِي مَلَكُ الْجِبَالِ فَسَلَّمَ عَلَيَّ ثُمَّ قَالَ : يَا مُحَمَّدُ إِنَّ اللّٰهَ قَدْ سَمِعَ قَوْلَ قَوْمِكَ لَكَ وَأَنَا مَلَكُ الْجِبَالِ وَقَدْ بَعَثَنِي رَبِّي إِلَيْكَ لِتَأْمُرَنِي بِأَمْرِكَ فَمَا شِئْتَ ؛ إِنْ شِئْتَ أَطْبَقْتُ عَلَيْهِمُ الْأَخْشَبَيْنِ ، فَقَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ : بَلْ أَرْجُوا أَنْ يُخْرِجَ اللّٰهُ مِنْ أَصْلَابِهِمْ مَنْ يَعْبُدُ اللّٰهَ وَحْدَهُ لَا يُشْرِكُ بِهِ شَيْئًا - (بخاری-مسلم)

428. హజ్రత్ ఆయిషా (రజి) ఇలా ఉల్లేఖించారు: తానొకసారి మహాప్రవక్తను 'ఉహుద్ దినం కంటే నికృష్టమైన దినం మీకు తటస్థ పడిందా?' అని అడగ్గా ఆయన ఇలా సమాధానం ఇచ్చారు. "ఆయిషా, నీ జాతి (ఖురైష్) ద్వారా నాకు ఎన్నో బాధలు కలిగాయి. అన్నిటికంటే కష్టమయిన దినం 'అకబా దినం'. ఆ రోజున నేను అబ్దెయాలైల్, ఇబ్నె అబ్దెకులాల్ ఎదుట నిలిచాను. నేను కోరింది అతడు స్వీకరించలేదు. వ్యాకుల హృదయంతో చింతాగ్రస్తుణ్ణయి అక్కడి నుండి బయలుదేరాను. 'కర్నిస్సఆలిబ్' అనే చోటికి వచ్చేటప్పటికి కాస్త హృదయం తేలికపడింది. అప్పుడు తల పైకి ఎత్తి చూసాను. అక్కడ (ఆకాశాన) జిబ్రీల్(అలై) కనబడ్డారు. ఆయన నన్ను సంబోధించి "మీ జాతి మీతో అన్న మాటలూ, వారు మీ సందేశానికి సమాధానం ఇచ్చిన తీరూ అంతా అల్లాహ్ విన్నాడు. ఇప్పుడు పర్వతాల నిర్వాహకదూతను మీ వద్దకు పంపాడు. మీరు కోరినట్లు అతడు మీ ఆజ్ఞల్ని పాలిస్తాడు" అని పలికారు. అప్పుడు పర్వతాల దూత నాకు సలామ్ చేసి ఇలా చెప్పసాగాడు. ముహమ్మద్ (సఅసం)

---

427. ధర్మసంస్థాపనామార్గంలో నిత్యం ఎలాంటి కష్టాల నెదుర్కోవలసివస్తుందో ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అలాంటి పరీక్షా ఘడియల్లోనూ సంయమనాన్ని, నిగ్రహాన్ని కోల్పోకుండా తనపై కష్టాలు తెచ్చిపెట్టినవారి పట్ల ద్వేష భావం మనసులో జనించనీయకుండా వారి మూఢత్వం పట్ల ఖేదం చెందుతూ ఆ జాతి దైవప్రవక్తను బాధించినందుకు దైవాగ్రహానికి గురవుతుందన్న భయంతో దైవాన్ని మన్నింపునకై ప్రార్థించిన ప్రవక్త హృదయ నైర్మల్యాన్ని ఈ హదీసు చాటి చెపుతోంది.

అల్లాహ్ మీ జాతి వారి మాటల్ని విన్నాడు. నేను పర్వతాల నిర్వహణకు నియుక్తుడిని. నా ప్రభువు నన్ను మీ వద్దకు పంపాడు- మీరు కోరినట్లు, మీ ఆజ్ఞల్ని పాలించడానికి. మీరు కోరినట్లయితే ఈ నగర ప్రజలంతా నలిగిపోయేలా ఈ రెండు కొండల్ని కలిపివేస్తాను.' అప్పుడు ప్రవక్త అతనితో, "వద్దు. (వీరు కాకపోయినా) వారి సంతితిలో కేవలం ఒకే దైవాన్ని ఆరాధించేవారిని, ఆయన దైవత్వంలో ఎవ్వరినీ సహవర్తులుగా భావించని వారిని అల్లాహ్ పుట్టిస్తాడని నాకు ఆశ ఉంది. (కనుక వారిని సంహరించవద్దు అని అన్నారు)." (బుఖారి, ముస్లిమ్)

# మహాప్రవక్త సహచరులు

٤٢٩ عَنْ سَالِمِ بْنِ عَبْدِ اللّٰهِ بْنِ عُمَرَ عَنْ أَبِيهِ أَنَّ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ قَالَ، نِعْمَ الرَّجُلُ عَبْدُ اللّٰهِ لَوْ كَانَ يُصَلِّيْ مِنَ اللَّيْلِ، قَالَ سَالِمٌ: فَكَانَ عَبْدُ اللّٰهِ بَعْدَ ذٰلِكَ لَا يَنَامُ مِنَ اللَّيْلِ إِلَّا قَلِيْلًا۔

(بخاری ۔ مُسلم)

429. 'ఒకసారి మహాప్రవక్త (సఅసం) "అబ్దుల్లాహ్ చాలా మంచి మనిషి, రాత్రుల్లో ప్రార్థన (తహజ్జుద్) కొరకు లేస్తే ఎంత బాగుండేది?" అని అన్నారు. అప్పట్నుంచి మా నాన్న (అబ్దుల్లాహ్) రాత్రుల్లో ఎంతో కొంత తప్ప నిద్ర పాయేవారే కారు' అని సాలిమ్ తన తండ్రి అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ గురించి తెలిపారు. (బుఖారి, ముస్లిమ్)

---

428. "అకబా దినం" అంటే "తాయిఫ్‌కు వెళ్ళిన దినం" అని భావం. తాయిఫ్‌లో కురైష్ వర్తకులు భారీ ఎత్తున తోళ్ళ వ్యాపారం చేసేవారు. తాయిఫ్‌వారు, కురైష్‌వారు పరస్పరం దగ్గరి బంధువులు. మహాప్రవక్త (సఅసం) మక్కా ప్రజల ప్రవర్తనవల్ల నిరాశచెంది, తాయిఫ్‌లోనయినా సత్యానికి స్థానం దొరుకుతుందేమో అన్న ఆశతో తాయిఫ్ వెళ్ళారు. కాని ఇబ్ను అబ్దె యాలైల్ అనే తెగ నాయకుడు దుండగులను ఆయన వెనక పంపాడు. వారు ఆయన్ని రాళ్ళతో కొట్టారు. ఆ

۴۳۰ إِنَّ فُقَرَاءَ الْمُهَاجِرِيْنَ أَتَوْا رَسُوْلَ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَ
سَلَّمَ فَقَالُوْا: ذَهَبَ أَهْلُ الدُّثُوْرِ بِالدَّرَجَاتِ الْعُلٰى وَالنَّعِيْمِ الْمُقِيْمِ،
فَقَالَ: وَمَاذَاكَ؟ فَقَالُوْا: يُصَلُّوْنَ كَمَا نُصَلِّيْ، وَيَصُوْمُوْنَ كَمَا نَصُوْمُ،
وَيَتَصَدَّقُوْنَ وَلَا نَتَصَدَّقُ، وَيَعْتِقُوْنَ وَلَا نَعْتِقُ، فَقَالَ رَسُوْلُ اللهِ صَلَّى
اللهُ عَلَيْهِ وَسَلَّمَ: أَفَلَا أُعَلِّمُكُمْ شَيْئًا تُدْرِكُوْنَ بِهٖ مَنْ سَبَقَكُمْ
وَتَسْبِقُوْنَ بِهٖ مَنْ بَعْدَكُمْ، وَلَا يَكُوْنُ أَحَدٌ أَفْضَلَ مِنْكُمْ إِلَّا مَنْ
صَنَعَ مِثْلَ مَا صَنَعْتُمْ؟ قَالُوْا: بَلٰى، يَا رَسُوْلَ اللهِ، قَالَ تُسَبِّحُوْنَ
وَتُكَبِّرُوْنَ وَتَحْمَدُوْنَ دُبُرَ كُلِّ صَلٰوةٍ ثَلَاثًا وَّثَلٰثِيْنَ مَرَّةً - فَرَجَعَ
فُقَرَاءُ الْمُهَاجِرِيْنَ إِلٰى رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ، فَقَالُوْا: سَمِعَ
إِخْوَانُنَا أَهْلُ الْأَمْوَالِ بِمَا فَعَلْنَا فَفَعَلُوْا مِثْلَهٗ، فَقَالَ رَسُوْلُ اللهِ صَلَّى
اللهُ عَلَيْهِ وَسَلَّمَ: ذٰلِكَ فَضْلُ اللهِ يُؤْتِيْهِ مَنْ يَّشَاءُ - (مسلم-ابوهريرةؓ)

430. అబూ హురైరా ఇలా ఉల్లేఖించారు: "మక్కా నుండి హిజ్రత్ చేసి వచ్చే వారిలో నిరుపేదలయిన వారు ఒకసారి మహాప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి, 'శాశ్వత సుఖ సంతోషాలు, ఉన్నత స్థానాలు ధన వంతులకే సొంత మయ్యాయి' అని మొరపెట్టుకున్నారు. మహాప్రవక్త (సఅసం) "అది ఎలా?" అని అడగ్గా వారు చెప్పసాగారు, "మేము నమాజ్ చేస్తామా-వారూ ఇలా నమాజ్ చేస్తారు; మేము రోజా వ్రతాన్ని పాటించినట్లే వారు కూడా పాటిస్తారు; కాని వారు దైవమార్గంలో దానధర్మాలు చేస్తారు. మేమేమో దైవ మార్గంలో ఖర్చుచేయలేము; వారు బానిసల్ని బంధ విముక్తం చేయడానికి ఖర్చు చేస్తారు, మేము అదీ చేయలేము." మహాప్రవక్త (సఅసం) వారి ఈ మాటలు విని, "మీకో మంచి మాట చెప్పమంటారా? దాని ద్వారా మీరు సత్కార్యాల్లో అగ్రగాములైన వారిని చేరుకోగలరు.

తద్వారా మీ వెనక వచ్చే వారి కంటే ముందు సాగిపోగలరు. మీ ఈ ఆచరణను అనుసరించినవారు తప్ప మరెవరూ మిమ్మల్ని (ధర్మపథంలో) మించిపోలేరు" అని సెలవిచ్చారు. "తప్పక చెప్పండి ప్రవక్తా!" అని అర్థించారు వారంతా. "అయితే మీరు ప్రతిఫర్జ్ (విద్యుక్తమయిన) నమాజ్ తరువాత 33 పర్యాయాలు "సుబహానల్లాహ్", 33 పర్యాయాలు 'అల్లాహు అక్బర్', 33 పర్యాయాలు 'అల్హమ్దు లిల్లాహ్' పఠించండి" అని ఉపదేశించారు మహాప్రవక్త (సఅసం). ఆ తరువాత ముహాజిరీన్‌లోని బీదవారంతా మరోసారి మహాప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి "ధనవంతులయిన మా సోదరులు (పై సంస్మరణా వచనాలను గురించి) విని, వారు కూడా దాన్ని మొదలెట్టారు" అని విన్నవించుకున్నారు. దానికి మహాప్రవక్త (సఅసం) "కానివ్వండి, అది అల్లాహ్ అనుగ్రహం. తాను కోరిన వారికి ప్రదానం చేస్తుంటాడు" అని చెప్పారు. (ముస్లిమ్ - అబూహురైరా)

---

దెబ్బలకు తట్టుకోలేక ఆయన స్పృహ కోల్పోయారు. ఒక జాతి ప్రవక్త సందేశాన్ని తిరస్కరిస్తే వారు అల్లాహ్ శిక్షకు పాత్రులవుతారు. కాని నిరాశ చెందని ప్రవక్త (సఅసం) ఆ శిక్షను పంపవద్దని అల్లాహ్‌ను వేడుకున్నారు. అదే విధంగా పర్వతాల నిర్వాహక దూత తాయిఫ్ వారిని సంహరించడానికి అనుజ్ఞను కోరినప్పుడు "ఇంకా నన్ను వీరిలో ప్రచార కార్యక్రమాన్ని సాగించనివ్వు. వీరు ఇప్పుడు కాకపోయినా భావిలో సందేశాన్ని శ్రద్ధతో విని నిష్కల్మష హృదయంతో స్వీకరించవచ్చు, లేక వీరి సంతానం దాన్ని ఆదరించవచ్చు" అన్న భావంతో మహాప్రవక్త (సఅసం) దూతను వారించారు. ధర్మసందేశాన్ని అందజేసే కార్యభారాన్ని తమపై వేసుకున్నవారు ఎంత ఓరిమితో, ఎంత సహనస్థయిర్యాలతో, మానవుల ఎడల ఎంత ప్రేమానురాగాలతో మెలగాలో మహాప్రవక్త చూపిన ఈ ఆదర్శంవల్ల ద్యోతకమవుతుంది.

429. సహచరులు తమ ప్రియ ప్రవక్త (సఅసం) చేసిన సంకేతాలపట్ల ఎంత శ్రద్ధగా, ఆసక్తిగా వ్యవహరించేవారో అర్థమవుతుంది. మరో విషయమేమంటే సకల సద్గుణాలతోపాటు దైవారాధనపట్ల మనిషికి అధిక ఆసక్తి ఉండటం ధర్మపథాన అభిలషణీయం. అందునా ఏకాంతంగా ప్రశాంత వాతావరణంలో చేసే తహజ్జుద్ నమాజ్ ప్రాముఖ్యం మరీ అధికం.

430. ఈ హదీస్ ద్వారా తెలిసిందేమంటే మహాప్రవక్త (సఅసం) సహచరుల్లో ధర్మపథాన పురోగమించాలని, ఆ మార్గాన ఉన్నత స్థానాలను అందుకోవాలని, ఆ

٤٣١ جَاءَ رَجُلٌ إِلَى النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ: إِنِّي مَجْهُودٌ،
فَأَرْسَلَ إِلَى بَعْضِ نِسَائِهِ فَقَالَتْ: وَالَّذِي بَعَثَكَ بِالْحَقِّ، مَا عِنْدِي
إِلَّا مَاءٌ- ثُمَّ أَرْسَلَ إِلَى أُخْرَى، فَقَالَتْ مِثْلَ ذَالِكَ حَتَّى قُلْنَ كُلُّهُنَّ
مِثْلَ ذَالِكَ، لَا، وَالَّذِي بَعَثَكَ بِالْحَقِّ، مَا عِنْدِي إِلَّا مَاءٌ- فَقَالَ: مَنْ
يُضِيفُ هٰذِهِ اللَّيْلَةَ؟ فَقَالَ رَجُلٌ مِّنَ الْأَنْصَارِ: أَنَا، يَا رَسُولَ اللهِ-
فَانْطَلَقَ بِهِ إِلَى رَحْلِهِ، فَقَالَ لِامْرَأَتِهِ: أَكْرِمِي ضَيْفَ رَسُولِ اللهِ صَلَّى
اللهُ عَلَيْهِ وَسَلَّمَ، وَفِي رِوَايَةٍ قَالَ لِامْرَأَتِهِ: هَلْ عِنْدَكِ شَيْءٌ؟
قَالَتْ: لَا، إِلَّا قُوتُ صِبْيَانِي- قَالَ: فَعَلِّلِيهِمْ بِشَيْءٍ وَإِذَا أَرَادُوا الْعَشَاءَ
فَنَوِّمِيهِمْ، وَإِذَا دَخَلَ ضَيْفُنَا فَأَطْفِئِي السِّرَاجَ وَأَرِيهِ أَنَّا نَأْكُلُ- فَقَعَدُوا
وَأَكَلَ الضَّيْفُ وَبَاتَا طَاوِيَيْنِ، فَلَمَّا أَصْبَحَ غَدَا عَلَى النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ
وَسَلَّمَ فَقَالَ: لَقَدْ عَجِبَ اللهُ مِنْ صَنِيعِكُمَا بِضَيْفِكُمَا اللَّيْلَةَ-

(بخاری- مسلم- ابوہریرۃؓ)

431. హజ్రత్ అబూహురైరా (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: 'ఒకసారి ఒక వ్యక్తి మహాప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి, "నేను అన్నం లేక అలమటిస్తున్నాను" అని విన్నవించుకున్నాడు. అప్పుడాయన (సఅసం) తన సతీమణి ఒకావిడ వద్దకు మనిషిని పంపారు (తినేందుకు ఏదైనా ఉంటే తెమ్మని). ఆమె, "మిమ్మల్ని సత్యంతోబాటు ప్రభవింపజేసిన వానిసాక్షిగా- ఇంట్లో నా వద్ద ఇప్పుడు పచ్చి మంచినీళ్ళు తప్ప మరేమీ లేదు" అని బదులిచ్చారు. అప్పుడు ఆయన (మనిషిని) మరో సతీమణి వద్దకు పంపారు. అక్కణ్ణుంచి కూడా అదే సమాధానం వచ్చింది. కడకు సతీమణులందరూ "మీకు సత్యంతోపాటు పంపిన శక్తి (దైవం) తోడు, మా వద్ద మంచి నీళ్ళు తప్ప మరేమీ లేదు" అనే సమాధానమిచ్చారు. అప్పుడు ఆయన (సఅసం) తన సహచరులను ఉద్దేశించి, " ఈ రాత్రికి

ఎవరు ఇతని ఆతిథేయాన్ని స్వీకరిస్తారు?" అని అడగ్గా, అన్సారుల్లోని ఒకరు "దైవప్రవక్తా !నేను" అని ముందుకు వచ్చారు. తదనుగుణంగా ఆయన ఆ అతిథిని తన వెంట ఇంటికి తీసుకు వెళ్ళారు. "ఈయన మహాప్రవక్త (సఅసం) అతిథి, ఈయనకు తగిన ఆతిథ్యం చెయ్యాలి ఇంట్లో ఏమయినా ఉందా?" అని అర్ధాంగిని అడిగారు, ఆమె "లేదు. కేవలం పిల్లల కోసమని వుంచిన అన్నం ఉంది, వాళ్ళింకా తిన లేదు," అని చెప్పింది. అప్పుడు ఆ అన్సారీ భార్యతో అన్నాడు, "పిల్లలకు ఏదయినా ఇచ్చి సరిపెట్టు. అన్నం అడిగితే ఎలాగో నిద్రపుచ్చు. అతిథి భోజనానికని లోనికి వచ్చినప్పుడు దీపం ఆర్పివెయ్యి. మనం కూడా అన్నం తింటున్నట్లు అతనికి స్ఫురించేలా చేద్దాము" అలానే అందరూ భోజనానికి కూర్చున్నారు. అతిథి మాత్రం కడుపునిండా భుజించి లేచాడు. కాని ఆ దంపతులిరువురూ పస్తులతోనే రాత్రి గడిపివేశారు. ప్రొద్దున ఆ అన్సారీ మహాప్రవక్త (సఅసం) సన్నిధిలోకి పోయినప్పుడు ఆయన (సఅసం) ఇలా తెలిపారుః "రాత్రి మీరద్దరూ అతిథికి చేసిన సదుపచారం పట్ల అల్లాహ్ ఎంతో ప్రసన్నుడయ్యాడు" అని.

(బుఖారి, ముస్లిమ్ - అబూహురైరా)

---

బాటన ఒకరినొకరు మించిపోవాలని ఎంతో తీవ్రమయిన పిపాస ఉండేది. దానధర్మాలు చేసే శక్తి సామర్థ్యాలు లేనివారు దైవనామ సంస్మరణ, ప్రార్థన ఇంకా ఇతర సత్కార్యాలు చేసి పరలోక మోక్షం సాధించాలని కోరేవారు. ఇంకా వారు, బానిసల్ని బానిసత్వపు నికృష్ట స్థాయి నుండి పైకిలేవనెత్తి తోటి మానవులస్థాయికి తేవడం, సమాజంలో వారికై సమాన స్థితిగతులు కలిగేలా ప్రయత్నించడం అత్యున్నతమయిన సత్కార్యంగా భావించేవారు.

ఈ హదీసులో "అల్లాహు అక్బర్"ని 33 సార్లు పఠించాలని ఉంది. మరో హదీసులో 34 మార్లు అని ప్రస్తావించబడింది. పెద్దలు దీన్నే పాటించారు, ఇంకా కొన్ని హదీసుల్లో ఈ మూడు పవిత్ర నామాలను పదేసిమార్లు స్మరించాలని ఆదేశించినట్లు కూడా ఉంది.

431. వచ్చిన వ్యక్తి అమితంగా ఆకలిగొన్నవాడు. అందువల్లనే పిల్లలకంటే అతనికే ప్రాధాన్యతనివ్వడం జరిగింది. అయితే ఇంత త్యాగం చెయ్యాలంటే సామాన్యంకాదు, తన అవసరం మేరకే వున్న అన్నం ఇతర అగత్యపరులకివ్వడం, స్వయంగా తాము

۴۳۲ عَنْ خَبَّابِ بْنِ الْأَرَتِّ قَالَ: هَاجَرْنَا مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ نَلْتَمِسُ وَجْهَ اللّٰهِ تَعَالٰى فَوَقَعَ أَجْرُنَا عَلَى اللّٰهِ، فَمِنَّا مَنْ مَّاتَ لَمْ يَأْكُلْ مِنْ أَجْرِهٖ شَيْئًا، مِنْهُمْ مُصْعَبُ بْنُ عُمَيْرٍ، قُتِلَ يَوْمَ أُحُدٍ وَّتَرَكَ نَمِرَةً، فَكُنَّا إِذَا غَطَّيْنَا رَأْسَهٗ بَدَتْ رِجْلَاهُ، وَإِذَا غَطَّيْنَا رِجْلَيْهِ بَدَا رَأْسُهٗ، فَأَمَرَنَا رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ أَنْ نُّغَطِّيَ رَأْسَهٗ وَنَجْعَلَ عَلٰى رِجْلَيْهِ شَيْئًا مِّنَ الْإِذْخِرِ - وَمِنَّا مَنْ أَيْنَعَتْ لَهٗ ثَمَرَتُهٗ فَهُوَ يَهْدِبُهَا - (بخاری - مسلم)

432. హజ్రత్ ఖబ్బాబ్ బిన్ అరత్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : 'మేము దైవ ప్రసన్నత కొరకు మక్కాను వదలి మహాప్రవక్త (సఅసం)తో పాటు మదీనాకు వలస వచ్చాము, మాలో కొందరు పరమపదించారు. వారికి ఎలాంటి ఐహిక ప్రతిఫలమూ లభించలేదు. అలాంటి పుణ్య పురుషుల్లో ముస్అబ్ బిన్ ఉమైర్ ఒకరు. ఆయన ఉహుద్ పోరాటంలో అమరగతులయ్యారు. ఆయన దేహంపై ఒక ముతక గొంగళి తప్ప మరేదీ లేకుండింది. అదే ఆయనకు "కఫన్"గా మారింది. దానితో తలను కప్పితే కాళ్ళు బయట పడేవి, కాళ్ళు కప్పితే తల బయటపడేది. అప్పుడు మహాప్రవక్త (సఅసం) ఆయన తలను గొంగళితోను కాళ్ళను గడ్డితోను కప్పమని ఆదేశించారు. ఇకపోతే దైవం కొరకు వలస వచ్చిన వారిలో కొందరికి ధర్మపథాన తాము చేసిన త్యాగాలకు, ప్రతిఫలం ప్రపంచంలోనే లభించింది. వారు దానిద్వారా లాభమొందుతున్నారుకూడా.'

(బుఖారి - ముస్లిమ్)

---

పస్తులుండి ఎదుటి వ్యక్తిని సంతృప్తిపరచడం త్యాగశీలతకు ఉత్తమ ఉదాహరణ. "ఆకలిగొన్నవారి పట్ల త్యాగంతో వ్యవహరించడం అంటే ఇంతకుమించిన మరో దృష్టాంతం కానరాదు. ఈ విషయంలో ఇది సర్వోత్కృష్టమైన ఆదర్శం" అని చెప్పవచ్చు.

۴۳۳ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ: لَقَدْ رَأَيْتُ سَبْعِينَ مِنْ أَهْلِ الصُّفَّةِ مَا مِنْهُمْ رَجُلٌ عَلَيْهِ رِدَاءٌ، إِمَّا إِزَارٌ وَّإِمَّا كِسَاءٌ، قَدْ رَبَطُوا فِي أَعْنَاقِهِمْ، فَمِنْهَا مَا يَبْلُغُ نِصْفَ السَّاقَيْنِ، وَمِنْهَا مَا يَبْلُغُ الْكَعْبَيْنِ، فَيَجْمَعُهُ بِيَدِهِ كَرَاهِيَةَ أَنْ تَبْدُوَ عَوْرَتُهُ ـ (بخاری)

433. హజ్రత్ అబూ హురైరా ఇలా ఉల్లేఖించారు: 'సుఫ్ఫావారిలోని డెబ్బయి మందిని చూశాను. వారిలో ఎవరికీ ఒంటి నిండా కప్పుకునే దుప్పటి లేకపోయింది. కేవలం ఒక లుంగీ లాంటిది కట్టుకునేవారు లేదా గొంగళిని మెడకు కట్టుకునే వారు, అది కొందరి మోకాళ్ళ క్రింది వరకు, కొందరి మడిమల వరకు వచ్చేది. మర్మ స్థలం కనబడకుండా గొంగళిని చేతులతో పట్టుకునే వారు.'

(బుఖారి)

---

432. హజ్రత్ ముస్అబ్ మక్కాలోని అతి సంపన్నుల సంతానం. ఎంతో గారాబంగా పెరిగారు. స్వారీ చేయడానికి ఉత్తమమయిన గుర్రాలు–ప్రొద్దున ఒకటి సాయంత్రానికి ఒకటి ఉండేవి. ఖరీదైన బట్టలు ధరించేవారు. రోజుకు ఎన్నో వస్త్రాలు మార్చుకునేవారు. అయితే మహాప్రవక్త (సఅసం) సందేశం విన్నంతనే అందులోని సత్యం తెలిసిరాగానే దాన్ని స్వీకరించడంలో జాగు చెయ్యలేదు. దాని పర్యవసానం ఏమవుతుందో అన్న ఆలోచనే ఆయనకు రాలేదు. పర్యవసానం ఏమిటో ఆయనకు బాగా తెలుసు. ఇస్లామ్ స్వీకరించినవారిపై జరిగే అత్యాచారాలన్నీ ఆయన కన్నులముందే జరుగుతుండేవి. ఆయన ఇస్లాం స్వీకారానికి పూర్వపు జీవితాన్నీ, ఇస్లామ్ తరువాత జీవితాన్నీ తలచుకుని మహాప్రవక్త (సఅసం) కన్నీరు కార్చేవారు. కాని ముస్అబ్‌కు మాత్రం తన గత సుఖమయ జీవితం జ్ఞప్తికి వచ్చేది కాదు. ఆయననోట ఎలాంటి ఖేదవాక్కులు ఎన్నడూ రాలేదు.

433. మహాప్రవక్త (సఅసం) సహచరులు ఇస్లామీయ ఉద్యమాన్ని జన సామాన్యంలో వ్యాపింపచేసేందుకు ఎంతటి త్యాగాలను చేసేవారో, ఎలాంటి కష్టనష్టాలను భరించేవారో ఈ హదీసుల ద్వారా బోధపడుతుంది. వారు తలచుకుని ఉంటే ప్రాపంచిక సుఖాలు పొందడం, విలాసవంతం కాకపోయినా సౌకర్యవంతమయిన జీవితం గడపడం అంత కష్టతరమయిన పనికాదు. కాని వారు ఇస్లామ్‌ను ఆశ్రయించి కష్టాలనే ఎన్నుకున్నారు.

٤٣٤ عَنْ أَبِي هُرَيْرَةَ قَالَ ....... فَلَبِثَ عِنْدَهُمْ أَسِيْرًا حَتَّى أَجْمَعُوا عَلَى قَتْلِهِ فَاسْتَعَارَ مِنْ بَعْضِ بَنَاتِ الْحَارِثِ مُوسَى يَسْتَحِدُّ بِهَا فَأَعَارَتْهُ فَدَرَجَ بُنَيٌّ لَّهَا وَهِيَ غَافِلَةٌ حَتَّى أَتَاهُ، فَوَجَدَتْهُ مُجْلِسَهُ عَلَى فَخِذِهِ وَالْمُوسَى بِيَدِهِ فَفَزِعَتْ فَزْعَةً عَرَفَهَا خُبَيْبٌ، فَقَالَ: أَتَخْشَيْنَ أَنْ أَقْتُلَهُ؟ مَا كُنْتُ لِأَفْعَلَ ذَالِكَ - قَالَتْ: وَاللهِ مَا رَأَيْتُ أَسِيْرًا خَيْرًا مِّنْ خُبَيْبٍ - (بخاری)

434. అబూ హురైరా ఇలా ఉల్లేఖించారు-"ఖుబైబ్ (రజ)' బనూ హారిస్ తెగవారి వద్ద ఖైదీగా ఉన్నారు. చివరికి బనూ హారిస్ వారు ఆయన్ని హతమార్చాలనే నిర్ణయానికి వచ్చారు - (ఖుబైబ్ బద్ర్ పోరాటంలో హారిస్‌ని హతమార్చారు కనుక). ఖుబైబ్‌కు ఈ నిర్ణయం గురించి తెలిసి వచ్చింది. అప్పుడు ఆయన హారిస్ అమ్మాయి ఒకామె వద్ద మంగలి కత్తి అడిగి తీసుకున్నాడు మర్మ స్థలంలోని వెంట్రుకల్ని తీసివేయడానికి. అంతలో ఆవిడ పిల్లవాడు ఆయన వద్దకు వచ్చేసాడు. ఆమె ఏదో పనుల్లో ఉండి పిల్లవాడు అతని వద్దకు పోవడం గమనించలేదు. ఖుబైబ్, పిల్లవాణ్ణి ప్రేమతో తన ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు. ఆ అమ్మాయి దృష్టి అటు పడగానే ఈ ఖైదీ తన పిల్లవాణ్ణి చంపేస్తాడేమో అన్న భయంతో ఆమె వణికిపోయింది. హజ్రత్ ఖుబైబ్ అది గ్రహించిఅన్నారు: 'నేనీ పిల్లవాణ్ణి చంపేస్తానని కదూ భయపడుతున్నావు? అలా నేనెన్నటికీ చెయ్యలేను,' ఆ తరువాత ఆ స్త్రీ, ఖుబైబ్ కంటే ఉత్తముడయిన ఖైదీని నేను చూడలేదు అని ప్రశంసించింది. (బుఖారి)

---

434. ఇది ఒక పెద్ద హదీసులోని భాగం. అందులో ఖుబైబ్ పట్టుబడటం ఆయన్ని చంపడం వంటి అన్ని వివరాలున్నాయి. కొన్ని గంటల్లో తనను ఆ తెగవారు హతమారుస్తారని ఖుబైబ్‌కు తెలుసు. అలాంటి పరిస్థితులలో శత్రువుల బాలుడు అతని చేజిక్కాడు. అతన్ని బందీగా చూపించి తనను వదిలేస్తే ఆ బాలుణ్ణి వదిలేస్తానని చెప్పి తాను తప్పుకోగలడు లేదా అతన్ని హతమార్చి తన కసి తీర్చుకోగలడు. కాని తాను ఆశ్రయించిన ధర్మం తనను అలా చెయ్యనివ్వదు. అధర్మంగా ఏ ప్రాణినీ

۴۳۵ إِنَّ عَائِشَةَ حُدِّثَتْ أَنَّ عَبْدَ اللهِ بْنَ الزُّبَيْرِ قَالَ فِيْ بَيْعٍ أَوْ عَطَاءٍ أَعْطَتْهُ عَائِشَةُ: "وَاللهِ لَتَنْتَهِيَنَّ عَائِشَةُ أَوْ لَأَحْجُرَنَّ عَلَيْهَا۔ قَالَتْ: أَهُوَ قَالَ هٰذَا؟ قَالُوْا: نَعَمْ، قَالَتْ: هُوَ لِلّٰهِ عَلَيَّ نَذْرٌ أَنْ لَّا أُكَلِّمَ ابْنَ الزُّبَيْرِ أَبَدًا، فَاسْتَشْفَعَ ابْنُ الزُّبَيْرِ إِلَيْهَا حِيْنَ طَالَتِ الْهِجْرَةُ - فَقَالَتْ: لَا، وَاللهِ لَا أُشَفِّعُ فِيْهِ أَبَدًا وَلَا أَتَحَنَّثُ إِلٰى نَذْرِيْ، فَلَمَّا طَالَ عَلَى ابْنِ الزُّبَيْرِ كَلَّمَ الْمِسْوَرَ بْنَ مَخْرَمَةَ وَعَبْدَ الرَّحْمٰنِ بْنَ الْأَسْوَدِ بْنِ عَبْدِ يَغُوْثَ وَقَالَ لَهُمَا: أَنْشُدُكُمَا اللهَ كَمَا أَدْخَلْتُمَانِيْ عَلٰى عَائِشَةَ، فَإِنَّهَا لَا يَحِلُّ لَهَا أَنْ تَنْذِرَ قَطِيْعَتِيْ، فَأَقْبَلَ بِهِ الْمِسْوَرُ وَعَبْدُ الرَّحْمٰنِ حَتّٰى اسْتَأْذَنَا عَلٰى عَائِشَةَ فَقَالَا: اَلسَّلَامُ عَلَيْكِ وَرَحْمَةُ اللهِ وَبَرَكَاتُهُ - أَنَدْخُلُ؟ قَالَتْ عَائِشَةُ: "اُدْخُلُوْا"، قَالُوْا: كُلُّنَا؟ قَالَتْ: نَعَمْ، اُدْخُلُوْا كُلُّكُمْ وَلَا تَعْلَمُ أَنَّ مَعَهُمَا ابْنَ الزُّبَيْرِ، فَلَمَّا دَخَلُوْا دَخَلَ ابْنُ الزُّبَيْرِ الْحِجَابَ، فَاعْتَنَقَ عَائِشَةَ وَطَفِقَ يُنَاشِدُهَا وَيَبْكِيْ، وَطَفِقَ الْمِسْوَرُ وَعَبْدُ الرَّحْمٰنِ يُنَاشِدَانِهَا إِلَّا كَلَّمَتْهُ وَقَبِلَتْ مِنْهُ، وَيَقُوْلَانِ أَنَّ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ نَهٰى عَمَّا قَدْ عَلِمْتِ مِنَ الْهِجْرَةِ، وَلَا يَحِلُّ لِمُسْلِمٍ أَنْ يَّهْجُرَ أَخَاهُ فَوْقَ ثَلَاثِ لَيَالٍ، فَلَمَّا أَكْثَرُوْا عَلٰى عَائِشَةَ مِنَ التَّذْكِرَةِ وَالتَّحْرِيْجِ طَفِقَتْ تُذَكِّرُهُمَا وَتَبْكِيْ وَتَقُوْلُ إِنِّيْ نَذَرْتُ وَالنَّذْرُ شَدِيْدٌ - فَلَمْ يَزَالَا بِهَا حَتّٰى كَلَّمَتِ ابْنَ الزُّبَيْرِ، وَاعْتَقَتْ فِيْ نَذْرِهَا أَرْبَعِيْنَ رَقَبَةً وَكَانَتْ تَذْكُرُهَا بَعْدَ ذٰلِكَ فَتَبْكِيْ حَتّٰى تَبُلَّ دُمُوْعُهَا خِمَارَهَا - (بخاری - عوف بن مالکؓ)

435. ఔఫ్ బిన్ మాలిక్ ఉల్లేఖనం ప్రకారం హజ్రత్ ఆయిషాతో ఎవరో, "మీరు ఫలానా వస్తువును ఎవరికో అమ్మగా లేక దానం చెయ్యగా దాన్ని గురించి ఇబ్నుజుబైర్ (హజ్రత్ ఆయిషా అక్కా కొడుకు) "మా పిన్నమ్మ నామాట వినకపోతే ఆమెపై ఆంక్షలు విధిస్తాను. (అంటే ఆమెకు బైతుల్ మాల్ (ఇస్లామీయరాజ్య బొక్కసం) నుండి లభించేదాన్ని ఆపేసి కేవలం ఖర్చుకు తగ్గ ధనం మాత్రం ఇస్తాను) అని అన్నాడు" అని అన్నారు. దానికి ఆయిషా (ర.అ) "ఇలా అతడు అన్నాడా?" అని రెట్టించారు. "అవును అతడే చెప్పాడు" అని అన్నారు అక్కడ ఉన్నవారు. దానిపై ఆమె, ఇకపై అతనితో ఎప్పటికీ మాట్లాడనని ఒట్టుపెట్టుకున్నారు. అలాగే సంబంధం తెంచుకున్నారు. ఇలా చాలా కాలం సాగింది. అప్పుడు ఇబ్ను జుబైర్ కొందరిని ఆమె వద్దకు తన సిఫారసు కొరకు పంపాడు. కాని ఆమె అంగీకరించలేదు. "నేను ఇబ్ను జుబైర్ గురించి ఎవరి రాయబారాన్నీ ఒప్పుకోను. నా ప్రమాణాన్ని భంగపరచను" అని ఖచ్చితంగా చెప్పివేశారు. ఈ పరిస్థితి ఇబ్నుజుబైర్‌కు సహింపరానిదయింది. ఈ మారు ఆయన, మిస్వర్ బిన్ మఖ్రమ, అబ్దుర్రహ్మాన్ బిన్ అస్వద్‌ల చేతప్రమాణం చేయించి, "మీరిద్దరు ఎలాగయినా హజ్రత్ ఆయిషా వద్దకు నన్ను తీసుకెళ్ళే ఉపాయం చెయ్యండి. ఆమె నన్ను దూరం చేసి వేసింది, ప్రమాణం కూడా చేసుకుంది. ఇది ఆమెకు భావ్యం కాదు" అని ఒప్పించాడు - అప్పుడు మిస్వర్, అబ్దుర్రహ్మాన్ ఇద్దరూ, ఆయన్ని తీసుకుని హజ్రత్ ఆయిషా వద్దకు వెళ్లారు. తలుపు తట్టారు. సలామ్ చేసి "మేము లోపలికిరావచ్చా" అని అనతి తీసుకున్నారు. 'రావచ్చు' అని ఆమె జవాబు చెప్పారు. "మేమంతారావచ్చా" అని తిరిగి అడిగారు వారు. దానికి ఆమె "అవును మీరంతా రావచ్చు. రండి!" అని పలికారు. వారితో ఇబ్నుజుబైర్ ఉన్నట్లు ఆమెకు తెలియదు. వారంతా ఇంటిలో ప్రవేశించగానే, హజ్రత్ ఆయిషా చాటుగా తెరవెనకగా కూర్చున్న చోటికి ఇబ్ను జుబైర్ వెళ్ళి ఆమెని వాటేసుకుని ఏడ్వసాగారు, నా తప్పు మన్నించండి అని ఒట్టువేసి బ్రతిమలాడసాగాడు. అటు మిస్వర్,

అబ్దుర్రహ్మాన్ కూడా ఒట్టువేసి ఇబ్నె జుబైర్ తప్పును మన్నించవల సిందిగా, అతనితో మాట్లాడవలసిందిగా వేడుకోసాగారు. ఇంకా వారు మహాప్రవక్త (సఅసం) చేసిన ఈ ఉపదేశాన్నికూడా వినిపించారు- "ముస్లిమ్ సోదరునితో మూడు రోజులకు మించి, సంబంధాలు తెంచుకుని వ్యవహరించడం ధర్మం కాదు' - అందరూ కలిసి, 'మీరు చేసేది పాప కార్యం' అని ఆమెపై ఒత్తిడి చేయగా ఆమె కన్నీరు కారుస్తూ, 'నేను ప్రమాణం చేశాను కదా. ప్రమాణ వ్యవహారం ఎంతో బలవత్తరమయింది కదా' అని పలికారు. అయినా వారిద్దరూ ఆమెను ప్రాధేయపడుతూనే వచ్చారు. చివరికి ఆమె ప్రమాణభంగంచేసి ఇబ్నె జుబైర్‌తో సంభాషిం చారు. ప్రమాణ భంగానికిగాను పరిహారంగా నలభయి మంది బానిసలకు స్వేచ్ఛను అనుగ్రహించారు. తన ఈ తప్పును గురించి జీవితంలో గుర్తు వచ్చినప్పుడల్లా ఆమె ఎంతో వగచేవారు. పదే పదే ఏడ్చి ఆమె పైట అశ్రువులతో తడిసిపోయేది. (బుఖారీ, ఔఫ్ బిన్ మాలిక్)

---

హింసించరాదని బోధిస్తుంది. అలాంటప్పుడు ఏ పాపమూ ఎరుగని పసికందుని తాను ఎలా చంపగలడు? ఆ మాటే భయకంపితురాలయిన ఆ స్త్రీకి చెప్పాడు ఖుబైబ్.

ఖుబైబ్ హత్యాస్థలానికి తీసుకువెళ్ళినప్పుడు ఆయన చివరి సారిగా అన్నమాటలు ఇవి: "ఇస్లామ్ మార్గంలో నా విశ్వాసానికి మూల్యంగా విశ్వాసావస్థలో మీరు నన్ను చంపుతున్నప్పుడు ఏ రీతిలో ప్రాణాలర్పిస్తున్నానన్న విషయం అప్రధానం, నా పట్ల జరగబోతున్న ఘటన దైవప్రసన్నత కొరకు, ఆయన ధర్మం కొరకు మాత్రమే జరగబోతోంది. అలాంటప్పుడు నా దేహం ఎన్ని ముక్కలయితే మాత్రం నాకేమి?"

435. తన పినకొడుకయి ఆ విధంగా మాట్లాడినందుకు హజ్రత్ ఆయిషా(రజిఅన్)కు ఆగ్రహం కలిగి ఆమె అబ్దుల్లా బిన్ జుబైర్‌తో మాట్లాడకూడదన్న ఒట్టు వేసుకున్నారు. అయితే నిష్కారణంగా ఓ చిన్న విషయానికిగాను అంత పెద్ద శిక్షను విధించినందుకు కుమిలి పోయిన ఇబ్నె జుబైర్ ఓ సందర్భంలో కల్పించుకొని తన క్షమార్పణలను సమర్పించుకున్నారు. ఆమె దానికి కరిగిపోయి సంబంధాలను పునరుద్ధరించుకోవడమేకాక తన పొరపాటును గ్రహించి జీవితాంతం బాధపడేవారు. ఈ గాథ మొత్తంలో ప్రవక్త సహచరుల చిత్తశుద్ధి, వారి మధ్య నిష్కళంకమైన ప్రేమానురాగాల బాంధవ్యాలు కొట్టవచ్చినట్లు కానవస్తున్నాయి.

٤٣٦ عَنْ عَائِشَةَ قَالَتْ: جَاءَ رَجُلٌ إِلَى النَّبِيِّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَ: يَا رَسُوْلَ اللّٰهِ، إِنَّ لِيْ مَمْلُوْكِيْنَ يَكْذِبُوْنَنِيْ وَيَخُوْنُوْنَنِيْ وَيَعْصُوْنَنِيْ وَأَشْتِمُهُمْ وَأَضْرِبُهُمْ فَكَيْفَ أَنَا مِنْهُمْ؟ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: إِذَا كَانَ يَوْمُ الْقِيٰمَةِ يُحْسَبُ مَا خَانُوْكَ وَعَصَوْكَ وَكَذَبُوْكَ وَعِقَابُكَ إِيَّاهُمْ فَإِنْ كَانَ عِقَابُكَ إِيَّاهُمْ بِقَدْرِ ذُنُوْبِهِمْ كَانَ كَفَافًا لَا وَعَلَيْكَ، وَإِنْ كَانَ عِقَابُكَ إِيَّاهُمْ فَوْقَ ذُنُوْبِهِمْ أُقْتُصَّ لَهُمْ مِنْكَ الْفَضْلُ، فَتَنَحَّى الرَّجُلُ وَجَعَلَ يَهْتِفُ وَيَبْكِيْ، فَقَالَ لَهُ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: أَمَا تَقْرَءُ قَوْلَ اللّٰهِ تَعَالٰى- وَنَضَعُ الْمَوَازِيْنَ الْقِسْطَ لِيَوْمِ الْقِيَامَةِ فَلَا تُظْلَمُ نَفْسٌ شَيْئًا، وَإِنْ كَانَ مِثْقَالَ حَبَّةٍ مِنْ خَرْدَلٍ أَتَيْنَا بِهَا وَكَفٰى بِنَا حَاسِبِيْنَ-" فَقَالَ الرَّجُلُ: مَا أَجِدُ لِيْ وَلِهٰؤُلَاءِ شَيْئًا خَيْرًا مِنْ مُفَارَقَتِهِمْ، أُشْهِدُكَ أَنَّهُمْ كُلَّهُمْ أَحْرَارٌ- (ترمذی)

436. హజ్రత్ ఆయిషా ఇలా ఉల్లేఖించారు: ఒక వ్యక్తి మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం) వద్దకు వచ్చి, "దైవప్రవక్తా! నా బానిసల్లో కొందరు నాతో అబద్ధం పలుకుతారు. వారికి అప్పగించిన వాటిని అపహరిస్తారు, నా ఆజ్ఞల్ని ఉల్లంఘిస్తుంటారు. నేను వారిని తిడుతూ ఉంటాను, కొడుతూ ఉంటాను. వీరి విషయంలో నా పరిస్థితి ఎలా పరిణమిస్తుంది ?" అని అడిగాడు. దానికి బదులు మహాప్రవక్త (సఅసం) ఇలా చెప్పారు: "తీర్పు దినాన వారి విశ్వాస ఘాతుకానికి, అవిధేయతకు, నీవు వారికి ఇచ్చిన శిక్షలకు లెక్క కట్టబడుతుంది. నీ శిక్ష వారి అపరాధానికి సరితూగినట్లయితే ఇక నీకు ఇచ్చిపుచ్చుకోవడాలేమీ ఉండవు. నీవు ఇచ్చిన శిక్ష వారి అపరాధానికి తక్కువ అయినట్లయితే అది నీపట్ల

కారుణ్యంగా పరిణమిస్తుంది. కాని ఒకవేళ నీ శిక్షే వారి నేరం కంటే అధిక మైనట్లయితే ఆ మేరకు నీ వద్ద నుండి బదులు వసూలు చేయబడుతుంది." ఇది విని ఆ వ్యక్తి ఓ మూల కూర్చొని రోదించసాగాడు. మహాప్రవక్త అతనితో తిరిగి అన్నారు, "నీవు దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ప్రవచనాన్ని పఠించలేదా?".

"ప్రళయ దినాన మేము ఒక్కొక్క వ్యక్తి చేసిన కర్మల్ని ధర్మకాటాలో తూస్తాము. ఎవరి తూకంలోనూ ఎలాంటి అన్యాయం చెయ్యబడదు. ఒకరు చేసినది ఎంత తక్కువ అయినా అతని కర్మపత్రంలో ఉంటే దాన్ని మేము ముందుకుతెస్తాము. ఈ లెక్కలన్నీ చూడటానికి మేమేచాలు."

అప్పుడు ఆ వ్యక్తి - "నేనిక ఆ బానిసల్ని వదలి వేయడం తప్ప మరోమార్గం నాకు శ్రేయస్కరంగా కనిపించడం లేదు. దైవ ప్రవక్తా! మీరే సాక్షులు నేను వారికి స్వేచ్ఛ ఇచ్చి వేశాను" అని ప్రకటించాడు. (తిర్మిజి)

## పరలోక చింతన

۴۳۷، عَنْ عَبْدِ اللهِ بْنِ عُمَرَ قَالَ : كُنَّا مَعَ النَّبِيِّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فِي بَعْضِ غَزَوَاتِهِ ، فَمَرَّ بِقَوْمٍ ، فَقَالَ : مَنِ الْقَوْمُ ؟ قَالُوْا : نَحْنُ الْمُسْلِمُوْنَ وَامْرَأَةٌ تَحْضِبُ بِقَدْرِهَا وَمَعَهَا إِبْنٌ لَهَا ، فَإِذَا ارْتَفَعَ وَهَجٌ تَنَحَّتْ بِهِ، فَأَتَتِ النَّبِيَّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ فَقَالَتْ : أَنْتَ رَسُوْلُ اللهِ ؟ قَالَ : نَعَمْ ، قَالَتْ : بِأَبِي أَنْتَ وَأُمِّي أَلَيْسَ اللهُ أَرْحَمُ الرَّاحِمِيْنَ ؟ قَالَ : بَلٰى ، قَالَتْ : أَلَيْسَ اللهُ أَرْحَمَ بِعِبَادِهِ مِنَ الْأُمِّ بِوَلَدِهَا ؟ قَالَ : بَلٰى ، قَالَتْ : إِنَّ الْأُمَّ لَا تُلْقِيْ وَلَدَهَا فِي النَّارِ ، فَأَكَبَّ رَسُوْلُ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ يَبْكِيْ ثُمَّ رَفَعَ رَأْسَهُ إِلَيْهَا فَقَالَ : إِنَّ اللهَ لَا يُعَذِّبُ مِنْ عِبَادِهِ إِلَّا الْمَارِدَ الْمُتَمَرِّدَ الَّذِيْ يَتَمَرَّدُ عَلَى اللهِ وَأَبٰى أَنْ يَقُوْلَ لَا إِلٰهَ إِلَّا اللهُ -

(مشكوٰة)

437. అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: "మేము మహాప్రవక్త (సఅసం)తో పాటు ఒక సారి 'జిహాద్' కొరకు ప్రయాణం చేస్తున్నాము. త్రోవలో కొందరు వ్యక్తులు కనబడ్డారు. వారి సమీపానికి వెళ్ళి "మీరెవరు?" అని మహాప్రవక్త అడగ్గా వారు, "మేము ముస్లింలము" అని పలికారు. వారిలో ఒక మహిళ వంట చేస్తూ కనబడింది. పొయ్యిలో కట్టెలు మండిస్తూ ఉంది ఆమె. ఆమె ఒడిలో పసిపిల్లవాడు కూర్చుని ఉన్నాడు. మంటలు పెద్దగా లేచినప్పుడల్లా పిల్లవాణ్ణి ఎడంగా లాక్కునేది. ఆమె మహాప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి, "మీరేనా దైవప్రవక్త?" అని అడిగింది. "అవును" అన్నారు మహాప్రవక్త. "నా తల్లి దండ్రుల్ని మీకై అర్పింతు. అల్లాహ్ కరుణామయుల్లోకెల్ల శ్రేష్ఠుడుకాడా?" అని ప్రశ్నించింది ఆవిడ. దానికి ఆయన "ఎందుక్కాదూ?" అన్నారు. ఆమె తిరిగి ప్రశ్నించింది, "తల్లి తన బిడ్డపై కనబర్చే అనురాగం కంటే అల్లాహ్‌కు తన దాసులపై కనికరం అధికం కాదా?" "నిజమే, తల్లికంటే, ఆయన తన దాసుల్ని అధికంగా ప్రేమించేవాడే!" అని సమాధానమిచ్చారు మహాప్రవక్త (సఅసం). "అయితే, తల్లి తన బిడ్డను అగ్నిలో వేయడం ఏమాత్రం సహించదే?" అన్నదామె. ఆ మాట విని మహాప్రవక్త (సఅసం) కొన్ని క్షణాలు తల వంచి కన్నీరు కార్చారు. తల ఎత్తి ఇలా అన్నారు. "దేవుని ఏకత్వపు సద్వచనాన్ని (లా ఇలాహ ఇల్లల్లాహ్)ని తిరస్కరించిన పొగరుబోతును తప్ప మరెవ్వరినీ అల్లాహ్ శిక్షించడు." (మిష్కాత్)

---

436. సాధారణంగా చాలా మంది తమ నౌకర్లను, బానిసల్ని కొడుతూ తిడుతూనే వుంటారు. అలా చెయ్యడం తమ హక్కుగా యజమానులూ భావిస్తారు, నౌకర్లూ పడుతూవుంటారు. అయితే ఆ వ్యక్తి మహాప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి తన వైఖరికి ఎలాంటి పరిణామం కలుగుతుందో అని అడగటం దేనికి? కేవలం పరలోకచింతన, పాపభీతివల్ల మాత్రమే ఆ వ్యక్తి అలా చేశాడు. మహాప్రవక్త (సఅసం) ఉద్బోధనవల్ల అతను కన్నీరుమున్నీరుగా రోదించడం కూడా అందుకే! మరి – ఆ బానిసలకు స్వేచ్ఛ ప్రసాదించడం కూడా అందుకే – ఇలాగైనా గతంలో ఆ బానిసలకు ఏమాత్రం అన్యాయం జరిగివున్నా, దాని బదులు తీరుతుందని తన పరలోక జీవితం సుఖమయమవుతుందని అతని తపన.

٤٣٨ عَنْ عَمْرِو بْنِ الْعَاصِ قَالَ: لَمَّا جَعَلَ اللّٰهُ فِي قَلْبِي الْإِسْلَامَ أَتَيْتُ النَّبِيَّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ، فَقُلْتُ: اُبْسُطْ يَمِينَكَ فَلَأُبَايِعُكَ، فَبَسَطَ يَمِينَهُ فَقَبَضْتُ يَدِي، فَقَالَ: مَالَكَ يَا عَمْرُو؟ فَقُلْتُ: أُرِيدُ أَنْ أَشْتَرِطَ، فَقَالَ: تَشْتَرِطُ مَاذَا؟ فَقُلْتُ: أَنْ يُغْفَرَ لِي - قَالَ: أَمَا عَلِمْتَ أَنَّ الْإِسْلَامَ يَهْدِمُ مَا كَانَ قَبْلَهُ - (بخاری)

**438.** అమ్ర్ బిన్ ఆస్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు : "అల్లాహ్ నాలో ఇస్లామ్ స్వీకరించాలన్న భావం ఉత్పన్నం చేసినప్పుడు, నేను మహా ప్రవక్త (సఅసం) సన్నిధికి వెళ్ళి 'మీ చేయి చాపండి నేను మీ చేయిపై (ఇస్లామ్ స్వీకరించే) ప్రమాణం చేస్తాను అన్నాను. ఆయన చేయిచాపగానే నా చేయిని వెనక్కు లాక్కున్నాను. "ఏమైంది అమ్ర్" మహాప్రవక్త అడిగారు. నేను "ఒక షరతు పెట్టాలనుకుంటున్నాను" అన్నాను. "షరతా? ఏమిటది?" అడిగారు మహాప్రవక్త (సఅసం). "గతంలో నా వల్ల జరిగిన అపరాధాలు మన్నించబడాలి అన్నదే" అని నేను పలికిన దానికి మహాప్రవక్త చెప్పారు, "అమ్ర్ నీకు తెలియదా? ఇస్లాం (దైవానికి పరిపూర్ణ సమర్పణ) స్వీకారం మనిషి పూర్వం చేసిన పాపాలను హరింపచేస్తుందని?"

(బుఖారి)

---

437. ఆమె ముస్లిమ్ మహిళ, దేవుని కారుణ్యగుణం తదితర గుణాలు ఆమెకు బాగా తెలుసు. అయితే ఆమె అలా అడగటానికి కారణం కేవలం పరలోక చింతనే. అందుకే మహాప్రవక్త ఆమె ఆవేదనను అర్థంచేసుకుని సమయానుకూలంగా సమాధానమిచ్చారు. దానికి భావమేమంటే దేవుని ఏకత్వపు సందేశం స్వీకరించి దాని ఆదేశాలను పాటించేవారిని అల్లాహ్ నరకాగ్నికి ఆహుతి చెయ్యడు. దైవ ధర్మం ప్రస్ఫుటమయి దర్శనమిచ్చినా, దాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకున్నా దాన్ని స్వీకరించక తిరస్కరించిన వారికే ఆ శిక్ష.

**438.** దివ్య ఖుర్ఆన్ మహాప్రవక్త ప్రచారం ద్వారా ఇస్లామ్ సందేశం విన్నవారికి ఈ జీవితం తరువాత మరో జీవితం రాబోతుందనీ, తాము ఇంత వరకు ఆశ్రయించి ఉన్న బహుదైవారాధనా మార్గం ఏమాత్రం ఉపకరించదనీ అర్థమైపోయేది. ఆ మార్గంలో మాజీ జీవితంలో చేసిన పాపపు పనులన్నీ ఇప్పుడు బాధ పెడతాయేమో అని వారు తలచి చింతించే వారు. ఆ విధంగా పరలోక చింతన మనసుల్లో స్థానం ఏర్పరచుకునేది.

۴۳۹ عَنْ رَبِيْعَةَ بْنِ كَعْبٍ قَالَ: كُنْتُ أَبِيْتُ مَعَ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ فَاٰتِيْهِ بِوَضُوْءِهٖ وَحَاجَتِهٖ - فَقَالَ: سَلْنِيْ - فَقُلْتُ: أَسْئَلُكَ مُرَافَقَتَكَ فِي الْجَنَّةِ، فَقَالَ: أَوْغَيْرَ ذٰلِكَ؟ قُلْتُ: هُوَذَاكَ - قَالَ، فَأَعِنِّيْ عَلٰى نَفْسِكَ بِكَثْرَةِ السُّجُوْدِ - (مسلم)

439. రబీఅ బిన్ కాబ్ (మహాప్రవక్త సేవకుడు) ఇలా ఉల్లేఖించారు: 'నేను రాత్రుల్లో మహాప్రవక్తకు తోడుగా ఉండేవాడిని. ఆయన కొరకు వుజూ నీరు అందివ్వటం, అలాంటి ఇతర అవసరాల్లో తోడ్పడే వాడిని. ఒక రోజు ఆయన ఏమి కావాలో కోరుకొమ్మని సెలవిచ్చారు. దానికినేను "స్వర్గంలో మీ సాన్నిధ్యం కోరుకుంటున్నాను" అని బదులు పలికాను. "ఇంకా ఏదయినా కోరుకో" అన్నారాయన. 'నాకు ఇంకేమీ అవసరంలేదు' అన్నాను. "అయితే నాకు తోడుగా నిన్ను ఉంచుకునేందుకు, ఇతోధికంగా నమాజ్ చేసి నాతో సహకరించు" అన్నారు మహాప్రవక్త (సఅసం).

(ముస్లిమ్)

۴۴۰ عَنْ أَبِيْ قَتَادَةَ عَنْ رَسُوْلِ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ أَنَّهٗ قَامَ فِيْهِمْ فَذَكَرَ لَهُمْ أَنَّ الْجِهَادَ وَالْإِيْمَانَ بِاللّٰهِ أَفْضَلُ الْأَعْمَالِ، فَقَامَ رَجُلٌ فَقَالَ: يَارَسُوْلَ اللّٰهِ، أَرَأَيْتَ إِنْ قُتِلْتُ فِيْ سَبِيْلِ اللّٰهِ تُكَفَّرُ عَنِّيْ خَطَايَايَ؟ فَقَالَ لَهٗ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: نَعَمْ، إِنْ قُتِلْتَ فِيْ سَبِيْلِ اللّٰهِ وَأَنْتَ صَابِرٌ مُحْتَسِبٌ مُقْبِلٌ غَيْرُ مُدْبِرٍ - ثُمَّ قَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: كَيْفَ قُلْتَ؟ قَالَ: أَرَأَيْتَ إِنْ قُتِلْتُ فِيْ سَبِيْلِ اللّٰهِ أَتُكَفَّرُ عَنِّيْ خَطَايَايَ؟ فَقَالَ رَسُوْلُ اللّٰهِ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ: نَعَمْ، وَأَنْتَ صَابِرٌ، مُحْتَسِبٌ مُقْبِلٌ غَيْرُ مُدْبِرٍ إِلَّا الدَّيْنَ فَإِنَّ جِبْرِيْلَ قَالَ لِيْ ذٰلِكَ - (مسلم)

440. అబూకతాదా (రజిఅన్) ఇలా తెలిపారు: ఒకసారి మహాప్రవక్త (సఅసం) తన సహచరుల మధ్యన ఉపన్యసిస్తూ ఇలా బోధించారు. "అల్లాహ్‌ను విశ్వసించడం, ఆయన మార్గంలో జిహాద్ చెయ్యడం సత్కార్మల్లోకెల్ల ఉత్తమమయినవి." అది విన్న ఒకవ్యక్తిలేచి, "దైవప్రవక్తా! నేను దైవమార్గంలో నా ప్రాణాలనుఅర్పించుకుంటే నా పూర్వపు పాపాలు మన్నించబడతాయా?" అని అడిగాడు. ఆయన సమాధానం పలికారు, "అవును, నీవు దైవమార్గంలో పోరాడుతూ, శత్రుసమక్షంలో వెన్ను చూపకుండా ధైర్యస్థయిర్యాలతో నిలబడి అల్లాహ్ వద్ద పుణ్యఫలం పొందే సంకల్పంతో పోరాడి హతమయితే నీ పాపాలన్నీ మన్నించబడతాయి." కొంతసేపయ్యాక మహాప్రవక్త (సఅసం) "నీవు అడిగిందేమిటి?" అని ప్రశ్నించగా అతడు "నేను అల్లాహ్ మార్గంలో పోరాడుతూ చనిపోతే నా పాపాలన్నీ మన్నించబడతాయా? అని అడిగాను "అన్నాడు. దానికి ఆయన (సఅసం)ఇలా చెప్పారు. "ఆ ! నీవు శత్రువు ఎదుట రణరంగం నుంచి పారిపోకుండా స్థయిర్యంగా నిలబడితే, పుణ్యఫలం పొందే సంకల్పంతో పోరాడితే నీ పాపాలన్నీ క్షమించబడతాయి. అయితే నీవు ఇతరులకు ఇవ్వవలసిన బాకీమాత్రం మాఫీకాదు. జిబ్రీలు వచ్చి ఇప్పుడే ఆ మాట తెలిపారు." (ముస్లిమ్)

---

439. "నమాజ్" ఏకేశ్వరోపాసనకు ప్రతీక. అల్లాహ్‌ను భక్తి శ్రద్ధలతో ఆరాధించటం, ఆయనకు విధేయులయి వుండటం, ఆయన ఆజ్ఞోల్లంఘన జరక్కుండా మసలుకోవడం కంటే మోక్ష మార్గం మరేదీలేదు. పరలోకంలో మహాప్రవక్త సాన్నిధ్యం అలాంటి వారికి లభించకపోతే మరెవరికి లభిస్తుంది?

440. "జిహాద్" అంటే దైవ మార్గంలో నిరంతర కృషి సలపడం అని అర్థం. ధర్మ వ్యతిరేక శక్తులతో, సిద్ధాంతాలతో పోరు సలపడం, అవసరమయితే ధర్మ విరోధులతో ముఖాముఖిగా తలపడటం అని కూడా అర్థం. మరో విషయం ఈ హదీసుద్వారా తెలిసేదేమంటే పరలోక చింతన మనసులో చోటు చేసుకుంటే మనిషి తనపాపాలు సమసిపోయే మార్గంకోసం సయితం ఆలోచిస్తుంటాడన్నది.

ఈ హదీసు ద్వారా, తోటి మానవుల హక్కులు, వాటి ప్రాముఖ్యం కూడా తెలియవస్తోంది. అలాంటి ఒక హక్కును, ఇందులో ఉదాహరించటం జరిగింది. మనిషి

۴۴۱ عَنْ أَنَسٍ قَالَ: إِنَّكُمْ لَتَعْمَلُوْنَ أَعْمَالاً هِيَ أَدَقُّ فِي أَعْيُنِكُمْ مِنَ الشَّعْرِ، كُنَّا نَعُدُّهَا عَلَى عَهْدِ رَسُوْلِ اللهِ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ مِنَ الْمُوْبِقَاتِ يَعْنِي الْمُهْلِكَاتِ - (بخاری)

441. హజ్రత్ అనస్ (రజిఅన్) తనతోటివారితో ఒకసారి ఇలా చెప్పారు: "మీ దృష్టిలో అతి అల్పంగా కనిపించే ఎన్నో (తప్పుడు) పనులు మీరు చేస్తూ ఉంటారు. కాని మహా ప్రవక్త (సఅసం) కాలంలో మేము వాటిని ధర్మం, విశ్వాసాలకు ఎంతో హానికరమైనవిగా భావించేవాళ్ళం." (బుఖారి)

۴۴۲ إِنَّ رَجُلاً قَالَ: يَا رَسُوْلَ اللهِ، مَتَى السَّاعَةُ؟ قَالَ وَيْلَكَ، وَمَا أَعْدَدْتَ لَهَا؟ قَالَ: مَا أَعْدَدْتُ لَهَا إِلَّا إِنِّي أُحِبُّ اللهَ وَرَسُوْلَهُ، قَالَ: أَنْتَ مَعَ مَنْ أَحْبَبْتَ، قَالَ أَنَسٌ: فَمَا رَأَيْتُ الْمُسْلِمِيْنَ فَرِحُوْا بِشَيْءٍ بَعْدَ الْإِسْلَامِ فَرَحَهُمْ بِهَا - (بخاری - مسلم - انسؓ)

442. హజ్రత్ అనస్ (రజిఅన్) ఇలా ఉల్లేఖించారు: ఒక వ్యక్తి మహా ప్రవక్త (సఅసం) వద్దకు వచ్చి 'ప్రళయం ఎప్పుడు వస్తుంది?' అని అడిగాడు. "బలేవాడివయ్యా ! దానికోసం అవసరమయిన సన్నాహాలు చేశావా?" అనడిగారు మహా ప్రవక్త (సఅసం). దానికతడు: "పెద్ద సన్నాహా లేమి చెయ్యలేదు. కాని అల్లాహ్, ఆయన ప్రవక్త (సఅసం) ను ప్రేమిస్తు

---

తానివ్వవలసిన అప్పును చెల్లించడమో లేదా దాన్ని మాఫీ చేయించుకోవడమో చెయ్యకపోతే అతడు దైవమార్గంలో తన ప్రాణాలను అర్పించుకున్నాసరే అప్పు భారం నుండి విముక్తి పొందలేడు. ఇతర మానవీయ హక్కుల విషయం కూడా అంతే.

441. చిన్న చిన్న తప్పులను మనిషి అల్పంగా ఎంచినట్లయితే ఒకరోజు పెద్ద పాపానికే ఒడిగట్టి దాన్నీ అల్పంగానే భావిస్తాడు. అందువల్లనే చిన్న పొరపాటయినా దానికి దూరంగా ఉండటమే శ్రేయస్కరం. అప్పుడే పెద్దపెద్ద తప్పుల నుండి కూడా దూరంగా మెలిగే సద్గుణం అబ్బుతుంది.

న్నాను." అని చెప్పాడు "మనిషి ఎవరిని ప్రేమిస్తాడో వారి సహచర్యమే అతనికి (పరలోకంలో) ప్రాప్తిస్తుంది" అని చెప్పారు మహాప్రవక్త (సఅసం). "ఇస్లాం స్వీకరించిన తరువాత మరెప్పుడూ కలగనంత ఆనందం విశ్వాసులకు, మహాప్రవక్త (సఅసం) చెప్పిన ఈ మాటలవల్ల కలిగింది" అని అనస్ (రజి) చెప్పారు. (బుఖారి, ముస్లిమ్)

---

442. ప్రళయం ఎప్పుడు వస్తుందో తెలుసుకోవాలన్న కుతూహలం కేవలం దాని భయంకర పరిణామాలనుండి తప్పించుకోవాలన్న ధ్యేయంతోనే. విశ్వాసంగై కొన్న సహచరులు మహాప్రవక్తను అందువల్లనే అడిగేవారు. కేవలం తెలుసుకుంటే లాభమేముంది, దాన్ని ఎదుర్కోవడానికి సన్నాహాలు చేయాలని మహాప్రవక్త తెలిపారు.

అల్లాహ్‌ను, మహాప్రవక్తను ప్రేమించడం అంటే ఏమిటో సహచరులకు బాగా తెలుసు. ఓ చోట మహాప్రవక్త (సఅసం) 'నన్ను ప్రేమిస్తే ఆకలిదప్పుల్ని, బీదరికాన్ని, లేమిని, కష్టాలను, పరీక్షను స్వీకరించడానికి సిద్ధంగా ఉండాలి' అని తన సహచరులకు ఉపదేశించారు. సల్లల్లాహు అలైహి వ సల్లం.

**– : సమాప్తం : –**